దళిత కథలు - 8

# విముక్తి కథలు

(1910 - 2000)

సంపాదకత్వం

డా॥ కె. లక్ష్మీనారాయణ

రమా పబ్లికేషన్స్
19-437ఎ-47 - ఇ 1
వినాయక్ నగర్, పాతూరు
అనంతపురం - 515 005
ఫోన్? (08554) - 44616

# DALITHA KATHALU - 8
## (VIMUKTHI KATHALU)

*Compiled & Edited by*
**Dr. K. Lakshmi Narayana**


నిడో (NIDO) ప్రచురణలు - 8

ప్రథమ ముద్రణ డిసెంబర్, 2000
ప్రతులు 1000

**కవర్ డిజైన్** - శీలా వీర్రాజు

వెల - లైబ్రరీ ప్రతి 75/-
సాదాప్రతి 50/-

**టైప్ సెట్టింగ్ :**
శ్రీ సాహితీ గ్రాఫిక్స్, చిక్కడపల్లి, హైదరాబాద్ - 20., ఫోన్. 7650686

**ప్రింటర్స్:** శ్రీ బాలాజి ఆర్ట్ ప్రింటర్స్, చిక్కడపల్లి, హైదరాబాద్ - 20

ప్రతులకు...

1. శ్రీమతి. కె. రమాదేవి 19-437 ఎ-47-ఇ 1, వినాయక్‌నగర్, పాతూరు, అనంతపురం
2. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ (అన్ని బ్రాంచీలు)
3. ప్రజాశక్తి బుక్‌హౌస్ (అన్ని బ్రాంచీలు)
4. నవోదయ బుక్ హౌస్, కాచిగూడ. హైద్రాబాద్
5. దిశపుస్తక కేంద్రం, చిక్కడపల్లి, హైదరాబాద్
6. మణిబుక్ స్టాల్, సండేమార్కెట్, నెల్లూరు
7. మైత్రీబుక్‌హౌస్, కారల్ మార్క్సురోడ్, విజయవాడ.

# అంకితం



విప్లవ, దళిత, సామాజిక, సాహిత్య, తాత్విక
రంగాలలో అలుపెరుగని పోరాట యోధుడు

శ్రీ. **బి.యస్. రాములు** గారికి
నావంతుగా...

**- డా॥ కె. లక్ష్మీనారాయణ**

# సంపాదకీయం

దళితుడి విముక్తి పథంలో........

భారతదేశం మొదటి నుండీ హిందూరాజ్యం. అతి ప్రాచీన కాలంలో ఇక్కడ వృత్తిపరంగా సామాజిక విభజన జరిగింది. వృత్తులు క్రమక్రమంగా కులాలుగా స్థిరపడ్డాయి. వృత్తులు కులాలుగా వుండడంతో, అదివరకు ఉన్న అసమానతలు కూడా స్థిరపడ్డాయి. ఈకులాలలో కొన్ని సంపన్న కులాలు. మరికొన్ని పేదకులాలు అయ్యాయి. సంపన్న కులాలు సంపన్న వర్గంగానూ, పేదకులాలు పేద వర్గంగానూ రూపొందాయి. ఈ రెండు కుల వర్గాల మధ్య సహజంగానే వైరుధ్యాలు సంఘర్షణలు ఏర్పడ్డాయి. చారిత్రక పరిణామ క్రమంలో అస్పృశ్యత సామాజిక సమస్యగా అవతరించింది. సామాజిక నియమాలను అతిక్రమించిన వాళ్ళ సంతానాన్ని అస్పృశ్యులుగా చూడడంతో మొదలైన ఈ సమస్య చివరికి వ్యక్తి స్వేచ్ఛను హరించే స్థాయికి ఎదిగి, అస్పృశ్య కులం ఒకటి ఏర్పడింది. ప్రతిఫలం లేని శ్రమకు అగౌరవానికి , అవమానాలకు, ఆ కులం ఆహుతై పోతున్నది, మూతికి ముంతముడ్డికి చీపురు నెత్తికి ఎర్రగుడ్డ ధరించి గంట వాయించు కుంటూ తిరిగే సంస్కృతికి వీళ్ళ జీవితం రూడి చేయబడింది. తమకు జరుగుతున్న అన్యాయాల నుండి తాము అనుభవించే అవమానాలనుండి బయట పడాలని తపనబడుతున్న దళితులకు విదేశీ పాలన ఆశాకిరణంగా కనిపించింది. మొదట మహమ్మదీయులుగా, తర్వాత క్రైస్తవులుగా మారారు. మతాంతరీకరణలు తాత్కాలిక ఉపశమనాలు కలిగించినా అవి శాశ్వత పరిష్కారాలు ఎలాగూకావు.

క్రీ.శ. 620 ప్రాంతంలో మహమ్మద్ బీన్ కాశీం దళితులను బలవంతంగా ఇస్లామీయులుగా మార్చాడు. ఈ ప్రయత్నంలో పలు ఇతర కులాలు కూడా ఇస్లామీకరణ చెందాయి. ఈ మతాంతరీకరణ దాదాపు 16వ శతాబ్దం దాకా సాగింది. ఔరంగజేబు అనంతరం ముస్లీం రాజ్యపాలన అంతమైంది. ఆనాటికే ఆంగ్లేయుల పటిష్టపడి తమ పరిపాలనను సాగించారు. భారతదేశం మరోసారి పరాయి పాలనలోకి పోయింది. అంటరాని సమస్య ఇస్లామీకరణలో అంతంకాలేదు. అనంతర కాలంలో అంటరాని సమస్య ఆర్థిక పరాధీనతలతో తిరోగమిస్తున్న దళితులు క్రైస్తవ మతబోధకుల పట్ల ప్రచారం పట్ల ఆకర్షితులయ్యారు. మిషనరీలు జీసస్ ప్రభువని, పేదల పాలిట పెన్నిధి అని ఈ మతంలో కులాలు లేవని ఉన్నది ఒకే కులం అని, దళితులు క్రైస్తవాన్ని స్వీకరిస్తే అసమానతలు తొలగుతాయని, విద్యను ఉద్యోగాన్ని కూడా పొందవచ్చని తెలిపారు. దళితులు అంటరాని తనాన్ని వదిలించుకోవడానికి ఆంగ్లేయులతో సమానంగా చూడబడటానికి క్రైస్తవులుగా మారారు. కానీ ఇక్కడ కూడా సవర్ణులు అగ్రభాగాన నిలిచారు. ఇక్కడ కూడా దళితులు పాలితులుగానే నిలిచారు. ఇలా దళితులు సమానత్వం కోసం బౌద్ధులుగానూ, జైనులుగా కూడా మతాంతరీకరణ పొందారు. ఈ నేపథ్యమే ఈ సంకలన సమీకరణానికి దారితీసింది.

ఈ సంకలనంలో ఇరవైఒకటి కథలున్నాయి. మొదటి కథ 'విష్ యు హాపీ క్రిస్మస్' క్రైస్తవులు శాంతి స్వభావులని ఆంగ్లేయుల పాలన అనంతరం ఈ దేశంలో దళితులు, అస్పృశ్యతను

అధికమించడం కోసం క్రైస్తవాన్ని పుచ్చుకున్నారని ఈ కథ చెబుతుంది. పాశ్చాత్యుల పాలనా కాలంలో సవర్ణుల హింస భరించలేక దళితులు క్రైస్తవాన్ని పుచ్చుకొని, తమ ఉనికిని చాటుకున్నారు. 'పాహిమాం... పాహి... పాహి' కథార్థం 'గుడిసె ఏసోబు కథలు' మిషనరీల నీడల్లో దళిత క్రైస్తవుల జీవనాన్ని వివరించాయి. ఇవి నాలుగు కథలు. ఈ కథల్లో ప్రధానపాత్ర ఏసోబుగాడు. ఈ దేశంలో దళితుల కోసం మిషనరీలు ఏర్పాటు చేసిన పాఠశాలలు వైద్యశాలలు సవర్ణులకే ఉపయోగపడుతున్నాయనేది ఈ కథల సారాంశం. క్రైస్తవ మతంలో కూడా అంతరాలున్నాయని 'వ్యత్యయం' కథ అంతరార్థం. ఈ కథానికల్లో సమానత్వం కోసం ప్రాకులాడే దళితుని తపన కన్పిస్తుంది. మతం ముసుగులో దళితుడికి జరిగే అన్యాయం కన్పిస్తుంది. సమానత్వాన్ని ప్రబోధిస్తుంది.

ఒక దళిత స్త్రీ ఉన్నత విద్య చదివి, మతాంతర వివాహం చేసుకొని వైద్య వృత్తి చేపట్టడం 'మెట్లు' కథాంశం భూ సంస్కరణల నేపథ్యంలో దళితుడికివచ్చిన బంజరు భూమిని సవర్ణులు కాజేశారనేది 'ఇంటి మాదిగోడు' కథార్థం. పాకీపిల్ల జీవితాన్ని చిత్రించిన కథ 'మెహ్తారానీ' దళిత ఉపాధ్యాయుడు గ్రామాల్లో అనుభవించే అస్పృశ్యతను 'నానేర్చిన అనుభవం' కథ సూచిస్తుంది. గ్రామాల్లో దళితుల సమస్యను పట్టించుకోని రాజకీయనాయకుల కథ 'తక్షణ చర్య'. దళితుడు స్వయంకృషితో వృద్ధి చెందడం 'తేరు' కాథాంశం. దళితుడి శ్రమ సూర్యునంత వేగమైందని. అలాకాక వారి జీవితం సూర్యోదయంలా వికసించాలని 'తెల్లవారితే' కథేతివృత్తం. దళితులు తనది కాని విషయంలో తలదూర్చితే ప్రాణహాని తథ్యమనేది 'కంపనబద్ధ కాకి' కథార్థం. కులానికి ప్రతీకగా నలుపును తీసుకొని, నలుపంటే అందరికీ అసహ్యమనే విషయాన్ని 'కర్రోడు' కథ సూచిస్తుంది. విలాస జీవితాన్ని గడుపుతున్న దళిత స్త్రీ మనస్తత్వాన్ని 'దొరసాని' కథ విశ్లేషిస్తుంది. ఈ కథానికల్లో పరిణామవంతమైన దళితుని మనస్తత్వం, తాను బానిస సంకెళ్ళ నుండి విముక్తి పొందడానికి పడే తపన కన్పిస్తుంది.

ఇవాళ వర్గం ప్రధానం అని ప్రచారం చేసే నక్సలిజంలో కూడా కులం ప్రధాన పాత్ర పోషిస్తుందని దళిత నక్సలైట్లు అటు పార్టీలోనూ, ఆ తర్వాత జన స్రవంతిలో కలిసిపోయిన అనంతరం ఇటు ప్రభుత్వంలో కూడా హింసను అనుభవిస్తున్నారని 'దక్షయజ్ఞం' కథార్థం. బసివినీ వ్యవస్థను వివరించే కథ 'నడిమింటి బోడెక్క బసివిరాలయ్యేద''. దళితుని అభివృద్ధిని వ్యతిరేకించిన పోలీస్ వ్యవస్థ కథ 'గుడిసె గుండెల్లో'. దళితులు అరటాకులని ముళ్ళు అరిటాకుమీద పడినా. అరిటాకులు ముళ్ళుమీద పడినా అరిటాకుకే నష్టం అనే చందాన్ని 'అరటాకులు' కథలో చూడవచ్చు. అస్తిత్వం లేని దళితుని మనస్తత్వాన్ని 'చరిత్ర' కథ వివరిస్తుంది. చచ్చిన సవర్ణుని ఖననం చేసేదళితుల కష్టాలు 'బ్యాగరోళ్ళు' కథాంశం. సమాజం దృష్టిలో దళితుని స్థాయిని 'అయిదవ వాడు' కథ విశ్లేషిస్తుంది. ఈ కథ దళితుని మానవత్వానికి ప్రతీక. ఈ కథానికల్లో దళితుని విముక్తి అంతర్లీనంగా బాహ్యంగానూ కన్పిస్తుంది. బానిసత్వ మూలాలను విశ్లేషించి కాలగమనంలో దాని నాశనానికి చరమగీతాన్ని ఈ కథానికలు పాడుతాయి.

ఈ కథలు చదివిన సమాజం. దళితుడు-అస్పృశ్యత, అ అస్పృశ్యత వాటినుండి విముక్తి ఆ విముక్తి పథంలో దళితుడు పన్ని వ్యూహాలు ఆచరించిన మార్గాలు చేసిన పోరాటాలు అవగాహన

ఆలోచిస్తుంది. ఈ సామాజిక ఆలోచనె దళిత విముక్త మార్గం.

ఈ సంకలనం ప్రచురణకు రాష్ట్రవ్యాప్తంగా తమ కథలను పంపి ప్రచురణకు అనుమతిచ్చిన రచయితలకూ ఈ సంకలన ప్రచురణలో తగు సూచనలివ్వడంతోపాటు ఈ సంకలనాలన్నింటి గురించి వ్యాసం రాసిన గురువులు ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి గారికి దళిత కథా సంకలనాలను అభిమానిస్తున్న రాష్ట్ర వ్యాప్త సాహితీవేత్తలకూ ఈ ప్రయత్నానికి స్ఫూర్తినిచ్చిన శ్రీ కె. సదాశివరావుగారికి, నా అభివృద్ధిని కోరే నా భార్య శ్రీమతి రమాదేవికి నా కుమారులు చి॥కె. హేమంత్ చి॥ కె. యశ్వంత్‌లకూ కృతజ్ఞుడను.

ఈ పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయం కొంతమేరకు చేసిన ఫాదర్ విన్సెంట్ ఫెర్రర్ (ఆర్.డి.టి.అనంతపురం) గారికి, ఆర్థిక సహాయ సమీకరణలో సహకరించిన శ్రీ వై.వి. మల్లారెడ్డి గారికి. ఈ పుస్తకానికి అందంగా ముఖచిత్రం వేసిన శ్రీ శీలావీర్రాజు గారికి, డి.టి.పి. చేసిన శ్రీ సాహితీ గ్రాఫిక్స్ వారికి, అందంగా అచ్చువేసిన చరిత గ్రాఫిక్స్‌వారికి కృతజ్ఞతలు.

డా॥కె. లక్ష్మీనారాయణ.

# విషయసూచిక

# 1 విష్ యు హేపీ క్రిస్మస్

## కొలకలూరి ఇనాక్

"రక్షకుండుదయించినాడట
మన కొరకు పరమ రక్షకుండుదయించినాడట"

చర్చిలోంచి పాట వినపడుతూ వుంది. క్రీస్తు జన్మకది గానం. క్రిస్మస్ సంగీతం.

ఈ పాట చర్చి గుండెలోంచి సుడులు తిరుగుతూ వెలువడుతూ ఉంది. ఈ చర్చి పట్టణం గుండెగా వుంది. ఈ పట్టణం ఆంధ్ర రాష్ట్రానికి గుండె.

చర్చిలో ఉత్సాహంలో, వెలుతురులో, సంగీతంలో, సుగంధంలో, ధ్యానంలో క్రైస్తవులు రంగు కాగితాలు అలంకారాలతో, అలంకరించుచున్న మనుష్యులతో, చర్చి ఉత్సాహంగా ఉత్సవంగా ఊపిరి పీలుస్తూ వుంది.

ఫాదర్ ప్రసంగం ప్రారంభించాడు. యేసు క్రీస్తు పుట్టడం, ఆ పుట్టుకను గూర్చి ముందుగానే ప్రవక్తలు తెలియజేయడం. దేవదూతలు గొర్రెల కాపరుల గురించి ప్రతి సంవత్సరం క్రిస్మస్ రోజు చెప్పేదే వివరిస్తున్నారు.

అది ఎన్నోసార్లు విన్న వాళ్ళు చాలా మంది. వాళ్ళే దాన్ని చాలా సార్లు చదివారు. ఎప్పుడూ విననివాళ్ళు ఇంకా అ ఆ లు రానివాళ్లు ఇప్పుడు వింటున్నారు. అయితే అర్థం కాదు. అర్థమయిన వాళ్ళకు ప్రతి సంవత్సరం కొత్త అర్థం, కొత్త జీవితం, కొత్త సమన్వయం. మరీ కొత్తగా క్రీస్తు జీవితం వినిపిస్తుంది. మనస్సుకు అనిపిస్తుంది.

వృద్ధులు భక్తితో పరవశించి పోతుంటే, పెద్దలు పదిమందిని చూసి పరమానందం పొందుతుంటే, యువత చుట్టూ వున్న జీవితం పులుంకొనే రంగుల మీద కలల సామ్రాజ్యం నిర్మించు కొంటుంటే, పసివాళ్ళు కొత్త బట్టల మైకంతో స్వర్గం పరిపాలించే డ్యూటీ పుచ్చుకొన్నట్టు పొంగి పోతున్నారు.

చర్చిలో వున్నవాళ్లు ఎవరెవరు ఏయేదశల్లో మనస్థితుల్లో వున్నారో చెప్పవచ్చు గానీ రత్నం మణి మాత్రం ఎవరి ఊహలకూ అందే మనుషులుకారు. వాళ్ళిద్దర్నీ చూసినవాళ్లు ముక్కుమీద వేలు వేసుకోలేదు. మూతి ముడుచుకోలేదు. కాని బిత్తర పోయారు.

సూర్యుడు పగలు, చంద్రుడు రాత్రి వుండటం మాములూ కాని ఇద్దరూ ఎప్పుడైనా ఒకేసారి వుండటం విడ్డూరం. అదే జరిగింది. చర్చిలో గంట నుంచి ఇద్దరూ వున్నారు.

వాళ్ళు పసివాళ్ళూ కారు, పడుచువాళ్ళూ కారు, ప్రాణం పోయే వాళ్ళూ కారు, ప్రాణం తీసే వాళ్ళు. అందుకే చర్చికి భయం.

రత్నం మణి రత్నాలూ కారు, మణులూ కారు. ఒకాయన జీవరత్నం. మరొక మనిషి శిఖామణి.

వాళ్ళ పేర్లు చెబితే మాయల ఫకీరును చూసిన ఆడవాళ్ళు భయపడినట్లు, సర్వాయి పాపడి



పేరు విన్న పసివాళ్ళు జడుసుకొన్నట్లు, ఎవరూ ఏమీ కారు కానీ, వాళ్ళకెవరూ ఎదురుపోరు. కొడతారని కాదు, చంపుతారని కాదు, భయం. అంతే!

అలా అని వాళ్ళు రౌడీలు కారు. పోకిరీ వాళ్ళు కారు. చదువు సంగతి చెప్పే డిగ్రీలలో ఎం.ఏ. పెద్దదైతే అది వున్నవాళ్ళు. డిగ్రీ వుండి వూరుకున్న వాళ్ళు కారు. ఉద్యోగాలు చేస్తున్నవాళ్లు. ఉద్యోగాలు సామాన్యమయినవీ కాదు.

జీవరత్నం జూనియర్ కాలేజీకి, శిఖామణి డిగ్రీ కాలేజీకి ప్రిన్సిపాల్సు. ఇంత మంచి వాళ్ళను, పోనీ గొప్పవాళ్ళను, కాకపోతే ఉద్యోగుల్ని చూచి ఎందుకు చర్చిలో వున్న జనం బెదిరినట్లు కనిపించింది? కారణం వుంది.

నాలుగేళ్ళ పూర్వం చర్చికి క్రిస్మస్ రోజున వాళ్ళిద్దరు బంధుమిత్ర సపరివార సమేతంగా వచ్చారు. బంధుమిత్రులు రంగంలోకి దూకలేదు. కాని పరివారాలు మాత్రం సరదాగా తలపడి, తలకాయలు పగిలి ఆసుపత్రిని పవిత్రం చేసి, ఆపైన సెషన్స్ కోర్టు చుట్టూ, మేజిస్ట్రేట్ కోర్టునూ, హైకోర్టునూ, హైకోర్టు చుట్టూ సెషన్స్ కోర్టునూ తిప్పి, తిప్పలు పడి మూడు చెరువులు కాదు, మూడు పంపులు కాదు, మూడు ఊర్ల నీరు త్రాగి, ఉప్పగా వుందని చప్పరించేశారు.

ఇప్పుడు ఇద్దరూ మళ్ళీ చర్చిలో కూర్చుని వున్నారు. బంధువులు, మిత్రులు పరివారాలు బారులు తీరి వున్నారు. ప్రమాదం కలగబోతూ వుందని పడుచు వాళ్ళకే ఏమిటి పనివాళ్ళకే తెలిసిపోతూ వుంది.

పసివాళ్ళు బెలూన్లు ఎగరవేసుకుంటున్నారు.

సిలువ ఆకారంలో వున్న చర్చి చుట్టూ చతురస్రంగా వున్న కాంపౌండులో ఇసుక వేస్తే రాలితే రాలవచ్చు కాని జనం రద్దీగా వున్నారు.

లోపల ఫాదర్ ప్రసంగం ముగిసిపోలేదు. వీరావేశంతో శివం తొక్కుతూ పూనకం వచ్చినట్టు ప్రసంగిస్తున్నాడు. పెళ్ళిలేక, పిల్లలు లేక, ఆస్తిపాస్తులు లేక బైబిల్‌ని నమ్ముకుని ఏం తిన్నాడో తినలేదో తెలియకుండా ఏమీ కొదువలేకుండా జీవించే నెమ్మది మనిషి ఫాదర్. కాని ఆయన బైబిల్ తాకాడా జ్వరం రాదుగాని, అంత పని అవుతుంది. ప్రసంగం మొదలు పెట్టాడా వెర్రెక్కిపోతాడు. కాదు అలా వుంటుంది.

ప్రతిరోజూ క్రైస్తవులెవరయినా దేవుణ్ణి ప్రార్థించవచ్చు. ఆదివారం తప్పనిసరిగా చర్చికి రావచ్చు. మామూలుగా సాధ్యం కాకపోయినా క్రిస్మస్ రోజు అందరూ చర్చికి రావడం మామూలు. అందుకే చర్చి నిండా క్రైస్తవులు. కాంపౌండు నిండా క్రైస్తవులు. కాంపౌండులో వున్నవాళ్ళు క్రైస్తవ పరిభాషలో పండగ క్రైస్తవులు.

వీళ్ళు కాంపౌండ్‌లో లోకాభిరామాయణంలో ఎలెక్షన్ల సంగతి, గెలిచే పార్టీ సంగతి మాట్లాడుకొంటున్నారు.

చర్చిలో వున్న క్రైస్తవులకు రాజకీయాలు తెలియవు. తెలుసుకోరు. ఈ రాజ్యం ప్రజాస్వామ్యమా, పారతంత్ర్యమా అక్కరలేదు. దేవుడి రాజ్యం లభిస్తే చాలు!!! అందుకోసం ప్రార్థన, ప్రయత్నం, జీవితం.

చర్చిని తమ భుజస్కంధాల మీద పెట్టుకొని దాని బరువు మోస్తూ తమ జీవితం అంకితం చేసేవాళ్ళు. ఆ ప్రయత్నంలో శుభమయ జీవితం అనుభవించే వాళ్ళు చర్చిలోపలే వున్నారు.

మణి రత్నాల తల్లి దండ్రులు కటిక దారిద్ర్యం నుంచి జీవితం ప్రారంభించి క్రైస్తవ మతం స్వీకరించి, యేసు క్రీస్తు జీవితం ప్రచారం చేయడంలో జీవితం చాలించారు.

అయితే వాళ్ళ పిల్లలు బాగా చదువుకొన్నారు. మంచి ఉద్యోగాలు సంపాదించుకొన్నారు. వీళ్ళిద్దరూ ప్రిన్సిపాల్స్ కావడం ఈ అభివృద్ధినే తెలుపుతుంది.

మిషన్ విద్యా సంస్థల్లో వదిలి దేశంలోని విద్యా సంస్థల్లో వాళ్ళు మొదట్లోనే చేరివుంటే ఈ పాటికి ఇంతకంటే మంచి ఉద్యోగాలు చేస్తూ వుండే వాళ్ళు.

కాని వాళ్ళలా చేయలేదు. దైవ సేవలో జీవించి గతించిన తల్లి తండ్రుల కొడుకులు వీళ్ళు. మిషన్ సేవే మాధవ సేవ.

వీళ్ళ తల్లి తండ్రులు వాళ్ళ కాలంలో ఆప్తులు, బంధువులు, మణి రత్నాలు తమ కాలంలో విరోధులు, పరాయివాళ్ళు.

ఇద్దరికీ పెళ్ళిళ్ళు అయ్యాయి. పిల్లలు కూడా కలిగారు. వాళ్ళు బాగా చదువుకొన్నారు. ఉద్యోగాలు చేస్తున్నారు. మిషన్‌లోనూ, ప్రభుత్వంలోనూ దాదాపు పిల్లలందరికీ పెళ్ళిళ్ళు అయ్యాయి. వాళ్ళు సుఖంగా ఉన్నారు. మణిరత్నాలు ఉద్యోగాల నుంచి రిటైరు అయ్యే కాలం ఎంతో దూరంలో లేదు. ఇద్దరూ సుఖంగానే వున్నారు, మిషనరీలు ఉండిపోయిన బంగళాలలో!!

మరి? ఎవరికయినా కలిగే ప్రశ్నే ఇది. వాళ్ళకే సమాధానం లేకుండా పోయింది.

తెలుగుదేశంలో ఏ విశ్వవిద్యాలయంలోనూ లేనంత మంది "డాక్టర్లు" ఉన్న కాలేజీకి ఏ స్కూలుకి రానన్ని రాంకులు వచ్చే స్కూలుకు ప్రిన్సిపాల్‌గా హెడ్ మాష్టారుగా ఉన్న వాళ్ళిద్దరూ ప్రిన్సిపాల్స్ అయ్యేసరికి కాలేజీ మామూలు కాలేజీ అయిపోయింది. స్కూలు తుక్కు దూగర జూనియర్ కాలేజీ అయింది.

చర్చిలో చందా పడుతున్నారు. చర్చిలో క్రిస్మస్ పండుగ అయిపో వచ్చింది.

ఇక ఇళ్ళలో విందు. బంధువులతో గడపడం, దాన ధర్మాలు చేయడం, దూరం నుంచి వచ్చిన కొడుకులు, కూతుళ్ళు, మనుమలు, మనుమరాళ్ళతో అంతా కలిసి గడపడం. క్రిస్మస్ ఎంత మంచి రోజు!

చర్చి సెక్రటరీ రిపోర్టు చదువుతున్నాడు. కేరల్ పార్టీలో, చర్చిలో వసూలైన మొత్తం, అయిన ఖర్చు, చేసిన దానం, వగైరా వివరాలు, ఎవరిక్కావాలీ? మణిరత్నాలు వింటున్నారు.

పిల్లలంతా క్రిస్మస్ చెట్టు చుట్టూ చేరారు. క్రిస్మస్ తాత వాళ్ళ కోసం అక్కడ చాక్‌లెట్లు పెట్టి వుంచాడు. తింటున్నారు. ఆ తాతే చర్చి వెలుపల కాంపౌండు లోపల బిచ్చగాళ్ళు లేని కాళ్ళ, కళ్ళ ముందు బట్టలు పరిచి ఉంచారు. దాన ధర్మాలకేం కొదవ! పైసలు! పావలాలు!! అర్ధలు! రూపాయలు!!

చర్చి కాంపౌండు వెలుపల విశాలమైన బయలు. అంతా దున్ని వుంచారు. ఏమో పంట పెట్టే ప్రయత్నంగా వుంది. ఎవరున్నారో, ఎవరు పంట పెడతారో, ఎవరు తింటారో!

ఆ స్థలం ఎంత లేదన్నా పాతిక ఎకరాలుంటుంది. అదెక్కడో అడవుల్లో వున్న స్థలమూ కాదు. ఊసర క్షేత్రమూ కాదు. వందేళ్ళు పూర్వం ఎక్కడెక్కణ్ణుంచో గరిక తెచ్చి వేసి పెంచి చక్కగా చేసిన బయలు అది. ఒక పక్కగా మూడు కాలేజీ హాస్టళ్ళు. మరొక పక్కగా లెక్చరర్లుండే ఇళ్ళు. ఈ మూలకుంది చర్చి. అదంతా బయలు.

శతాబ్దం పూర్వం ఇది ఊరికి దూరంగా ఉన్న చోటు. ఇప్పుడు ఊరికి నడిబొడ్డు. మనిషి వున్న చోటే మిత్రుడైనా శత్రువైనా వుంటాడని నమ్మవచ్చు. క్రైస్తవులు అయిన వాళ్ళు కానివాళ్ళు ఈ చుట్టూ ఇళ్ళు కట్టుకోవటం వల్లే ఈ ప్రదేశం పట్టణం గుండె అయింది.



క్రైస్తవుల మతం ప్రచారం చేస్తున్న రోజుల్లో తెల్లవాళ్ళు ఊరికి దూరంగానే వున్నారు. అందుకే ఊరికి దూరంగా వున్నవాళ్ళు క్రైస్తవులయ్యారు.

విద్య కోసం, వైద్యం కోసం, ఉద్యోగాల కోసం హిందువులు కొందరు క్రైస్తవులయ్యారని మామూలుగా అనిపిస్తుంది. కాని నిజానికి కారణం సమానత్వం మీద ఆశ! ప్రేమ! భక్తి!

ఎందుకో మనిషి ఏమీలేని రోజుల్లో కష్టాల్లో, బాధల్లో ఇతరులతో కలిసి వుంటాడు. అన్నీ వున్న రోజుల్లో సుఖాల్లో సంతోషాలలో విడిపోతాడు. ఇది మానవ నైజం! క్రైస్తవుడూ మనిషే! అందుకే క్రైస్తవుడూ తనలో తాను నేడు విడిపోతున్నాడు. వేరవుతున్నాడు.

చర్చిలో ఎంత మౌనం! వెలుపలకి రాబోయే ముందు చేసుకొనే ప్రార్థన!

నిరంతరం శ్రమించే మనిషికి చర్చి విశ్రాంతి.

ఎప్పుడూ శబ్దించే మానవ యంత్రానికి చర్చి విరామం.

నిశ్శబ్దత నుంచి మానసిక ప్రశాంతిని పొందటానికి చర్చి క్రైస్తవులకు దేవుడిచ్చిన వరం.

మైక్ శబ్దంతో కాంపౌండు జనం గోలలతో, ఫాదర్ ప్రసంగంతో ప్రతిధ్వనించిన ప్రదేశం ప్రశాంతంగా వుంది.

ఈ ప్రశాంతి పశులు పాకలోంచి, బేత్లహేంలోంచి ఆసియా అంతటా, ప్రపంచమంతటా ప్రవహించి వున్న కాలం ఇది.

తల వంచుకోవటం తెలియని మణిరత్నాలు, తలలు వంచుకొన్నారు. మౌనంగా ఉండలేని వాళ్ళు మౌనంగా వున్నారు. ఒక్క చోట ఉండకూడని వాళ్ళు ఒకే చర్చిలో ఉన్నారు. ఇదేం ప్రమాదమో! క్రిస్మస్ జరిగిపోతూ వుంది.

ఈ ప్రదేశం అంతా భారత దేశంలో భాగమే! తెల్లవాళ్ళు పరిపాలించిన రోజుల్లో క్రైస్తవ మిషనరీల కోసం ఈ భూభాగం దత్తం అయింది. ఆ రోజుల్లో దీనికేం పెద్ద విలువలేదు.

ఇప్పుడు సెంటు నేల అయిదువేలు ఇస్తామన్నా అమ్మేవాళ్ళు ఈ ప్రాంతంలో దొరకరు. అలాంటిది పాతిక ఎకరాల నిక్షేపం లాంటిది స్థలం. ఇది ఏ వ్యక్తి సొంతమూ కాదు; మతం ఆస్తి; ఇంత ఆస్తి వుండీ, ఎవరికీ ఉపయోగపడదు. లంకెల బిందెల్ని రాక్షసులు, నాగుబాములు, దెయ్యాలు కాపాడినట్లు ఈ ఆస్తిని మతం కాపాడుతూ వుంది. అది తినా తినదు, ఇతరుల్ని తినానివ్వదు.

తెల్ల దొరలు వెళ్ళిపోతూ వదిలిపెట్టిన బంగళాలలో అప్పుడు మత ప్రచారకులుగా ఉన్నవాళ్ళు చేరుకున్నారు, సొంతం చేసుకున్నారు. వంశ పారంపర్యంగా అనుభవిస్తున్నారు.

ఆ తల్లిదండ్రుల వారసులుగా మణిరత్నాలు ఈ బంగళాలలో స్వగృహాలలో లాగా నివసిస్తున్నారు, పోనీ జీవిస్తున్నారు.

అంతటితో సంతోషిస్తే ఆపదలే లేవు. బంగళా చుట్టున్న స్థలమంతా నాదంటే నాదంటూ రెండు బంగళాల వాళ్ళు పోటీ పడి చర్చి, క్వార్టర్స్, హాస్టల్స్, నావంటే నావంటూ మణి రత్నాల రూపంలో కోర్టుల చుట్టూ తిరిగారు. మొత్తం మీద చర్చి ఆస్తి అంతా నాది నాది అని కొట్లాడుకున్నారు. తిట్లాట, పోట్లాటగా, అది మర్డర్లాటగా మారిపోయింది.

శిక్షలు పడ్డవాళ్ళు లేరు. జైలు పాలైన వాళ్ళు లేరు. చనిపోయిన వాళ్ళు లేరు. కాని చర్చి ఆస్తికి మణి రత్నాలు సమానంగా వారసులుగా కిందా మీదా పడ్డాక అక్కడొక తీర్పు ఇక్కడొక తీర్పు ముగిశాక, అటింతా ఇటింతా ఖర్చు అయ్యాక తీర్మాణం అయింది. తీర్పు వచ్చింది.

హైకోర్టు తీర్పు అసలేం బాగాలేదని సుప్రీం కోర్టుకు మణి రత్నాలు మర్యాదగా కేసు దాఖలా చేశారు. అదెప్పుడు మొదలవుతుందో, ఎప్పుడు తీర్పు వస్తుందో మణిరత్నాల కాలంలోనే తీర్పు

వింటారో వీళ్ళ పిల్లలు వినవలసి వస్తుందో వేచి చూడవలసిందే! మిగతా కథ వెండి తెరమీద చూడవలసిందే!

చర్చిలో నుంచి ప్రార్థన ముగించుకొన్న జనం బైటికి వస్తున్నారు. కబుర్లు, బంధుత్వాలు, పలకరింపులు, అభినందనలు, షేక్‌హాండులూ, కలకలం, రద్దీ!

చర్చి అంతా ఖాళీ అయింది. అందరూ వెళ్ళిపోయారు. కానీ ఫాదర్ పోలేదు. ఎందుకు పోలేదంటే మణి రత్నాలు పోలేదు కాబట్టి.

బైటికి పోయిన వాళ్లు లోపలున్న మణి రత్నాలను చూస్తున్నారు.

వాళ్ళ బంధువుల మిత్రుల మాటలకేంగాని పరివారం మాత్రం పరాకుగా లేదు.

ఫాదర్ వచ్చి ఇద్దరినీ అభినందించి మరీ వెళ్ళాడు.

వెలుపల ఉన్న వాళ్ళు మణి రత్నాలు గోదాలో వస్తాదులు రాగా కుస్తీ పడుతారని పందెం కాసుకుంటున్నారు.

వాళ్ళలో ఎవరు చేయి ఎత్తినా పరివారం తలపడుతుందని నమ్ముతున్నారు! వాళ్ళలో ఎవరు ఎవరి వాళ్ళో పోల్చుకుంటున్నారు.

కూడబలుక్కున్న వాళ్ల మాదిరిగా ఇద్దరూ ఒకేసారి కుర్చీలలోనుంచి లేచి నిలబడ్డారు.

వెలుపల నుంచి తొంగి చూచే వాళ్ళ కళ్ళలో ఆత్రం!

మణి రత్నాలు ఒకరివైపు ఒకరు ఒక్కొక్క అడుగు వేస్తుంటే, బైట నిలబడ్డ జనం తలుపుల దగ్గర, కిటికీల దగ్గర ఒకరు మీద ఒకరు ఎక్కి నిక్కినిక్కి చూస్తున్నారు.

చర్చి సెంటరులో ఇద్దరూ నిలువుగా, నిటారుగా, నిలువెత్తున నిశ్శబ్దంగా, నిశ్చలంగా నిలబడివున్నారు.

ఇద్దరూ ఒకేసారి కుడి చేతులెత్తారు.

చేతితో కొట్టవచ్చు. నెట్టవచ్చు. గొంతు పిసకవచ్చు.

కానీ ఇద్దరి చేతులూ కలిశాయి; కరచాలనం, షేక్ హాండ్స్.

క్రీస్తు రెండవ రాకడను, క్రైస్తవ భక్తులు వాళ్ళిద్దరినీ చూచి, భావించుకొంటున్నారు.

రెండు చేతులూ ఊగుతున్నాయి. ముఖ్యంగా నవ్వుతున్నాయి.

“విష్ యు హాపీ క్రిస్మస్’ ఇద్దరూ ఒకేసారి అన్నారు.

జనం విన్నారు.

అందరూ అనుకొన్నారు.

“విష్ యు హాపీ క్రిస్మస్’

బంధువులు మిత్రులు మామూలే కాని పరివారం కూడా ఎదుటి పరివారంతో ఎదురుగా నిలబడి చేతులు కలుపుతున్నారు.

కాంపౌండు నిండా జనం, భయం లేని జనం, సందేహం లేని జనం.

కాంపౌండు అంతా షేక్ హాండ్స్.

ఏ మూల విన్నా, స్త్రీలు, పురుషులు, పిల్లలు అంతా ఒకటే మాట.

‘విష్ యు హాపీ క్రిస్మస్’

చర్చి గంటలు నిర్విరామంగా మోగుతున్నాయి.

(ప్రచురితం, 1980)



# 2 పాహిమాం... పాహి... పాహి...

ఎం. సూర్య ప్రసాదరావు

చెంగయ్య గబగబా గంగయ్య దగ్గరకు పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"గంగయ్యన్నా..... గంగయ్యన్నా...."

"ఏం, చెంగయ్యా.... ఏమయింది?" గంగయ్యన్నాడు. కాలుతోన్న చుట్ట నుసి రాల్చుకుంటూ.

'చిమరే మరే....." చెంగయ్య రొప్పుతున్నాడు.

"ఇలా కూచో." గంగయ్య రచ్చబండ చూపించాడు.

రచ్చబండ! హరిజనవాడలో ఏ సమస్య వచ్చినా చర్చించుకోడానికి వారేర్పరచుకున్న స్థలం! అందరూ కష్టసుఖాలు చెప్పుకునే చోటు.... పరిష్కారం కోసం పదిమంది తలలు కలుసుకునే సమావేశ స్థలం. అదీ సాయంత్రం ఐదు తరువాత!

చల్లని మర్రి చెట్టు క్రింద గంగయ్య ఆ వాడ కంతకూ అంతకంటే చల్లని నీడ! అపకారికి సైతం ఉపకారం చేయమనే పరోపకారి! ఆ వాడకు అతను హితుడు, సన్నిహితుడు, స్నేహితుడు! అందుకనే అతను ఆ వాడకు తలలోని నాల్క. ఎంత సమస్య అయినా అతని ముందు దూది పింజలా తేలిపోవాలసిందే.

అందుకే చెంగయ్య గంగయ్య దగ్గరకు పరిగెత్తుకుంటూ వచ్చాడు.

ఇంతలో రంగయ్య కూడా రంగప్రవేశం చేశాడు.

"గంగయ్యన్నా, గంగయ్యన్నా!"

"ఏందిరా రంగా, ఏమయింది?" గంగయ్య గొంతులో కొద్ది ఆదుర్దా తొంగి చూసింది.

"మరేమో, మరేమో మనల్ని ఊరి బావికాడికి రానియ్యరంట!" రంగయ్య రోజుతూ రొప్పుతూ చెప్పేశాడు.

"అదే అన్నా, నేనూ అదే చెబుదామని వచ్చా." చెంగయ్య వంత పలికాడు.

గంగయ్యకు ఈ కంప్లెయింట్ వినడం ఐదోసారి!

"ఎందుకంటరా.... ఎందుకంట?"

"ఏమో! ఊరి బయట వున్నోళ్లం. ఊరి బావికాడికి రాగూడదంట."

"మనం ఏ తప్పు చేశామంట?"

"మనం అంటరాని వాళ్లమంట. అందుకని మనల్ని వాళ్ల బావినీళ్లు తోడుకోనియ్యరంట."

"ఎవర్రా ఆ మాటలంది?"

"అళ్లే - అళ్ళంతా...." దూరంగా కనిపించే పెంకుటిల్లువైపు, డాబాలు, మేడలు, మిద్దెలవైపు రంగయ్య చూపించాడు.

గంగయ్య ఆలోచనగా చూస్తున్నాడు.

"మరెట్టాగన్నా?" చుట్టుపక్కలవాళ్ళు ప్రశ్నించారు.

"ఆ బావి వారొక్కరి సొత్తేనా?..... ఊరి బావంటే ఊరందరిదీ!" చెంగయ్య మరింత ధీమాగా అన్నారు.

"మనందరిదీలే. అందుకు వాళ్ళతో కొట్లాడి పగలు పాతేసుకుందామా?" గంగయ్య అన్నాడు.

"అసలే వచ్చేది ఎండాకాలం. ఆ బావి లేకపోతే మనమంతా మల మలా మాడి చావాలి."

"పగలు పాతేసుకోకపోయినా గుక్కెడు నీళ్ళు పుట్టే దెట్టన్నా?"

తలా ఒక మాట అంటున్నారు.

"ఉన్న మార్గమేదో నువ్వే చెప్పు". చెంగయ్య గొంతులో విషాదం వినిపిస్తోంది.

"అసలు ఆ బావిని త్రవ్వింది ఎవ్వరంట?" గంగయ్య ప్రశ్న వేశాడు.

"ఎవరూ? మనవేఁ! కట్టవడి సెమటోడ్చి సల్లని నీరు తెప్పించాం." రంగయ్యన్నాడు.

"ఊరి మధ్యలో ఉండడంచేత బావి పరమైంది. "చెంగయ్య అక్కసుగా అన్నాడు.

"అటువంటి మరో బావిని మనం స్వంతం చేసుకుంటే?" గంగయ్య సాలోచనగా అంటే -

"అంటే?"

"మనమంతా ఆ పాడు ఊరికి దూరంగా మరో బావి త్రవ్వుకుందాం. అప్పుడు మనం ఆ పాడు ఊర్లోకి వెళ్ళక్కరలేదు".

"బలే.... భలే..... అంటే, మనవేఁ ఆ వూరిని ఎలేత్తున్నామన్నమాట!" రంగయ్య ఉత్సాహంగా అన్నాడు.

"అంతే. అంతే. అలాగే. అలాగే." అందరూ ముక్తకంఠంతో అన్నారు. స్థల నిర్ణయం, కాల నిర్ణయం, పనివాళ్ళ నిర్ణయం క్షణాల్లో జరిగిపోయాయి.

హరిజనవాడకు దూరంగా, ఊరికి చాలా దూరంగా బావి తవ్వకం జరిగిపోతోంది.

ఆడా, మగా భేదం లేకుండా పెద్దవాళ్ళంతా పనులకు వెళ్ళిపోయిన వేళ.... పట్టపగలే దారుణం!

"అమ్మో! నాయనో! దేవుడో! రచ్చించండి."

హాహాకారాలు!!

ఇళ్ళలోపల్నుండి పారిపోతున్న వాళ్ళు.

వాళ్ళను తరిమి తరిమి వెంటాడినవాళ్ళు.

కాళ్ళు విరిగిన వాళ్ళు, చేతులు కోల్పోయినవాళ్ళు.

ముసలీ, ముతకా, పిల్లా, జల్లా....

కాలిపోతున్న గుడిసెలు.

బయటకు విసిరివేయబడ్డ సామాన్లు.

హాహాకారాలు....

శ్రవణానందకరంగా కొందరికీ....

ప్రాణ రక్షణ పరిదేవనంగా అక్కడి వారందరికీ.

పనులకు వెళ్ళినవాళ్ళు తిరిగి వచ్చేసరికే ఘోర పరిణామాలు. విషాదకర విధ్వంసక దృశ్యాలు అధికారులూ, రాజకీయ నాయకులూ వచ్చారు. పరామర్శించారు. వెళ్ళారు. బాధితులు.... బాధితులుగానే ఉండిపోయారు.

బావి త్రవ్వకం పూర్తయిపోయింది.

ఊరికి దూరంగా, మరింత దూరంగా, ఊరి వెలుపలనున్న హరిజన వాడ కొత్త బావి దగ్గరకు వెళ్ళిపోయింది.

"ఇక్కడ ఎలా ఉంటామన్నా? కరెంటు లేదుగా!"

"లేకపోతే యేంరా? సల్లని వెన్నెల వుందిగా!"

"పురుగూ పుట్రా రాత్రిపూట తిరుగుతుంటాయటగా?"

"అవి మనల్నేవీ సెయ్యవు బాబాయ్! వాటికి మనం యేదయి నా సేత్తేనే అవి మనల్ని కుట్టేది. కానీ. మాయదారి మడిసి అట్టాకాదు. ఆడికి మనం యేమీ అపకారం సెయ్యకపోయినా కసిదేవుకొని కాటేత్తాడు."

"అంతే. అన్నా! అంతే!"

ఆరాచకత్వానికి, అత్యాచారానికి, వర్ణ - వర్గ వైషమ్యాలకు బలియైన వారంతా ఒకరినొకరు ఓదార్చుకుంటున్నారు.

పాతిక పాకలు - క్రమేపి ఏభై గుడిసెలయ్యాయి.

కొన్ని పెంకుటిళ్ళు తలెత్తాయి.

నిర్వాసితులంతా ఎల్లలు పెంచుకున్నారు.

వారు విడిచిన ఊరు పట్నమైపోయింది. పట్నం పరిధులు పెంచుకొంది.

పట్నం రహదారికి ఆ హరిజనవాడ అడ్డం వచ్చింది.

అంతే! పట్నం ఆగ్రహించింది.

'ఆ వాడను అక్కడి నుంచి లేపాలి. వారిని దూరంగా మరింత దూరంగా తరిమికొట్టాలి!"

అంతే! హరిజనవాడకు నోటీసులు జారీ అయ్యాయి.

'త్వరలో ఆ జాగాను ఖాళీ చెయ్య'మని!

పది సంవత్సరాలుగా పిల్లాజెల్లాతో పచ్చపచ్చగా ఉంటున్న నేల.....

ఘర్మ జలాన్ని ధర్మజలంగా మార్చి, కొబ్బరి నీరు లాంటి నీటిని చేపించుకున్న నేల....

తుప్పలను మంచి నేలగా, నేలను పాకలుగా, పాకలను పూరిళ్ళుగా, పూరిళ్ళు పెంకుటిళ్ళుగా మార్చుకొన్న నేల.

ఎలా విడిచి వెళ్ళడం? ఎక్కడకు వెళ్ళడం?

ఇన్ని కుటుంబాల గోడు ఆలకించే నాథుడే లేడా!

అధికారులకు అర్జీలు పెట్టుకొన్నారు. రాజకీయ ఓనమాలు దిద్దుకోనివారి దగ్గర నుండి ఔపోసన పట్టిన పురుషోత్తములవరకూ కలుసుకున్నారు.

అందరూ చూదామన్నారు. చేదామన్నారు. పైవారికి చెప్పి చూదామన్నారు. చేయి చూదామన్నారు. లేచి చూడమన్నారు.

రోజులు గడిచిపోయాయి. వారాలు నెలలయ్యాయి. మరో నెల రోజుల్లో ఆ ప్రదేశం ఖాళీ చేయమని వారికి ఆఖరి ఆదేశాలు జారీ అయ్యాయి.

"ఎలాగన్నా ఈడనుండి పోవడం?"

"ఎలాగ బాబాయ్! ఈ జాగా ఖాళీ చేయడం?"

"పిల్లా జెల్లాతో ఇప్పుడు యేడకుపోతాం? యేమైపోతాం?"

గంగన్న ఆలోచిస్తూ ఉన్నాడు.

అతనికీ ఆ ప్రదేశం వదిలి పెట్టకూడదనే ఉంది. 'కష్టపడి సంపాదించుకున్న పరిసరాలు. ఇది వదిలి ఎక్కడకు పోవాలి? ఇది వదిలితే వాళ్ళు అక్కడ కూడా ఎసరు పెట్టరని గ్యారంటీ ఏమిటి?'

'ఎలా.... ఎలా.... ఈ సమస్యను పరిష్కరించడం?'

ఆలోచిస్తూనే ఉన్నాడు.

గంగన్న ఆలోచనలు అన్వేషిస్తూనే ఉన్నాయి.

'పాహిమాం... పాహి' అన్న గజేంద్రుని రక్షించిన కరివరదుని కోసం.

'చిన్న ప్రహ్లాదుని బ్రోచిన నారసింహుని కోసం....'

తమను రక్షించే వారికోసం. తరణ్యుపాయం కోసం.

రేడియో కార్యక్రమాలు వింటున్నవాడల్లా ఉలిక్కిపడ్డాడు.

గంగన్నకు తరుణోపాయం లభించింది!

సాయంత్రానికి సమావేశం ఏర్పాటు చేశాడు.

అందరికీ తలలో నాల్కలా తన పరిష్కార మార్గం వినిపించాడు. అందరినీ ఔననిపించాడు.

హరిజనవాడ ఖాళీ చేసి వెళ్ళిపోవాల్సిన సమయం వచ్చేసింది! అధికారులు సర్వేకు వచ్చారు.

అధికారులతో సంతోష సల్లాపాలతో మిగిలినవాళ్లూ ఆ ప్రాంతానికి వచ్చారు.

ఆ వాడకు ముందు మర్రిచెట్టు నీడలా ఉన్న ఆ నగరం పేరు చూచి క్షణకాలం విస్తుపోయారు.

బోర్డుదాటి కొద్దిగా ముందుకు వెళ్తే ఓ ఎత్తయిన కట్టడం.... పెద్ద పెద్ద కిటికీలు పెద్ద పెద్ద ద్వారాలు. శిఖరాగ్రాన ఓ పెద్ద గంట!

ఆ కట్టడంలోంచి నలుదిశలా అమర్చబడిన మైకుల నుండి ప్రసంగం వినబడుతోంది!

"బిడ్డలారా! నన్ను నీవు రక్షించుకోలేవు నిన్నూ నన్నూ సర్వజనులనూ రక్షించగలిగింది ఆ ప్రభువు ఒక్కడే! ఆ ప్రభువునే శరణు వేడుకో! ఆ ప్రభువే నిన్ను రక్షిస్తాడు!"

నిశ్శబ్దంగా ఆ అధికారులు వింటున్నారు.

చర్చి మైకుల్లోంచి వినిపిస్తోన్న ఆ రక్షకుని 'రసవద్గీత'ను

మరో పది నిముషాల్లో అందరూ బయటకొస్తున్నారు.

ముందుగా బయటకు వచ్చింది గంగయ్య - డేవిడ్ గంగయ్య!

తరువాత..... రంగయ్య - మైకేల్ రంగయ్య! ఆ తరువాత చెంగయ్య - శామ్యూల్ చెంగయ్య!

ఒక్కొక్కరూ భార్యాపిల్లలతో వాళ్ళ నగరానికి వెళ్ళిపోతున్నారు.

సరిగ్గా చర్చి వెనగ్గా అనేక వరసల్లో పూరిళ్ళు, పెంకుటిళ్ళు.

గంగయ్య చెంగయ్య రంగయ్య వెనక్కి తిరిగి చూచి చూచి మరీ వెళ్ళుతున్నారు.

ఆ రోజు తమను తరిమిన వారిని, తమను హాహాకారాలు పెట్టించిన వారిని....

అధికారులు అలా నిశ్చేష్టులై చూస్తూనే ఉండిపోయారు -

ఆ హరిజనవాడ ముందున్న బోర్డును చూచి.

అది 'బెత్లెహామ్ నగర్!'

(ఇంకానా? ఇకపై సాగదు కథల సంకలనం నుండి)

# 3 గుడిసె ఏసోబు కథలు

డి. గోపి

## మా కాన్వెంట్

"ఇదిగో నిన్నే... ఈ పూటన్నా ఆ కాన్మెంటుకుపోయి పెద్దమ్మగోర్ని కలుత్తావా? ఆరితో మంచిగ మాట్లాడి మన చంటిగాన్ని అందులో పెడితే బాగ సదువుకుంటూడు. లేకపోతే ఆడుమనలాగ ఈ ఎట్టిసాకిరి సెయ్యాల్సిందే! యిన పడిందా?"

"యినపడిందిలేవే! ఎందుకంత కేకలేత్తవ్? ఆడిగురించి నేను ఆలోసినసేయటం లేదనుకున్నవా? అసలియ్యాల కూలిపనికి పోన్ది కూడ అందుకేగా?"

"కూలి మానేసి నోడివి అట్టా బండమీద కూసోని ఆలోచిత్తే పనౌద్దా? చాన పొద్దెక్కింది. బస్సొచ్చే యేల కూడ అయ్యింది. ఈ పాటిక కాన్మెంటు తెరిసే వుంటారు. కొత్త సద్దికూడు తినిపోయి పెద్దమ్మగోర్ని కలచిరా!"

తొందర పెట్టింది నా పెళ్ళాం. చాన పొద్దెక్కినట్టు నాక్కూడా గుర్తొచ్చింది. మొకం కడుక్కుని ఇంట్లోకి పోయేసరికి సద్దికూడు పళ్ళెంలో పెట్టి గోంగూరపచ్చడేసి నా ముందు పెట్టింది. గబగబ నాలుగు ముద్దల్లో అవజేసి, తలకి కొబ్బరినూనె పూసుకుని, పెట్టెలోనుంచి మూడేళ్ళ కిందట కిస్మిస్‌కి కొన్న పంచె, చొక్కా, పై పంచె తీసి కట్టుకున్నా. ఈలోగా అది కూడా మొకం కడుక్కుని వచ్చింది. వస్తూనే ఆ తల్లి పటం ముందు మోకరించి పార్థన చేద్దాం" అంది.

మరియమ్మ తల్లి పటం ముందు యిద్దరం మోకరించాం.

"తల్లీ మరియమ్మ తల్లి - నువ్వు సల్లగా చూడబట్టే యియ్యాల్టికీ కలో - గంజో తాగుతున్నాం. నీ దయే లేకపోతే మా బతకులు ఎట్టా వుండేయో! తల్లీ మాకున్న ఈ ఒక్కగానొక్క కొడుకుని నీ పాదాల ముందు పెడుతున్నాం. నువ్వే ఆడ్ని కాపాడాల. ఆడు మాకు మల్లే కట్టపడి గంజినీల్లు తాగకూడదు. సక్కగా యే ఆఫీసులోనో కురిసీలో కూసుని చల్లగా బతకాలి. ఎండకి మాడిపోతన్నం. వానకి తడిసి పోతన్నం. రోజంతా కట్టపడి పనిచేసినా రాతిరికి నాలుగు వరి మెతుకులు దొరకటం లేదు. తల్లీ - మరియమ్మ తల్లి - మా బిడ్డ సాన పెద్దవాడవ్వాల. ఆడిని పెద్దమ్మగోరు కాన్మెంటులో చేర్చుకునేలాగ సాయం సేయి తల్లి."

మరియమ్మ తల్లి పాదాలకు దండం పెట్టుకుని కాన్మెంటుకి బోవటానికి బయల్దేరాను.

కాన్మెంటు కాడికి పోయాలకి ఎట్టుంటదోనని కుండలో నుంచి గ్లాసుడు మంచినీళ్ళు తీసుకొని తాగాను.



"యామేవ్-మరి నేను పోయి వత్తా" అంటూ నా పక్కన సూత్తే అది" కనపళ్ళేదు. ఇంతలోనే యాడికి పోయిందబ్బా అనుకుంటూ యింట్లో నుంచి బైటికొచ్చి వాకిటి గుమ్మంలోకి సూశా.

"ఎవ్వల్లూ రావటంలేదు. తొందరగా రావయ్యా" అంటూ గుమ్మంలో నాకు ముందుగా తనే ఎదురు రాటానికి నుంచుంది.

"ఇదిగో వత్తన్నా. నువ్వెటు పోయావా అని సుత్తుంటే యిక్కడున్నావా?"

సూర్లోనుంచి పాతసెప్పులు తీసి తొడుక్కొని కాన్మెంటుకి పోదామని బయలెల్లాను.

మన సంటిగాణ్ణి కూడా తీసుకెళ్లి పెద్దమ్మగోర్కి సూపిత్తే బాగుంటదేమంటా! అయినా యీడు ఏడకు పోయిండే? పొద్దుటి నుండి కనపల్లేదు?"

"ఆడుకోటానికి పోయుంటడు. యిప్పుడేడ మనకి దొరుకుతడు. ఆకలైతేగాని ఆడికి యిల్లు గురుతురాదు. ఆడెందుకులే - మద్దెలో ఏడిపిత్తడు. నువ్వెల్లిరా" అంటూ సాగనంపింది.

"యీణ్ణిట్టా వదిలేత్తే మన సేతికే దొరకడు. ఆ పెద్దమ్మగోరి కాల్లు పట్టుకొనైనా యీణ్ణి కాన్మెంటులో పడెయ్యాల" నాలో నేనే గొనుక్కుంటూ రోడ్డెక్కాను.

నా కిప్పుడు పాతికెళ్ళుంటయ్. నేను సిన్నప్పుడే మా అయ్య పాము కరిసి పోయిండు. మా అమ్మే నన్ను పెంచింది. ఎనిమిదేల్లొచ్చాయో లేదో పెద్దరెడ్డిగారి గేదెలకాడ బుడ్డ పాలేరుగా కుదిరాను. యేడాదికి బత్తాన్నర గింజలు యిచ్చేవోరు.

పన్నెండో యేట నుంచీ నీల్లుతేటం, గొడ్లకాడ పేడతీసి వూడవటం, ఆటికి మేత పడెయ్యటం సేసేవోణ్ణి. జీతం యేడాదికి పది మానికెల గింజల సొప్పున పెరిగింది.

ఆరేళ్ల కిందటే అమ్మ పొంగుసూపి సచ్చిపోయింది. ఆ తరువాత యేడు నా పెళ్లి సేసిండు పెద్దరెడ్డిగారు. పెల్లయిన రెండోయేట పాలేరుతనం మానేశా. కూలీ పనికెల్తూ తినీ - తినక గడుపుకొత్తన్నం.

సంటిగాడు పుట్టి నాలుగేల్లయింది. ఆణ్ణి కాన్వెంటులో పడేద్దామని అనుకున్నా. ఆడునాకుమల్లే కట్టపడకూడదు. ఎంత కట్టపడ్డా ఏంవత్తంది? గంజినీళ్ళు తప్ప. ఒక్కొక్క యేడు వానలు కురవకపోతే కూలిపని లేక ఆ గంజీ దొరకదు. అందుకే సంటిగాణ్ణి సదివియ్యాల. ఆడు కలకటురు కాకపోయినా గుమత్తా అయినా మేలేను. 'ఏం ఏసోబన్నా, యాడికి తెల్లబట్టలు కట్టిపోతున్నవ్? ఏంటి సంగతి?' ' అన్న మాటలతో ఆలోచనల్లో నుండి బైటికొచ్చిన. ఎదురుగా నవ్వుతూ యాకోబుగాడు నిలబడ్డాడు. భుజమ్మీద పార, చేతిలో సద్దిమూట. నేను పాలేరుతనం మానుకున్నా పెద్దరెడ్డి గారి దగ్గర ఈడే కుదిరిండు. మిరప తోటకి నీరు కట్టటానికి పోతున్నట్టుండు.

"యాడకి లేదురా, మన పెద్దమ్మగోరి కాడికెళ్ళి సంటిగాణ్ణి కాన్మెంట్లో సేర్చుకోమని అడుగుదామని పోతున్నా, అవునొరేయ్ - మిరప తోట బాగుందా?"

"ఆ బాగనే వుంది. మొన్ననే మందేసినం. మరి పొద్దెక్కుతుంది. నువ్వు పోయి పెద్దమ్మ గోరి కాల్లమీద పడు. ఎట్టాగైనా సరే ఆణ్ణి ఆల్లకాడే వుంచాల. లేకపోతే యిప్పుడు మన బతుకులు సూడు - సద్దిబువ్వకూడ యింటి పట్టున తినేయోగంలేదు. ఆడు ఈ ఎట్టిశాకిరి సెయ్యకూడదు. సర్లే-నేను పోతా"

యాకోబు గాడు ఎల్లిపోయిండు. మల్లీ నడక మొదలు పెట్టా.

రెండేళ్ల కితం కామోసు అమ్మగార్లు, సాములోరు వొచ్చి ఈ ఊల్లో కాన్మెంటు మా కోసం పెడుతున్నట్టు సెప్పారు. మా పిల్లలు సదువుకోవచ్చని మా సాములోరు సెప్పిండు.

యేడాది తిరక్క ముందే పెద్ద డాబాలు, చుట్టూ పారీ గోడ కట్టించారు. రాళ్ల రప్పలతో వుండే పోరంబోకు బూమి యిప్పుడెంత బాగుందని? కొబ్బరిసెట్లు, రంగు రంగుల పూల సెట్లు, పచ్చలాగు, తెల్ల చొక్కా తొడుక్కుని కేరింతలు కొట్టే పిల్లగాళ్లు - బాలేగుంది.

ఆ పోరంబోకుభూమిలో రాల్లన్నీ మేమే పగలగొట్టినం. ఆటినే డాబా కట్టటానికి గోడల్లో పెట్టారు. యిసక తోలినం. పునాదులు తియ్యాలంటే ఎంత కట్టపడ్డామని? పలుగుతో దెబ్బేత్తే ఖంగుమని మోతొచ్చేది.

నేనే కావిడి తీసుకుని నీల్లు మోసి ఆనేల అంతా నానబెట్టా. మిగతా వోల్లేమో పునాదులు తీశారు. సిమెంటు కట్టలు మోసి, యినుపసువ్వలు వంచి ఎన్ని పనులు సేసినామో! అంత కట్టంలోను - మేం సంతోషంగా వుండేవోల్లం. ఎక్కువగా కూలితీసుకోలేదు. యీ కాన్మెంటు మా పిల్లల కోసమని సాములోరు సెప్పినాదుగా. మా పిల్లల బాగు కోసం కట్టపడుతూ కూలీ తీసుకోవాలి అని అనుకున్నం.

మాకళ్లల్లో మా పిల్లల బవిసత్తే కనపడింది. ఆల్లంతా బాగా సదువుకొని, పెద్ద ఆపీసర్లై మల్లీ ఈ వూరొత్తే -నన్ను నీ యమ్మ' అని తిట్టి, కాలితో తన్నిన పెద్దరెడ్డిగారు, ఆరి పిల్లలు కూడ లేసి పిల్లలకి దండమెట్టాల.

పట్టలేనంత సంతోసం.

కాని -తీరా కాన్మెంటు కట్టటం పూర్తయినాక పిల్లల్ని చేర్చుకోవాలంటే - అదేదో ఫీజు కట్టమన్నరు కొత్త బట్టలు కుట్టియాల, బూటుకావాల అన్నారు ఆ పెద్దమ్మగోరు.

మా ఆసలన్నీ యెగిరి పోయినాయి. పెద్దరెడ్డిగోరు మా పిల్లల్ని కూడా తిడతారని తెలిసి గుండె పగిలింది.

పొట్ట ఎండగట్టుకుని, గోచీలు పెట్టుకుని అయినా మా పిల్లలకి బట్టలు కుట్టిత్తామన్నారు. కాల్లుకాలి, ముల్లులు దిగబడినా సెప్పులు కుట్టిచ్చుకోలేని మేము బూట్లు కుట్టిత్తాములే అన్నాం.

కాని బూట్లు కుట్టిత్తే పనికిరావట. పట్నంపోయి కొట్టులో కొనాలట.

ఇంకా మా పిల్లలకోసం మేం యింగిలీసులో మాట్లాడాలట. ఆల్లచేత సదివించి,, ఆల్లకురాని అచ్చరాలు యింటికాడ మేం సెప్పాలంట. యియ్యన్నీ మాకు సాద్దెమయ్యే పన్లేనా? లేకపోతే సీటియ్యరంట.

ఇప్పుడా కాన్మెంటులో వున్నపిల్లల్లో చానామంది గొప్పోల్ల పిల్లలే. బాపన డాట్రుగారి పిల్లలు, కరనంగారి పిల్లలూ, మనవల్లూ, రెడ్డిగారి పిల్లలూ, కోంటోరిపిల్లలూ, అంతా ఆల్లేగాని మా లేబరోల్ల పిల్లలే లేరు.

మేం తీసిన పునాదులు, మేం ఎత్తిన బండలు - అన్నీ మాకు యిసమయ్యాయి.

సివరికి ఆ గేటుకాడ వుండోడు..

గుండెలమీద కర పోటు తగలటంతో మల్లీ ఈ లోకంలోకి వచ్చిన. కాన్మెంటు ముందున్నా · నిప్పుడు.

కాన్మెంటు గేటుముందు కాపలాకాసే పోలీసు నన్ను ఆపుసేసిండు.



మేం కట్టిన డాబాలోకి మమ్మల్ని పోనియ్యడుయీడు. యీ ఉద్యోగమున్నా మా ఊరోల్లకిత్తే ఎంత బాగుండేది? యీడితో ఏం మాట్టాడాలన్నా సావే. నాబాస యీడికి రాదు... యీడు మాట్టాడితే నాకు తెలవదు.

ఐనా ధైర్యంసేసుకుని -పెద్దమ్మగారు... మా సంటిగాడు... కాన్మెంటు సీటు....'' అన్న.

నేను సెప్పింది ఆడికి తెలిసిందోలేదో కాని, కరనంగారు మోటర్ సైకిలుమీద రాటంతో పరుగెత్తుకెల్లి నమస్కారం పెట్టి గేటుతీసిండు పోలీసుగాడు. ఆరు లోపలికెల్లగానే గేటు మూసేత్తూ నాకెల్లి సూసి లోనికి ఎల్లమని సైగసేసిండు.

"మరియమ్మ తల్లి, నామీద దయసూపి ఈ గేటోడికి మంచిమనసు యిచ్చావమ్మా. శానామంది మావోల్లు యీ గేటు దాకా వొచ్చి ఎనక్కి పోయారు. నన్ను ఎట్టాగైతే లోనికి రానిచ్చావు. అట్టాగే పెద్దమ్మగోరికి కూడా మంచి మనసు దయచెయ్యితల్లి, గుణదల కొండకి వొచ్చి తలనీలాలు యిచ్చుకుంటం'' అని మరియమ్మ తల్లికి మొక్కుకున్న.

పెద్దమగోరు వుండే గదికాడకి పోయిన. ఇందాక వొచ్చిన కరనంగోరు పెద్దమ్మగోరితో ఏంటో మాట్టాడతుండు. ఆయన బైటికి వచ్చినాక పెద్దమ్మగోర్ని కలవచ్చులే అని గోడకానుకొని నిలబడ్డా.

ఎంత సేపయినా కరనంగోరు బైటికి రాలేదు. కాల్లు పీక్కొచ్చి అక్కడే కూలబడ్డా.

గోడ, కిందగచ్చు సల్లగా వున్నయ్. సాపలేకపోయినా అట్టనే పండుకోని నిదరపోవచ్చు. అంత సుబ్రంగా వుంది.

యిక్కడ వూడిసే మనుసుల్ని, వంటోల్లని పెద్దమ్మగోరు యాడనుంచో తెచ్చారు. గేటుకాడోడికి మల్లే, యీల్లకీ మా బాస తెలవదు. పెద్దమ్మగోరు అయితే అల్లతో బలే మాట్టాడతారు.

ఓయ్! ఎవరయ్యా నువ్వు! ఇక్కడ నిద్రపోతున్నావేంటి?'' పులిగర్జనతో పులిక్కిపడి లేచాను. ఎదవది సల్లగా వుండేసిరికి కునుకుపట్టింది. ఈలోగా కరణంగారు ఎల్లినట్టుండు. కల్లునలుపుకుని సూచిన.

ఎదురుగా మరియమ్మ తల్లిలాగ పెద్దమ్మగోరు'' అన్నాను.

"ఆఁఏంకావాలినీకు? ఇక్కడకొచ్చి నిద్రపోతున్నావేంటి? నీ యిల్లేమైంది?''

"చమించండమ్మా! తప్పయిపోయింది'' మల్లీ దండమెట్టిన.

"సర్లే - సర్లే - ఇంతకి ఏం కావాలి నీకు?''

మరియమ్మ తల్లిని మల్లొకసారి తలుసుకొని

"మాసంటోడిని మీ కాల్లకాడ పడేద్దామని ...." నా మాటింకా పూర్తికానేలేదు....మీ చంటోడేమన్నా కాన్వెటంట యా! నాకాళ్ళదగ్గర పడెయ్యటానికి?''

పెద్దమ్మగోరు అన్నమాటకి అర్థం తెలవకపోయినా ఆరు సరిగా మాట్టాట్టంలేదని తెలిసింది. అంత మాటనకండమ్మా బీదోల్లం. కట్టపడేటోల్లం. అట్టనే మీ పంచనసేరి నాలుగు అచ్చరం ముక్కలు నేరుసుకుంటే ఆడు బాగుపడతడని...

"ఇదుగో చూడు - ఈ కాన్వెంటులో చేరాలంటే - ముందుగా ఎడ్మిషన్ ఫీజు కట్టాలి. -డ్రస్ కుట్టించాలి, బూట్లు, టై కొనాలి. కనీసం మీకు సైకిలన్నా వుండాలి. పిల్లలకి యింటిదగ్గర ఇంగ్లీషు నేర్పాలి. మాథ్స్, సైన్సు కూడా చెప్పగలిగి వుండాలి. ఇవన్నీ మీ వల్లకాదు. ఇవన్నీ సాధ్యం కానప్పుడు ఈ కాన్వెంటులో చదువుకోవటం ఇంపాసిబుల్. మీలాంటి వాళ్ళకు అడ్మిషన్ యిస్తే పిల్లలు

ఫెయిల్ అయ్యి కాన్వెంటుకి బాడ్ నేమ్ తెస్తారు. అయినా - ప్రస్తుతం - అన్ని సీట్లు ఫుల్ అయ్యాయి. ఇప్పుడు ఖాళీల్లేవు''.

''అమ్మ అమ్మ.... మీ కాళ్లు మొక్కుతా అంతమాటనకు తల్లి. దయసూడు తల్లి......''

''ఏమిటయ్యా ఈ న్యూసెన్స్ - నేను దయలేని మూర్ఖురాలి ననుకున్నావా? పిచ్చి పిచ్చిగా మర్యాద లేకుండా మాట్లాడకు. అసలు బయటకు నడువు ముందు''

''తల్లి - తల్లి పెద్దమ్మగోరు - మీకు దండం పెడతాను తల్లి...... అలా కాదనకండి.... యేదో రకంగా నా సంటోన్ని సేర్చుకోండమ్మా''

''ఇదిగో చెప్పేది నీక్కాదనుకున్నావా? ఒకసారి చెబితే అర్థం చేసుకోవే'' అంటూ గది లోపలికెళ్ళిపోయి బెల్లు కొట్టింది పెద్దమ్మగోరు.

గేటు కాడ పోలీసోడు లగెత్తుకొచ్చిండు. ఆడికేదో సెప్పినట్టుండారు.

ఆడు గదిబైట కొచ్చి నాజబ్బ పట్టుకుని బైటికి లాగుతున్నాడు.

అర్థమైందినాకు.

''అమ్మో........ పెద్దమ్మగోరు.... కాస్తదయసూపండమ్మా....... నేనమ్మా యేసోబుగోణ్ణి. సాములోరి మతపోణ్ణే తల్లి...... ఈ కాన్మెంటు మా పిల్లలకోసమే అన్నారుగా తల్లి ఆయేల? మీరు కూసున్నగది మేం కట్టిందేనమ్మా..... అమ్మా పెద్దమ్మగోరు..... మేం మతపోల్లమే తల్లీ!.... బీదోల్లమమ్మా....

నా మాట ఆలకించిన వాల్లేలేరు.

గేటు పోలీసుగాడు నన్ను బైటికి తోసి గేటు మూసిండు.

# పట్టపరుపు

మా గుడిసెలోల్లంతా సెంటర్లో నిలబడ్డారు. చానా మంది వుండారు. గారడీవోడో, సర్కస్సోడో వత్తే తప్ప ఇట్టా పన్లన్నీ మాని చోద్దెం చూడరు మా గూడెపోల్లు. అప్పుడప్పుడు గంగిరెద్దులోల్లు కూడ పత్తారు. అట్టాటోడెవడో వచ్చుంటాడనుకుంటూ గుంపు దగ్గరికి చేరిన.

అక్కడుండోల్లెవుల్లూ నవ్వుతూ కనిపించలేదు. ఏదో పారేసుకున్నోల్ల మాదిరుండారు.

నన్ను సూసి పక్కకి తప్పుకొన్నారు మావోల్లు. ఎడ్ల బండిమీద వరిగడ్డేసి ఈతసాప పరుత్తుండు యాకోబుగాడు.

''వొరే సంసోను ఏసోబన్న వొచ్చిండ్రా, పెద్దరెడ్డిగారి కాడికిపోయి డబ్బులు రెండొందలు తెమ్మను''.

నన్ను సూసి సంసోనుగాడితో సెప్పిండు మా ఏసుపాదం మావయ్య. మా యిద్దరికి సిన్న గడవలొచ్చి మాటా మాటా పెరిగి మాట్లాడుకోడం మానేసినం.

''బావా - అక్క నొప్పులు పడతావుంది. పెద్దమ్మ గోరికాడికి తీసుకుపోయినం. కానుపు శానాకట్టంగా వుంటది, మా దగ్గర సూదిమందుల్లేవు, పట్నం తీసుకుపొమ్మని సెప్పినారు. మనం ఎంటనే పట్నం ధర్మాసుపత్రి పోవాల. ఆ పన్లన్నీ మేం సూత్తంగాని నువ్వు పెద్దరెడ్డిగారికాడికి పోయి రెండొందలు పట్టుకురా. తొందరగాపోరా!'' అడావుడి సేసిండు సంసోను.



నా నోటమాట పడిపోయినట్టనిపించింది. వొల్లు సెమట్లు పట్టింది.

"యాడుందిరా మీ అక్క! నన్నొక్కసారి సూడనియ్యి".

"అబ్బ! దాందగ్గర మా అమ్మ, సువార్తొదిన వుండార్లేకాని - నువ్వు తొందరగా పెదరెడ్డిగారి కాడికి పోయిరా. ఆల్చెం అయితే పసవం కట్టంగా వుంటది. నువ్వు ఎల్లు తొందరగా."

"అరె - ఒక్కసారి సూడ్నియ్యిరా!" చేతులు పట్టుకుని బతిమాలాను.

"సెప్పేది నీక్కాదు? తొందరగా పొమ్మంటుంటే ఏంటా ఏడుపు. మేం మడుసులం కాదనుకున్నావా? మేం సూసుకుంటంలే - నువ్వుపోరా". ఏసుపాదం మావయ్య కోపడ్డాడు.

ఇక లాభం లేదనుకొని పెదరెడ్డిగారి కాడికి బలెల్లాను.

"ఏంట్రా ఏసోబా! శానా కాలానికొచ్చినవ్. ఏంటి."

నా అదుట్టం కొద్ది రెడ్డిగారు యింటికాడే వుండారు.

"అయ్యో పెదరెడ్డిగారు, మా ఆడది కట్టపడతుందయ్యా. కాన్పు కట్టంగా వుంటదని

నా నోటమాట పడిపోయినట్టనిపించింది. వొల్లు సెమట్లు పట్టింది.

"యాడుందిరా మీ అక్క! నన్నొక్కసారి సూడనియ్యి".

"అబ్బ! దాందగ్గర మా అమ్మ, సువార్తొదిన వుండార్లేకాని - నువ్వు తొందరగా పెదరెడ్డిగారి కాడికి పోయిరా. ఆల్చెం అయితే పసవం కట్టంగా వుంటది. నువ్వు ఎల్లు తొందరగా."

"అరె - ఒక్కసారి సూడ్నియ్యిరా!" చేతులు పట్టుకుని బతిమాలాను.

"సెప్పేది నీక్కాదు? తొందరగా పొమ్మంటుంటే ఏంటా ఏడుపు. మేం మడుసులం కాదనుకున్నావా? మేం సూసుకుంటంలే - నువ్వుపోరా". ఏసుపాదం మావయ్య కోపడ్డడు.

ఇక లాభం లేదనుకొని పెదరెడ్డిగారి కాడికి బయలెల్లాను.

"ఏంట్రా ఏసోబా! శానా కాలానికొచ్చినవ్. ఏంటి."

నా అదురుట్టం కొద్ది రెడ్డిగారు యింటికాడే వుండారు.

"అయ్యో పెదరెడ్డిగారు, మా ఆడది కట్టపడతుందయ్యా. కాన్పు కట్టంగా వుంటదని పెద్దమ్మగోరు సెప్పినారంట. పట్నం తీసుకుపోవాల. ఒక్క రొండొందలియ్యండయ్యా. మీ కాల్లు పట్టుకుంటాను. మీ సొమ్ము వుంచుకోన్లే దొరా."

"ఏంట్రా - నాకాడేమన్నా డబ్బుల సెట్టుందనుకున్నావా అడిగినోడికల్లా ఇయ్యటానికి? ఇప్పుడికిప్పుడు రెండొందలిమ్మంటే యాడతేవాలనేను. నాకాడ వుండ డబ్బుతో మొన్ననేగా మిరపతోటకి మందుకొన్నా యింకేడుండయి"?

"అంతమాటనకు దొరా! మీకాల్లు పట్టుకుంటా. బీదోల్లం. మీరు కాదంటే ఎట్టయ్యా అది సావుబతుకుల మద్దెనుంది. మీ సొమ్ము వుంచుకోను దొరా".

"అబ్బ సెప్పేది నీక్కాదురా? నాకాడ లెవ్వంటే యినవేం".

"అంత మాటనకు దొరా! మీ బర్రెల కాడికి మా నంటోన్ని పెడతాలేసామి. దాన్ని బతికియ్యండయ్యా".

"ఆ బుడ్డోడు-లాగు కట్టుకోటం శాతకానోడేం బర్రెల్ని కాత్తడు. సరే - పాపం నీ ఆడది కట్టాల్లో

వుందని ఏడుత్తున్నావ్ కాబట్టి నిమ్మతోట పెట్టుబడి డబ్బులు నూటయాబయ్ వుండయ్ అయి పట్టుకెల్లు''.

దేవుడు నా మీద దయదల్చి పెదరెడ్డిగారికి మంచి మనసిచ్చిండు.

"తల్లీ మరియమ్మతల్లీ దాన్ని'' సల్లగా సూడు తల్లీ. తల్లీ - పిల్ల బాగుంటే నీ కొండ కొత్తా గుణదల మరియమ్మ తల్లికి మనసులోనే దండమెట్టుకున్న''.

"ఇదిగో ఈ నూటయాబయ్ తీసుకోరా జాగర్తగా వాడుకో. ఆస్పత్రినుంచొచ్చేదాకా సరిపోవాల. మద్దెలో వచ్చి యింకా యియ్యమంటే నాకాడ దొరకవ్''.

"అట్టాగేదొరా మీ దయవల్ల అది పిల్లతో సహా సల్లగుంటే అదే పదేలు. నేనొత్తాదొరా'' డబ్బులు తీసుకుని దండమెట్టి ఎక్కి తిరిగిన.

"వొరేయ్ ఏసోబుగా! ఆ బుడ్డోన్ని బర్రెలకాడికి పంపడం మర్చిపోబోకు. రేపుట్నుంచి పన్లోకి రమ్మను. అర్థమైందా?''

''అట్టాగేనయ్యా! రేపొద్దున్నే అన్ని పంపిత్తా'' రోడ్డెక్కాను. మనసంతా యేదోలా వుంది.

సంటిగాన్ని సదివియ్యాలనుకున్నా. ఆడెంతో కొంత సంపాదిత్తూ నీ డపట్టుఉండాలే తప్ప నాలాగా ఈ గొడ్డుసాకిరి చెయ్యకూడదనుకున్నా. కాని సివరికి ఆడి బతుకు నా బతుకులాగే అయ్యేటట్టుంది.

ఆలమ్మ పైటసెంగు పట్టుకొని తిరిగే నా సిన్ని సంటోన్ని రేపట్నుండి బర్రెలకాడికి పంపాల. పలక పట్టుకొని బడికి పోవాల్సినోన్ని కర్రసేతికిచ్చి బర్రెలకాడికి పంపాల.

సంటోడా నన్ను సమించరా! నిన్ను సదివిచ్చి గుమత్తాగ అయినా సూడాలనుకున్నా. ఈ బతుకు నువ్వు బతకక్కూడదనుకున్నా. కాని నేనేం సేసేది? నిన్ను పంపుతానంటేనే ఆ రెడ్డిగోరు డబ్బులిచ్చిండు.

ఆ పెద్దమ్మగోరు కాన్మెంటులో సేర్సుకోనన్నప్పుడే నీకు సదివేయోగం లేదనుకున్నా.

పెద్దమ్మగోరు కాన్మెంట్లో నీకు సీటియ్యలేదు. మీ అమ్మకు ఆస్పత్రి మందులియ్యలేదు. సూది మందుల్లెవ్వన్నారంట. అవున్లే మనకెందుకిత్తారు? మనం డబ్బులియ్యలేం కదా! అదే ఆ పెద్దరెడ్డిగారో, కరనంగోరో, సెట్టిగోరో అయితే యీడ మందుల్లేకపోయి ఆరి జీబులో పట్నంలో అల్ల అమెరికా ఆస్పత్రికే తీసుకుపోతారు.

ఇంకా యీ అమ్మగారేనయం. పిచ్చిదో, బికారిదో జొరమన్నా, తలనొప్పన్నా ఒక మాత్ర యిత్తారు. ఆ పట్నం అమ్మగోర్లయితే ఆసుపత్రిలో కనపడరు. నరుసులే మనలాటి బీదోల్లని తరిమేత్తరు. ఆల్ల పెద్దమ్మ గోరు యాడుంటదోకూడా మనకు తెలవదు. అక్కడ అందరూ కారుల్లోనో, జీబుల్లోనో వొచ్చేవోల్లే. ఆల్లకోసమే ఆ ఆసుపత్రి.

దరమాసుపత్రికి సేరుకున్నాను. సంసోనుగాడు గేటుకాడే కలిసిండు.

" పెద్దరెడ్డిగోరు డబ్బులిచ్చిండా? ఎంతిచ్చిండు?''

"ఆఁ యిచ్చిండు. సంటిగాడ్ని బర్రెలకాడికి పంపిత్తానంటే లేవనుకుంటానే నూటయాబయ్ రూపాయలు యిచ్చిండు. సరేగాని డాట్రగారొచ్చిండా? యావండు? కానుపయ్యిందా? తల్లీ పిల్లబాగుండరా?''

''డాట్రులేదు గీట్రులేదు. ఆ జవాను గాడికి పది రూపాయలిత్తేగాని డాట్రగారికి కేసు గురించి

చెపుతానండు. మాకాడ పైసాలేదు. నీ కోసమే ఎదురుసూత్తున్నా?" పేరికి దరమాసుపత్రి పైసాలేందే పన్లు జరగవు. జవాన్ల కాడనుంచి పెద్ద దాట్రుకాడికి పైసలిత్తేనే పన్లు జరుగుతయ్. పాసం పోతుందన్నా - పైసలు లేవంటే పట్టించుకోరు.

ఆ జవానుగాడికి పది రూపాయలియ్యగానే నర్సువొచ్చి తనకొక పదిరూపాయలిమ్మంది. ఇద్దరు కల్సిదాన్ని" దాట్రుకి సూపిచ్చినారు.

"అయ్యా దాట్రుగారూ మీకు దండమెడతాను. నా పెల్లాం పిల్లల్ని బతికించండి దొరా! దాట్రుగారి కాల్లుపుచ్చుకున్నాను.

"అబ్బ లేవయ్యా వెధవ న్యూసెన్సు. మేం మనుషులం కాదా! మాకు పెళ్ళాం పిల్లలు లేరా. నువ్వు గోల చెయ్యకుండా బైట నిలబడు. సిస్టర్ వీళ్ళందరిని బైటకి పంపించు. నా డ్యూటీ అయిపోయింది. వేరే డాక్టర్ని పిలువు".

"అయ్యా! దాట్రుగారు, అంతమాటనకండయ్యా! అది సావుబతుకుల్లో వుందయ్యా" దయసూడండయ్యా." నర్సు మమ్మల్ని బైటికి నెట్టుకెల్లింది.

"మాటల్తో లాభంలేదు. మీ ఆవిడకి సీరియస్‌గా వుంది. డాక్టరుగారి డ్యూటీ అయిపోయింది. ఒక వందరూపాయలుంటే యిచ్చుకో. పని సక్రమంగా అవుతుంది".

"అంతమాటనకు తల్లి! ఇయిగోనమ్మా వంద, యివి డబ్బులు కావు తల్లి, నా సంటోడి రకతం - ఆడి బవిసత్తు. ఆన్ని పెదరెడ్డిగారి కాడ తాకట్టుపెట్టి తీసుకొచ్చిన డబ్బులియ్యి. నా పెల్లాం పిల్లల్ని కాపాడండి తల్లి".

వంద తీసుకొని లోపలకెళ్ళింది నర్సు పెద్దరెడ్డిగారిచ్చిన నూటయాభైలో వంద దాట్రుగారికి, పది జవానుకి, పది నర్సుకి పోతే ముప్పయ్ మిగిల్నియ్ నాకాడ. మందులు గట్రా తెమ్మంటే యాడ తేవాల?

మరియమ్మ తల్లి దయసూడమ్మా నీ కొండకొచ్చి తల నీలాలిచ్చుకుంటం'.

"సమయానికి స్టాకులేదు. కేసు చాలా సీరియస్‌గా వుంది. నువ్వెళ్ళి రెండు సెలైన్ సీసాలు పట్టుకురా" నర్సుమల్లీ బైటకొచ్చి సెప్పింది.

యాకోబుగాన్ని తీసుకుని మందులు కొట్టుకాడికి పరుగెత్తిన.

"రెండు సిలెన్ సీసాలియ్యండి దొరా" నా దగ్గరున్న ముప్పయ్ కొట్లో యిచ్చాను.

సిలెన్ సీసాలు పట్టుకొని ఆసుపత్రి గదికాడికి పరుగెత్తినం.

దాట్రు బైటికెల్లిండంట. నర్సు వొచ్చింది.

"సెలైన్ సీసాలు తెమ్మంటే యింత ఆలస్యంగానా వచ్చేది? నీకు బుద్ధుందా? ఇంటికి పట్టుకెళ్ళి కుండలో కలుపుకుని అందరూ తాగండి. మీ ఆవిడని ఇక యింటికి తీసుకెళ్ళవచ్చు?"

"అంతమాటనకండమ్మా కొన్నాల్లిక్కడే వుంచండి"

"ఇక్కడెందుకయ్యా దరిద్రం. చచ్చిన పిల్లని కన్నందుకు ఇంటికి తీసికెళ్ళి పట్టెమంచం పట్టుపరుపు వేసి పూజించుకో నీ పెళ్ళాన్ని అనుకుంటా ముందుకెల్లింది నర్సు.

సంపేసినార్రా యాకోబుగా - బిడ్డని సంపినార్రా. సంటోన్ని తాకట్టు పెట్టి తెచ్చిన డబ్బు తిని కూడా నా బిడ్డని సంపినార్రా.....

# బీదోల్ల యేసు

"యేం జానుబాబు, శానాల్టకొచ్చినవ్! బాగుండవా?

నాకేం - లక్షణంగా ఉన్నాను. మన వాళ్ళంతా మంచిగా వున్నారా?

"యేం మంచిలేబాబు - అట్టనే రోజులు గడుపుకొత్తన్నం అరె అట్టానిలబడ్డావేం కూసో?

గోడకానిచ్చిన కుక్కిమంచం వోల్చుకుని జాన్‌బాబు కూసుండు.

"ఏంటి - మరియమ్మ లేదా యింట్లో నువ్వు అంట్లు గడుగుతున్నావ్"?

"లేదుబాబు పుట్టింటికెల్లింది. నెల్లోపట నిద్ర సేయించటానికని అల్లమొమ్మొచ్చి తీసుకెల్లింది'

"నెల్లోపల నిద్రచేయించటానికి తీసుకెళ్ళిందా! అంటే మరియమ్మ ప్రసవించిందా? అరె - మరి యిప్పటివరకు చెప్పలేదేం? ఆ.... తల్లీ పిల్ల బాగున్నారా? ఆడపిల్లా? మగపిల్లాడా?

జాన్‌బాబు కల్లనిండ ఎలుగు నాకు కనిపిత్తానే వుంది.

"పెసవించింది. కాని యేం లాభం? ఆడపిల్ల పుట్టియెంటనే సచ్చిపోయింది. ఆ దిగుల్తో' అది" సుకంగా ఎట్టా వుంటది? సోటుమారిత్తే బాగుంటదని పుట్టింటికి పంపిచ్చా"

"అయ్యో! ఎంత ఘోరం జరిగి పోయింది. ఎలా చనిపోయింది. పాప.....?"

అంట్లు కడగటం పూర్తయింది.

ఆయాల నేను పొలంకాడినుండి వొచ్చేయాలకి మా గూడెపోల్లంతా సెంటర్లో నిలబడ్డారు.' యేంటో సొద్దె కామోల అనుకుని నేను కూడ ఆడకిపోయిన, అప్పుడు మా సంసోనుగాడు వొచ్చి సెప్పిండు - అక్క కట్టపడతావుందని పెద్దమ్మ గారి కాడికి తీసుకుపోతే మందుల్లెవ్వని యెనక్కి పంపిందట. నేను రెడ్డిగారి కాడ డబ్బులు తేటానికి పోయినాను. అల్లేమో దాన్ని" బండిమీద పట్నం దరమాసుపత్రికి తీసుకుపోయినారు మన దారి సరిలేక బండి అటు ఇటు కొట్టుకొని ఈ గోరంజరిగిందో లేక ఆ దాట్రు, నర్సు ఆజాగర్త వల్ల జరిగిందో తెలవదు".

ఆ యేల నేను పడ్డ కట్టమంతా గురుతొచ్చి కల్లెంట నీల్లు వొచ్చినయ్.

"బాధపడకు తల్లి క్షేమంగానే వుందిగదా? ఇంకోసారి జాగ్రత్తపడితే సరి. అవును..... ఈ రోజు అన్నం నేను వండుతాను. కూర నువ్వొండు. తొందరగా కానివ్వు. నాకు భలే ఆకలౌతుంది.

మాట మార్చేసి తొందరపెట్టిండు జానుబాబు.

"యేం జానన్న బాగుండవా? యెంత సేపైంది వొచ్చి. యాకోబుగాడు గుమ్మంలో నుండే పలకరిచ్చిండు.

"ఆ - నేను బాగానే వున్నా, నువ్వు కులాసాయేగా? ఏమిటి విశేషాలు? ఎక్కడికి వెలుతున్నావ్?

"యిసేసాలేవుంటయ్ మాకాడ? యేవన్నా వుంటే పట్నం నుంచి వొచ్చినోడివి నువ్వే సెప్పాల..... మిరపతోట కాడికిపోయి వత్తా యియ్యాల వుంటన్నావా."

"ఆ - ఈరోజేం ఖర్మ మరో నెలరోజులవరకు యిక్కడే వుంటాను. నువ్వు మళ్ళీరా. తీరికగా మాట్లాడుకుందాం."



''అట్టాగే - పెందలాడే వత్తాలే'' అనుకుంటా ఆడు యెల్లిపోయిండు.

''ఇదిగో ఈరంబులో బియ్యం వుండాయి. ఈ సట్టిలో పోసి పొయ్యిమీద పెట్టు. నేను అట్లా కొట్టుకాడికిపోయి రొండు కోడిగుడ్లు తెత్తా.''

కట్టుకోని వొచ్చిన గుడ్డలన్నా మార్సుకోకుండ అట్టనే పొయ్యికాడికి పోయిండు జాను.

నేను కొట్టుకాడికి బయలెల్లాను.

జాను శానా సిత్రమైన మనిషి యీయన సాములోరే. కానీసామి'' అంటే ఒప్పుకోడు. సివరకి అండీ'' అన్నా వూరుకోడు.

తనకంటే సిన్నోలయితే అన్నా' అనిపిలవమంటాడు. పెద్దోలయితే పేరున పిలవ మంటాడు. నేనొక్కన్నే జానుబాబు అని పిలిసేది. మిగతా వోల్లంతా జాననో, జానన్న అనో పిలుత్తారు.

మాతోపాటు పని సేత్తడు. వొండిన అన్నం సమయానికి లేకపోతే వొండుకొని తింటడు. పగులేమో కూలిపనికి మాతోపాటే వత్తాడు. రాతిరిపూట మాత్రం వొకగంటో, రెండుగంటల్లో కొత్త కొత్త యిసయాలు సెప్పుతాడు.

యేసుపబువు పేదోల్లకోసమే బతికాడని. పెద్దరెడ్డిగోరి లాంటి గొప్పోల్లంతా కలిసి ఆయన్ని సంపేసినారని జాను సెప్పిండు.

మాగూడెపోల్లంతా సాములోర్ని సామిఅనో తండ్రిగారు అనో పిలుత్తారు. జాను అయితే అసలు అట్టా పిలవొద్దు అని బైబుల్లో వుంది అని సెప్పిండు.

కొట్టుకాడ రొండు కోడిగుడ్లు పావలా టమాటాలు తీసుకొని యింటికి చేరాను.

''అన్నం వండేసాను. ఇక నీ వంతు పనే మిగిలింది. తొందరగా కూరవండితే ఆకలి తీర్చుకుంటాను.''

బాగా ఆకలేత్తందేమో తొందరసేసిండు జాను.

''అట్టాగే రొండు నిమిసాల్లో కూరతయారైద్దిచూడు''

రొండు ఉల్లిపాయలుకోసి కొద్దిగా మంచి నూనెపోసి పొయ్యిమీద పెట్టాను.

గుడ్లు కారిసి వొండితే జాను కడుపునిండా తింటడు. అందుకే వుడకపెట్టకుండా కారిసేవొండాను.

యిద్దరం అన్నం తిన్నాం. అప్పటికే సీకటిపడింది. యాకోబు గాడొచ్చిండు.

'ఏం జానన్నా అన్నం తిన్నావా?'ఆ నేను రెడీ, నువ్వు కూడా త్వరగా తిని మన వాళ్ళందరికీ చెప్పిరా. ఇప్పుడు మీటింగు పెట్టుకుందాం'' జాను యాకోబుగాడితో సెప్పిండు.

''నేను ఇప్పుడే తిన్నాలే - అట్టయితే ఎల్లి ఆల్లందర్నీ పిలుసుకొత్తా.

అంతా పోగయ్యేసరికి చానాపొద్దుపోయింది.

మావోల్లంతా జానుని పలకరించారు. అందర్నీ కుసల ప్రశ్నలడిగి మంచిగ మాట్లాడిండు జాను.

''క్రిస్టమస్ పండుగ ఇంకా ఎన్నోరోజులు లేదు. మరి మనవాళ్ళంతా ఏం చెయ్యాలను కుంటు న్నారు?'' జాను అడిగిండు.

''ప్రత్యేకంగా మేం అనుకోటం యేంది జాను! యేటా సెయ్యటంలేదు! మేం అంతా తలొక

ఐదు రూపాయలేసుకుని పెద్దమ్మ గోరికిత్తే గుడికాడ కరెంటు బుడ్లుపెట్టి పసులపాకేత్తారు. ఈ యేడు కూడా అట్టాగే సేత్తాం." యేసుపాదం మావయ్య సెప్పిండు.

పోయినేడు కిస్మస్‌కి జాను యీడ లేడు. రైలెక్కి ఏదోదేశం పోయిండంట. అందుకే మేం కిస్మస్ నాడు యేం సేసినమో తెలవదు.

"అందరు యిచ్చింది కలిపితే మొత్తం ఎంతౌతుంది?

"రొండు - మూడొందలౌద్ది అన్నా" యాకోబుగాడు సూసాయగా సెప్పిండు.

"అంతడబ్బు అనవసరంగా ఖర్చు చేస్తున్నారా?

"అనవసరంగా యేం వుంది! దేవుడికోసమేగా?"

అదే నేనూ చెప్పేది. యేసు ప్రభువు చిన్న పశువుపాకలో పుట్టాడు. అటువంటి పాక ప్రత్యేకంగా తయారు చేయడం ఎందుకు? మీ పాకల్లో యేదో ఒక దాంట్లో ఆయన విగ్రహం పెడితే సరిపోతుందికదా? అందుకింత ఖర్చు దేనికి?

"ఆ బోర్డింగుకి యెల్లను"

"యేంట్రా నువ్వుసెప్పేది? ఎన్నిసార్లుసెప్పినా ఆ బోర్డింగుకి యెల్లను అని తప్ప యేరే మాటేమైనా సెప్పుతున్నవా? అసలు నీమాట నీదేగాని నేను సెప్పేది యింటున్నావా?"

"పెపంచకంలో వున్న కట్టాలన్నీ నీకే వొచ్చినట్టు, నువ్వొక్కడివే ఆ బోర్డింగులో సదువుతున్నట్టు. నాకు తెలీక అడుగుతాను అసలు నువ్వొక్కడివేనేరా ఆ బోర్డింగులో సదివేది? నీతోపాటు సదివోల్లంతా యిట్టాగే మాట్టాడుతున్నారా?"

"ఒకపక్క ఆ కాన్మెంటుల్లో, బోర్డింగుల్లో సీటురానోల్లు బర్రెలకాడికి పోతుంటే, నువ్వేమో నేను బోర్డింగు కెల్లను అని మొండిపట్టు పట్టినవ్."

"మా సంటిగాడు సూడు. ఆడిప్పుడు పెద్దరెడ్డిగారి బర్రెల్ని కాత్తండు. అన్ని నీకు మాలే సదివియ్యాలనుకున్నారా? కాని యేం సేసేది? ఆ పెద్దమ్మ గారేమో ఆరి కాన్మెంట్లో సేర్చుకోనన్నారు. పోనీలే గవర్నమెంటు బల్లోనైనా సదివిద్దామనుకున్నా. కానీ ఈ లోపల మీ అక్కని ఆసుపత్రికి తీసుకెల్లాల్సివొచ్చి అన్ని పెద్దరెడ్డి గారికి అమ్ముకోవాల్సి వొచ్చింది. సంటిగాన్ని బర్రెల కాడికి పంపుతానంటేనే కదరా ఆయన డబ్బులిచ్చింది?"

"ఒకపక్క యిట్టాటియ్యన్నీ సూత్తానే నువ్వు ఆ బోర్డింగుకి యెల్లనంటే యేంటి నీ ఉద్దేశం? అసలు నిన్నని యేం సుకం!? చిన్నప్పట్నుండి అమ్మాబాబుల అదుపులో పెరిగినోడికైతే ఒకసారి సెపితే అర్థమైతది. బిడ్డల్ని పెంచటం సేతకానోల్లకి కూడ పిల్లలు కావాల. ఒక్కడే వంసోద్ధారకుడు కదాని ఎనకటికెవడో కొడుక్కి యెన్నపూస పొయ్యిలో యేసి కాల్చి పెట్టాలనుకున్నాడట. అట్టా పెంచినారాయె మీ అమ్మా, బాబు."

"ఇది మరీ బాగుంది. ఆడు మూర్కంగా మాట్టాడుతుంటే మద్దెన మా అమ్మా బాబుని అంటావెందుకి? ఆల్లేం సేసినారు? ఆల్ల బావ సెప్పితేనన్నా యింటాడేమో అన్ని తీసుకెల్లవే అంటే తీసుకొచ్చిన గాని యిట్టా నీ సేత అల్లని తిట్టియ్యటానికి కాదు."

"ఐనా సదువుకోటం ఆడికి యిట్టం లేనపుడు మనం మాత్రం యేం సెయ్యగలం? ఇక నువ్వేం సెప్పకు. ఆడి బతుకు అన్ని బతకనియ్యి. అట్టనే కూలీ. నాలీ చేసేకుని ఆడే బతుకుతుడు."



"ఆ బతుకుతుడు - కూలీ, నాలీ సేసుకుని. ఇప్పుడు మనం బతకటం లేదూ!? అట్టనే ఆడూ బతుకుతుడు.

"గుండెలు పగిలేటట్టు బండసాకిరీ సేసినా పొయ్యి మీదికి కుండెక్కటం లేదు. నిన్నాసుపత్రికి తీసుకెల్లాల్సొచ్చేసరికి కన్నబిడ్డన్ని పాలేరుతనం పెట్టాల్సి వచ్చింది. వొరే యిప్పుడు తెలవదురా నీకు. అనుబవం ఐతేనే గాని తెలుసుద్ది."

"పతి అడ్డమైనవోడు అరె - వొరె' అంటుంటే అందరికీ వొంగి వొంగి సలాం సేత్తూ, యీ కులంలో పుట్టినందుకి, మనల్ని మనం తిట్టుకుంటూ, పుట్టిచ్చిన అమ్మాబాబుల్ని తిట్టలేక, చావలేక బతుకుతున్నాంరా."

"వొంట్లో సత్తు వున్నంతవరకు గొడ్డుసాకిరీ సేయించుకొనే వోల్లేకాని, దయతల్సి గుప్పెడు గింజలు పెట్టేవోల్లు లేరురా. అసలు ఈ పుటకే బానిస పుటక."

"ఆ జానుబాబు సెప్పినట్టు ఈ బానిస బతుకు నుంచి యిముక్తి యెప్పుడా అని యెదురు సూత్తావుంటే...."

"ఏంటి యేసోబు.... జానుబాబు అంటున్నావ్? ఏంటి సంగతి".

జానుబాబు వొచ్చిండు.

"సమయానికి వొచ్చినవ్. రా జానుబాబు కూసో."

"అడుగో ఆ మూల్న కూసున్నోడు నా బామ్మర్ది. దీని తమ్ముడు. పట్నంలో బోర్డింగులో సదువుతుండు. మొన్న సెలవలకొచ్చిండు. తిరిగి బోర్డింగుకి పోనని మొండికేసిండు."

"ఏమిటంట విశేషం? నీళ్ళు సరిపడలేదా? లేక అమ్మా నాన్న మీద బెంగగా ఉందా?"

"అయ్యేం కాదు. ఆ వార్డెను సాములోరు ఈన్ని తిడతారంట, కొడతారంట. తోటపని సెయ్యాలంట. కూడు సరిగా ఉండదంట. ఆ నీల్ల మజ్జిగ అన్నంలో పోసుకుంటే - పల్లెం నిండా పురుగులు తేలతాయంట....."

"అర్థమైంది కేసు. సరిగ్గా ఒక అరగంట -కితం మన బాలస్వామి ఇంట్లో ఇదే విషయం గురించి మాట్లాడి వస్తున్నా. వాళ్ళ అబ్బాయి కూడా అదే బోర్డింగ్‌లో చదువుతున్నాడంట. వాడు తిరిగి ఆ బోర్డింగుకి వెళ్ళనని మంకుపట్టు పట్టాడు. ఆ కుర్రాణ్ణి మంచిగా అడిగితే చెప్పాడు అసలు విషయం."

"యేంటి జానుబాబు, యేంటా అసలు యిసయం? ఈల్లేమైనా గొప్ప పని సేసొచ్చినారా? యెదవనాయాల్ని తోలు వొలుత్తాను సెప్పు."

"తోలు వొలవాల్సింది మన పిల్లల్ని కాదు. పెద్దోళ్ళ కుళ్ళు బుద్ధులు, కిరాయి మనస్తత్వాలు తెలియని పల్లెటూరి పేదపిల్లలు వీళ్ళు. ఒకవేళ వీళ్ళు తప్పుచేసినా కొంతవరకు సబబుగానే ఉంటుంది. పల్లెటూరి వాళ్ళు, పేదపిల్లలు పైగా పసిపిల్లలు. తల్లికేకలేసి అన్నం పెడితే తప్ప ఆకలి తెలియక కేరింతలు కొడుతూ ఆడుకునే ఆకతాయి పిల్లలు వీళ్ళు."

"అసలేం జరిగింది జానుబాబు? యిదంతా సూత్తుంటే యేదో పెద్ద యిసయమే జరిగినట్టుంది".

జానుబాబు మాట్టాడినంత సేపు సానా కోపంగా ఉన్నడు. మండిపోతున్నట్టున్నడు. ఆయన వాలకం సూత్తే బయమేసింది.

"చెప్పడానికి ప్రత్యేకంగా యేం వుంది? నేను ఎప్పుడూ చెప్పేదే. మీరు వినేదే. ఇందులో కొత్తేమీలేదు. కాపోతే ఈ సంఘటనలో బాధితులు మీరు, మీ పిల్లలు కనుక మీ స్పందన కొంచెం తీవ్రంగా ఉంటుంది."

"అయినా నేను చెప్పటం దేనికి, నీబావమరిది యిక్కడే ఉన్నాడుగా! వాణ్ణే చెప్పమను."

"ఆడు యే సెప్పటం లేదు. యెంత బతిమాల్నా నోరు యిప్పడు. తిడితే యేడుత్తుడు."

"పిల్లల చేత విషయాలు రాబట్టాలంటే కొడితేనో, తిడితేనో సాధ్యంకాదు. చాలా వోర్పు, నేర్పు కావాలి. నేను చెప్పిస్తాను. నువ్వేం మాట్లాడకు."

జానుబాబు ఆడి దగ్గర కూసుండు. కూసేపు ఆడితో యేదో మాట్టాడిండు.

ఆడు యేడుపు మొదలుపెట్టిండు. జానుబాబు ఆడిసేత మాట్టాడిచ్చిండు.

"మరేమో.... ఒక శనివారంనాడు బోర్డింగులో సెలవిచ్చారు. అందర్నీ మధ్యాన్నం పూట ఆడుకోమని చెప్పారు. నేను, ఇంకో ఇద్దరు కలిసి సినిమాకు వెళ్ళాలనుకొని గోడదూకి వెళ్ళినం. సినిమా చూసి మళ్ళీ ఒక్కొక్కళ్ళమే గోడదూకి ఆడుకొంటున్న వాళ్ళల్లో కలిసిపోయినం. మాలో ఆఖర్న గోడదూకిన వాడిని మా అసిస్టెంటు వార్డనుగారు చూసి పిలిపించారు.

"ఎక్కడికెల్లావురా" అని అడిగారంట. వాడేమో నేను ఎక్కడికి వెళ్ళలేదండి. అందరితో ఆడుకొంటున్నాను. బాలు బైట పడితే తేటానికి గోడదూకి వెళ్లాను" అని చెప్పాడు.

ఆ బ్రదర్‌గారేమో భలే వాడివిరా, ఎందుకు భయపడతావ్? నేనేమన్నా నిన్ను కొడతానా? ఎలాగూ రేపు ఆదివారం మిమ్ముల్ని అందర్నీ సినిమాకు తీసుకువెళదాం అనుకుంటున్నాం. మంచి సినిమా ఐతే చెప్పు. రేపు మళ్ళీ అందరం కలిసి వెళదాం" అని మంచిగా అడిగారంట.

వాడేమో బ్రదర్‌గారి మాటలు నిజమే అనుకొని అంతా చెప్పేసిండు. చివరికి ఎవరెవరు వెళ్ళామో కూడ చెప్పిండు.

ఆ రాత్రి బ్రదర్‌గారు మా ముగ్గుర్నీ పిలిచి ఆయన రూములో ఉన్న ఇనపసువ్వతో కొట్టారు.

"తప్పైపోయింది బ్రదర్‌గారు. యింకెప్పుడూ సినిమాకి వెళ్ళం" అనీ యేడుస్తూ ఆయన కాళ్ళు పుచ్చుకున్నం.

ఇనుపసువ్వ అక్కడ పారేసి మా ముగ్గుర్నీ ఆయన రెండు కాళ్ళతో డొక్కలోను, మోకళ్ళమీద, తలమీద ఇష్టం వొచ్చినట్లు తన్నాడు.

ఆ రాత్రి మాకు అన్నం పెట్టలేదు. రాత్రి పదిన్నర వరకు మోకాళ్ళమీద నుంచోబెట్టి చదివించారు.

తెల్లారి మా ముగ్గురిచేత హాస్టల్‌రూములన్నీ కడిగించారు. స్టూడెంట్స్ బట్టలు, దుప్పట్లు ఉతికించారు. ఆ మధ్నాహ్నం అందర్నీ పిలిచి సినిమాకి వెళతారా" అని అడిగారు.అంతా వెళతాం' అని చెప్పారు.

మా ముగ్గుర్నీ అందరిముందూ మోకాళ్ళమీద నుంచోమన్నారు.

"మీరంతా ఒక్కక్కరే ఈ కర్రతోటి వీళ్ళ ముగ్గుర్నీ వాళ్ళు అబ్బా అనేలాగ ఒక్కొక్క దెబ్బకొట్టి వెళ్ళండని" అన్నారు.

స్టూడెంట్స్ ఎవ్వరూ మాట్లాడలేదు. అప్పుడు బ్రదర్‌గారు -ఒరే వెధవల్లారా మాట్లాడలేరా? ఈ సంవత్సరంలో మళ్ళీ ఇంకెప్పుడూ సినిమాకి పంపను తెలిసిందా? అన్నారు.



నిజంగానే మళ్ళీ సినిమాకు పంపించరేమో అనుకుని మా స్టూడెంట్స్ అంతా మీరు చెప్పినట్లే చేస్తాం'' అని ఆ కర్రతో మా ముగ్గుర్నీ తలొక దెబ్బ కొట్టారు.

ఎవరైనా చిన్నగా కొట్టినట్లు బ్రదర్‌గారికి అనుమానం వస్తే మళ్ళీ వాడిచేత కొట్టించారు.

వాళ్ళంతా సినిమాకి వెళ్ళిన తర్వాత బ్రదర్‌గారు దొంగ సన్నాసుల్లారా? ఇంటికి పోతే తింటానికి మెతుకులు ఉండవ్ మీకు. ఇక్కడేమో వెధవ వేషాలా? ఆడుకొండిరా అంటే మీకు సినిమాలు, షికార్లు కావాల్సి వొచ్చాయా? పొట్టకోస్తే అక్షరం ముక్కరాదు. గొడ్లని కాసుకొని బ్రతకాల్సిన వాళ్ళని సదువుకొండిరా అని తీసుకొచ్చి హాస్టల్లో సీటిచ్చి, ఉచితంగా తిండి పెడతావుంటే మీకు పొగరెక్కిందిరా'' అని ఇష్టమొచ్చినట్లు తిట్టారు.''

ఆడు సెప్పటం ఆపుసేసిండు. నాకు మాల్నే జానుబాబుకి. శౌరి తాతకి కల్లల్లో నీల్లొచ్చినయ్.

''అది తమ్ముణ్ని దగ్గరకు తీసుకొని యేడ్చింది.

''బిడ్డల్ని కన్నోల్లకి తెలుసుద్ది ఆ బాధ. ఆలకేం తెలుసు? పిల్లోల్ని యిట్టా యింసించటం ఆల్లకి సరదాగా ఉంటది కామోసు. మొన్న మా సిన్నమ్మ సెప్పితే ఉత్తిదే అనుకున్న. అది తాతయ్యా అని నాకాడికొచ్చి యేడిసింది.

మా సిన్నమ్మ ఆల్ల ఆస్టల్లో పొద్దునే లేసి గంటకొట్టాలంట, అందర్నీ నిద్రలేపాలంట.

ఒకనాడు మరి యేమయ్యిందో - వొక పాప నిద్దరలేవలేదంట. ఆల్ల వార్డినమ్మ గారు మా సిన్నమ్మను, ఆపాపను పిలిసి మోకాల్ల దండ వేయించి, ఎనిమిది గంటల నుంచి తొమ్మిదిన్నరదాక మాసిన్నమ్మను ఆ పాప సెవుకాడ గంట కొట్టమందంట ఆ వోర్డినమ్మగారు.

సెవులు దిమ్మెత్తి పాపం ఆ పాప యేడ్సి యేడ్సి పడిపోయిందంట. ఆల్లకేం తెలుసు పిల్లల్ని పెంచటం. ఎంత తప్పు సేత్తే మాత్రం యిట్టానా బయం నేర్పేది?''

కల్లెర్ర సేసిండు శౌరితాత.

''మన పేర్లు చెప్పి కోటలకు కోట్లు ఇతర దేశాల నుంచి డబ్బు తెచ్చుకొనేది చాలక, ఇంగ్లీష్ మీడియం, హై స్టాండర్డ్ అంటూ గొప్పోళ్ళ పిల్లలకి చదువులు చెప్పడం, హాస్పటళ్ళు కట్టించి డబ్బు వసూలు చేస్తూ ఏదో ఒకటి రెండు బోర్డింగుల్లో ఉచితంగా పిల్లల్ని చదివించినంత మాత్రాన పిల్లల్ని యిలా చిత్రహింసలు పెడుతున్నారు. అదేమి అనే వాళ్ళు లేకపోవడంతో పసిపిల్లల మీద వాళ్ళ కిరాయి మనస్తత్వాన్ని ప్రదర్శిస్తున్నారు. ఎవరన్నా ఎదురు తిరిగితే వాళ్లను ఇంటికి పంపించటం. ఈ బోర్డింగులకన్నా ఆ గవర్నమెంట్ హాస్టల్లే నయం. పిల్లలే వార్డిను మీద పోట్లాడి మరీ మంచి అన్నం తింటారు. చదివినా, చదవక పోయినీ వీళ్ళని పట్టించుకునే వాళ్ళుండరు. ఈ బోర్డింగుల్లో ఎంత హింసించినా, గవర్నమెంటు హాస్టల్లో కంటే ఎక్కువ మంది పాస్ కావడం లేదు'' జానుబాబు సెప్పిండు.

''మరి యిప్పుడేం సేద్దాం జానుబాబు''?

''ఆ బాలస్వామికి ఒకటే మాట చెప్పా ఎలాగూ ఇక ఉన్నది రెండు నెలలు. ఈ రెండునెల్లూ ఓపిక పడితే వచ్చే సంవత్సరం ఆ బోర్డింగ్‌కి వెళ్ళే పనిలేదు. ఏదో ఒక తిప్పలుపడి గవర్నమెంటు హాస్టల్లోనే పిల్లల్ని చేర్పించవచ్చు.''

''మనం మతపోల్లం కదా! మరి మనకు ఆ గవర్నమెంటు ఆట్టల్లో సీటుదొరుకుద్దా.''నాకు అనుమానంగానే ఉంది.

"మన ప్రయత్నం మనం చేద్దాం. మీరంతా ఇష్టపడితే అటు మతాధికారులకు, ఇటు ప్రభుత్వాధికారులకు వినతిపత్రాలు పంపిద్దాం. అంతకీ లాభం లేకపోతే చుట్టు ప్రక్కల గ్రామాలు తిరిగి అక్కడి క్రైస్తవుల్ని కలుసుకొని అందర్నీ వొప్పించి మన పోరాటాన్ని తీవ్రం చేద్దాం. ఏమంటావ్ శౌరి తాత?"

"నేను నీకు సెప్పే అంతటోన్నా బాబు. నువ్వెట్ట సెపితే అట్టనే చేద్దాం. మాకు మంచి సేసొడివే కాని, సెడు చేసోడివి కాదుగా".

ఈ యినయాలన్నీ ఎట్టావున్నా అన్ని వొప్పించి ఈ రెండు నెల్లూ ఆ బోర్డింగుకి పంపించాల. లేకపోతే యిన్నాల్లు బళ్లో ఉన్నోడు బర్రెల్ని కాయటానికి కూడా పనికిరాడు.

"యేరా మరి జానుబాబు సెప్పినట్టు యీ రెండు నెల్లూ బోర్డింగు కెల్లు. వొచ్చే యేడు సూద్దాంలే యేదన్నా యేర్పాటు".

జానుబాబు మాట మీద నమ్మకం కుదిర్నట్టుంది ఆడికి. యెల్తానని వొప్పుకుండు. వచ్చే యేడు మాత్రం ఆ బోర్డింగుకి యెల్లడంట.

# మాయదారి తుపాను

మాయదారి తుపాను మా బతుకుల్ని బుగ్గిసేసింది. గుడిసెల మీద కప్పులన్నీ ఎగిరిపోయినయి. గోడలు కూలిపోయినయి.

సెట్టు నీడల్న ఉందామన్నా ఆ గతీ లేకుండా పోయింది. కూలిపోయిన సెట్లు గుడిసెల మీద పడ్డాయి. రోడ్ల కడ్డంగా పడ్డాయి.

పదేళ్ళ కితం యిట్టానే మాయదారి ఉప్పెనొచ్చి మమ్ముల్ని ముంచేసింది. అప్పటికి నాకు 14 ఏళ్ళుంటాయేమో.

పెద్దగాలొచ్చింది. మా గుడిసె ముందున్న యేపచెట్టు యిరిగి పడ్డది. మా గుడిసె కూలి మీద పడుద్దనుకున్నం. మా అమ్మ నేను మంచం కింద దూరినం. మా యమ్మ నన్ను వొళ్ళో కూసోబెట్టుకుంది.

యేపసెట్టు పడిన మోత యినగానే మా యమ్మ మరియమ్మ తల్లి ఫుటువా నా సేతుల్లో పెట్టింది. నెత్తిమీద ముసుగేసుకుని మరియమ్మ తల్లికి దన్నం పెట్టింది. నన్ను కూడ దన్నం పెట్టమంది.

మోకాల్లమీద కూసుందా మనుకుంది గాని మేం కూసున్నది మంచం కిందకాటంతో యీలు పడ్లేదు. అయినా అట్టనే పార్థన సేసింది.

మరియమ్మ తల్లీ యే దిక్కూ లేనోల్లం. నువ్వే దిక్కు తల్లీ. ఈ మాయదారి ఉప్పెన బారినుండి నన్ను నా బిడ్డని రచ్చించు తల్లీ! నీకు తలనీలాలిచ్చుకుంటాం. గుణదల నీ కొండకొత్తాం తల్లీ. నా బిడ్డని కాపాడు. మా కున్న గుడిసె యిదొక్కటే తల్లీ. యిదీ పడిపోతే మాకు నీడ లేదు తల్లీ. మాకు నువ్వే దిక్కు తల్లీ.



యాడనో మల్లొక సెట్టు పడ్డట్టు మోతొచ్చింది. దాంతోపాటు ఎవుల్లో యేడ్సినట్టు కూడా యినిపిచ్చింది. నాకైతే యేం అర్థం కాలేదు. అమ్మ మాత్రం నన్ను గట్టిగా గుండెలకత్తుకుంది. తెల్లార్లు మాయమ్మ నిద్రపోలేదు. నేను మాత్రం అమ్మ వొల్లో బయం బయంగానే నిద్రపోయిన.

తోల్లారినాక తెలిసింది యాకోబుగాడోల్ల అమ్మ సచ్చిపోయిందని. మాయదారి సెట్టుని నరికి తీసేత్తన్నరు. యింకొంతమంది పాడె సిద్ధం సేత్తన్నరు.

మోసే పెదనాన్న, పేతురు మావయ్య యింకా పెద్దోలంతా సేరినారు. యాపసెట్టుని నరికి తీసేత్తన్నరు. యింకొంత మంది పాడె సిద్ధం సేత్తన్నరు.

యాకోబుగాన్ని ఎవల్లో ఎత్తుకున్నారు. ఆడు యేడుత్తునే ఉండు. నాకుమల్లే నానలేడు ఆడికి. యీ మాయదారి ఉప్పెన యిప్పుడు అన్ని అమ్మ లేనోన్ని సేసింది.

అప్పన్నుండి కట్టం సేత్తే రెండేళ్ళ కితమే మల్లీ గుడిసెలోల్లం అయినం. తినీ తినక మాలో కొంతమంది పైస పైస కూడపెట్టి మట్టిగోడలు కూడ పెట్టుకున్నారు.

యిన్నేల్ల తర్వాత యిప్పుడే యిది గూడెంలాగ కనిపిత్తాంది. యిన్నేల్లు పందిల్లు మాదిరిగా ఉండే పాకల్లో వున్నాం.

సాయం సేసినోల్లు లేరు. గవర్నమెంటోల్లు కారుల్లో వొచ్చినారు. గుడిసెలకి యేం రాదు. అయినా మేం దయతల్చి యితన్నాం అంటూ తలొక వందా పంచిపోయినరు.

ఆ వొంద రూపాయలు ఉప్పు పప్పు కొనుక్కోవటానికే సాల్లేదు.

ఉప్పెన తర్వాత అన్నిటి రేట్లు బాగా పెరిగినయి. ఎవుల్లో పట్నం పోయి వచ్చినోల్లు సెప్పారు. ఆడ టీ రూపాయన్నర అమ్మినారంట. లీటరు కిరసనాల పది రూపాయలంట.

అమ్మో మల్లీ ఈ తుపాను పోయినాక రేట్లు పెరిగితే ఎట్టా? నా గుండె జల్లుమంది. ఎందుకంటే మునుపు తుపానప్పుడు నేను సిన్నోన్ని. బాధలన్నీ మా అమ్మేపడ్డది. యిప్పుడు ఆ బాధలన్నీ నేనే మొయ్యాల. మరియమ్మ తల్లీ నువ్వే దిక్కు.

అమ్మ గుర్తొచ్చింది. మునుపు తుపానుకి అమ్మ నన్ను బతికించమని మరియమ్మ తల్లిని యేడుకుంది. గుణదల వొత్తానని దన్నం పెట్టింది. గుణదల ఎల్లకముందే పైకెల్లిపోయింది అమ్మ.

నా కల్లల్లో నీల్లు నిలిచినయి.

యేంటో ఈ ఉప్పెన ఎప్పుడొచ్చినా మా గుడిసెలే నాశనం అవుతున్నాయి. మేం సేసిన పాపం యేంటో తెలవదు.

మా గూడెంల వొక్క గుడిసె లేకుండా పోయినా పెద్దోల్ల మేడలు యేం కావు. ఆల్ల మేడలు కూలిపడవు. ఆ మేడల ముందున్న సెట్లే పడతాయి.

ఈ గవర్నమెంటోల్లు కూడ ఆ కూలిపోయిన సెట్లకే ఎక్కువ డబ్బిత్తరు.

ఈ తుపాను అయినాకైతే పెద్దరెడ్డిగారు యాకోబుగాడి సేత శానాపని సేయించిండు. గవర్నమెంటోల్లు వొచ్చి ఆ సిందర వందరని పుటువాలు తీసుకున్నారు. ఎంతిచ్చినారో తెలవదు.

యియ్యాల మా గుడేనికి వత్తారని కపురొచ్చింది. అందుకే అందరం సెంటర్లో కూసున్నం.

పొద్దు నెత్తికొచ్చింది. జీబులొత్తున్న జాడ కనపల్లేదు.

బువ్వలేల్లకల్లా గూడేనికి వత్తామని కపురు పెట్టినోల్లు పైటేల అయినా యింకా రాలేదు.

ఆకలైనోల్లు గుడిసెలకి పోయి గంజితాగి వొత్తున్నారు.

గుడిసెల కాడ ఆడోల్లు నుంచోని రోడ్డెంక సూత్తున్నారు.

పిల్లగాల్లయితే గూడెం పొలిమేరకాడికి పోయి సూసివొత్తున్నారు. పొలిమేరకాడికి పోటం కాసేపు సూట్టం, కాల్లీడ్సుకుంటా వొచ్చి మాకు చెప్పటం.

సీకట్లు కమ్ముకుంటున్నాయ్. యిక వాల్లు వొత్తారన్న ఆశలేదు. గుడిసెలకి ఎల్లిపోదాం అనుకున్నం. యింతలో గూడెం దగ్గర్లో మోత యినపడ్డది. జీబు వత్తంది-అంటూ పెద్ద పిల్లలిద్దరు వురుకెత్తుకొచ్చి సెప్పినారు.

మేం ఎవల్లం మాట్లాడకూడదనుకున్నం.

మా తరపున మా జానుబాబు మాట్టాడతడు. శౌరి తాతా కూడా మాట్టాడతడు. యీల్లిద్దరు తప్ప యెవుల్లూ నోరు మెదపకూడదనుకున్నం.

జానుబాబు శౌరితాతకు యేదో సెప్పుతావుండు. యేం మాట్టాడాలో మల్లొకసారి గాపకం సేత్తండు కామోలు.

జీబు రానే వొచ్చింది.

కాని యీ జీబు గవర్నమెంటోల్లది కాదు. సాములోల్లు వచ్చారు.

కిస్టమసు తర్వాత సాములోల్లు మా వూరు రాడం యిప్పుడే. కిస్టమసుకి మేం సందాలివ్వలేదని, పెద్ద గుడికి పూజకి రాలేదని సాములోరు మా మీద కోపం గుండడు. మల్లీ యిన్నాల్ల తరవాత వొచ్చినారు. యీల్లయినా పైసలిస్తే పొట్టగడుపుకుంటం. అందుకే వచ్చారేవో.

గవర్నమెంటోల్లు వొత్తారనుకుంటే సాములోల్లు రాడంతో జానుబాబు మమ్ముల్నే మాట్టాడమండు. అవసరమైతే తను కూడా మాట్టాడతాలే అండు.

శౌరితాత సాములోల్లకి దండం పెట్టిండు. సామీ శానాల్లుకి వొచ్చినారు మావూరు. యింకా మేం బతికున్నామో లేదో సూట్టానికొచ్చినారా? యేంటి సామీ తుపానుకి వొక్కల్లన్న సావకుండా అందరూ బతికి వున్నారేంటాని ఆచ్చరం పోతున్నారా? మీకు ఏం గాపకం లేకపోయినా మాకు ప్రభువులాంటోడు జానుబాబు మాకాడనే వుండు. ఆయన దయవల్లే మేం అందరం బతికి బైటపడ్డాం.

"అదుగో ఆ తొందరపాటే మంచిదికాదంటున్నాం. మీ చావులు కోరుకునే దుర్మార్గులమా మేం? మీరు...."

సాములోరిమాట పూర్తి కానేలేదు. ఎపుడో అంతేలే సామి. మేం సత్తే మీకు సందాలెక్కన్నుంచి వత్తాయి?" అన్నాడు.

పొద్దుట్నుంచి యీసెంటర్లో పడిగాపులు పడిన కడుపుమంట అది. ఆ మాట పట్టించుకున్నట్టు లేదు. సాములోర్లు. ఆల్లల్లో ఆల్లే యేదో యింగులీసులో మాట్టాడుకున్నారు. ఆ బాస మా జానుబాబుకైతే అర్థమైతది. మా కెవల్లకీ రాదు.

"ఇదుగో శౌరి - ఇప్పుడు మేం పాత గొడవలు తిరగతోడటానికి రాలేదు. మీకెంత నష్టం జరిగిందో, మీ పరిస్థితి యెలా వుందో తెలుసుకుని రిపోర్టురాసి మీచేత సంతకాలు పెట్టించుకు



రమ్మన్నారు మన తండ్రిగారు. అందుకే వచ్చాం. చెప్పండి మీలో ఎవరెవరికి ఎంతెంత నష్టం జరిగిందో."

కలం కాగితం తీసుకున్నాడు మా సాములోరితో వొచ్చిన సాములోరు.

"సెప్పేదేవుంది సామీ? మునుపటి ఉప్పెన తరవాత నానా కట్టాలు పడి ఇలా గుడిసె లేసుకున్నం. అయి ఈ ఉప్పెన దెబ్బకి నాశనమయినయి. మళ్లీ అందరం కలిసి అడివికి పోయి కట్టెలు, తాటాకులు తెచ్చుకున్నం. యెట్టోకట్టా గుడిసెలు నిలబెట్టుకున్నం. యియ్యాల ఆ గవర్నమెంటోల్లు వత్తారని కపురొత్తే పొద్దుట్నుంచి యీడ కూసున్నం. అల్లు రాలేదు."

"వాళ్ళు ఏదో గ్రామానికెళ్తే మీలాంటోల్లు వాళ్ళ కారుల్ని తగలబెట్టారంట. వాళ్ళని కొట్టటానిక్కూడ సిద్ధమయ్యారంట. అప్పుడు పోలీసులు కలగజేసుకుని లాఠీఛార్జీ చేస్తేగాని ఆ జనం ఆగలేదంట. అందుకే వాళ్ళెవరూ ఈ రోజు ఎటూ వెళ్ళలేదు."

"యేంటిసామీ - మాలాంటోల్లు అంటారు? మేం ఉత్తిపున్నేనికే గవర్నమెంటోల్లని కొట్టేటోల్లమా? ఆ గవర్నమెంటోల్లోదో తప్పుడు పని సేసుంటారు. అందుకే అల్లు గొడవ సేసుంటారు." యాకోబుగాడు గట్టిగనే మాట్టాడిండు.

"నువ్వు నోర్ముయ్యరా యెదవ. నేను మాట్టాడతన్నాగా? మద్దెన నీ సిందులేంటి?" శౌరితాత యాకోబుగాన్ని గద్దిచ్చిండు.

"తాతా - యాకోబు అన్నదాంట్లో తప్పేం లేదు. జనం కోసమని వచ్చిన డబ్బుల్లో అధికార్లు సగంపైనే మింగేశారు. ఐదువందలు ఇవ్వాల్సిన వాళ్ళకి రెండొందలు చొప్పున ఇస్తుంటే మేం తీసుకోం - మాకు ఇవ్వలసినదంతా ఇవ్వమని అడిగారు. అప్పుడే పోలీసులు అన్యాయంగా వాళ్ళమీద లాఠీఛార్జి చేశారు. దీనికి సమాధానం చెప్పమను మీ స్వాములోర్ని" జానుబాబు ముందుకొచ్చి అన్నడు.

"ఫాదర్ జాన్ - మీతో మేం మాట్లాడదల్చుకునిలేం. అనవసరంగా మీరు జోక్యం చేసుకోవద్దు....' ' ఇంకా యేదేదో మాట్టాడిండు యింగిలీసులో మా సాములోరు.

జానుబాబు కూడా యింగిలీసులోనే యేదో గట్టిగనే అన్నడు.

శౌరితాత కలగసేసుకొని జానుబాబు నువ్వు ఆగు, మేం మాట్టాడతాంలేం. మాకు జవాబు సెప్పమనండి యీ సాములోర్ని." అన్నడు.

"సామీ - యీ గొడవలన్నీ మనకొద్దు. మీరిచ్చే సాయం యేదన్నా వుంటే యియ్యండి, మా బతుకు మేం బతుకుతాం" అని శౌరితాత సాములోరితో అన్నడు.

"ఏదీ అన్ని గ్రామాల వివరాలు ఇంకా సేకరించలేదు. ఏ గ్రామంలో ఎంత నష్టం జరిగిందో పూర్తి వివరాలు వొచ్చిన తర్వాతనే వాటిని తండ్రిగారు పైకి పంపిస్తారు. డబ్బులు మంజూరు అయితే వాటిని మళ్ళీ తండ్రిగారు ఏయే విచారణకి ఎంత ఇవ్వాలో నిర్ణయించి మా కిస్తారు. వాటిని మీకు అందిస్తాం".

"యీలోగా మేం యెట్టా బతకాల సామీ?"

"చివరేం చేద్దాం చెప్పు? నష్టపోయింది నువ్వు ఒక్కడివే కాదుగా? మన మేత్రాసనంలో అన్ని గ్రామాలు తిరగాలి. వివరాలు సేకరించాలి. నీకొక్కడికే పంచేటట్లయితే నేనే ఎంతో కొంత ఇప్పుడే ఇచ్చేద్దును."

"నాకొక్కడికి మీరిచ్చినా నేను తీసుకొన్లే సామీ. యిత్తే అందరికీ యియ్యండి"

"అది కాదు. శౌరి. తండ్రిగారు ఇస్తేనే కదా మేమూ వీకిచ్చేది? మా దగ్గర మాత్రం ఎక్కడివి?"

"అంతేలేసామీ - మీ దగ్గర మాత్రం యాడుంటయి. తండ్రిగారిచ్చే డబ్బుల్లో మీ మోటరు సైకిలుకీ, పండ్లు పలాలకే సాలవాయే."

"వొరే సంసోనుగా - నువ్వు నోరు మూత్తావా లేదా? నేను మాట్టాడతన్నా కదరా యెదవ నాయాల? పోనీ నేను నోరు మూసుకుని కూకుంట. నువ్వొచ్చి మాట్టాడరా."

శౌరితాత సంసోనుగాడి మీద అరిసిండు. పేతురు మావయ్య కలగసేసుకుని శౌరితాతకు నచ్చసెప్పిండు.

"సరే మీరు మరీ ఇబ్బందుల్లో ఉన్నారు కాబట్టి తక్షణ సహాయంగా మీ గుడిసెలకి తాటాకులు కొనిస్తాం. అదైనా రేపు తండ్రిగార్ని అడగాలి" సాములోరు అన్నడు.

"మాకు తాటేకులెందుకు సామీ. మేం యెట్టనో గుడిసెలేసుకున్నం కదా!"

"మమ్మల్ని ఏం చెయ్యంటారు చెప్పండి? తక్షణ సహాయంగా ఇళ్ళు కప్పుకోటానికి తాటాకులు కొనివ్వాలని తండ్రిగారు నిర్ణయించారు."

"పోనీ ఆ డబ్బులిప్పించండి సామీ, ఆటితో మేం ఉప్పు పప్పు కొనుక్కుంటం."

"అలా వీల్లేదు శౌరీ! డబ్బులెవరికీ ఇవ్వనని తండ్రిగారు అన్నారు. ఆయన నిర్ణయం మనం కాదనలేంగా?"

"మీరు డబ్బులియ్యరు. మాకు తాటేకులు అవసరం లేదు. ఇంకెట్టా సామీ యేం సేసుకోవాల మేం ఆ తాటేకుల్ని?"

"మేం ఏం చెప్పం? మీరే ఆలోచించుకొని ఏదో ఒకటి తేల్చి చెప్పండి".

"పోనీ సామీ, ఆ తాటేకులు మా పక్కూరోల్లకి కావాల్సివస్తది. ఆల్లకి అమ్ముకుంటం. ఆ డబ్బుల్తో ఉప్పు పప్పు......"

"అలా వీల్లేదు. మేం ఇచ్చేవాటిని మీరు అమ్ముకునేట్లయితే ఇచ్చేది లేదు."

"మాకు అవసరం లేదు మొర్రో అంటుంటే అయ్యే యిత్తానంటారేం? మాక్కావల్సినయి యియ్యండి సామీ. మాకు తాటేకులొద్దు, డబ్బులన్నా యియ్యండి. లేదా ఉప్పు పప్పు అన్నా కొనియ్యండి".

"మేం ఇస్తామన్నది వద్దంటారేం మీరు? మీకు ఇంత పొగరు కాబట్టే ఆ వూళ్ళో పోలీసులు లాఠీఛార్జీ చేశారు".

అనుకుంటా జీబెక్కి ఎల్లిపోయినారు సాములోర్లిద్దరు.

అమ్మగార్లేనా మనుసులు?

ఉత్తరాదిన ఇందీ దేశంలో జరిగిన సంగతంతా జానుబాబు సెప్పిండు.

ఇద్దరు అమ్మగార్లను దొంగయెదవలు సెరిసినారంట. వొల్లు కావరం యెక్కి, కిందా మీదా తెలవకుండా పోతంది యెదవలకి.

యెంత దారునం జరిగింది? దేవతల్లాంటి అమ్మగారలకి అన్నాయం చేసినోల్లు మట్టకరిసి పోతారు.



ఎట్టనైనా మాపిటికి పంచాయతీ పెట్టాల్సిందే. అందరం కూసోని యీ యిసయం గురించి మాట్టాడాలి. యేదో వొకటి సెయ్యకపోతే దొంగనాయాల్లు మరీ రెచ్చిపోతారు.

యియ్యాల సిన్న అమ్మగార్లకు జరిగింది. ఎవుల్లూ మాట్టాడక పోతే యింకొకపూట పెద్దమ్మగోరికి జరగొచ్చు. యాకోబుగాన్ని పిలిసి అందరికి సెప్పమని మాపిటికి బడికాడికి సేరమని సెప్పి పంపిన.

మా గుడిసెలోల్లందరూ బడికాడ సెంటర్లో సేరాలంటే యాకోబుగాడు సెప్పాల. పొద్దు గూకినాక అందరూ బువ్వలు తిని బడికాడికి సేరినం. ఇంకా కొంతమంది తానాలు సేత్తన్నారు. అల్లూ బువ్వతిని వచ్చేటప్పటికి కొద్దిగా పొద్దెక్కుద్ది. యీలోగా ముందుగల వొచ్చినోల్లు కండవలు నేలమీద పరుసుకొని సిన్న కునుకు తీత్తారు. మల్లీ అల్లని లేపాలకి తలపానం తోకకొత్తది.

యాకోబుగాడు రానోల్లని పిలవటానికి మల్లీ ఎల్లిండు. సేతిలో లాంతర, పైకి కట్టిన లుంగీ పంచ, తలగుడ్డ, యింకొక సేతిలో కఱ్ఱ అచ్చం యాకోబుగాడు అల్ల అయ్యలాగే వుండు. అల్ల అయ్యగూడ యిట్టనే తిరుగుతుండోడు. ఆయన పొయ్యినాక ఆపని యీడికొచ్చింది.

పిచ్చాపాటి యేదోకొకటి మాట్టాడకపోతే ముందు వొచ్చినోల్లు నిద్దరపోతారు.

"యిదుగో శౌరితాత - న్యాయస్థాపన ఆదివారం వొచ్చింది. పొయ్యింది. అయినా మనకేం వొరగలేదు. ఆ ప్రభుత్వం మనకు అన్యాయం సేసేది యీల్లేగా? మతం పేరు మీద యిన్ని యిస్కూల్లు ఉండయి. యే యిస్కూల్లోనన్నా మన బుడ్డోల్లని సేర్సుకుంటన్నారా? యే యిస్కూల్లో నన్నా మన ఆడోల్లకి గింతపని సెప్పుతున్నారా? అల్ల వంటమనుసుల్ని కూడ యేడనుంచో తెచ్చుకుంటన్నారు గాని....."

నా మాట యింకా పూర్తి ఆవనే లేదు....

"అయితే యేందిరా నువ్వు సెప్పేది? యేం సేద్దామంటవ్"? అన్నడు శౌరితాత.

"నేను సెప్పటం కాదు. మనం అందరం సెప్పాల. అందరం కూడ బలుక్కోని యేదో వొకటి నిర్ణయించుకుంటే మంచిది" అన్నాను.

"నిర్ణయించుకోని ఎవల్లకి సెప్పుదాంరా"?

జేబులో నుంచి సుట్టదీసి ఎలిగిచ్చుకుంట అన్నడు పకీరు మామయ్య.

"యెవల్లకంటే.... నేనేం సెప్పేది? అదేగా అందరం నిచ్చయించుకోవాలనేది?"

"వొరేయ్.... వొకపక్క జానుబాబు సెప్పటంలా? యీ సాములోల్లు, తండ్రిగారు మనగురించి పట్టించుకోరని?"

"జానుబాబు సెప్పేదేందెహె..... మనకి తెలవదా? గుల్లోకి వత్తన్నారా? సందాలేత్తన్నారా? అని తప్ప యింకే యిసయంలో అల్లు పట్టించుకుంటారు?" శౌరితాత కండవ దలుపుకుని నేలమీద పర్సుకుంట అన్నడు.

"మన పిల్లల్లాంటోల్లు, మన గుడిసెల్లో పుట్టి, పెరిగి సాములోరు, అమ్మగారు అయినోల్లు శానా మంది ఉండారు. అల్లకి సెప్పితే...."

"వొరే యేసేబుగో - నీకు శానా ఆశలుండయిరా? మన గుడిసెల్లో పుట్టినోల్లు సాములోరైతే యింకా అల్లు మన మనుసులే అనుకుంటన్నావా? అల్లు పెద్ద సాములోల్లకి ఎప్పుడో అమ్ముడుపోయార్రా. అల్లకిప్పుడు మనం, మన గుడిసెలు యాడగుర్తొత్తయ్? మన పిల్లోళ్ళు పెదరెడ్డిగోరికి పాలేరు తనం సేత్తున్నట్టే, మన గుడిసెల్లో పుట్టి సాములోరైనోల్లు పెద్ద సాములోళ్ళకి

వూడిగం సేత్తన్నారు. ఆల్లే నీతిగ ఉంటే మన బతుకులు యిట్టా ఉంటయ్యా?" సెవులో మంచి నుంచి యెంగిలి సుట్టదీసి పకీరు మావయ్యని అగ్గిపెట్టె అడుక్కుని ఈ మాటన్నాడు సామేలు.

యీలోపల అంతా వొచ్చినారు. యాకోబుగాడే యెందుకి పిల్చిందీ అందరికీ యినబడేటట్టు సెప్పిండు.

జానుబాబు వొక మూల రాయికి ఆనుకొని కూసుండు.

శౌరితాత పాడుకున్నోడల్లా లేసి యేందిరా? వొక్కడూ నోరు తెరవడు? అమ్మగార్లకి అంత అన్నాయం జరిగింది. యిది అన్నాయం అని వొక్కడు అనడేరా?" గట్టిగా అరిసిండు.

"యేంటయ్యా అన్నాయం? యియ్యాలేదో యిద్దరు అమ్మగార్లకి యేదో జరిగిందని, సాములోర్లు, అమ్మగోర్లు అంతా కట్టగట్టుకొని రోడ్లమీదికి వొచ్చినారు. సమ్మెసేసినారు, యిస్కూలు బళ్ళన్నీ మూయించారు. యిన్నాల్లూ మనకి అన్నాయం జరుగుతుంటే యీల్లల్లో యే ఒక్కడన్నా నోరు మెదిపిండా? అరె నిన్నగాక మొన్న కంచికచర్లలో అర్లప్పని పెద్దరైతు నిలువునా సంపేత్తే యేనాకొడుకన్నా నోరు మెదిపిండా? యేం అర్లప్ప మన మడిసి కాదా? మన మతపోడు కాదా? ఆన్ని సంపేత్తే నోరెత్తని యీసాములోల్లు అమ్మగార్ని సెరిత్తే నెత్తీ నోరూ బాదుకుంట రోడ్లెంటబడ్డారు. మన బీదోల్లకి అన్నాయం జరిగితే పార్దన సేత్తనంటారా? అదే సాములోరికో, అమ్మగారికో అన్నాయంజరిగితే సమ్మెజేత్తారా? ఎవురిది అన్నాయం?" సంసోనుగాడి కళ్ళు యెర్రగా సింతనిప్పులాగుండయ్. ఆడిమాట తప్పని యెవుడన్నా అంటే సేతికర్రతో సాపగొడ్తాడేమో అనిపిచ్చుద్ది ఆన్ని సూత్తే.

ఆడు నిజవేఁమాట్టాడిండనిపిచ్చింది నాక్కూడ. కారంచేడులోగాని, నీరుకొండలోగాని యిప్పుడు సంసోనుగాడు సెప్పిన కంచికచర్లలోగాని అంతా మతపోల్లే..... బీదోల్లు..... పెద్ద దొరల సేతిలో బలైనపుడు యే వొక్కడు నోరు తెరవలేదు. యిది తప్పు....... గోరం అని అన్న సాములోరే లేడు.

"వోరే సంసోనుగా.... నువ్వు సెప్పింది కాదంట లేదు. గాని యిది అమ్మగార్లకు సంబందించిన యిసయం కాదురా.... మన మతానికి సంబందించింది".

"అర్లప్పను సంపినపుడు అది మత యిసయం కాదా? అయ్యాల మూసెయ్యలేదే యీల్లు ఇస్కూలు బళ్ళన్నీ? అయ్యాల సెయ్యలేదే సమ్మె?" సంసోనుగాడి సేతిలో కర్ర బిగుసుకుంటం అందరం సూత్తన్నం. పకీరు మావయ్య సుట్టని ఆర్పేసి సెవిలో పెట్టుకుంటా అదికాదురా సంసోనా ....." అని యేదో సెప్పబోయిండు.

"మనకోసం న్యాయ స్థాపన ఆదారం పెట్టి పూజ సేత్తన్నారుగా సాములోల్లు. అట్టనే పాపం ఆ అమ్మగోర్లకోసం కూడా యింకొక ఆదారం పెట్టి పూజ సెయ్యమనుండి. అంతేగాని సమ్మె సెయ్యటం యేంటి?" అన్నడు యేసుదాసు.

"యింకొకటి సేత్తే బాగుంటుంది. ప్రభువు నొక సెంపమీదకొడితే యింకో సెంప సూపించమన్నాడ, సెత్రువుని ప్రేమించమన్నాడని యీల్లే సెప్పుతున్నారుగా, మరిప్పుడు వొకసోట ఆపని జరిగితే యింకోసోట కూడా."

"నోర్మయ్యరా యెదవనాయాలా? నువ్వేం మాట్టాడతన్నవో అర్థమైతుందా?" ఆడిమాట పూర్తికాకముందే పకీరు మావయ్య రమేసుగాన్ని తిట్టిండు.

"ఆడనే దాంట్లో తప్పేం వుంది? శత్రువుని ప్రేమించమని ప్రభువే సెప్పిండని మన యిసయాల్లో సెప్పే సాములోరు" అమ్మగార్లు యీ యిసయంలో ఆపని సేసినోల్లని ప్రేమించకుండా కటినంగా



శిచ్చించాలని గవర్నమెంటుని అడగటం ఏంటి? మనకు వొకనాయం, ఆల్లకొకనాయవా?" అన్నడు పెద్దరెడ్డిగారి దివానంలో పనిచేసే ముత్తయ్య.

కోప్పడితే లాభంలేదనుకుండేమో మోసె పెదనాన్ననోట్లో సుట్టతీసి తుపుక్కున వుమ్మేసి వొరే - పెద్దోల్లు, చిన్నోల్లు నేనొకమాట సెబుతా కొంచెం ఆలోసించుండి. ఈ సాములోల్లు అమ్మగార్లు అంతా ఒక్కటే. ఆల్లు మన పీనుగుల మీద పైసలేరుకున్నోల్లేగాని పైసా మన సేతికిచ్చేల్లు కాదు. అందుకే యింతకాలం మనకి అన్నాయం జరుగుతున్నా'కనీసం పట్టిచ్చుకోకపోయినా బాగుండేది. ఈల్లు కూడా మనల్ని బురదలోకి తొక్కేత్తన్నారు."

"ఇంతకీ నువ్వు సెప్పేదేందిరా. ఏదో కొత్త సంగతి సెప్పుతానని యిప్పుడు దాకా మనం మాటాడుకున్నాయే సెప్పుతవేం?" పకీరు మావయ్య ఉండబట్టలేక అడిగిండు.

మా మోసె పెదనాన్నకి అసలే కోపం ఎక్కువ. పైగా ఆయన మాట్టాడుతున్నపుడు ఎవులన్నా కలగజేసుకుంటే అగ్గిమీద గుగ్గిలం అయిపోతాడు.

"చన్-నోర్మూయెయ్యెహ పకీరా! పెద్ద పోనుగాడల్లే వాగుతుండవ్! నువ్వే గొప్ప తెలివికలోడనుకుంటన్నవా?" అరిసిండు మోసే పెదనాన్న.

"నువ్వు నోర్మూయ్యరా పకీరా. యిదుగో మోసే - ఆడి మాటల్దేముందిలే గాని నువ్వు సెప్పేదేందో సెప్పు. శానా పొద్దుపోయింది యిప్పుడికే. మల్లీ పొద్దున్నే పన్లకి పోవాల" సర్దిసెప్పిండు శౌరితాత.

శౌరితాత మాటలతో శాంతించిన మోసె పెదనాన్న యింతదాకా తను సెప్పింది గుర్తు తెచ్చుకుని మల్లీ సెప్పడం మొదలు పెట్టిండు.

"ఇంతకీ నేను సెప్పేదేంటంటే - దెబ్బ ఆల్ల మనిసికే తగిలిందో, మన మనిసికే తగిలిందో ఎవల్లకి తగిలితేనేం - యిన్నాల్ల బరీగ తిని నిద్రపొయ్యే సాములోల్లు, అమ్మగార్లు యేకం అయిరోడ్డు మీదికొచ్చినారు. సివరకి సమ్మెగూడ సేసినారు. ఈ పరిస్థితిలో మనం మెదలకుండా ఉంటే బాగోదు. ఏదో ఒక సమస్య మీద ఆల్లందర్నీ ఏకం సేద్దాం. పార్థన సేత్తేనే లాబం లేదు అవసరాన్ని బట్టి పోరాటం కూడా సెయ్యాలని ఆల్లకి తెలియసెప్పడం ఎంతైనా మంచిది. మనకి అన్నాయం జరిగినపుడు ఆల్లు మాట్టాడలేదని యియ్యాల మనం మాట్టాడకపోతే మనమద్దెన తేడాలు ఎక్కువైతాయి. మనం యిట్టా యేరేరుగా ఉంటే బైటోల్లకి లోకువైతం".

దూ - నీయమ్మల బతుకులుగాల - మీరిట్టా వొంగి వొంగి సలాంలు సేత్తుండబట్టే అటు దొరలు, యిటు సాములోల్లు మనల్ని అడుక్కల్లా తొక్కేత్తన్నారు ఆ అమ్మగార్లేనా మనుసులు? కంచికచర్లలో దొరలు సంపిన అర్లప్ప మనిసి కాదా? మీ యిట్టవొచ్చినట్టు సేసుకోండి, నేను పోతన్నా ......" అనుకుంటా యింటి దారిపట్టిండు సంసోనుగాడు.

ఆడెనకాల్నే మరియదాసు, ఏసుపాదం యింకొంతమంది కుర్రకారోల్లు యెల్లినారు. ఇంత జరుగుతున్నా ఆ మూలన బండకానుకుని కూసున్న జాను అట్టనే కూసుండుగాని నోరెత్తలేదు.

"జాను - ఏంటి మాట్టాడవ్? ఆ కుర్రోల్లంతా ఎల్లిపోతన్నారు. మనమేంటి సేద్దాం?"

జానుబాబు నడిగిండు శౌరితాత.

జేబులో నుంచి సిగిరెట్టు తీసి ఎలిగిచ్చుకుని అందరి మద్దెలోకి వచ్చిండు జాను.

"ఈ విసయంలో నేను ఏం మాట్లాడగూడదనుకున్నా, అంతా మీ ఇష్ట ప్రకారమే నిర్ణయాలు జరగాలని అనుకున్నాం. ఇప్పుడు కూడా కేవలం నా అభిప్రాయం చెప్పాను. నేనైతే ఖచ్చితంగా

అమ్మగార్లపై జరిగిన అన్యాయాన్ని ఖండిస్తా. అంతేకాదు. దోషుల్ని పట్టి శిక్షించేవరకూ క్రైస్తవ సంస్థలన్నీ బందు పాటించాలని అంటాను. మనకు, మన మతానికి అన్యాయం జరిగితే చూస్తూ ఎలా ఊర్కుంటాం. ఇకపోతే ఇదే సమయంలో అమ్మగార్లందర్నీ ఇంకో మాట అడుగుతాను. అదేమంటే దేశంలో అనేక చోట్ల రోజూ ఎంతోమంది ఆడవాళ్ళపై అత్యాచారాలు జరుగుతుంటే ఏ ఒక్క అత్యాచారాన్నైనా మీరు ఖండించారా?

ఏ అత్యాచారం గురించైనా న్యాయం విచారణ కోరుతూ బందుపాటించారా? గురువులకి కూడా ఇంకో ప్రశ్న ఏమంటే - దళిత క్రైస్తవులపై ఇన్ని అత్యాచారాలు జరుగుతుంటే ఏ ఒక్క రోజైనా నిరసన తెలిపారా? ఈ ప్రశ్నలతో క్రైస్తవ మతాధికారులు తమలో తాము ఆత్మ విమర్శ చేసుకోవాలి. ఇప్పటికైనా తమ తప్పుల్ని గుర్తించి, న్యాయంగా క్రీస్తుబాటలో నడవాలి. ఒక్కమాటలో చెప్పాలంటే దళిత క్రైస్తవుల పట్ల సాములోర్ల దొంగబుద్ధిని ఖండిస్తూనే, అమ్మగార్లపై జరిగిన అత్యాచారాన్ని ఖండిస్తూ, న్యాయం కోసం కృషి చేస్తా''. జానుబాబు సెప్పడం ముగించిండు.

మా మోసే పెదనాన్న సెప్పింది కూడ యిదేమాట. కుర్రోల్లెవ్వల్లకీ నచ్చకపోయినా మోసె పెదనాన్న సెప్పింది మావోల్లందరికీ నచ్చింది. ఇట్టా సేత్తేనే ఆ పెద్దోల్లందరికీ బుద్దొచ్చుద్ది.

కుర్రోల్లకి జానుబాబు నచ్చజెప్పుతానన్నాడు.

మేం అందరం యెల్లుండి శనివారం నాడు మండలాపీసుదాకా యెల్లి కాగితం యిచ్చి రావాల. ఆ కాగితాన్ని యమ్మారావుగారు కలెట్రుగారికి పంపించేటట్టు సూడాల.

తెల్లారి ఆదివారంనాడు సంఘ పెద్దలంతా కలిసి యింకొక కాగితం తండ్రిగారికి యియ్యాల.

ఇయ్యన్నీ నిర్ణయిచ్చుకునేలకే తొలి కోడి కూసింది.

అందరం సరేనంటే సరేననుకుని ఎవల్లిళ్ళకి అల్లు ఎల్లినం.

మీకోసం..... మీ పిల్లల కోసం

ఇయ్యాల పనికిపోవాలంటే బద్ధకంగా వుంది. అందికే పనిమానేసి ఇంటికాన్నే కూసున్న. పొద్దుగూకినాక పెద్దరెడ్డిగారింటికి పోవాల. పండగొత్తంది. డబ్బులిత్తే సంటోడికి, అల్లమ్మకి గుడ్డలు తీస్కోవాల. పోయినేడు ఎవుల్లకీ తీసుకోలేదు. ఇయ్యేడన్నా తీసుకోపోతే దానికి కట్టుకోటానికే లెవ్వు. సింపిరి గుడ్డలతో ఎట్ట గడుసుద్ది? అందికే పెద్దరెడ్డిగార్నడిగి డబ్బులు తీస్కుందామని పనికి బద్దకిచ్చిన.

కాని ఇంతలోనే సైకలేసుకొని ఎంకటేసు వొచ్చిండు. ఎంకటేసుది మా అత్తోరూరు. ఇంత ఎండలో ఆడు ఎందుకొచ్చిండో తెలవలేదు.

ఇట్ట బంధువులిల్లకాన్నుంచి సైకలేసుకొని ఎవుల్లన్నా వొత్తే ఏదో కబురు సెప్పటానికే వత్తారు. లేకపోతే రారు.

ఎండాకాలంలో వత్తే పెల్లి కబురు తెచ్చిండు అనుకుంటం. కాని ఇప్పుడొత్తే ఏం కబురు? పైగా ఈ రోజుల్లో కూలిపన్లెక్కు వుంటాయి. కాబట్టి ఎవుల్లూ పెల్లిగొడవ పెట్టుకోరు. మరీడు ఎందుకొచ్చినట్టో?

నాలో నేను ఇట్టా ఆలోచిత్తనే ఉండా. ఈలోగా ఆడు పండిట్లో సైకల స్టాండేసి తొట్లో నీల్లు తీసుకొని కాల్లు కడుక్కుండు.

"యావేఁ.... మీ వూర్నుంచి ఎంకటేసొచ్చిండు. బైటికిరా'' అని ఇంట్లో బువ్వతింటున్న దాన్ని పిల్చిన.



తినే బువ్వగిన్నె సేతపట్టుకొని గబగబ బైటకొచ్చింది.

"ఏంట్రా ఎంకటేసు శానాల్లకొచ్చినవ్? అమ్మా, నాన్న అంతా బాగుండారా?"

దండెంమీద పాత కండవా తీసి కాల్లు, సేతులు తుడుసుకోటానికి ఎంకటేసుకిచ్చి. అడిగింది.

కాల్లు, సేతులు, ముకం తుడుసుకొని, కండవ దండెంమీద ఏత్తూ అంతా బాగానే ఉండారు. కాసిన్ని మంచినీల్లియ్యి" అన్నడు ఎంకటేసు.

బువ్వగిన్నె గుమ్మలంలోనే పెట్టి మంచినీల్లు తేటానికి లోపలికెల్లింది.

"సంటోడేడి బావా కనపట్టంలేదు. బల్లోకి పోయిండా?" మంచంమీద కూసోని అడిగిండు ఎంకటేసు.

"బల్లోకా, నా బొందలోకా? అంత అదుట్టం ఆడికేడిది? మీ అక్క జబ్బున పడ్డప్పుడు ఆసుపత్రికి మందులకని పెద్దరెడ్డిగారి కాడ డబ్బులు తీసుకున్న. ఆ డబ్బులు కింద సంటోన్ని ఆరికాన్నే పాలేరుతనం పెట్టిన. గేదెల కాడికి పోయిండు. పొద్దుగూకితేగాని ఇంటికిరాడు" ఆడిబవిసత్తు గుర్తొచ్చి నా కల్లంట నీల్లు తిరిగినయి.

"మంచిపనే నేసినవ్. ఈ రోజుల్ల బడికిపంపితే ఆల్లుబతికి ఇంటికొత్తారని నమ్మకంలేదు" అన్నడు ఎంకటేసు.

ఇంతలో అది మంచినీల్లు తెచ్చింది.

నీల్లుతాగి చెంబు దానికిచ్చి. మతం పుచ్చుకుంటే గవరమెంటోల్లు బల్లో సేర్సుకోటల్లేదు. సరేనని బోర్డింగుల్లో సేరిత్తే పిల్లోల్లకి ఆడనే నూరేల్లు నిండిపోతన్నయి" అన్నడు ఎంకటేసు.

ఆ మాట ఇనంగనే నాకెందుకో బయమేసింది. ఏమైందిప్పుడు? ఎవల్ల గురించి ఈడు మాటాడేది? ఇంతకీ ఆ వూల్లో ఏం జరిగింది? అసల సంగతేంటో ఆన్ని అడుగుదామనుకున్న. ఇంటికొచ్చినోడు సంగతి సెప్పకుండ పోతాడా? నేనిట్టా అనుకుంటుండగనే.

"ఏటైందిరా ఎంకటేసు? ఎవల్లకి నూరేల్లు నిండింది?" అనడిగింది అది.

"మనోడే, ఇంతకిముందు సెలవల్లో ఆడు నేను బోర్డింగు కెల్లనంటే మీరు బలవంతాన పంపినారు గదా!"

ఆడి మాటింకా పూర్తికానేలేదు. నాకైతే గుండె ఆగినంత పనయింది.

"ఆ పంపినం. అయితే ఏంటి?' అన్నాను.

"అదే కూడదనేని. మనం ఎంత పెద్దోల్లమయినా పిల్లోలు సెప్పేమాట వొకపాలి కాకపోతే వొక పాలన్నా ఆలకియ్యాల. ఆడెందుకెల్లనండో, ఏంటో కనుక్కున్నారా? అయ్యేం లేకుండా అన్ని తిట్టి బోర్డింగుకి పంపిచ్చారు."

"కనుక్కోక పోటమేంట్రా? అయ్యాల జానుబాబు ముందే ఆడు అల్లవార్డినుగారు పెట్టిన ఇసయాలు సెప్పి ఏడ్సిండు. ఆ పూట జానుబాబు, శౌరితాత, నేను కల్సి ఆలోసిచ్చి, ఈ నాలుగు రోజులు అట్టనే గడిపితే వొచ్చే యేడు గవరమెంటు అస్టల్లో సేర్పిత్తామని అన్నం. ఆడు కూడా అందుకొప్పుకున్నడు". గతంలో ఆడు సెప్పిన కథ, జానుబాబు, నేను ఆడికి సర్దిసెప్పిన సంగతి గుర్తు తెచ్చుకున్న.

"ఆ వొప్పుకోకేం. జేత్తడు? మీరందరూ కలిసి అన్ని బలవంతపెట్టి ఉంటారు! లేకపోతే పోనంటే మీరు కొడతారేమోనని వొప్పుకొనుంటడు"

"చ... అదేం లేదురా! అయ్యాల నేను కూడ ఉండ. జానుబాబు సెప్పినాక ఆడు ఎడ్చుకుంటనే ఆ బోర్డింగుకి పోతనని వొప్పుకుండు" అని సెప్పింది అది.

"మరింకేం. ఆడు బోర్డింగుకి పోటానికి సంతోషంగా వొప్పుకోలేదు. ఏడ్సుకుంట వొప్పుకుండు. అదే సివరికి ఆడి పానం తీసింది" ఉన్నమాట సెప్పిండు ఎంకటేసు.

ఆడిమాట పూర్తయిందో లేదో అది ఏడుపు మొదలేసింది.

"అమ్మ నా తమ్ముడో - నీకు అప్పుడే నూరేల్లు నిండిపోనాయా! నా తమ్ముడో - నా తమ్ముడా...'' సేతిలో బువ్వగిన్నె పక్కనపడేసి సోకాలు పెట్టింది.

"ఏహె, నువ్వాగవే. అసలేం జరిగిందో యివరంగా తెల్సుకోకుండనే ఏడుపేంటి" దాన్ని గద్దిచ్చిన.

"ఇంకా ఏంటి జరగాలయ్యో - నా తమ్ముడికి నూరేల్లు నిండిపోయినయ్యుంటరో - దేవుడో..... దేవుడా...." ఏడుత్తనే నాకు జవాబిచ్చింది.

"అసలేం జరిగిందిరా?" దుక్కంతో నా గొంతిక పూడుకుపోతన్నా యిసయం తెలుసుకుంటానికి ఎంకటేసుగాన్ని అడిగిన.

"నాకు ఏం తెలవదు - నిన్న పొద్దున పాలేరుతనానికి పోతావుంటే ఆ కాలవ డాం (డామ్)లో పిల్లోడి శవం (శవం) కనిపించింది. ఏంటా అని సూత్తే మనోడి శవం అది. గబగబ కాలవలోకి దిగి శవాన్ని బైటికితీసి ఇంటికి మోసుకెల్లిన. శవాన్ని సూసి పెద్దమ్మ, పెదనాన్న వొకటే ఏడుపు!"

"ఆఁ తర్వాతేం అయ్యింది?"

"ఏమైద్ది? పిల్లోడి శవాన్ని సూత్తే బోడిగుండు సేసుంది. రెండు సేతులకి కాల్సిన వాతల గుర్తులుండయ్"

"ఈడి దినంజెయ్య నా తమ్ముడుకెంత పనిసేసిండమ్మో.... దేవుడో... దేవుడా... ఆ వోర్డినుగాడు మంచోడుకాదని నా తమ్ముడికెంత పనిసేసిండమ్మో... దేవుడో... దేవుడా... ఆ వోర్డినుగాడు మంచోడుకాదని నా తమ్ముడు అప్పుడే సెప్పి ఏడ్చిండమ్మో.... నా తమ్ముడో..... నా తమ్ముడా" మళ్లీ ఏడుపురాగం అందుకుంది.

"ఏహె నువ్వాగవేఁ..... ఆ వోర్డినే అని సెప్పుతున్నవ్ నీకు తెల్సేంటి?"

"అక్క అన్నది నిజవేఁ బావా! నిన్న మధ్యాన్నం బాలసౌరి బోర్డింగుకెల్లి ఆ వోర్డినుగార్ని కలిసి మనోడి గురించి అడిగిండంట. ఆయనేఁవో నేను మీవోన్ని యింటికి పంపినా ఆల్ల అమ్మ, నాన్నని తీసుకురమ్మని. ఆడు ఇంటికి రాలేదా! అన్నడంట. పైగా ఆడు సదువుమానేసి సినిమాలు సూత్తండు. బల్లోకిపోడు. శానాసార్లు సెప్పినా యిన్లేదు. అందికే ఇంటికి పంపిన అని సెప్పిండంట!"

"మరైతే ఆ బోడి గుండెవురు సేసినారు; ఆ సేతులకి వాతలేంటి?"

"అదీ ఆ వోర్డిను పనేనంట, బాలసౌరి బోర్డింగులో పిల్లోల్లనడిగి తెల్సుకుండు!"

"ఏం జెప్పారా పిల్లోల్లు?"

"నేను ముందే సెప్పిన్నయోయ... ఇది ఆ వోర్డిను సాములోడి పనేనని.... నా తమ్ముని ఆ సాములోడే పొట్టన పెట్టుకుండమ్మో.... నా తమ్ముడో...... నా తమ్ముడా...."

ఈలోపు సుట్టుపక్కల యిల్లోల్లంతా వొచ్చినారు. సారి తాత గూడా వొచ్చిండు. జానుబాబు, యాకాబోగాడు, సామేలు, మోసె పెదనాన్న, ఏసుపాదం.... అంతా వొచ్చినారు. ఆడోల్లంతా దానిసుట్టూ సేరారు. మొగోల్లేవో నా మంచం సుట్టూ సేరారు.



"ఆ పిల్లోల్లేం జెప్పినార్రా?" ఏసుపాదం మావఁయ్య అడిగిండు.

"ఏం సెప్పుతారు; ఆడ జరిగిందే సెప్పారు."

"అదే... ఆడేం జరిగిందో సెప్పురా" మోసె పెదనాన్న తొందర పెట్టిండు.

"అయ్యాల, అదోరం అంట. పిల్లోల్లందర్నీ వోర్డెను సిలిమాకి తీసుకుపోయిండంట. సిలిమా అయినాక, పిల్లోల్లంతా బోర్డింగుకే ఎల్లినారంట. మనోడు మాత్రం బొక్కు కొనుక్కుందామని కొట్లోకి పోయిండంట. ఈ లోపు మిగతా పిల్లోలు బోర్డింగుకు పోయారు. ఈడికి దారి తెలవక, ఏ బస్సు ఎటుపోద్దో తెలవక, నానా తిప్పలపడి రాత్రి తొమ్మిదింటికి బోర్డింగు కెల్లిండంట...

"మనోడు ఏడ్సుకుంటనే బొక్కు కొనుక్కునేలకి అంతా దాటి వొచ్చేసారని సిలిమా సూడలేదని సెప్పిండంట'.

"మరి సూడనికాడికి సిలిమా సూసిన్నని ఎట్టసెప్పుతడు?' అన్నడు సామేలు.

" అరె అన్ని సెప్పనియ్యంర్రా. తొందరపడతారెందుకు?" గద్దిచ్చిండు మోసె పెదనాన్న. నువ్వు సెప్పురా అని పురమాయించిండు.

"ఈడు నేను సిలిమా సూల్లేదని సెప్పేలకే ఆ వోర్డెనుకి కోపం వొచ్చి ఎదవల్లారా - యింటికిపోతే మెతుకు దొరకదు. యీడ తిండి పెట్టి సదువుకోంర్రా అంటే సిలిమాలు - సికోర్లు కావాల్సొచ్చినయా. పైపెచ్చు అబద్దాలు కూడానా' అనుకుంటూ ఆయన కూసున్న కుర్చీ పక్కనే వున్న బెత్తం తీసుకొని ఆయనకి సాలొచ్చిందాకా యీన్ని కొట్టిండంట.'

"వాడి సేతుల్లో పుండుపుట్టి. ఆడి సేతులిరిగిపోను. నా తమ్ముణ్ని పొట్టన పెట్టుకొం డమ్మో...' అంటూ అది మూలిగింది. దాని సుట్టూ సేరిన ఆడోల్లు కూడా తలొక తిట్టూ తిడతనే వుండారు.

"ఆ రాత్రి తెల్లార్లు నిద్దర పోనియ్యలేదంట యీన్ని. తెల్లారి పొద్దున్నే సెంటరుకి తీసుకెల్లి ఆ వోర్డెన్ యీడికి గుండు సేయించిండంట'.

ఏడ్సి ఏడ్సి అది సొమ్మసిల్లిపడింది. ఆడోల్లు పైట సెంగుల్తో దానికి గాలి యిసురుతున్నరు. అటిటుగా నా పని అట్టనేవుంది.

"గుండు సేయించినాక ఎల్లి మీ అమ్మబాబుని తీసుకురా ఎదవా, అని ఆయనెల్లిపోయిండంట.

"మరీడు కాలవలో ఎట్ట సచ్చిపోయిండురా?" యీ మాట ఎవురన్నరో తెల్సుకొనే మతిలేదు నాకు గాని అందరికీ అదే ఆలోసన వుంది. యీడు ఎట్ట సచ్చిపోయిండు? ఎందికి సచ్చిపోయిండు?' యీ మాట అడుగుదామనుకునేలోపు ఎంకటేసే సెప్పిండు. ఎట్ట సచ్చిపోయిండంటే యవళకి తెలుసు? ఆడ ఆటయంలో యవళం వున్నం గనక?' అన్నడు ఎంకటేసు.

అప్పుడిదాకా మాట్టాడకుండ వున్న జానుబాబు మెల్లగా వొక పక్కకి కదిలి అన్నాడు. వీడు ఏడ్చుకుంట' ఆదమరిచి నేల వొడ్డున నడుస్తూ జారిపడిపోయి వుండొచ్చు.' లేదంటే ఇంకో అవకాశం కూడా లేకపోలేదు. వంటి నిండా వాతలు, బోడిగుండుతో ఇంటికి వెళ్లటం ఎలా? వెళ్ళినా జరిగిన దాన్లో తన తప్పేమీ లేదని చెపితే అమ్మా నాన్న నమ్ముతారో లేదో? నమ్మకపోతే చావగొడతారో అనే భయం అయినా వాడికి కలిగి వుండాలి.

జానుబాబు సెప్పిన రెండు మాటల్లో యేది నిజవోఁతెలసేదెట్ట?

అంతలోనే జానుబాబే అన్నాడు.

"నాకైతే మొదటి కారణమే నిజమేమో అనిపిస్తోంది. లేదంటే ఎంత భయంవేసినా అంత చిన్నపిల్లోడు ఆత్మహత్య చేసుకోవటం అసాధ్యం. అలాంటి ఆలోచనే ఆ పసి మనసులకు తట్టదు. వాడు ఖచ్చితంగా ఆదమరిచి నడుస్తూ కాలుజారి కాల్వలో పడి వుంటాడు.'

ఎట్టన్న జరగనియ్ ఆడు సచ్చిపోయిండు. మరిప్పుడేంటి సెయ్యటం?' అన్నడు సామేలు మావయ్య.

"ఏం చేస్తాం? ఇప్పుడేం చెయ్యగలం? ఏం చేస్తే ఏం ప్రయోజనం ఉంటుంది? అందరం కలిసి ఆ కార్యం ఏదో జరిపించటంతప్ప ఏం చెయ్యగలం?' అన్నడు జానుబాబు.

మాకైతే ఎవురికీ నోటిమాటలేదు. యాకోబు గాడనుకుంట అన్నాడు -

"మనం ఏం సేత్తంలే - మీకోసం మీ పిల్లలకోసం యేడ్వండని యేసు ప్రభువు సెప్పలేదూ? అంతకంటే యేం సేత్తం?" ఆడు యీ మాట యే వుద్దేశంతో అన్నాడో గాని యింతకంటే యిప్పుడేం సెయ్యగలం? అనిపిచ్చింది.



4

# వ్యత్యయము

## వేలూరి శివరామశాస్త్రి

నరసింహులకు కాటఁడు పాలేరు. ఇపు డిరువురికిని సుమారు ఎనుబదేండ్లు.

కాటఁడు నమ్మినబంటు. నరసింహులయింట దొంగలు పడినపుడు కాటఁడు తానే వారిదెబ్బలు తినెను. పని పట్టినపుడు ముసురురేలఁ గాఁ అడవులగుండ పయనించి దొరపనులన్నియు సాధించెను. ఊరంతయు కాలిపోవుచున్నపుడు తన శరీరమంతయు కాలినను దొరయిల్లు కాపాడెను.

నరసింహులు కూడ కాటని కఱవులలో కాపాడెను. పెండ్లి పేరంటము లొనరించెను. ఇల్లు కట్టించియిచ్చెను. కూడు గుడ్డలకు వెతుకుకొన నక్కఱలేకుండఁజేసెను. ఇటులు దొరవలన పాలేరును, పాలేరు వలన దొరయు సుఖజీవన మొనరించిరి.

ప్రాయము పడమటికి తిరిగినపిమ్మట దొరకును, పాలేరునకును పుత్రోదయమాయెను. దొరకొడుకు సోములు, పాలేరుకొడుకు రాములు. కొడుకలఁగని యాయమ్మ లిరువురును ఒకరి తరువాత నొకరు పసపు కుంకుమలతో పరలోక మేఁగిరి.

ఒకనాఁడు కాటఁడు నలుగురి సాయముతో నరసింహుల యింటికి నడచివెళ్లెను. మడిగట్టుకొని యున్నసోములు కాటనిజూచీ దూరముగా నుండుమని' కరాళించి లోనికి తొలఁగిపోయెను. గదిలో జ్వరశయ్యమీఁద నున్న నరసింహులు "ఏమిరా నాయనా, ఏల యటులు బొబ్బవెట్టెదవు?' అని యడిగెను.

"ఉఁహుఁ. వింటివా? పాముచెవులు! ప్రొద్దుననే కాటఁడు, మధ్యాహ్నమున కాటఁడు, సాయంకాలము కాటఁడు. కాటఁడు కాటఁడు! అని సోములనెను.

నరసింహులు కఱ్ఱపొడుచుకొనుచు వాకిటికివచ్చి అరఁగుపై కూరుచుండెను. మాలఁడు భక్తిపూర్వకముగా తల నేలమోపెను. బాపఁడు దీవించెను. వా రొకరినొకరు తమతమ ఆరోగ్యముగుఱించి ప్రశ్నించుకొనినపిదప కాటఁడు - స్వామీ! నాకిఁక స్వామిసేవ చేయఁగల భాగ్యములేదు. ఇదియే చివరచూపు....' అని చెప్పుచుండఁగా అతని కంఠము స్తంభించెను. పలుకుగద్గదమాయెను. కనుల నీరోడెను. కాటఁడు కొంచెము సేపటిలో కన్ను దెఱచి చూచెను.

నరసింహులు కన్నీరు బొటబొట జాఱుచుండఁగా- కాటా! మన మిరువురమును ఒకపడవనే యెక్కితిమి నీవు ముందు నేను వెనుక. నీ విఁక దుఃఖింపకుము! నారాయణుని స్మరింపుము' అని యనెను.

అదియే యుపదేశముగా కాటఁడు నారాయణమంత్రమును గ్రహించెను. అటు పిమ్మట నతఁడు తనకొడుకును దక్కుఁగల బంధుగుల నావలికిఁబంపి నరసింహులయెదట నొక మూట విప్పెను - మూర కాసులు. కాటఁడు వానిఁజూపీ అయ్యా! ఇది మీ సొత్తే. ఇవి తమ కడనే

సంపాదించితిని. నా కొడుకున కింక మీరే దిక్కు. అక్కఱలో వీని నతని కిత్తురు గాక' అని మనవి చేసెను. నరసింహులు సోములను బిలిచి కాసుల సంగతి చెప్పి భద్రపఱపించెను. కాటఁడు ముమ్మాఱు మ్రొక్కి నారాయణుని స్మరించుచు పలువురు సాయమున తనయింటి కేఁగెను.

2

నరసింహు లచటనే కూరుచుండి పలుమాఱు లావులించెను. అతని కదియే తుదిసెలవుగా కానిపించెనా? అతఁడు నిట్టూర్చి ఆకాశము కేసి చూచుచుండెను. అతని కేమియు తోఁపలేదా? ధనముకన్న విలువ యగువస్తు వేమేని పోవుచున్నదా? ఔను. తానును కాటఁడును ఒకరి వెనుక నొకరు దున్నిరి. సాంద్రపొలములను పంటపొలములనుగా మార్చిరి. రాత్రులందు చేలగట్లమీద నెదురుబొదురుగా శయనించిరి. నీరు కట్టిరి, కోసిరి, కుప్పలు వేసిరి, నూర్చిరి. వారి కిండ్లకడనే దవ్వు. పనిలో ప్రేమలో ఒకటే చేయి, ఒకటే మనసు.

కాటని బాహుబలమును దానికన్న మిన్నయగు విశ్వాసమును తన సౌభాగ్యమునకు కారణము. ఆ భాగ్యముచేతనే తాను బవంతి కట్టుకొనెను, కాటనికి ఇల్లు కట్టించి యిచ్చెను. తాను పెండ్లి చేసి కొనెను, కాటని నొక యింటివానిఁ జేసెను. అట్టి కాటఁడు తనకడనే కాక యిహలోకముకడ సెలవుగొని పోవుచుండగా ధనముకంటె విలువగల పదార్థ మొకటి తనను మఱపించిపోవుట లేదు?

నరసింహులటులు కూరుచుండి కూరుచుండి రేయిచొరుదలయందు కాటని కాయమును కనుఁగొనెను. అతనికి దుఃఖమును సంతోషమును ఒకతూరియే కలిగెను. రాముఁడు దొరగారు వచ్చిరి దొరగారు వచ్చిర'ని తండ్రిచెవిలో నూఁదెను.

ఇపుడు చెవిలో నూఁదవలయునది 'నారాయణ' అని నరసింహులనెను.

కాటఁడు 'నారాయణ' అని అనెను. అతఁడు కనులెత్తి కనలేక పోయినను నరసింహులదెస చేతు లెత్తును. అంతట నరసింహులు జ్వరబాధచే గడ గడ వనుకుచు వెనిదిరిగిపోయెను. నరసింహులు ఇల్లుచేరి తన ఆస్తిలో మూఁడవపాలు కాటని కొడుకు రాములకు వ్రాసి రాముని పిలిపించి యాకాకిత మతనికిచ్చెను. రాములు దానిని సోములకడ దాఁచనిచ్చెను.

నరసింహు లంతట నపథ్యమయినను స్నానముచేసి శయ్యనాశ్రయించెను. స్పృహకలిగినపుడు ఇచట నరసింహులకును అచట కాటనికిని నారాయణ స్మరణముతక్క వేఱుమాట లేదు.

ఎవరము ముందర పోదుమా యని పన్నిదము చఱచిన చందముగా వారిరువురు నొక్కొక్క యింద్రియమును విడనాడుచు మృత్యువు ముంగలి పరుగిడిరి. శ్మశానమున స్వామిభృత్యు లిరువురు నొకరి వెలుఁగును మఱియొకరు చూచుకొనుచు కలిసియే పరలోక మరిగిరి.

3

సోములు కడుఁ గొలఁది కాలములోనే సొంత సేద్యపు కామాటము ఎత్తివేసెను. తన పొలములనే కాక తన తండ్రి రాముల కిచ్చి వైచిన పొలమునుగూడ నమరకపఱిచెను.

సోముల కిపుడు కావలసినంత తీరిక. అఁతడే యిపుడు కులము నకును, గ్రామమునకును పెద్ద. సంఘ వ్యవహారములకు, గ్రామ వ్యవహారములకును అతఁడే యిపుడు పరిష్కర్త.

ఒకనాడు సోములు గీతలు చదివి ఇటులు అర్థము చెప్పి కొనుచుఁ బోవుచుండెను ఎఱుకగలవారు విద్యావినయములు కల బ్రాహ్మణుని యెడలను, ఆవు నెడలను, ఏనుఁగు నెడలను, కుక్క యెడలను మాలని యెడలను సమబుద్ధి కలవారు.'

రాముఁడు పాదిరికడకు బోయెను. అతఁడు తెలుఁగు బైబిలు తెఱచి - కంటికికన్ను పంటికి పల్లు అని చెప్పబడిన మాట మీరు విన్నారు. అయితే నేను మీతో చెప్పేది ఏమనగా, దుష్టుని ఎదిరించక నిన్ను కుడిచెంపమీద కొట్టువానితట్టు రెండవది కూడ తిప్పుము. నీతో వ్యాజ్యమాడుచు నీ అంగీ తీసుకొన కోరువానిని నీపై వస్త్రముకూడ తీసుకొననిమ్ము. ఒకడు ఒక మైలుదూరము రమ్మని నిన్ను బలవంతముచేసితే వానితో రెండుమైళ్ళు వెళ్ళుము. నిన్ను అడుగుకొనువాని కిమ్ము. నీ యొద్ద అప్పు పుచ్చుకొనకోరే వానినుంచి నీ ముఖము తిప్పుకొనవద్దు, అని చదువుచుండెను.

'పక్షులను చూడుఁడు అవి విత్తవు, కోయవు కొట్లలో నిలువచేయవు. అయినను ఆకాశమందున్న మీ తండ్రి వానిని పోషించుచున్నాఁడు. మీరు వానికంటె శ్రేష్ఠులు కారా? మీలో నెవఁడెంత తల పోసినను ఆయువు మూరెఁ డెక్కువ చేసుఁకొనఁగలరా? బట్టలకు వగవనేల? అడవిపూలెటు లెదుగుచున్నవో యెఱుఁగరా? అవి శ్రమించి వడకవు. ఏ చక్రవర్తియు సకల సంపదలతో వానివలె అలంకతుఁడు కాఁజాలఁడు. నేఁడుండి రేపు ప్రోయిలోఁ బడుదానిని భగవంతుఁడిటు లలంకరింపగా ఓ విశ్వాస విహీనులారా? మిమ్ముల వాని కంటె నెక్కువగా అలంకరించునే! కాన ఏమి తిందు మేమి త్రాగుదు మేమి కట్టుదు మని వగవలదు. ఇవి ఎవరో సమకూర్తురు. ఇవి యన్నియు మీకు వలయునని ఆకాశమునం దున్న మీ తండ్రికి తెలియును. కాని మీరు దేవుని రాజ్యమును మొదట వెదకుఁడు. అపుడివియకాక యెన్నియో మీకు సమకూరును. కావున రేపటి సంగతిని గూర్చి వగవకుడు' అని చదువుచుండెను.

రాములది విని నాఁటికి వెడలిపోయెను. అతఁడిటులు నెల రోజులు పాదిరికడకు వెళ్ళెను. రాముఁడు జకరయ్యగా మాఱెను. కొలఁది నాళ్లలోనే రెబెకా రాములకు పెండ్లియాయెను.

5

రెబెకా జకరయ్య లిరువురును నెలరోజులు పాదరి యింటిచుట్టును తిరిగిరి. నూఱు నేఁబదిరూకలు నా కిచ్చుచో పాతిక రూకల పంతులపని యిప్పింతునని పాదిరి యనెను.

జకరయ్యకు లజ్జయు ఉదాసీనతయుఁ గలిగెను. అతఁడిటులనెను - అయ్యా, అన్నముచే కడుపునిండు ననియు, బైబిలుచే నోరు నిండు ననియు, సర్వత్తిచే మనస్సు నిండుననియు నేను మతమునఁగలిసితిని. నాకు పూఁటకూటికి టికాణా లేదు. నే నిన్నిరూక లెటులీఁగలను?'

''కాటఁడు కాసులమూట యని యేరికి తెలియదు?, అని పాదిరీ యనెను.'

'కాసుల మూటమాట నిక్కమే. మా నాయన అప్పులవారి కిచ్చివేసెను' అని రాము లనెను.

పాదిరి నవ్వి - ప్రకృతము పదియేను రూకల కొకటియును పది రూకల కొకటియును కాళీ యున్నవి, మీ యిరువురును ప్రవేశింతురా?'

రెబెకా జకరయ్యలు సంతసముతో నంగీకరించి వెళ్ళిపోయిరి.

రెబెకా పంతులమ్మ యాయెను. జకరయ్య పంతులాయెను!

రెబెకా జకరయ్యలు ప్రతి ఆదివారమునాఁడును ఏసు పేర పావలా ముడుపు కట్టవలసి యుండెను. వేఱు వేఱు పండుగలలో పండుగ పండుగునకును ఒకొకరూపాయి యీవలసి వచ్చెను. నెల కొక రూపాయ యిచ్చి మత వాఙ్మయము కొనవలసి యుండెను. ఇదియంతయు లెక్కవేసి చూడఁగా కుడిచేతితో ఇచ్చి ఎడమచేతితో లాగుకొను చందముగా నుండెను. వీని యన్నిటికిని చెల్లఁగా మిగిలిన ద్రవ్యము రెబెకా రాముల పొట్టకు చాలలేదు. ప్రొద్దుగ్రుంకులు బడిలో వాగి వాగి యింటికడకు వచ్చినఁగోలె వారికి వాకట్టు.

పాదిరి వలననే తమజీత మిటు లారతి కప్పుర మగుచున్నదని జకరయ్య తెలిసికొనెను. జకరయ్య పాదిరి దర్శనమున కేఁగి తమకు కలుగుచున్న యన్యాయమును సర్దుబాటు చేయఁగోరెను.

'ఓరీ! మేమేసు కొలము వారము. మీకును ఏసునకును సాక్షాత్సంబంధము లేదు. మాగుండ మీరాయేసుగుడి ముంగిలికి మాత్రమేఁపోఁగలరు. ఈ నల్లవారందఱు మాకు బానిసలు. బానిసలమీఁద నుంపవలసిన దయ నాకు తెలియును. నేను చేయఁగలిగినంత ఉపకారమును చేసివేసితిని' అని యనెను.

జకరయ్య తలవాల్చి - 'నీ దవడమీఁద కొట్టినవానికి రెండవ దవడగూడ ఒగ్గుము, నీ చొక్కా తీసికొనినవానికి నీ కోటు గూడ నిషేధింపకు' మని చదివి యింటికి వెళ్ళిపోయెను.

కొలది దినములకే రెబెకా జకరయ్యల యుద్యోగము లుద్వాసితము లాయెను. రెబెకా 'కిరస్తాని మతము కాని మతము' అని జకరయ్యతో అనెను.

జకరయ్య చిఱునవ్వు నవ్వి యిటులనెను - విద్యా వినయములు కల బ్రాహ్మణుఁడును మాలఁడును ఎఱుకగలవారి కొకటే" యని చదువుచు దాని యర్థమును తృణీకరించు సోములుగారే చెడ్డవారని యనుకొంటిని. దైవమును చింతించుచుండు వారిని దైవమే కాపాడు" నని చదువు పాదిరి సోములుగారికి తీసిపోయెనా? ఏ మతములో తప్పున్నది, స్వార్థపరుఁడగు మానవునిలో గాక! ఇంతకు నేటి మాలల యవస్థ యిటులున్నది. భగవంతున కెరిమీద యనుగ్రహము కలుగునో వారి కతడు ధనములేకుండ జేయును. భగవంతు డిటులనెనుః-

"ఎవ్వని గరుణింప శిచ్ఛించితిని దాని
యల విత్తంబునే నపహరింతు"
మనమిక దాసరుల మగుదము పద!

5

# మెట్లు

అడవి బాపిరాజు

1

ఆ మాలపిల్ల తెల్లబోయి చూచింది, తమగూడెం బయట ఆగిన కారులోంచి దిగిన ముగ్గురు బాలికలనూ, ఒక యువకుడ్నీ! ఎంత చిత్రమైన బట్టలు కట్టుకున్నారు. ఎంత తెల్లగా ఉన్నారు. వాళ్ళు కారులోంచి దిగగానే ఏదోగుమ్మైన వాసన ఆ చుట్టపక్కలంతా ప్రసరించింది!.

ఈలా అనుకొని ఆ పదునాలుగేళ్ళ ఈడుగలబాలిక తనవైపు చూచుకుంది. ఉతుకు ఎరగని చెరిగిపోయిన తనపాత పోగులు పరిశీలించుకొంది. ఆ చిరుగుపాతే చీరలా వల్లెవేసుకుంది. అప్పుడప్పుడు తానూ తలగడుగు పోసుకుంటుంది. అయినా తనవాళ్ళు అలా గుమ్మున వాసనేస్తుంది.

ఆ దిగిన బాలికల బంగారపు ఒడలి కాంతులు చూచింది. తన దేహం కారునలుపు! పళ్ళు మాత్రం తెలుపు. ఆ బాలికలు జుట్టు ఎంత అందంగా దువ్వుకొన్నారో! ఆ పూల్లో! అలాంటి పూలే పూయవు తమగూడెంలో.

వాళ్ల వేసుకొన్న బంగారు హారం, చెవులకు పెట్టుకొన్న ఆ లోలాకులు, చేతుల ఆ సన్నవి బంగారు గాజులు, అమ్మో, వాళ్ళు తొడుగుకొన్న ఆ చెప్పులేమిటి? కిరస్తానీమిసమ్మ గొడుక్కునే జోళ్ళకన్న ఎంత అందంగా ఉన్నాయో!

వాళ్ల కారెక్కివచ్చారు. అప్పుడప్పుడు దున్నపోతు స్వారితప్ప తనకేముంది. వాళ్ల ఎంత తియ్యగా మాట్లాడుకొంటున్నారు? మధ్య మిసమ్మ మాట్లాడే ఇంగిలీషూ మాటాడుతున్నారు.

తన తల సంతనాడు తప్ప నూనే మెరుగును. తంగేడు పూలు, పొలంగట్టున బంతిపూలు తప్ప తాను పూలేమెరుగును. శివరాత్రి తీర్థం రోజున తానుగడ్డికోసి బజారులో జట్కావాళ్ళ కమ్మితే వచ్చిన డబ్బులో అప్పుడప్పుడయ్యకియ్యకుండా దాచుకొన్న అణా, అర్ధణా, కానీలు పోగుచేసుకొన్న పదణాల మూడు కానులతో కొన్న మాయ నెండికడియాలు, మురుగులేగా తనకు!

ఆ బాలికకు యౌవనం తొంగిచూస్తున్నది. పదునాలుగేళ్ళయినా కాయకష్టం చేసేజాతి కాబట్టి త్వరగా ఈడు రాదు. యౌవనం పొంగిపొర్లే ఆ ముగ్గురు నాగరక బాలికలకు కను ముక్కుతీరు లెట్లా ఉన్నా వయ్యారం దేహమసృణత్వము బంగారురంగు ఆ ప్రదేశం అంతా కాంతించాయి.

ఈ మాలపిల్ల మాచి మోము రేఖలు శిల్ప సౌందర్యాలు, విశాల నయనాలు సినీమాతారలు చూచి ఉడుకు బోతుతనంతో కుంగిపోవలసినదే.

ఈనాడు మాలమాచి ఆ అందాల బాలికల చూచి తెలియరాని ఆవేదనలో కుంగిపోయి కన్నులనీరు తుడుచుకుంది.

ఆరాత్రి మాచికి నిదరలేదు. మాచికి పోతిగాడి సంబంధం కుదిర్చాడు తండ్రి. పోతిగాడు దున్నపోతులా ఉంటాడు. పోతిగాడు తనకు వద్దు. యీమాలగూడెం తనకువద్దు! చదువు. ఆపిల్లలులా అవ్వాలి. అలా కారు ఎక్కాలి. అలాంటి నగలు, అలాంటి చీరెలు, అలా! అలా!

2

మా చెమ్మ స్కూలు ఫైనలు పరీక్షలో నెగ్గింది; తన ఊరు నచ్చింది.

"బాబూ! యీ వూరులో ఉండలేను" అంది. ఎంత మంది బతిమాలినా ఉండనంది. ఇరవదవ ఏడున ఖద్దరు చీరా, ఖద్దరు రయికా తొడుక్కొని హరిజన సుందరి మాచెమ్మ సంపూర్ణ యవ్వనంతో మాలపల్లి చివర కరణం గారి మామిడితోట లోని పూతపూచిన గున్న మామిడిలా ఉన్నది. కాకతీసీమకాలోత్పలవిగ్రహంలా ఆమె వికసించింది.

ఆమె ఎంత చదువుకున్నా రంగేమి మారుతుంది? ఎంత చక్కని చీరలు కట్టుకున్నా నల్ల రంగును బంగారం చేయలేవు. రహస్యంగా ఇంగ్లీషు మాసపత్రికలు కొనుక్కొంటూ, అందు ఆంగ్ల అమెరికను స్త్రీలు అందాలు ఎలా సేకరించుకుంటారో చదివేది.

ఇంటిదగ్గిర పోరుపెట్టి తనగ్రామపు హరిజన సంఘంవారి సహాయంతో చెన్నపట్నం దుర్గాబాయమ్మగారి ఆంధ్రమహిళా సభ విద్యాలయంలో ఎనిమిదేళ్ళు చదివి, మొదటితరగతిలో కాశీ విశ్వవిద్యాలయ ప్రవేశపరీక్షలో కృతార్థురాలైంది.

ఉచిత విద్యావేతనం సంపాదించింది, ఇంటరు చదవడానికి.

చదివేరోజుల్లో రెండు మూడు సంబంధాలు తండ్రి తీసుకొని వచ్చాడు. ఒక హరిజనబాలుడు ఇంటరులో నెగ్గినాడు. తాలూకాఫీసులో గుమాస్తా ఉద్యోగానికి, ప్రభుత్వపు ఉద్యోగాల సమితివారు ఎన్నుకొన్నారు. మాచమ్మ ససేమిరా నేను పెళ్ళిచేసుకోనంది.

ఆరోజు సాయంకాలం తన ఊరు బయట కనబడిన కారు, కారునుంచి దిగివచ్చిన అప్సరసలు, ఆ వయసుకాడు, వారి కిల కిల సంభాషణలు, ఆ పడుచుల వయ్యారినడకలు, వారి చీరలు, వారి నగలు, వారి దేహపు మిసిమితనం, ఆహా - ఆమె గజగజ వణికింది.

చిన్న బాలికగా స్నానం అంటే అసహ్యించుకొనేది. దుర్వాసనకొట్టే తాను చుట్టబెట్టుకొన్న పాతపేలిక తడపడం అంటే ఆమెకు రోషం వచ్చేది. సంతలో తెచ్చుకొన్న నూనె రాసుకోవడమూ అసహ్యమే!

అలాంటి బాలికకు ఆ మోటారుకారు ఆ మూవురు బాలికలు ప్రథమ సోపానపంక్తి అయ్యారు.

ఆమెలో ఏమి స్పందించినదో! అదివరదాకా ఉన్న గూడెం మండిపోయింది. ఆమె చూపులో - ఆ పాలాలు నేలలోకి కుంగిపోయాయి. కాల్చిన పందిమాంసం ఎండుచేపలు రొయ్యలు కాలకూటవిషాలై గంజి విషధార అయ్యింది.

మూడు రోజులూ మాలగూడెంలో యమయాతన సలిపి, నాల్గవరోజున మదరాసు వెళ్ళిపోయింది.

3

మాచమాంబ అని పేరు మార్చుకున్నది. ఇంటరు పరీక్ష ప్రథమ తరగతిలో నెగ్గి విద్యార్థి వేతనంతో వైద్య కళాశాలలో చేరింది.

అందరితోనూ మాట్లాడేది కాదు మాచమాంబ. చదువుకొన్న కళాశాలలో అతి జమీందారికంగా మెలిగింది. ఎవ్వరీ బాలిక, ఎవ్వ రీ మాచమాంబిక అని ఇంటరు విద్యార్థులు విద్యార్థినులు కళ్ళతో ప్రశ్నిస్తే, తాను మాలపిల్లనని చెప్పుకోలేకపోయింది. మంచి టాల్కంచూర్ణం, పలచని పెదవుల రంగు, చక్కని సెంట్లు, పాముకు బుసములాంటి చీరలూ అవీ కొనేందుకు వచ్చిన విద్యార్థివేతనం చాలకపోతే, తిండి తక్కువతిని అవన్నీ సంపాదించుకొన్నది.

వార్ధా ఆశ్రమం వెళ్ళినప్పుడు హరిజన బాలిక అవడం వల్ల మహాత్ముని ఆశీర్వాదాలు, ఇతర నాయకుల అభినందనాలు పొంది, కొంత వేతనం సముపార్జించుకొని మదరాసువచ్చింది. అక్కడ స్త్రీల వేష భాషాదులలోని నిరాడంబరత, స్నిగ్ధ సౌందర్యమూ చూచి, సేవాగ్రామ ఆశ్రమంలో ఉన్నంత సేపూ ఏదో బాధకు లోనయింది. కాని ఏ దర్శనమైతే ఆ మెసుమాల పల్లికి దూరం చేసిందో ఆ ఆశ తిరిగి మదరాసుకు రాగానే ఆమెను తనపంథానే నడిపింప జేసింది.

బాలకుల పొగడ్తలలో ''ఈచీర బాగున్నది, నీ వేషం మహాద్భుతం'' అన్నముక్కలే వినేది కాని ''నువ్వు సౌందర్య రాణివి'' అన్న మాట ఒకనాడూ వినలేదు.

ఒక తోటి విద్యార్థి ఎప్పుడూ మాచమాంబను అనుసరించేవాడు. అతడు ఆమెతో ఎంతో స్నేహం చేశాడు. ఆమెను సినిమాలకు తీసుకువెళ్ళాడు. ఆమె దగ్గరగా చేరి రెండు మూడు సార్లు ఆమె ధృఢవక్షనిధులపై హస్తతలం పారించి స్పర్శించి, అదిమినాడు. అప్పుడా బాలికకు వివశత్వం కలిగింది. ఒళ్ళంతా విద్యుల్లత్తలు ప్రసరించాయి. కాని ఆ బాలుడుతన్ను ప్రేమించి అలా చేయలేదనీ తన్ను క్షుద్రజాతి బాలికగా ఎంచి క్షుద్ర జాతి వారికి నీతి నియమా లుండవని యెంచి, వాడు ఈలా తన్ను అవమానం చేశాడనే భావం కలిగిందామెకు.

ఆమె అవమానంతో కుంగిపోయింది. తోకతొక్కిన భుజంగిలా బుస్సుమన్నది. మరునాడా బాలుడు సంతోషంతో పల్కరించగానే వానితో "ఓరి దుర్మార్గుడా, నేను హీనజాతి దాననుకదా, నీ పశుత్వానికి అడ్డం పెట్టననుకున్నావా? ఇక్కడ నుంచి నాతో మాట్లాడకు, నువ్వు విషపు జంతువవు!' ' అని మండిపోయింది. ఆ యువకుడు తెల్లబోయి తలవాల్చుకుని వెళ్ళిపోయినాడు.

ఆమె ఆనాటినుంచి తన తరగతిలో బాలకులతో గాని, తన కాలేజీలోని ఇతరతరగతుల యువకులతో గాని మాట లాడటం మానివేసింది.

ఒకనాడు మాచమాంబిక ఒక ఆచార్యుని ఇంటికి వెళ్ళింది. అప్పుడప్పుడు తెలియని విషయాలు చెప్పించుకొనడానికి విద్యార్థులు, విద్యార్థినిలు తమకు వివిధపాఠాలు చెప్పే వివిధ ఆచార్యుల ఇళ్ళకు వెళ్లే అలవాటు ఉంది.

ఆ అలవాటు చొప్పున మాచమాంబ తానున్న బాలికా వసతి గృహంనుంచే బయలుదేరి తమతరగతికి ఆచార్యులలో ఒకరిబసకు ఏదో పాఠం చెప్పించుకోడానికి వెళ్ళింది. ఆమె చదువుదీక్ష ఆ ఆచార్యులకు తెలుసును. ఆమె గ్రహణశక్తి తక్కువే. కాని, అది తెలుసుకొన్నంతవరకు నిద్రాహారాలు మానివేస్తుంది. తెలుసుకొని కాని ముందుకు అడుగు వేయదు.

ఆ ఆచార్యులు మధ్య వయస్సుకలవాడు. ఆమె సౌందర్యం అతన్ని ఆకర్షించలేదు. ఆమెయవ్వనం, ఆమె దీక్ష, ఆమె దేహపుజిగి అతని హృదయాన్ని కలతపెట్టాయి. ఈ బాలిక ఎవరో పేదవారిబిడ్డ. కొంచెం అనునయిస్తే తనకోర్కెను ఎందు కామె తీర్చరాదు?

ఆరాత్రి ఎనిమిదిగంటలకు పాఠం ఆ ఆచార్యులు ఆమెను తన ప్రక్కనే సోఫాపై కూర్చుండబెట్టుకొని బోధిస్తున్నాడు. ఏ యాదాలాపంగా వేసినట్లో తనచేయి ఆమెతొడపై వేసినాడు. ఆమె పాఠం చదివే దీక్షలో ఆ చేయి నంతగా గమనించలేదు. ఆచేయి - ఆచేయి నెమ్మదిగా ఆమె బొడ్డుక్రిందకు జరిగింది. ఆమెకు ఒక్కసారిగా మెలకువ వచ్చింది. ఆమె గభుక్కున అతని చేయి తీసిపారవేసి, లేచి, ఆడుపులై "మీకు బుద్ధి ఉందా, ఇదా మీరు పాఠం చెప్పడం!" అని ఆ పుస్తకాలన్నీ అక్కడే ఉంచి విసవిస గదివిడిచి వెళ్లిపోయింది.

తన సొమ్ముసంచీ మొదలైనవి ఉంచుకొన్న అలంకరణపుసంచీ అక్కడే ఉండిపోయినందున తిన్నగా నడిచే తన వసతిగృహం చేరింది.

అందరు ఆచార్యులు అందరు విద్యార్థినులూ ఆలాగే చేస్తారా? లేక తనకొక్కర్తికే ఈ పరాభవమా? ఆమె కుంగిపోయింది. ఆ మరునాడు ఉదయం ఆ ఆచార్యులు ఆమెగ్రంథాలు, సంచీ అన్నీ పంపిస్తూ ఆ అలంకరణపు సంచిలో ఒక లేక ఉంచాడు.

"అమ్మాయీ, క్షమించు! ఇది నా అపచారం కాదు! నేను ఒంటివాడను. భార్యపోయిన మధ్యకాలపువాణ్ణి. వైద్యాలయంలో దాదులు నాకోవిధమైన తృప్తి తీరుస్తున్నారు కాని సరియైనమందుకూ, ప్రకటనపు మాయమందుకు నాకు తేడా తెలిసింది కాదు. రాత్రంతా నిదరపట్టలేదు. నేను పడినబాధ అనంతము! కంచె చేను మేస్తే లోకం నాశనమే! నేను నలభై ఒక్క ఏళ్ళవాడిని నాకు భార్యలేదు. ఇద్దరుబిడ్డలు. ఇద్దరూ మేనమామలకడ బెంగులూరులో చదువుకొంటున్నారు. నిన్ను గురించి విచారిస్తే నువ్వు హరిజనబాలికవనీ చెక్కుచెదరని శీలంకల దానివనీ తెలుసుకున్నాను. నువ్వు నన్ను వివాహం చేసుకో - నేను తెలుగు బ్రాహ్మణుణ్ణి! నువ్వు నన్ను ప్రేమించలేకపోవచ్చును. కాని ఉత్తమగృహిణీధర్మమే ప్రేమ కాగలదని నా నమ్మకము. నీకు ఇష్టముంటే నీకున్న కుంకుమ పువ్వురంగుచీర కట్టుకొనిరా! లేకపోతే ఏ చీర కట్టుకున్నా సరే! ఆలోచిస్తాను అనదలుచుకుంటే పువ్వులులేని తెల్లచీర కట్టుకురా! ఇట్లు క్షంతవ్యుడైనరావు" అని ఆతడు ఉత్తరం వ్రాశాడు. ఆయన పేరు డాక్టరు సి.పి. రావు.

4

మాచమాంబిక ప్రభుత్వ వైద్యశాలలో వైద్యురాలయినది. భర్తడాక్టరు రావుగారు నెల్లూరులోనే జిల్లాముఖ్య వైద్యాధికారి అయినాడు. మాచమాంబ పేరు డాక్టరు మాచమాంబారావు. ఆమె అసిస్టంటు సర్జనుగా ఉన్నది. ఆమెకు ఆమె కాలేజీ విద్యార్థినిగా ఉన్నప్పుడే వివాహం అయింది.

డాక్టరు రావు గురువుల వివాహ ఉత్తరం పదేపదేచదువుకొని మాచమాంబ ఆలోచించుకొన్నది. ఉత్తరమువచ్చిన మూడు రోజులవరకు ఆమె కదే ఆలోచన. తాను హిందూ జాతి కాలికింద నలపబడుతూ ఉన్న మాలపిల్ల. డాక్టరు రావుగారు బ్రాహ్మణుడు. పెద్దవాడయితే ఏమి. పదమూడు పన్నెండు సంవత్సరాల తేడా పెద్ద తేడా కాదు. తనతోటియువకులు తన్ను వివాహం చేసుకుంటారా? ఆరేడువందలజీతము, కారుకలిగి ఉన్న భర్త - తన చదువుపూర్తి - తనకు కావలసిన చీరలు - నగలు కారు - తన చదువున కాయన కిరీటం కాగలడు!

ప్రేమా? తనకు ప్రేమ అంటే ఏమీ తెలియదు. డాక్టరు రావు అంత అందమైనవాడు కాడు. అతన్ని తాను ప్రేమించగలదా? ప్రేమ అనేది జంతుధర్మానికి మానవమనస్తత్వం రంగరించిన



ఒక మందు తాను ప్రేమించగలుగునో లేదో! ఏదైనా అయన్ను వివాహం ఆడడంవల్ల తనకు అన్నీ లాభాలే!

ఏ కారణంవల్ల నయితే ఏమి ఆ ఉత్తముడు తన్ను వివాహం చేసుకుంటానన్నాడు.

ఆమె మూడవనాడు కుసుంబాచీర కట్టుకు వెళ్ళింది. అందాకా వట్టి తెల్ల చీర కట్టుకొని వెళ్ళేది. ఆ మరునాడు సాయంకాలం ఆమె పుస్తకాలు పట్టుకొని డాక్టరు రావుగారింటికి వెళ్ళింది వారు పెళ్ళి విషయం అన్నీ మాట్లాడుకున్నారు.

పెళ్లి రిజిష్టరూ అయింది, హిందూ వివాహం చొప్పునా అయింది. వైద్య కళాశాలాచార్యులు, వైద్యాధికారులు మొదలైన వారెందరో వచ్చినారు. కాని ఆమె తన తలిదండ్రులనూ చుట్టాలను ఎవ్వరినీ రావద్దంది.

భర్త తనకు ఈనాడు అన్ని సౌకర్యాలు పొందడానికి కారణం అయ్యాడు. కావలసినవి ముద్దిని సుముక్కాలు చీరలూ ఉన్నాయి. చక్కని అతినవీనరకపు నగలు అందమైనకారు, జిల్లా వైద్యాధికారి బంగళా. ఇంగ్లీషుక్లబ్బు. అనుకున్నవి జరగుతున్నాయి. కాని! కాని!

భర్తకు మొగం అందం కాకపోయినా ఇరవయ్యో వన్నె బంగారు రాయ తాను గర్భవతి కావచ్చు. పురిటికి సెలవు పుచ్చుకొంటుంది. తనపై అధికారైన భర్త పురుడు పోయగలరని ఆమె కలలుగన్నది.

ఆమకు కామతృప్తీ, భర్తకు కామతృప్తీ అవుతున్నది. భర్త ఒకవిధంగా రసికుడే. తనకేమి తెలియును రసికత! అందుకై ఎన్నో స్త్రీ పురుష సంబంధ గ్రంథాలు చదివినది. కష్టపడే విద్యార్థినిగా తయారయింది. యీ విషయంలో కష్టపడే విద్యార్థినే.

వారి వివాహం అయి మూడేళ్లు నడిచింది. కాని వారిద్దరిలో యేదో అసంతృప్తి ఉన్నదని ఆమె గ్రహించేది. ఆమె యవ్వనం చూచి ఉద్భవించిన వాతావరణం చూడక, తొందర పడి ఆ బాలికను చేసుకొన్నాడు. తరగతినల్లకుక్కను తెల్ల కుక్క చేసేప్రయత్నం అయింది. మంగలి బ్రాహ్మణు డెట్లా అవుతాడు? అనాగరకజాతి స్త్రీ ఎంత చదువుకుంటే ఉత్తమ సంస్కారుని భార్య కాగలదు? అతని మొదటిభార్య జ్ఞాపకం వచ్చింది. బిడ్డలను అప్పుడప్పుడు బెంగుళూరు వెళ్ళి చూచి వచ్చేవాడు.

భార్య తన కౌగిలింతకు వచ్చిన మొదటి సంవత్సరం అతడు కామతృప్తినందేవాడు. తరువాత ఆతడు ఆమెలో యేదో లోటును గుర్తింపసాగినాడు. ఆమె తన దేహం అతనికి అర్పించేది. కాని ఆమె ఎక్కడో ఉండేది. ఆమెలేని ఆమె దేహమాత్ర మూర్తిగా తోచి ఆతడు వ్యథనొంది భార్యను తన పడక గదికి పిలిచేవాడు కాదు.

ఆమె బాధపడేది. ఆతడు వట్టి పురుషుడుగా తన్ను కోరేవాడు. తాను పూర్ణపురుషుని వాంచించిది. ఆతడు పశువులావచ్చి పశుతృప్తి పొంది తన్ను తన పడక గదికి పొమ్మనే వాడు.

5

ఒకనాడు లేడీ ఆస్పత్రిలో లేడీ అసిష్టంటు సర్జను డాక్టరు మాచమాంబారావుగారు ఒక స్త్రీరోగిని వైద్యాలయంలో చేర్పింపవలసి వచ్చింది. ఆమె గర్భవతి. ఆ రోగికి ప్రతిపురుడు అసాధ్యమై ప్రాణాంతమువరకు వస్తున్నది. ఆ వచ్చిన స్త్రీ ఖద్దరుధారిణి. ఆమెకు యేరోగమూ లేదు. కాని పురుడు మాత్రమే కష్టం. ఆమె ముగ్గురు ముత్యాలలాంటి బిడ్డలతల్లి!

వారిద్దరు ఈమాటా ఆమాటా చెప్పుకొనడం ప్రారంభించారు. ఆ గర్భగుర్విణి కూడా తన భర్తకు రెండవ భార్య. ఆనందించింది. ఆమె మహదానందము వైద్యురాలు. మాచమాంబకు ఆశ్చర్యం కలుగజేసింది.

రోగి:- డాక్టరుగారూ, మా వారికి వచ్చు జీతం అరవై రూపాయలయినా మాసంసారం యేదో గుప్తంగా లోట్లు లేకుండా జరుగుతున్నాదండి. ఈ యుద్ధంవల్ల ఖర్చు ఎక్కువైన మాటనిజమే కాని యుద్ధభత్యం ఇంకో పదిరూపాయలిస్తున్నారు. మాకు భములవల్ల సాలుకు ఆరువందలు వచ్చునవి పంటలకు ఖరీదులు ఎచ్చి ఇప్పుడు పదిహేనువందలు వస్తున్నాయి.

డా. మాచ:- ఇప్పుడు మీ సంసారం చక్కగా జరుగుతోందన్న మాటా?

రోగి:- ఆ!

డా. మాచ: - ఒక వారంరోజులలో మీకు పురుడు వస్తుంది. ఇంతవరకూ ఆలస్యం చేశారేమమ్మా?

రోగిః నేను మావారిని ఏలా వదిలి ఉండగలను డాక్టరుగారూ. వారు వండుకొంటారు. పిల్లలను చూసుకోగలరు. మా సవతి పోయినయేడే నా పెళ్లి. తర్వాత మూడేళ్ళ వరకూ నేను కాపురానికి రాలేదు. తాలూకాఫీసుపని - ఎన్ని తాలూకాలో బదిలీ - తామే తమకూ, తమ ఇద్దరి బిడ్డలకూ వంట చేసుకొనేవారు. ఇప్పుడు నేను వారి నెల్లావండుకోనివ్వగలను చెప్పండీ?

డా: మాచ:- మీకు ఇద్దరు సవతిబిడ్డలా?

రోగి:- అవునండి. నేను కాపురానికి వచ్చినప్పటినుంచి ఆ ప్లిలలు "అమ్మా, అమ్మా" అంటూ నన్ను వదిలితేనా? నా బిడ్డలమీదకన్న వాళ్ళమీదే నా కెక్కువాపేక్షండి.

ఆమెపురుడు డాక్టరు మాచమాంబారావు తానే స్వయంగా పోసింది. ఆమె భర్త, కాపురం చేసే ఇద్దరు సవతి కూతుళ్ళు, ఆమె స్వంత బిడ్డలు అందరూ ఆ బాలెంతను చూడడానికి వచ్చారు. వారి ఆనందము వర్ణనాతీతము. డాక్టరు మాచమాంబారావు కన్నులనీరు తిరిగింది.

గర్భవతి అవడం ఎంత ఆనందం? గర్భవతులుగా ఉన్నప్పుడు స్త్రీలు అందవికారాలు పొందుతారు. అది అందవికారమా? ఆలా పాలిపోయి. లావెక్కి నీరుపట్టి కదలలేక ఆ స్త్రీలు దేవతామూర్తులులా ఉంటారే! బిడ్డలకనడం పశు ధర్మం. బిడ్డలకు పాలివ్వడం పశుధర్మం, బిడ్డలను రక్షించడం పశుధర్మం, బిడ్డలు పాలు తాగేటంతవరకు ప్రేమించడం పశుధర్మం. కాని ఆలా పెద్దవారైన బిడ్డలను, తలిదండ్రులను, చుట్టాలను, స్నేహితులను ప్రేమించడం? అది మానవధర్మం, దివ్యధర్మం.

అది వర్ణనాతీతం తన పొంకాలైన వక్షోజాలు బిడ్డలకు ఎప్పుడూ పాలియ్యగలవు? తెల్లని ఆ అమృతధారలు తన గబుకు గబుకున పుణుకగలదు?

ఆ బిడ్డల తండ్రి, ఆ బిడ్డలు తన గర్భాన మూర్తించడానికి కారణం తనభర్త! జిల్లావైద్యాధికారి! ఒక బ్రాహ్మణుడు. తనకై క్రిందకుదిగిన వ్యక్తి! తన్ను చేయిపట్టి మెట్లెక్కించిన దేవతా మూర్తి - తన బిడ్డలకు తండ్రి కావాలి. తన "నాన్నా" అని పిలవరూ! వారు తనకు సర్వనాగరికతలు ధారపోశారు. వారు దేవతామూర్తి. వారు భగవంతుడు. తానెవరు?



ఆరాత్రి ఆమె సాధారణంగా అలంకరించుకొనే విధానంగా అలంకరించుకోలేదు.

ఆమె సాయంకాలమే తలంటుకొన్నది. నల్లటి తన పొడుగాటిజుట్టు వదులువాల్జడ వేసుకొంది. కనకాంబరాలను తలలో ధరించింది. చెవుల దుద్దులు మాత్రం. మెళ్ళో పుస్తెలతాడు, ఒక సన్నని బంగారు గొలుసు నుదుట ఇంత కుంకుమ బొట్టు, బంగారు రంగు రవిక, కుసుంబారంగుచీర కుసుంబారంగు గాజులు ధరించింది.

నల్లటి ఆమె మొగాన పౌడరు లేదు. పెదవుల ఎఱుపు రంగు లేదు.

ఆమె రాత్రి వారిద్దరి గదికీ మధ్యనున్న తలుపు తెరువబోయి, అది వేసి ఉండటంవల్ల, వారి గదిలోకి వెళ్ళే ముఖ్య ద్వారం వెంటనే లోపలికి వెళ్ళింది.

ఆ జిల్లా వైద్యాధికారి పురుషుడు. వంగి సోఫాలో కూర్చుండి చుట్ట కాలుస్తూ ఏదో వైద్యపత్రిక చూస్తున్నారు.

మాచమాంబ తిన్నగా భర్తదగ్గిరకు వెళ్లి సోఫాదగ్గిర భూమిమీద మోకరించి భర్తవొళ్లొ తల వుంచింది.

ఆయన తెల్లపోయాడు. ఎవరీమె? ఆ మాలపిల్లా?

ఆమె సంపూర్ణమూర్తిగా, పూర్ణ భార్యగా వచ్చినదన్న ఒక పరమశ్రుతి ఆయన హృదయంలో మారుమ్రోగింది. ఆయన గడగడలాడిపోయాడు! ఆమె ఎక్కడో ఏదో గ్రామంలో ఊరిచివర ప్రపంచాన్ని తెల్లబోతూ చూస్తున ఉన్న అనాథ బాలిక యై ఒక దేవునికై ఒక పరమపవిత్ర నాధునికై, జీవితానికై చేతులు చాచి నిలుచుండిపోయిన బాలికయై ఆయనకు గోచరించింది.

ఆయనలోని పురుషత్వము, మానవత్వము, దివ్యత్వము భర్తృత్వము, జనకత్వం ఒక మహాపుష్పంలోని అన్ని రేకులై విప్పారినవి.

ఆతడామెను తన హృదయానికి గాఢంగా, గాఢంగా, లలితంగా, తమిగా, గౌరవంగా, కామంగా, ప్రేమగా అదుముకొన్నాడు!

6

డాక్టరు మాచమాంబకు పండులాంటి ఆడపిల్ల పుట్టింది. భర్తగారి తల్లి పోలిక అట.

జిల్లా వైద్యాధికారి డాక్టరు సి.పి. రావుగారు నల్లని తన మాలపిల్లలో భారతజాతియొక్క అడుగుమెట్టు చూచి పండవలసిన శాలిభూమి తన భార్య. ఆ నలుపు బంగారినిక రెండవఛాయ!

ఆమె హృదయం కోటిబంగారాల విలువ. ఆమె అమృత మూర్తి అయిపోయినది. ఆమె నీలనీరదగాత్ర అయిన పార్వతి! ఆమెధరిత్రీమాత! ఆమె ప్రపంచాన్ని కరిగించే ప్రేమతో తన సవతి బిడ్డలను హృదయాని కదుముకొన్నది.

తన బిడ్డకు తానే రొమ్ముకుడుపుతూ వైద్య రాజయిన భర్తను బ్రహ్మానంద వీక్షణాలతో చూస్తున్నది.

(తరంగిణి కథల సంపుటి)

6

# ఇంటి మాదిగోడు

## వై.సి.వి. రెడ్డి

రామునికి . తొంబైఏళ్ళు. ఇంట్లోకీ బయటికీ తిల్లాడుతాడు. చూపు పరవాలేదు, దగ్గరగా వుంటే గుర్తుపడతాడు. బాగా ముసలివాడయినాడు. వయసులో ఎంతో బలంగా వుండి వుంటాడు. శరీరంలో ఎక్కడ తోలు పట్టుకొన్నా బెత్తెడారేళ్ళు సాగుతుంది. వంగిపోయి కూడా ఆరడుగులుంటాడు. కట్టెసాయం లేకుండా నడుస్తాడు. గంగమ్మ అరుగుకాడ కూచొని నులక పేడుతావుంటాడు. యాలకింత పెడితే తింటాడు. గంగమ్మ అరుగుమీదే పడుకొంటాడు. పొలం పనులకు పోలేడు. కొడుకూ, కోడలూ మనవండ్లూ పనికిపోతారు. మొత్తం కుటుంబము పదిమందిదాకా వున్నారు. మనవండ్లక్కూడా ఇద్దరికి పెళ్ళిళ్ళయి పిల్లోల్లయినారు.

రామునికి చదరం పదిమూరల కొట్టం వుంది. అందరూ అందులో యిరుక్కోలేరు. కొంతమంది రైతులిళ్లకాడ వసారాల్లో గంగమ్మ అరుగుమీదా పడుకొంటారు. రామునికింకా రెండు కొట్టాలైనా వుండాల. కొడుకూ కోడలూ బాగానే పనులు చేస్తున్నారు. చాలినంత కొట్టం - వొదుక్కొని పండుకొనేందుకు సంపాదించలేక పోయినాడు. చేసిన కష్టమంతా తిండికే సరిపోయింది.

రాముడు 10, 15 ఏళ్లనుండి పనికి పోలేకుండా వుండాడు. ఆయాసంలేని పనులుమాత్రం చేస్తాడు. నులకపేడడం రైతులకు మంచాలల్లడం - సేద్యపు మోకులు - పగ్గాలు - పట్టెండ్లు వేయడం చేస్తూ వుంటాడు. బువ్వాగుడ్డ సంపాదించుకొంటాడు. ఆకు వక్క పొగాకు పుల్లలు సంపాయించుకొంటాడు. తొంబైఏళ్లు వచ్చినా రామునికి పని తప్పలేదు. తనకు ఆకలి అయినప్పుడు ఒక్కక్క సారి బువ్వ వుండదు. ముఖ్యంగావళ్లమీద గుడ్డ సరిగా వుండదు. దసిలి పోయిన శరీరం చలికాలంలో బాగా అవస్థపడతాడు. ఎక్కడో ఎట్లనో కప్పుకోను లేకుండా పండుకోవాల. రాముడికి కోడి నిద్ర. ఎప్పుడూ మెలకువగానే వుంటాడు కళ్లాల్లోకి కావలి కూడా అప్పుడప్పుడు పోతూవుంటాడు. ఎంతముసిలోడైనా చేతిలో పని వుంది కాబట్టి వూరిలో ఎవరింటికాడైనా యింత బువ్వ దొరుకుతుంది. ఎక్కువతినలేడు. తిన్నా అరిగించుకోలేడు. పేదోళ్లకు ముసలి తనంలో పించనీ యిస్తారట. రాముడికీ రెందుకో. రాముని కొరకు ఎవరో ఒకరుపోయి అందరి కాళ్ళూ పట్టుకుంటే కానీ అది రాదు. అరవైఏళ్ళవుతానే కొట్టాన్ని చూచి ఎవరి సిపార్సూ లేకుండా యీవచ్చునే. అని అనుకొంటాడు రాముడు. నెలకింతవస్తే బాగున్ను అని అనుకోవడంలోనే రామునికి తొంభై దాటుతున్నాయి. నులక పేడడం. మంచాలల్లడం పాతతాళ్లూ తలుగులు అతకడం తప్పలేదు. తాను వయస్సులో వున్నప్పుడు ఎన్నో పనులు గొప్పగా చేసినా నంటాడు. పనుల్లో రైతుల్ను మెప్పించినాననీ చెపుతూ వుంటాడు. రామునికి రానిపనేముంది.

"ఏలా రాముడూ బాగున్నావా. చూపులు బాగున్నాయా" అని అడిగితే "ఏముందబ్బా అంతా

అయిపోయింది. కట్టె నిలిచింది. ఎప్పుడుపోతాదో యేమో. ఉన్ననాళ్లు వూరకుంటే ఎట్లబ్బా" అని నులక పేడేది నిలిపి తృప్తిగా చెప్పినాడు.

హరిజనులకు కొట్టాలకు జాగా లిస్తున్నారంటనే. నీ కొడుకుతో సెప్పి అర్జీ పెట్టుకోకూడదా అని అంటే "ఏందబ్బా మాకెవరిస్తారు. పెద్దోళ్లు పట్టుకొంటే అయ్యేపనులు. గంగమ్మ అరుగుకాడనే నాకట్టెవ్వతాది. యిప్పడెందుకులేబ్బా - అది - మావాడు చూచుకొంటే చూచుకోనీలే అని - అనుకుంటే - మొన్న ఒకాయన - మాదిగోళ్ళది జాస్తి అయింది. గౌర్నమెంట్ డబ్బంతా వాళ్ళకే అని నేను అనుకొంటుండా" అనికొంచెం నొప్పిగా మాట్లాడినాడు. "ఇస్తే వాళ్ళదేం పోయిందనీ" అన్నాను.

"పోయిందో పోలేదో - రైతులకు కొంచెం యాష్టగావుందబ్బా. మాకాలం యిట్లా కాదబ్బా రైతులు మాకూ - మేము రైతులకూ అని అనుకొన్నాం. మావూర్లో మాదిగోళ్ళల్లో నేను పెద్ద భాగస్తుని. చాకిరీకి రైతుల యిళ్ళను మూడేళ్ళకొకసారి పంచుకొనేవాళ్ళం నాకు అణా బాగముండేది. నాకు మూడు నాలుగిళ్లు వచ్చేవి. నేనూ నా పెళ్లామూ పనికి పోగా యింకా మిగిలిన ఇండ్లను సన్న బాగస్తునికి ఆయిళ్లు చూచుకోమని చెప్పేవాన్ని. ఆకాలంలో యింటి మాదిగోడంటే అన్ని పనుల్లో మునుము పట్టినట్లు ముందుండాల. మాపని గాలికాలంనుండి ఉగాది వరకు వుంటుంటాది. పరుపు పావనాల కాలం నుండి కళ్లాల కాలందాకా. రైతులకు బావికింద తోటా దొడ్డీ వుంటే తీరికే వుండదు. మాకాలంలో కవిలె (కపెల) తోలేవాళ్ళం. కవిలె అంటే అబ్బా రొమ్ముల కుంపటిపని. వరుపువస్తే అడుగు నీళ్ళకు కవిలె తోలాలంటే అదిరి పోతాది. అందులో బావులకు వంతులుంటాయి. వంతులోనే తోటపారాల. లేకుంటే పైరు ఎండగాలి పోతాది. కోడికూసే టప్పుడుపోతే చీకటిపడేవస్తాం. ఈ వూర్లోనాతోపాటి కవిలె తోలేవాడు ఒక్క బాలిరెడ్డేనబ్బా. ఆయన మొన్ననే చచ్చిపోయినాడు అని బాధగా అన్నాడు.

"ఏం కపిలె తోలేదంత కష్టమా" అన్నాను. చెప్పుతావాబ్బా. రెండుకాండ్లకు పొద్దుగూకులూ కొనబారికీ మొదటిబారికి చిల్లపోటు పట్టుకొని పరిగెత్తినట్లుండాల. లేకుంటే ఎద్దులు నెమరు వేసుకొంటా వూరుకుంటాయి. నీళ్లు తక్కువగా పోతాయి. తోట పారదు. అదీగాక మాకు బొక్కెనకుట్టేపని వుంటాది. బొక్కెనబాన చిల్లిపడినా వలిగెంకాడ కుట్లూడినా - ముక్కర తొలికాడ తెగిపోయినా - తొండానికి సావు కుట్టూడినా - మాదిగోని తిట్టిన తిట్టు తిట్టకుండా తిడ్తారు. ఏమంటే పంతులబావి కవిలె యుద్ధంలో పనిచేసినట్లు వుంటాది. మోకు తెగచ్చు - గుదిమోకు తెగచ్చు - దాపుతాడు తెగచ్చు - తొండానికి దాపుతాడుకూ లంకెగా వున్న ముక్కిరసిల్ల పోయినా పని యిబ్బందే. అంతా కట్టుదిట్టంగా వుండాల రెండు కాండ్లు ఎద్దులూ నలుగురు మాంచి మోటకష్టం చేసేవాళ్ళుంటే - అన్ని యారముట్లూ - మోకూబొక్కనా - వగైరాలు - సక్కతిగా వుంటే - మాపుటేలకు ఎకరన్నర తోట పారుతుంది. లేకుంటే పారదు. అడుగునీళ్ళయితే ఎకరానే పారేది. ఏమన్నా చెప్పబ్బా - కవిలె పోయింది మాదిగోనికి కష్టాలొచ్చినాయి ఇంజన్లు మోటార్లువచ్చి మానోటి కాడికూడు పోయిందబ్బా మాతో అవసరమేముంది. బొక్కెనతోపనిలేదు. మోకుతో పనిలేదు. ఎద్దులుకూడా అనవసరం. స్వంతం చేసుకోవచ్చు. ఇప్పుడు ఇంజన్లు మోటార్లు రిపేరు చేసేవాళ్ళ కాలం బాగుందబ్బా మావృత్తి పోయిందబ్బా. అందుకేనేమో మాదిగోళ్ళకు సాయం చేయడం. మా కుల వృత్తి పోయింది. ఏమన్నా చేలల్లో తోటల్లో పనులుంటే - ఇంత వస్తాది. లేకుంటే లేదు. మా

కాలంలో ఇంటిమాదిగోని పని అంటే ఒకటా - బొక్కెనా కుట్టాల - గొడ్డు చస్తే చర్మం కర్రవేసివాల. బిళ్ళ మోకులు వర్నెలు చిల్లపోట్లు - ఇంటి అందరికీ చెప్పులు - సోలకాళ్ళకు వార్లూ - ఎద్దులకు తలతాళ్లూ, కొమ్ముతాళ్ళూ - మెడవార్లూ - అన్నీ అమిరించాల. ఇవన్నీ చర్మం లేకుంటే కొనకచ్చి అయినా అమిరించాల. పొద్దున్నే గాడిపాటలూడ్చాల. గింజలు దంచాల రైతు ఇంట్లో ఎవరైనా చనిపోతే బంధువుల వూర్లకుపోయి చెప్పిరావాల. శవాన్ని పూడ్చడానికి గుంత తొగాల. మూడు రోజులు గుంతకాడికి కావిలి పోవాల. నక్కలు గుంతెల్లెయ్యకుండా. యిదంతా అనుకుంటే - రైతులకు మాదిగోళ్లు చేయని పనేముందబ్బా. ఆవులూ బర్రెగొడ్లూ యానినపుడు - ఎద్దులు పాలు మాలినప్పుడు మాదిగోడు చేయాల్సిన పనులు పురమాయింపులు - ఎన్నో వుంటాయి. ఇవన్నీ యిపుడేమున్నాయి రైతులు గింజపైర్లు పెట్టరు. డబ్బు వచ్చే పంటలు పండిస్తారు. డబ్బు చేసుకొంటారు. ఎద్దులుండవు ఎనుములుండవు కొందరికి. యిప్పుడు మా వూర్లో ఐదుపుట్ల గింజలు పండించేవాడేలేడు. అన్నీ సంతలో కొనుక్కుంటారు. యీనులకైనా కొనుక్కోవచ్చు. నేను పేడే నులక అగ్గువకు వస్తాది అందుకే నారిచ్చి నులక పేడిచ్చుకొంటారు.'' అని బుసయిడవకుండా చెప్పినాడు.

''ఇంతపనీ చేస్తె నీకాలంలో నీకెమాత్రం గిట్టుకొనేది'' - అని అన్నాను.

''ధారాళమైన రైతుంటే బాగా గిట్టుకుంటుంది. ఎంతయినా తిండికి లోటుండేది కాదు. ఎక్కడ చూచినా గింజ పైర్లు బాగా పండుతూ వుండినాయి. మాకష్టానికి కళ్లాల్లోరాశిగింజలె - అంటే రైతు యిష్టపడి - చేసిన కష్టాన్ని అంచనావేసి, రాశిని విడిచిపెట్టి ఎత్తకపో అని చెప్పితే వచ్చే గింజలు రాశి గింజలు. ధారాళంగా పెట్టేవారు. మేము లేకుంటే వాళ్ళకు జరిగేది కాదు. తలసమురు కాన్నుంచీ అన్నీ ఎక్కువ లేక పోయినా తక్కువ వుండేదికాదు. సోలకాళకు వార్లు పెట్టుకొనిపోతే - గిన్నె నిండుకూ తలసమురు - ఆముదం వండింది - పోసేవారు. మాకు ఎంత లేదన్నా పుట్టెడూ పుట్టెన్నర - ఒకసారి రెండు పుట్లూ కూడా వచ్చినాయి. నిరుకులేరు. రైతులకొద్దీ. ఉగాది నుండీ గాలికాలం వచ్చేంత వరకూ ఆగింజలు సరిపోతాయి. రైతుపనికి పోయేప్పుడంతా - బువ్వపెట్టారు. రాత్రిపూట గుంత మూకటినిండాకు కొర్రన్నం పెడ్తారు.

ఒకప్పుడేమైందంటే మహన్నబావుడు - మా రైతు ఇంట్లో అలుపూ సలుపూ లేకుండా పని చేసినా. ఎంతపనో చెప్పడానికి కాదు. ఆ సంవత్సరందండిగా గింజలు పండినాయి. కళ్ళంలో జొన్నలు రాశి పోసినాము. సాయంత్రం గింజలు రైతింటికి మోస్తున్నాం. గాదెలు కిందనాలు అన్నీ ఒకటొకటే నిండుతున్నాయి. అందరితో పోటీ నేను నా భార్య గింజలు మోస్తున్నాం. రాశిగింజలు రైతు పొనిచ్చినవి మేమెత్తుకొని పోవాల. ఆనాడు అందాజుగా నాకష్టానికి యిప్పుడు మిగిలిన రాశిగింజలయితే సరిపోతాయి అని మోసేగంప కల్లంలో కింద పెట్టినాను. మా పెద్దరెడ్డి నాదిక్కు చూచినాడు, ఏరా గంప కింద పెట్టినావు - అన్నట్లు చూచినాడబ్బా - నేను నసుగుతా మళ్లీ గంప తీసుకొన్నాను మోయడానికి. అంతలోనే నవ్వుతూ - మహన్నబావుడు యాడుండాడో చచ్చిపదేళ్లైంది యింకొద్దులే అని అన్నాడు - అన్నీ ఎత్తుకపోయినాం. నాయింట్లో పట్టక తావులేక రైతింట్లోనే కొలిచి పోసినాం పుట్టెన్నర గింజలైనాయి. నా జీవితంలో అది పెద్ద కల్లం. రైతును గురించి కూడా వూర్లో అందరూ ఎముకలేని చెయ్యి - మాదిగోనికి గింజలు బాగా పొనిచ్చినాడు. అని అన్నారబ్బా. అదో అట్లా వుంటుందబ్బా - రైతు మాదిగోని సంబంధం మాకాలంలో ''అని అబ్బిళ్ళు కొరుకుతూ చెప్పినాడు..'' రాముడుమళ్లీ వుత్సాహంగా చెపుతున్నాడు. అసంవత్సరం ఆరైతు యిల్లు విడిచి

పెట్టేటపుడు అయిల్లునాకు ఎప్పుడు నాబాగానికి వస్తాదో అని - సంతోషం పట్టలేక - పేరుండేందుకు ఏదన్నా చెయ్యాలనుకొన్నా ఒకరోజు పందెం వేసుకొన్నట్లు ఒంటి రోకట - యిద్దుము కొర్రలు - వండుకునేందుకు తరమయ్యేట్లు - సడింపులు చేసినాబ్బా - చీకట్లోలేసి చీకటి పడేతలికే - పేరుజెప్పి అన్నీ కొర్రలూ దంచినాను. ఆ రాత్రికి మా తల్లి మెచ్చుకొని పరమాన్నం పెట్టింది. అది యిప్పటికీ మరిచిపోలేదు. ఆయన పేరూ నిలబడింది. నాపేరూ నిలబడింది. యిప్పుడెవరుండారులే ముండనాయాండ్లు ఊసుకాళ్ళ దానప్పలు - యిద్దుర కొర్రలు అంటే 64 సేర్లు ఒంటి రోకటితో సాయంత్రానికి వండుకొనేట్లు దంచమను తెలుస్తాది'' అని మీసం మీదికి చెయ్యి పోనిచ్చినాడు రాముడు.

ఇప్పుడు రైతుల్నుంచి మామాదిగోళ్లూ యాష్టపడుతూ వుంటారు. పేట్టుపోతలు లేవు. రాశిగింజలు లేవు. చాలినంతపని దొరకదు. పై పనులు మెట్లుకుట్టేది కూడాలేదు. ఆదాయం తగ్గింది ఉప్పుతో ముప్పైమూడూ - మాదిగోడు కొనాలంటే అవుతుందా అబ్బా నువే చెప్పు - రైతు పండించిందంతా మాదిగోనికి కొద్దో గొప్పో యింటికి వస్తే అదో అప్పుడే రైతుకూ మాకూ కుదురుతాది లేకుంటే ఎట్లబ్బా అని అన్నాడు రాముడు.

మాదిగోళ్ళకు అప్పులిచ్చి. పనుల్లోకి రాబెరుక్కుంటూ వుంటారు. అప్పులివ్వడం, వాన్ని బాదించడం ఎక్కువయింది. వాళ్లు కూళ్లు సరిగా యివ్వరంట - మావాడు మొత్తుకొంటూ వుంటాడు. ఈ నడమన బంజరు భూములకు పెట్టుకొంటూ వుంటే అదే పనిగా కొందరు రైతులు చెడగొట్టినారంట - ఏందబ్బా - వాళ్లివ్వరు - యిచ్చేవాళ్ళకు అడ్డం పోతారు - అన్నీ వున్నవాళ్ళకే చెందాలంటే ఎట్లబ్బా. మాబోటి పేదనాయుండ్లు ఎట్ల పోవాల. ఊరకుంటే వుండూరు అచ్చి రాదంట. ఎట్లనో ఒకట్ల కావాల్సినది సంపాదించుకోవాల. లేకుంటే గడసదు.

ఈమధ్య దేవర్లు చేయరు. దేవాలాలకాడికి రానీరు. అడవిలో కూడా కుంటల్లో దొణల్లో - కూడా ఎవరూ చూడకుండా నీళ్ళు తాగాల. పెళ్లిళ్ళలోకూడా ముందు మాదిరి అన్నాలు పెట్టరు, ఇంతకూ అద్దమానం కాలం వచ్చిందబ్బా. పిల్లనాకొడుకులు ఎట్ల సంపాయించుకొంటరో ఎట్ల బతుకుతారో పాపం అనిపిస్తుంది.

మావాడు ఎందుకో దినమూ యాడికో ఒకసాటికి పోతాంటాడు. ''ఏంపనిరా అంటే ఏదోలే ముసిలోడా నీకెందుకు - ఊరకుండు మనకూ నాలుగు రాళ్ళు సంపాదించుకొనే పనే. నేను పోతూండేపని'' అని అంటాడు. సామీ నీకు తెలిసినోళ్ళుంటే మా వాని కేదన్న సాయం చేయి సామి. నీకు పున్నెం ఉంటుంది. వాడూ పిల్లలు గల్లోడు. నేదకుడు. వాని పెళ్లాం అంటేనో - దానిని చెప్పేందుకు లేదు చెవిటి మాలోకం. తనకు తెలియదు ఒకరు చెప్తే విన్ద. నామనవండ్లందామా రైతుల్తో పాటీషాపు చెప్పులు కొనకచ్చుకుంటారు. పైనపోయే నాయాండ్లు. ఎట్లన్న కానీ మావానికి సాయం చేయి సామీ'' అని ఎందోయిదంతా నాకర్థం కాలేదు. ఎవరికీ ఎవరూ చిక్కకుండా పోవాల. అంతలోకే కొడుకు అడికి వచ్చి నాయనా మనకు బంజరు వచ్చింది. పట్టా వచ్చిందని చెప్పినాడు. ముసిలోడు ముసి ముసి నగుతో నులక పేడడం మొదలు పెట్టినాడు. తకరార్లుండక పోతాయా బంజరైనా భూమి - భూమే - రైతులాశిస్తారు - అడ్డం పడ్తారు. వశపరచుకోవాలని చూస్తారు అన్న భావం వచ్చిందేమో - రాముని మొగంలో దిగులావరించింది.

('గట్టిగింజలు' కథా సంకలనం నుండి)

7

# మెహ్తారాని

## ఇల్లిందల సరస్వతీదేవి

శాంతి వేదికమీద కెక్కి ఉపన్యాసమిస్తున్నది. ముగ్ధ మోహన రూపం ఔత్తరాహుల సౌందర్యం - ఆమె విగ్రహము పొడవైనది. అందానికి మెరుగులు దిద్దే అలంకరణ చేసుకున్నది. ప్రింటెడ్ నైలక్సు చీరె ధరించింది. ఆ చీరె కట్టూ భుజాలు దాటీ దాటని ఒత్తైన నల్లటి తలవెంట్రుకలూ, వాటిని రెండు భాగములుగా చేసి రిబ్బన్లతో సంబంధించబడిన చిన్న చిన్న జడలు, ఎడమచేతి కొక ప్లాస్టిక్ గాజూ కుడిచేతికొక రేడియమ్ డయాల్ వాచీ, కనుబొమ్మలమధ్య తిలకం బొట్టు - ప్రేక్షకుల దృష్టిలో ఒక చిత్తరువులా నిలిచింది.

చక్కటి శైలి. అంతకంటె చక్కని ఉచ్చారణ - శ్రావ్యమైన కంఠం ప్రేక్షకులను ముగ్ధులను చేసింది.

"వివాహాల విషయం - యువకుని మనసుమీద విశ్వాసాల (సెంటుమెంట్సు) ప్రభావ మెక్కువా? సంస్కారం భావాల ప్రభావా మెక్కువా? ఏవి ఎక్కువ పని చేస్తాయి? చేస్తే ఎంతకాలం?' ' ఈ విషయం పైన చర్చ, చర్చలో పాల్గొన్న వారు అరుగురు - వారిలో ఇద్దరు విద్యార్థినులు. ఆంగ్లభాషలో రసవంతంగా సాగుతున్నది చర్చ.

శాంతి చర్చా వేదిక పైకి రాగానే అందరూ చకితులై ఆమెను చూస్తున్నారు. ఆమె చెప్పేదే వింటున్నారు.

"గుండె బలంగల యువకుడు చిత్తశుద్ధితో దృఢ నిశ్చయం చేసుకుంటే సంస్కారం నిలబడుతుంది; మనోబలం లేకపోతే దృఢ నిశ్చయం కూడ కొంత కాలానికి సడలిపోతుంది. విశ్వాసాలు దానిచోట స్థావర మేర్పరచుకుంటాయి" ఇది ఆ చర్చలోని సారాంశము. దీన్నే సోదాహరణంగా చర్చించింది. ఎందరో యువకులు మొదట సంస్కారమనే బులుపుతో కులాంతర మతాంతర వితంతు వివాహాలు చేసుకుంటారనీ ఆ బులుపు తీరగానే వారిలో విశ్వాసాలు చోటు చేసుకోగా చాలామంది తమ వైవాహిక జీవితాలను నరకప్రాయంగా చేసుకుంటున్నారని - మానవ జీవితంలో విశ్వాసాలకున్న బలం దేనికీ లేదని - యువకులకు ఆత్మ స్థైర్యము కావాలని అది ఉంటే విశ్వాసాలను జయించ వచ్చునని శాంతి కంఠం మారుమ్రోగింది - కళాశాల ఆవరణ మంతా.

ప్రేక్షకలోకంలో విద్యార్థులు. ఉపాధ్యాయ వర్గము, పురజనులు. ఉన్నారు. అందరికి ఆనందానికి మరో మెట్టు పైన ఉన్న అనుభూతి కలిగినది. అంతా తన్మయులై పోతున్నారు. ఆమె విగ్రహం చాలామంది హృదయాలలో ముద్రపడి పోయింది.

విద్యార్థి లోకంలో వాళ్ళకు కలిగిన అనుభూతి - ఉపాధ్యాయ వర్గంలో కొందరికి కలిగిన అనుభూతి అంతలో క్షణికమయిపోయినది. వాళ్ళ అనుభూతిలో ఏదో వెలితి ఏదో అసంతృప్తి.

ఆమెకు అందం ఉండచ్చు. ఆధునిక విద్యానాగరికత ఉండచ్చుగాని ఆ పిల్ల మెహ్తర్ల పిల్ల?

ఆ సంగతి మనసులోకి రాగానే దుర్వాసన! వాళ్ళ ముఖాలలో అప్పటి కప్పుడు రంగులు మారుతూన్నాయి.

సభ ముగిసే వరకూ మురళీమోహను కళ్ళ కొక అనుభూతి, నాసిక కొక అనుభూతి రెండూ పరస్పర విరుద్ధంగా ఉండి ఘర్షణ పడుతూనే ఉన్నాయి. ఈ విభిన్న దృక్పథాల మధ్య అర్భకుడైన మురళీమోహన్ నలిగిపోతున్నాడు.

ఈ చర్చంతా కృతకమే. ఇవన్నీ చిలక పలుకలే కాని యువకుల హృదయాలమీద వాటి ప్రభావ మెంత? వాటి బలమెంత?

మామూలే. రోజూ ఎన్ని నీతులు వినటం లేదు? కూటికోసం కొందరు - గౌరవ మర్యాదల కోసం కొందరు ఉన్నతికి కొందరు - ఇదిగో ఈ విద్యార్థినీ విద్యార్థులు బహుమతుల కోసం? అంతేగా? ఇలా సాగుతున్నాయి. అతడి మనసులో ఊహలు.

ఆ సంవత్సరం ప్రారంభంలో మొట్టమొదటిసారిగా తను బాటనీ క్లాసు రూంలో అడుగు పెట్టాడు. పాఠం చెబుతూ మధ్యలో బోర్డు మీద ఏదో వ్రాయాలని లేచి చూసేసరికి క్రిందుగా ఒక బొమ్మవేసి ఉంది. ఆపరేషన్ చేసేటప్పుడు డాక్టర్లు నోటికి ముక్కుకు కలిపి కట్టుకునే మాస్కుతో ఒక ఆడపిల్ల బొమ్మ. దాన్ని చూడనట్టే పాఠం చెబుతూ క్లాసు నాలుగు మూలలా చూశాడు. ముందు సీట్లో ఇద్దరు చేతి గుడ్డలను అలా కట్టుకొని కూర్చున్నారు మురళీమోహన్ అదంతా గమనించనట్టే పాఠం పూర్తిచేసి "మీలో చాలామంది మెడిసన్‌లో సీటు దొరక్క ఇక్కడికి వచ్చారని నాకు తెలుసు, థియేటర్‌లోనికి వెళ్ళి ఆపరేషన్ చేయాలని ఎంతో సరదా పడుతున్నట్టు కూడా నాకు తెలుసు" అంటూ బోర్డు తుడిచి అందరిని ఒకసారి అనుమానంగా చూసి నవ్వుతూ వెళ్ళాడు క్లాసు రూంలోనుంచి

అతడా కార్టూను చూడగానే గ్రహించాడు. ఎవరిని చూసి వేసిందీను. అది మూడు మూర్తులా శాంతి బొమ్మ శాంతి అందానికి అతడి హృదయం తబ్బిబ్బవుతుంది. ఆమెకు సన్నిహితం కావాలనీ, పాఠం చెప్పే నెపంతో పలకరించాలని ఇంకా ఏమేమిటో కలలు కంటుంది కాని మన్మథ కృష్ణ శాంతిని గురించి చెప్పిన తరువాత మనసంతా అదోలా అయిపోతున్నది. ఆమె మీద అభిమానమంతా వెగటుగా మారిపోతున్నది. బుద్ధికీ హృదయానికి మధ్య సంఘర్షణ భరించరానిదిగా ఉన్నది.

మన్మథకృష్ణ క్లాసులో శాంతిని చూసిన తరువాత ఈ పిల్లను ఎక్కడ చూశానా అని మధన పడిపోయాడు. గోవిందరాజన్ సరోజనీదేవి నగర్ కాలనీ నుంచి వస్తాడు. అది కొత్త కాలనీ. అలవాటు చొప్పున మరుగుదొడ్లు కడిగే మెహ్తర్ల కోసం ఎదురు చూశారు ఆ కాలనీ వాళ్ళు. పది రోజుల వరకూ ఎవరి దొడ్లు వాళ్ళే కడుక్కోవలసి వచ్చింది. గాంధీ సూత్రాలను గట్టిగా నమ్మిన వాళ్ళు "మనపని మనం చేసుకుంటే ఏం?" అనుకున్నారు. కనబడిన వాళ్ళకు చెప్పారు. కాని కొందరు ఇంట్లో పనిచేసుకొని కూడా అది గౌరవ భంగమనుకుని చెప్పలేక పోయారు, అలా అందరు మెహ్తర్ కోసం అలమటించి పోతున్న సమయంలో ఇరవై ఏళ్ళ అబ్బాయి. పదిహేనేళ్ళ అమ్మాయి

పాయిజామా కుడతా ధరించి సైకిల్ మీద వచ్చేరు. అమ్మాయి తలమీదుగా ఓణీ కప్పుకుంది ముఖం పూర్తిగా కనబడలేదు.

ఆ కాలనీ వాళ్ళంతా "ఇంటికి రెండేసి రూపాయలిస్తాం పాకీవాళ్ళను పంపించ"మని చెప్పారు. ఆ మరునాటినుంచీ ఆ అన్నాచెల్లెళ్ళు ఉదయం ఐదు గంటల నుంచి ఎనిమిది గంటలవరకూ దొడ్లు తుడిచేవారు. కొన్ని ఇళ్లు మిగిలిపోతే సాయంత్రం పూట వచ్చి తుడిచేవారు అవి డ్రైనేజి దొడ్లు. నీళ్లు పోసి చీపురుతో గబగబా కడిగేసి వెళ్ళేవారు. ఆడపిల్ల కొంగుచాటున చీపురు పట్టుకుని నీళ్లు నీళ్ళు అంటూ ఉండేది. ఇంట్లో ఎవరో పోసేవారు. ఒకనాడు మన్మధకృష్ణ పోశాడు ఆమె ముఖం సరిగా కనబడలేదు. మూడోనాడూ నాలుగోనాడూ తానే నీళ్ళు పోస్తూ ముఖం బాగా తేరిపార చూశాడు.

ఆ కార్టూను చూసేంతవరకూ విద్యార్థులు ఆమెతో మాట్లాడాలనీ ఆమె మాట్లాడుతుంటే వినాలనీ ఉవ్విళ్ళూరే వారు. విద్యార్థినులు ఆమెను మధ్యగా కూర్చోబెట్టుకుని కబుర్లు చెప్పుకునేవారు. అప్పుడప్పుడు ఆమె టిఫిన్ డబ్బా తెరచి ఆమె తెచ్చుకున్న పూరీకూరా తీసుకు తిని ఆమెకు అన్నం పెట్టేవారు.

కార్టూను చూసి శాంతి భయపడిపోలేదు. తన తల్లి డ్రైనేజి లేనిచోట దొడ్లు తుడిచేటప్పుడు అలా ముక్కుకు గుడ్డ కట్టుకుంటుంది. అదొక వృత్తి, ఆ వృత్తికి మాత్రం గౌరవం లేదా?

కాని - కార్టూను తరువాత శాంతి ఒంటరిదయిపోయింది. ఇప్పుడామెకు సమీపంగా ఎవరూ రారు దూర దూరంగా పోతున్నారు. శాంతి ఇంటికి వచ్చి అన్నకు చెప్పుకుని భోరున ఏడ్చింది.

లక్ష్మణ్‌ను చూసిన వాళ్ళు అతడు ఏ తెల్లదొర సంతానమో అనుకుంటారు. అతడు శాంతి చదువుకునే కాలేజి ప్రిన్సిపల్ గదిలోకి వచ్చి "సర్... నేను మీతో కొంచెం మాట్లాడాలి" అన్నాడు.

ప్రిన్సిపల్‌కు రెండు అంగుళాల పొడుగున డిగ్రీలు ఉన్నాయి. కాని కాలాన్ననుసరించి విద్యార్థులంటే మనసులో భయంభయంగా ఉంటుందాయనకు.

లక్ష్మణ్ తన చెల్లెలికి జరిగిన అవమానాన్ని గురించి చెప్పి "అందరి హక్కులూ కాపాడవలసిన వారు మీరు. నా చెల్లెలి కిక్కడ అవమానం జరిగితే ఫలితాలు బాగుండవు" అన్నాడు.

లక్ష్మణ్ టెరిలిన్ షర్టు టెర్రికాట్ పాంటూ - ఖరీదైన బూట్లూ జేబులో ఖరీదయినకలమూ - హుందాగా ఉన్నాడు.

తను చూస్తున్న దానికి విన్నదానికీ పొత్తు కుదరక తెల్లబోతూ "నీవేం చేస్తున్నా"వని తను కాస్త ధైర్యాన్ని పుంజుకోడానికి ప్రయత్నించాడు ప్రిన్సిపల్.

"మెడికల్ కాలేజిలో మూడవ సంవత్సరము" అన్నాడు లక్ష్మణ్.

"చాలా సంతోషం నేను ఇక్కడి విషయాలను అదుపులో పెడతాను" అంటూ లేచి లక్ష్మణ్‌తో కరచాలనం చేసి - అతడు వెళ్ళిన తరువాత అమ్మయ్య అనుకుంటూ కుర్చీలో కూర్చున్నాడు ప్రిన్సిపల్.

నలుగురు ఆడపిల్లల మధ్యన అపురూపంగా పుట్టిన లక్ష్మణ్‌ను చూసి తండ్రి మురిసిపోతూ వీడిచేత చీపురు పట్టించకూడదనుకున్నాడు ముద్దుగా పెంచి చదువు చెప్పించాడు. కాని కొడుకు

కాలేజిలో ప్రవేశించగానే కాలూ చెయ్యి పడిపోయి మంచానపడ్డాడు. తల్లి ఒకతె పనిచేయగా వచ్చేరాబడి చాలటం లేదు లక్ష్మణ్ తరువాత పుట్టిన శాంతి అన్నతో కూడా చదువులో ప్రవేశించింది.

కాలేజీలో అభ్యుదయ ఉత్సవాలు జరిగి వారం రోజులయినా అందరి కళ్ళల్లో అదృశ్యాలే ఇంకా మెదులుతున్నాయి. అందరి చెవుల్లో ఆ ఉపన్యాసాలూ ఆ నాటకాలలో పాటలూ పద్యాలూ ఇంకా మారుమ్రోగుతూనే ఉన్నాయి.

ఆ కాలేజిలో తెలుగు లెక్చెరరు ముకుందం ఆనాటి నుంచి ఏమిటోగా ఉంటున్నాడు. సాధారణంగా తెలుగు లెక్చెరర్లమీద విద్యార్థులకుండే గౌరవముకంటె ఆ కాలేజిలో అతడికెక్కువే గౌరవముంది. అతడెప్పుడూ తెలుగులో మాట్లాడడు. ఎప్పుడూ ఫుల్ సూటులో ఉంటాడు. ఈ రెండు కారణాలతో గౌరవాన్ని సంపాదించాడు. అభ్యుదయ ఉత్సవాలలో విద్యార్థులకు ఉపన్యాసాలను తయారు చేసి ఇచ్చాడు. వాళ్ళల్లో ఒక్కరికయినా ప్రైజు వస్తుందని నమ్మాడు. కాని వాళ్ళకు రాలేదు. ఆ ఓటమి తనదిగా భావించాడు. మనసు చిన్న బోయినట్లయింది.

కాని అది క్షణికమే. వేదిక మీదికెక్కి ఉపన్యాసం ఇచ్చిన శాంతి రూపం - ఆమె వచో మాధుర్యం - దాని సారాంశం అతడి బాధను మరిపింప చేస్తున్నాయి. ఆ అజంతా సుందరి తనను ఓడింపచేసింది. కాని ఆ ఓటమి కూడా ఎంత ఆనందాన్ని ఇస్తున్నది! ఆమెకు ఎవరో కాచివడబోసిన అనుభవాన్ని చక్కగా బోధించారు. ఆమె తీయటి కంఠంతో వెలిబుచ్చటమే అతడికెంతో ముచ్చటగా ఉంది.

ఋతువులు మారుతున్నాయి. ముకుందం ఆలోచనలు ఒక రూపానికి వచ్చాయి. అతడీమధ్య నరేంద్ర పండిట్ దగ్గరకెళ్ళి తనకు ఆరు నెలల్లో హిందీ భాష నేర్పమని కోరాడు. "నేను సంస్కృతం వచ్చినవాడిని. ఆ లిపి కూడా వచ్చు. భాష రావాలి" అన్నాడు. నరేంద్ర పండిట్ ప్రయోజన విద్యా ప్రణాళికా రచనలో సిద్ధహస్తుడు. రెండు మూడు నెలలలోనే సంభాషణా కౌశాలన్నీ - ఉపన్యాసాలయినా అర్థం చేసుకునే శక్తినీ ప్రసాదించాడు.

ముకుందం ఆత్మస్థైర్యాన్ని కలిగించుకుంటున్నాడు. అతడి కళ్ళ ఎదుట అనేక దృశ్యాలు కదలిపోతున్నాయి. అమెరికా దేశం నుంచి రీసర్చి స్కాలరుగా మదరాసు వచ్చి మూడు సంవత్సరాలు గానకళ నభ్యసించిన జాన్ హిగ్గిన్స్ చక్కని ఉచ్చారణతో భావయుక్తముగా కీర్తనలు పాడి గురువులనే గాక భారతీయుల నందరినీ మెప్పించిన అతడి మూర్తి-జరీ అంచుల దోవతి అడ్డుకట్టు - సరిగంచుల ఉత్తరీయము ముఖానబొట్టు తమిళ గాయకుడిలా మెదిలాడు. ఆ చిత్రం మారి మరొక దృశ్యం. అమెరికా దేశస్థురాలు కుమారి రాక్సేన్ ఆలయ నృత్యాలు. ఆమె భారత దేశానికి వచ్చి అనుకరించిన భారత స్త్రీల కట్టూ బొట్టూ ఆ అలంకరణ కళ్లు చెదరి పోతున్నాయి. పాశ్చాత్యులే మన దేశానికి వచ్చి మన పద్ధతుల నవలంబించి మనలో కలిపిపోయి మన ఔన్నత్యాన్ని విదేశాలలో చాటుతుంటే మనదేశం మన జాతి - వర్గ భేదమున్నంత మాత్రాన మెహ్తూరా పిల్ల తనకు అర్థాంగి కాలేదా? శాంతి రూపము అనేక భంగిమలలో అతడిని గిలిగింతలు పెట్టడం మొదలు పెట్టింది.

ముకుందం అభిలాష వినగానే లక్ష్మణ్ ఎగతాళి క్రింద జమకట్టాడు. వారం రోజుల పాటు ప్రతి సాయంకాలం దానిలోని కష్ట నిష్ఠూరాలను వర్ణించి చెబుతూ వచ్చాడు. ఆఖరి రోజున "మీ మన స్థైర్యాన్ని అభినందించకుండా ఉండలేక పోతున్నా" నన్నాడు.

ముకుందం మూడు పూటలా గాయత్రిని జపిస్తాడు. ఆ దేవతే తనకా మన స్థైర్యాన్నిస్తోందని అతడి నమ్మకము.

తరువాత పది రోజులకు ప్రిన్సిపల్ దంపతులనూ లక్ష్మణ్‌ను కూడా రిజిస్ట్రార్ ఆఫీసుకు తీసుకువెళ్లి శాంతిని పెళ్లి చేసుకున్నాడు. ఆ సాయంకాలము ప్రిన్సిపల్ క్వార్టర్సు ముందర పెద్ద షామియానాలో విద్యార్థులకూ స్టాపుకు పెద్ద విందు జరిగినది. ప్రిన్సిపల్ భార్య అనితాసింగ్ అన్ని ఏర్పాట్లు చేసింది. వధూవరులు టెర్రిలిన్ నైలక్సు దుస్తులలో గులాబీ దండలతో మెరిసి పోతున్నారు. మెర్క్యురీ లైట్ల కాంతిలో ఆహూతులందరికీ ఈ పెళ్లిని గురించి ఏమనటానికి నోరు రావటంలేదు. పచ్చి వెలక్కాయ గొంతున పడినట్టున్నది. అయినా నవ్వుతూ వధూవరులకు కరచాలనం చేశారు.

అందరి పరిస్థితిలాంటిది కాదు మురళీమోహన్‌ది. అతడి ముక్కు ముడతలు పడిపోతున్నది. కనుబొమ్మలు ఆత్మీయంగా కలుసుకుంటున్నాయి. ఆవేదనకు అంతులేదు. కాని - ఈనాడు ముక్కు ముడతలు పడటం అసహ్యం కొద్ది కాదు. తనకు ఆత్మ స్థైర్యం లేనందుకు - గుండె బలం లేనందుకు - పరిస్థితులు చెయ్యి జారిపోయినందుకు.

"తీపి తిని నవ దంపతులను దీవించండి" అంటూ అనితాసింగు ఇచ్చిన ఐస్క్రీం అతడికి వేడివేడిగా చేదు చేదుగా ఉంది. నవ్వుతూ అందరితో కరచాలనం చేస్తూ కృతజ్ఞతలు తెలుపుతున్న వధూవరులవైపు కళ్ళెత్తి చూడలేకపోయాడు.

(స్వర్ణకమలాలు కథా సంకలనం నుండి)

8

# నానేర్చిన అనుభవం

విద్వాన్ దస్తగిరి

మాతభాషాభిమాని నయినందున "తెలివితక్కువ" వాన్నయాను.స్వార్థం లేనందున "పిచ్చవాన్న' ' యాను, జనాన్ని ప్రేమిస్తున్నందున "కమ్యూనిస్టు" నయ్యాను. దేశభక్తి అన్నందున "పైకిరాని" వాన్నయాను. కమ్యూనిస్టు నయినందున, మాదిగకులస్థుడనైనందున అంటరాని వాన్నయ్యాను. నేను కమ్యూనిస్టును మాత్రం కాను. అయింటే ఎంతో బాగుండేది.

తన్నడంలో తన్నిచ్చుకోవడంలో మనిషి గాడిదకన్న అధ్వాన్నంగా తయారయ్యాడు గాడిద వెనక కాళ్ళతో తంతుందని తెలుసు. మనిషి ఎప్పుడు ఎక్కడ తంతాడో తెలీదు ఎప్పుడు ఎట్లా గోల్‌మాల్ చేసి నీరులేని చోట నారపాసతో గొంతు కోస్తాగో తెలీదు. అంతేగాదు తాను తన్నడం ఎంత తప్పుకాదో, తన్నించుకోవడమూ అంతే తప్పుకాదనుకుంటున్నాడు మనిషి. తమను ఇంత గాడుదులుగా చేసింది దోపిడీ సమాజమని గ్రహించినపుడు ఆ చైతన్యం పొందినపుడు ఒకరికొకరం తన్నుకోవడం ఆపి ఈ దోపిడీ సమాజిన్న పురావస్తు ప్రదర్శన శాలకు తన్నేసి తాను మనిషవుతాడు అపుడు మాత్రమే అతనికి మనిషి గుణాలు అబ్బుతాయి.

నేను అంటరాని వాన్నయినందున (కులంతోను భావాలతోను) నేను ఒక చోట కొంత నిలకడగా ఉద్యోగం చేయడం అధికారులకు యిష్టం లేదు. అధికారులు తిప్పినట్లల్ల తిరగటమే పక్కకు మెదిలేకి నాకు వేరే అవకాశాలు లేవు. పైగా పెద్ద కుటుంబ భారమంతా నా నెత్తిన వుంది. ఒక వూరుకు ట్రాన్స్‌ఫర్ చేస్తారు. ఆ వూరికి పోయి యింకా ప్రయాణపు బడలిక తీరకనే యింకోవూరికి ట్రాన్స్‌ఫర్ ఇలా ఎందుకు జరుగుతున్నదో నాకు స్పష్టము. అందువల్ల ఇదంతా నాఖర్మ అనో. పూర్వ జన్మ ఫలితమనో అనుకొనే అజ్ఞానిని కాదు.

నేను వెళ్ళే వూర్లు ఎట్లుంటాయంటే చెప్ప తరం కాదు. మధ్య యుగపు గాలులు, యిప్పటి గాలులు కలిసి పాతకొత్తల చెడ్డకలయికగా, వింతగా, వెగటుగా ఆ వాతావరణం తైతక్క లాడుతుంటుంది. ఒకటి రెండు మేడలు. వీటినే మాడీలు అంటారు. ఆ మాడీల తాలూకు నీడ ఉండీ ఉండని చివరి అంచులలో కొట్టాలు వుంటాయి.

ఈసారి ఉరవకొండ దగ్గర ఓ పల్లెకు ట్రాన్స్‌ఫర్ చేసారు. అది బస్సు రూటుకు ఆరుమైళ్ళ దూరంలో వుంది. 'లెస్‌లగేజ్ మోర్ కంఫర్ట్‌బుల్' అన్నారు. అందుకే ఒకే ఒక సూట్‌కేసుతో బస్సుదిగినాను. "దారి ఎటు" అని కండక్టర్ని అడిగాను. దిక్కును చూపిస్తు "తోడు ఎవరూ లేరా'

' అన్నాడు. "లేదన్నట్లు తలూపాను. "భద్రం దేవుడూ" అన్నాడు కండక్టరు ఏం? అన్నాను అతని మాట అర్థం అయినా అడిగాను.

"వాతావరణం నీకు సానా కొత్తగా వున్నట్లుందే మిట్ట మధ్యాన్నం దుడ్డు, గిడ్లు వుండాయేమో' ' అన్నాడు నా సూట్‌కేసు చూస్తూ.

"ఉత్త బట్టలే అన్నాను".

"ఏం ఒకటో రెండో సిల్లర గూడా లేదా" అన్నాడు. ఆ తరువాత నా మొగం చూసి జాలికలిగిందేమో ఫర్వలేదు నరసింహారెడ్డింటికి అను భద్రంగా నిన్ను గూడా మోసుకపోతారు. అని నాతో గుసగుసగా చెప్పి అభయ ముద్ర చూపి రైట్ అని బస్సు రేకును తట్టాడు.

దొంగల్లో కూడా బానిస దొంగలుంటారు. అంటే కష్టం వీరిది, ప్రతిఫలం అంతా యజమానిదే. ఎర్రని ఎండ. ఈ బస్సు తప్పోతే వేరేది లేదు. చుట్ట పక్కల నిలబడటానికి ఒక చెట్టు కూడా లేదు. ఏం చేస్తాను? నడవటం మొదలు పెట్టాను. చెమటలు కారుతున్నాయి. వాటర్ బ్యాగ్‌లోని నీళ్ళు అయిపో చేసాను. దాదాపు సగం దూరం వచ్చాను. దారి పక్కన చిన్న గుట్టలాంటి ఎత్తు ప్రదేశం మీద చింతచెట్టుంది. ఒళ్ళు సల్లబడినట్లయింది. చెట్టు కిందికి చేరి, అంగీ విప్పి చెమట తుడుచుకున్నాను. కొంచెం సేపటికి గాలి చల్లగా తగిలింది. ప్రాణానికి మాయనిపించింది. సిగరెట్టు పీలుస్తు దొంగలొచ్చింటే బాగుండుననుకున్నాను. వాళ్ళకు నూరేళ్ళాయుష్షు ఊరివైపు నుండి ఇద్దరు మనుషులొస్తున్నారు. బనీండ్లు తొడుక్కున్నారు. మోకాళ్ళ దాకా వున్న డ్రాయర్లతో వున్నారు. నా దగ్గరకు వచ్చారు. "అగ్గిపుల్ల వుందా?" అన్నారు. సూట్‌కేసు తెరవమని ఎందుకనలేదాని అనుకుంటున్నా. కొంపతీసి సూట్‌కేసు సూట్‌కేసే నెత్తిన పెట్టుకపోరు గదా? దీనితో భయం వేసింది. ఉండేది రెండు జతలు. అసలే కొత్త పోతున్నా.

"యావూరన్నా మంది? యిక్కడెక్కడ?" ఇది వాళ్ళ ప్రశ్న. ఏవూరో ఎందుకొస్తున్నానో అంతా చెప్పినాను.

"వోర్నీ! నువ్వేనా? అయ్యవారుగారు వొత్తుండేది? మనోడివేలే." అన్నా డొకాయన.

అంటే మీరూ అయవార్లు వున్నారా? అన్నాన్నేను. వాళ్ళు పక పక నవ్వి "అంతోటు వుంటే యింకేముండె. పెపంచం పెంపంచం అంతా ఏలిందుము. నవ్వు మాకులమోడివే అందుకని. పొద్దన బాపనయ్యవారు సెప్పినాడులే ఈ పొద్దు వత్తావని. నీ పేరేం పేరు."

"ఓబులేసు"

"అదే సెప్పినాడులే ఆ సామి. నా పేరు కూడ ఓబిలేసే." పెద్ద కిరీటం పెట్టుకున్నట్లు నవ్వు వెలిగించాడు. కొంచెం సేపు అదీ యిదీ మాట్లాడాను. సిగరెట్టు అంటించాను. వాళ్లకూ యిచ్చాను.

వస్తాను అన్నాను. "మేమూ వస్తాము తట్టుకో" అన్నారు. ఎక్కడో యిక్కడ పోతున్నారు అన్నాను. "ఆ పని తరువాత సూసుకుంటాం. లే సుంకిగా! యివి (సిగరెట్లు) యిక్కడే తాగిపోదామప్పా. న్యక్క మల్లా వాల్లుగిన సూస్తే పీకులాట" అన్నాడు ఓబులేసు "ఇప్పుడెందుకు లేలే. రాత్రి సీలు (మాంసం) తిన్నంక తాగుదాం" అన్నాడు సుంకన్న సిగరెట్ల వంక ఆప్యాయంగా చూస్తూ నా దగ్గర యింకా వుండాయి తాగండన్నాను. ఏదో బాధ భావం సూదుల్లా గుండెల్లో గుచ్చుకొని కెలికి కెలికి బాధపెడుతోంది.



ఊరు ఒక ఫర్లాంగు వుందనంగా ఒక సంఘటన జరిగింది.

"పసులు కాసేవానికి ఉంగరమా? యీలే". అని పసుల పిల్లవానిది గుంజుకున్నాడు ఒకబ్బాయి.

"మా అవ్వ నిన్న సేయించిందప్పా. ఇది ల్యాకపోతే, యింటికి పోతే సంపుతారప్పా" అని ఏడుస్తున్నాడు పసులు కాసే పిల్లాడు. ఆ అబ్బాయి తన వేలికి ఉంగరం పెట్టుకుని (ఉంగరం అంటే రాల్లుంగరం కాదు బంగారు తీగ చుట్టది) పసుల పిల్లవాన్ని రొండు గుద్ది పరుగెత్తాడు. ఆ అబ్బాయిని పట్టుకొనేందుకు నేనూ పరుగెత్తబోయాను. నా అంగీ గుంజి నిలిపి; "రొడ్డి కొడుకు" అన్నాడు ఓబళేసు. "అయితే?" అన్నాను. "అది అంతే. నీకింకా కొత్తగా వున్నట్లుందే?" అని నారెట్టలు బిర్రగా పట్టుకున్నాడు. రెండు పెద్ద తడిమొదుల మధ్య ఒక నిప్పు కణికలా విలవిలాడాను.

సాయంకాలం రెడ్డిదగ్గరకు పిలుచుకొని పోయారు ఓబలేసు, సుంకన్న.

అక్కడ -

ఓ ముసల్ది దుమ్మెత్తి పోస్తూ "దూంతగల! నాశనం కాను! మా వుసురు తగలకుండ పోతుందా... పిడకోతిని. పిల్లోనికి రెండు సుట్లుంగరం సేయిస్తే అదీ నీవాతనే కొట్టుకుంటివా యింత మందిని పీడిచ్చి తినేది సాల్దా? అంటోంది.

నాలో ఏవేవో గాయాలు రేగుతున్నాయి.

"ఏయ్ తుడుగులంజా! ఏం కూస్తున్నావ్? యింకా జాస్తీగా మాట్లాడినావంటే సూడు. సచ్చిపోతావ్. దాన్ని మెడబట్టి నూకరా సెప్పుతో కొట్టి." అన్నాడు రెడ్డి. ముసిలవ్వను ఒకడు ఈడ్చిపారేసాడు. నేను లేపబోయాను. అంగీ వెనుక భాగాన్ని బిర్రుగా పట్టుకొని "బతకల్లని లేదా.' ' అన్నాడు ఓబులేసు. పసుల పిల్లవాడు "అవ్వా" అంటూ ఆమెను పట్టుకొని ఏడ్చాడు. ఆమె లేచి "నువ్వేశిల కట్టుకొని రాం రాం అని రాజ్యమేలప్పా. మేమే పోతాము" అంది. తన మనుమణ్ణి దబ దబ బాదింది. "దొంగ లంజా కొడకా! నేను వద్దురా వద్దురా అని సెప్తే హఠంతో తీసికొని పోతివి. .... పిడకోతిని కష్టపడి సేయిస్తే అప్పుడే దొంగ లంజకొడుకులికి నీగి వస్తివా?" అని దబ దబ బాదుకుంటు తలతో పాటు వొళ్ళంత తెగిన బల్లితోకలా విల విల లాడుతు వణుక్కుంటు వెళ్ళింది. చీకటి కమ్ముకోగా అస్తమిస్తున్న సాయం సంధ్య జ్ఞాపకం వచ్చింది.

"ఈ సిల్లరోల్ల కథే యింత. మల్ల ఏమన్న అంటేగిన అబ్బరోడ్లు! అంటారు. ఒక ఏటుకొడితె సచ్చేటట్లుంది. దీనికి ఎంత పొగరు సూడు? యింకా మా బట్ట కట్టి మా సొమ్ము పెట్టుకుంటుండగనే యింత కండ్లలో కారం పోసుకుంటుండారె! యింక వారే వాల్ల సొమ్ములకు ఆసిస్తాంటే చెప్పాల్నా! సిల్లర జాతి..." అని బూతులు తిట్టాడు తన రెండువందల ఎకరాల విస్తర్ణంతో.

ఆ రెడ్డికి తన రెండువందల ఎకరాల పైన ఎంత నమ్మకం వుందో ఈ 'సిల్లరజాతి' అజ్ఞానం పైన అంత నమ్మకం వుంది. ఆ రెడ్డి చుట్టుపక్కల చేండ్ల వాల్లు "నంబరాళ్ళు మా చేన్లోకి జరిపి ఉద్ధరగా, దౌర్జన్యంగా కొంత భూమి కాజేసినాడు' అని ఓర్చలేక అంటున్నారట. అది ఆయన తప్పుకాఈదు. రెండు వందల సంఖ్య పైని అభిమానం అంతే. అతను ఇచ్చిన అప్పులు కొద్ది అయినా దండి భూముల్ని లాక్కొచ్చి రెడ్డి దగ్గరకు చేర్చాయి, చేర్చుతున్నాయి. ఆ రెడ్డికి భగవంతుని మీద ఎప్పుడూ తన ఆస్తి కన్న రెట్టింపు నమ్మకం వుంది. "అంతా భగవంతుని లీల" అని ఆస్తి

ఎక్కే కొద్దీ అంటుంటాడు. బీదసాదలకు బొరుగులు పంచిపెడుతుంటాడు. ఆస్తి పెరుగుదలకు దేవుని భక్తికీ గాఢమైన సంబంధం వుంది.

కొంత సేపయిం తరువాత నా వైపు చూసాడు. "ఎవడు?" అన్నట్లు కనుబొమ్మలెగరేసాడు. "మనస్కూలుకు కొత్తయ్యవారు" అన్నాడు బాపనయ్య వారు. "ఓహో! నువ్వేనా మాదిగయ్యవారివి!' ' అన్నాడు. అంటే నాకు నామకరణం జరిగిందని అర్థం. ఈ వూరిలో నా పేరు మాదిగయ్యవారు. యింకో నడ్డయ్యవారు ఇంకో వూర్లోకుంటయ్యవారు. యింకో వూర్లో చెవులయ్యవారు. చూశారా! మీకు ఒకటే పేరు. నాకు ఎన్నో పేర్లు, ఏం భాగ్యం?

"కొంత జాగ్రత్తగా సదువు సెప్పు. ఊరకనే ఎట్టి జీతం తింటేకాదు ఎవరికన్న ఎట్లన్న జెప్పుదువు. మా పిల్లలకు యింగ్లీషు బాగ సెప్పల్ల. పారిన్ పంపిచ్చల్ల ఫారిన్" అన్నాడు. వెంటనే పక్కకు తిరిగి "ఏంరా! రాగి ఎట్లుంది." అని వేరే మనిషిని అడిగిడు. అంటే నేను వెళ్ళిపోవచ్చు నన్నమాట. ఏదో సందర్భంలో ఫారిన్ అంటే అమెరికా, బ్రిటన్ అని తెలియజెప్పాడు అంత మాత్రం నాకు తెలియ నందుకు ఆయన ఆశ్చర్యపడిడు.

2

ఆ రోజు ఓబలేసు యింట్లోనే భోజనం.

"నాకు మాంసం అలవాటు లేదే!" అన్నాను.

"ఓర్నీ! ఏమి? అవున్లే మా యట్ల మోటు మనుసులాకట్ల, మడ్డిమనుసు లాకట్ల, ఎనుగొడ్లు, దున్నపోతులు తింటారా? ఏదో సూచ్మంగా గుడ్లకొచ్చిన కోళ్ళు, ఎంటమేపిన పొట్టేండ్లు తింటారు. అయవారివి కదూ" అన్నాడు ఓబలేసు.

"నువ్వు తింటావని అల్లం గిల్లం ఏసి బాగా సేస్తి కదా పాపోడా! నీ యిష్టం లెప్పా. బలంతం ఎందుకు? అయినా యింట్లో ఏమీలేదే? సింతొక్కుంది. తట్టుకో రెడ్డోల్ల యింటికి పోయొస్తా. వాల్లెస్తారా అబ్బా? "అని ఓబలేసు పెండ్లాం పోయింది. తిరిగివచ్చి" ఈ కమ్మని సింతొక్కు మా యింట్లో ల్యాకపోయినా? యింత పాప్పెయ్యి రెడ్డెమ్మ! అంటే లేదని ముడి సింతొక్కు పెట్టింది. యీ భాగ్యం మా యింట్లో లేదా? తిరగవాత పెట్టిందే వుంది. మల్ల వద్దని వస్తే దీని కెంత పొగరు? అంటారు. ఏమే! నీ దగ్గర పదిపైసలుందా? "అంది." యాడవీ అన్నాడు ఓబలేసు. అర్ధరూపాయి యిచ్చి అంతకూ తీసుకొని రమ్మన్నాను నేను. "ఊఉ. అంతకూ యాడేస్తారు మనట్లా వాల్లకు! నీకూ పెరుగు బొట్టు కావల్లా అంటారు. పదిండ్లు తిరిగితే. పదిపైసలకు ఏస్తే కష్టమాయ' ' అంది.

తెచ్చి. చిల్లర యిచ్చింది. చిల్లర పిల్లవాండ్లకు యిచ్చాను. "అయెయ్యో అప్పుడే నేర్పద్దప్పా. ఒకసారి నేర్పితే పొద్దాకా అదేపని పడతారు." అంది.

అది పెరుగా? మజ్జిగ అన్నా అసత్యదోషం చుట్టుకుంటుంది.

ఆ వూరిలో అంగడిలో సిగరెట్లు కొనుక్కుంటే అందరు నా వైపు ఎగాదిగా చూస్తారు. మంచి నీళ్ళడిగితే దోసిలి పట్టమని ఉప్పునీళ్ళు తెచ్చిపోస్తారు. ఆ వూర్లో మంచినీళ్ళకు మైలుదూరంలో ఒక తోటబావికి పోవల్ల. ఉప్పునీళ్ళు ఊర్లోనే ఉంటాయి. ఆ నీళ్ళూ ఎంత కాలమూ వుండవు.



తెల్లవారుఝాంకాడ గోక్కో వల్ల. మా ఊరిబయట వాల్లకు వూర్లో యజమానులు దయతలచి తమ కడవర్లోపోసే వరకు వుండవలసిందే. వూరికి ఒక బోరింగ్ శాంకషన్ అయింది. కొంచెం ఉప్పులు తక్కువగావుంది' నీళ్ళు బాగ దొరికే చోటు! రెడ్డి పెరట్లోన బాయికి దగ్గరగ వుంది. అంఉదువల్ల దాన్ని ఎక్కడో వేసినారు. ఎప్పుడో గోగెక్కి పోయిందది. తన బావిలో నీళ్ళు తగ్గుతాయని అక్కడ వద్దన్నాడు రెడ్డి.

నేనూ పల్లెలో పుట్టింటే బాగుండేది. ఓ పాటి టౌన్‌లో పుట్టినందున ఈ వాతావరణంలో సర్దుకోటానికి కొంచం యిరకాటన పడినట్లు మొదట్లో అనిపించేది. ఊరిలో నాకు ఇండ్లు దొరకవు. హరిజన వాడల్లోనే వుండల్ల. అదే నాకిష్టం. వాల్లను చూచి రుచికరమైన వంట తినలేక పోయాను. నా వంటల్ని చూసి ఆ వాడ పిల్లలు నా వైపు గుటకలు మింగుతు చూసే చూపు నాకు రంపపుకోతగా వుంది. అను నిత్యము దానాలు చేయలేను. అది పరిష్కారమూ కాదు. వాల్లరకపు తెండే అలవాటయింది.

ఆదివారము అలవాటు ప్రకారం ఉదయంపూట ప్రవేటు చెప్పడానికి రెడ్డింటికి పోయాను. గొడ్ల కొట్టం పక్కన అరుగుమీద గోనెపట్ట పరుచుకొని కూర్చున్నాను. ఆ రెడ్డి మనుమలు, చిన్న కొడుకూ సిరిచాప మీద దర్జాగా కూర్చుని వున్నారు. బడి వుంటే మధ్యాహ్నం, రాత్రికి ప్రవేటు; శెలవురోజుల్లో అయితే పొద్దున, నీడ తిరిగింతరువాత, రాత్రికి ప్రవేటు.

ఎదురుగా పడసాలలో పలకల నిచ్చెనపై రెడ్డికూర్చొని వున్నాడు. కుక్క వచ్చి వాకిలి పంచమీద ఉచ్చపోసింది. "థత్ థత్, దాన్ని పట్టుకోండిలా. దానెఖ్మ దినామూ దానికి పిల్లాట అయిపోయింది.' ' అని కట్టె తీసుకొని కట్టదిగినాడు. అది పారిపోయింది. " ఈ సారిరాపో సెప్తా నీ కథ" అని కొప్పు బిర్రగా ముడేసి పడసాల కట్ట ఎక్కిడు. ఈ సారి అది మలవిసర్జన చేసింది." ఔర్రా! దానెఖ్మ దాన్ని నా చేతుల్లోనే చంపుతా." అని' దాని వెంబడే పరిగెత్తాడు. మనుషుల అజ్ఞానం మీద అంత నమ్మకమున్న వాడు కుక్క యింతగా కవ్విస్తుంటే వూరకనే వుంటాడా!

ఉల్లాసంగా పిల్లలూ పరుగెత్తారు, కేకలు వేస్తున్నారు. నాకూ ఉత్సాహం పూనుకొచ్చింది. నేనూ పరుగెత్తాను. కొందరు రాళ్ళతో విసరుతున్నారు. ఉత్సాహం ఉత్సాహం. అది ఒకవైపుకే పోకుండా నానా తిప్పలు పెడుతున్నది. ఒకటే కేకలు. ఒకటే గోల ఒకటే ఉత్సాహం వేటకు పోయినట్లుంది.

"నీథల్లి! నీయాలి నీయఖ్మ: ఈ పొద్దు లాస్టు. యింకెక్కడ పోతావమ్మా సూసుకో నాతడాఖా. "అంఊ గోచి ఎగజెక్కుకుంటూ, కొప్పు వూడి పోయినా లెక్క జేయకుండ పరుగెత్తుతున్నాడు రెడ్డి పక్క నోళ్ళ ఎగతాలి, ఆ కుక్క కవ్వింపు అతన్ని బాగా రెచ్చగొడుతున్నాయి. ఒకటే పరుగు. ఒకటేతరమడం. కడపటికి కుక్కతో పాటు అందరు అలసి పోయారు. ఎగబుస అందరికీ అలవాటు లేని జీవి కదా! కళ్లు తిరిగి బోర్లాయి. తట్టుకొని కిందపడ్డాడు రెడ్డి! కుక్క అంత దూరంలో నిలబడి దగ తగ్గించుకుంటున్నది. పౌరుషం వచ్చిందేమో కొందరు దానికోసం పరుగెత్తారు అది చిక్కితేనా! కొండ మలుపులో మాయమయింది. రెడ్డివైపు చూసాను. ఎగబోసుకుంటున్నాడు. ముక్కులెంట రక్తం వస్తున్నది. ఆ ఆకారంలో అతన్ని చూసేటప్పటికీ పునికిలో పీచు పీచుగా రేగిన ఒక భావం మట్టపరచినట్లు, వొళ్ళంతా హాయిగా చల్లని గాలి తగిలినట్లనిపించింది.

అయితే! కనీసం కుక్కతో పాటైనా ఈ రొడ్డిని సర్కస్ ఫీట్ చేయించలేకుండా వున్నామే! అనే భావం గుండెలో కెలుకుతూనే వుంది మల్లా.

మావిటాల ప్రపేటు చెప్పడానికి పోయాను. నిచ్చెన దగ్గర రెడ్డి. నిచ్చెన పలకపైన ఆయన పెండ్లాం కూర్చొని రెడ్డికొప్ప విడదీసి, చిక్కంటితో వెంట్రుకలు యిడబాప దువ్వుతూ పేలు చూస్తున్నది. ఒక్కొక్కరే కూలీలు వచ్చి కూలి వేయించుకొని పోతున్నారు. ఒక మనిషి కొలిచేస్తున్నాడు.

"ఏం రొడ్డీ యింత అన్యాయమా? ఎంత సిన్నోల్లమయినా. ఉత్త తాలు, నుసిమన్ను. మేమేమి ఉండల్ల? పోవల్లా? రొండు శేర్ల కొర్రలని యిస్తే అవి యింటికాడ కొలిస్తే శేరు ముప్పావు అయితాయి. యింక తాలూ, దస్కం తీసి దంచుకుంటే శూరూపావు అవుతాయి." అంది ఓ కూల్ది.

"తాలంట తాలు! అవి దొరికితే సాల్రా భగవంతుడా అనుకోలా. కాలం ఎట్లుందనుకున్నావ్? నీకేం బాగాతిని దిక్కుతెలీలా? నీకొక్కదానికే సప్రేటుగా పండిచ్చి యిస్తున్నామా?" అన్నది రెడ్డి భార్య.

"ఆ సప్రేటుగా గాని పండిచ్చి ఈరు నూడి మీరు. కాదు రొడ్డీ మీరు యివే తింటారా రొడ్డీ."

"అవన్నీ మాటలతో పనిలేదు. మేమిచ్చిన్వి తీసుకొని పోల్ల. అంతే. నీకిష్టముంటేరా. కష్టమయితే పో. అసలు నిన్నెవడు రామన్నాడు? రేపట్నుంటీ రావద్దు".

"జరపండి జరపండి మొగలాయి. దర్బారు. మాకింతకన్నా గతిలేదు. మీరు రావద్దన్నా రాక తప్పదు. రాకపోతే మాకు మమ్ముకు జరగదు. ఏం చేస్తాం? ఆ దేవుడు గుడ్డిలంజాకొడుకు" అని గొణుక్కుంటూ వెళ్ళింది.

నిన్న రాత్రి ఓబలేసు సారాయి బాగా తాగి ఆనందంతో, ఎగురుతు కేరింతలేస్తూ, కేకలేస్తూ తప్పెట కొట్టడం జ్ఞాపకం వచ్చింది. వాళ్ళకి సారాయి విలాస వస్తువు కాదు. కష్టాల ప్రపంచం నుండి తప్పించి, ఆనందలోకంలో తేలియాడించే బ్రహ్మానంద సాధనం. వారికష్టాలే వారిని తాగబోతుల్ని చేసాయి. అందువల్ల మరింత కష్టం పెరిగింది. ఇదొక విషవలయం. ఆడవాళ్ళ విషయం సరేసరి. తరతరాలుగా కష్టాల కోర్చుకోవడం ఉగ్గుపాలతో నేర్చారు. ఇన్నాళ్ళు వీళ్ళ గురించి ఎంత ఆలోచించినా ఏమీ చేయలేకపోయాను. అందుకే కమ్యూనిస్టు కాలేకపోయాను. బలహీనత, జంకు, వ్యక్తిగత స్వార్థం నన్ను అడ్డగించాయి. ఇన్నాళ్ళు ఈ జీవితాల తీరు నాకు నచ్చటం లేదు. నాచైతన్యం నన్ను ఊరక ఉండనీయడం లేదు. అడ్డంకుల్ని లెక్కించటం లేదు. వీళ్ళందరినీ సమీకరించుతా వీళ్ళని చైతన్యపరుస్తా. వీళ్ళు మనుషులుగా, మానవహక్కులను సంపూర్తిగా అనుభవించేటట్లు చేస్తా. అప్పుడు నేను కమ్యూనిస్టును కాగలను. నిజమైన కమ్యూనిస్టులను కాగలను.

**(విశాలాంధ్ర, 26-3-72)**



9

# తక్షణ చర్య

- డా॥ మానేపల్లి

మూడు రోజుల్నించీ ఆ వీధి కుళాయిల్లోంచి ఒక్కనీటి బొట్టురాలడం లేదు. జవాబు అనూతులవెంట, ఈ నూతులవెంట, పై వీధుల్లోవున్న కుళాయిల వెంట పడుతున్నారు. ఆ వీధి చివర రాళ్ల గుట్టలూన్నయి. ఒకటి రెండు చిన్న క్వారీల్లాంటివి కూడా వున్నాయి. ఆ క్వారీలు దాటాక మాలపేట వుంది. ఆ మాల పేటను అనుకొని ఉరంతటి మురుగును మోసుకు వెళ్లే అతి పెద్ద మురుగు నీళ్ల కాలవ వుంది. ఆ కాలవకవతల చింతతోపు దాటాక స్మశానం వుంది. ఆ నుయ్యిమురుగు కాలవకి బాగా చేరువులోవున్న మూలాన, కాలవలో మురుగు నూతిలోకి దిగుతుందనీ, ఆ నీరుతాగడం మంచిదికాదని జబ్బులొస్తాయని జనం భయపడుతుంటారు. భయపడుతున్నా తప్పని పరిస్థితుల్లో ఆ నీరే వాడుకుంటుంటారు.

కుళాయిల్లోంచి నీరు రావడం లేదని చెప్పిన పేట పేరు రాళ్లపేట, పది సంవత్సరాల క్రితం అక్కడ చాలా పెద్ద పెద్ద రాళ్లుండేవి. ఆ ప్రాంతం అంతా ఒక పెద్ద రాతి మెట్ట. దూరంగా చింత చెట్లు కింద అయిదారు వూరికొంపలుండేవి. అపూరికొంపల్లో ఉండే జనం రాళ్లు కొట్టుకు బ్రతికేవారు. ఇప్పుడక్కడ రాతిగుట్టలేదు. వెనుకబడిన కులాల కాలనీ తయారయింది. అన్ని కులాల వాళ్లు ఆ చుట్టుపక్కల స్థలాలు కొనేసి ఇళ్లు కట్టేసుకున్నారు.

రాళ్లపేట వైపు నీళ్లు తీసుకెళ్లే పైపు లైను చెడిపోయింది. నీరు తమ పేట కుళాయిలకి రావడంలేదని, పైపులైన్ వెంటనే బాగుచేయించమని జనం అర్జీలు పెట్టుకున్నారు.

'ఇయ్యాళే మనుషుల్ని పంపిస్తాను, రేపు తెల్లారేసరికి మీయాదికి నీరొస్తాది మీరెల్లిరండ'ని మంచిమాటలు చెప్పి, వాళ్లలా వెళ్లగానే విశాఖపట్నం వెళ్లిపోయాడు పాత్రుడు.

ఆవూరొక పెద్ద మేజరు పంచాయితీ వూరు బాగా పెరిగిపోయింది. ఏనాడో మునిసిపాలిటీ అయిపోవలసినది. పాత్రుడూ మరికొంతమంది రాజకీయనాయకులూ కలసి దాన్ని మునిసిపాలిటీ కానివ్వలేదు. లేకపోతే అమదాలవలసా, ఇచ్ఛాపురమూ మునిసిపాలిటీలయినపుడే వాటితోపాటు ఈవూరూ అయిపోవలసింది.

రాళ్లపేట జనం గోవుల్లాగ, గొర్రెల్లాగ రెండు మూడు వారాలు చూశారు. చివరకి పాత్రుడు ఊళ్లోలేడని తెలుసుకొని తెలివితెచ్చుకొని కలవ్వలసిన అధికారుల్ని కలిశారు. తమ కష్టాలు చెప్పుకున్నారు.

"ఒక్క రెండురోజులు ఓపిక పట్టండి. ప్రెసిడెంటుగారు విశాఖపట్నంనుంచి రాగానే మాట్లాడతాను. మాట్లాడి పైపులైను బాగు చేయిస్తాను తప్పక బాగు చేయిస్తాను" అన్నాడొక అధికారి.

మర్నాడు అనుకోకుండా ఆ వూరికి అక్షరక్రాంతి కార్యక్రమానికి జిల్లా కలెక్టరు గారొచ్చారు. పెద్ద పెద్ద షామియానాలు వేశారు. అందరూ తక్షణం అక్షరాలు నేర్చుకోవాలని పెద్దలు సుదీర్ఘమైన ఉపన్యాలిచ్చారు. ఈ గొడవంతా అయ్యాక రాళ్లపేట వాళ్లు వెళ్లి కలక్టర్ని తమగోడు చెప్పుకుని మహజరు సమర్పించారు.

మాపేటలో శానా మందికి సదవడం ఒచ్చును. గాని బాబూ నీటి సుక్కలే దొరకడం కష్టంగా వుంద. నీళ్లొచ్చేదోవ సూపెట్టండి మాప్రెబో' అన్నాడొక ముదరోడు.

ప్రెసిడెంటు పాత్రుడునీ, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్నీ పిలిచి

"వీళ్ల సంగతి చూడండి. నీళ్ల సమస్య వెంటనే పరిష్కరించండి" అని జిల్లా కలక్టరుగారు కొంత తెలుగులోనూ, కొంత ఇంగ్లీషులోనూ చెప్పారు. మాలపేట వాళ్లు - మురుగు కాలవవతలున్న వాళ్లు వాళ్లుకూడా - వచ్చి మహజరు సమర్పించారు. వాళ్ల గురించీ ఆఫీసర్లతో అలాగే చెప్పారు కలక్టరుగారు ( మాలపేటలో యువజన సంఘం కుర్రాళ్లు దాన్ని హరిజన కాలనీ అని పిలవడానికి ఒప్పుకోరు 'హరిజన' అనే పేరులోనే బోలెడు కుట్రవుందని వాళ్ల అభిప్రాయం)

మార్చినెల ప్రారంభంలో మొదలైన- ఈ నీళ్ల పోరాటం మే నెలవరకూ సాగుతూనేవుంది. మే పదమూడవతేదీన పెద్ద వూరేగింపు జరిపి తమ నీటి సమస్యని పరిష్కరించకపోతే ప్రత్యక్ష చర్యకు దిగుతామని నోటీసులిచ్చారు. వూరేగింపు వెంట పోలీసు జీపులు నడిచాయి.

అనుకోకుండా మే పదహారవ తేదీన ఆ వూరి మీదుగా ముఖ్యమంత్రి రెడ్డిగారు వెళ్లే కార్యక్రమం వచ్చింది. పైకి చెప్పే కార్యక్రమం ఏదైనా కొత్తగా ఎం.ఎల్.ఎ అయిన మిడతూరు రాజుగారితో ప్రతిపక్షం వాళ్లని తమ పక్షంలోకి కలుపుకునేందుకు మంతనాలకూ, డబ్బుసంచులివ్వడానికి వస్తున్నారని రాజకీయ వర్గాలవారికి తెలిసి పోయింది. వాటితో సామాన్య జనానికి ఏంపని? రాళ్లపేట వాళ్లు మాలపేటవాళ్లు మాట్లాడుకొని ఆ రోజు ముఖ్యమంత్రి కారు నిలుపు చెయ్యాలని నిర్ణయించుకొన్నారు. రాత్రిరాత్రి మీదే ఒక కార్యాచరణ సమితి ఏర్పడింది. ఆడవాళ్లు ఖాళీకుండల తోనూ, బిందెలతోనూ రోడ్డుకు అడ్డంగా నిలబడాలని నిర్ణయం కూడా జరిగింది.

దీన్ని అక్షరాలా అమలు చేశారు ఆరోజు మధ్యాహ్నం 2 గంటలప్రాంతంలో (పదిగంటలకే రావలసిన) ముఖ్యమంత్రి కారు మిగతా మరో పాతిక కార్లు ఆ వూరి మీదుగా వస్తూ గంటకు పైగా నిలిచి పోయాయి. ఇటువంటిది జరుగుతుందని పోలీసులు ఊహించకపోలేదు. గాని ఇంతపెద్ద ఎత్తున జరుగుతుందను కోలేదు. రాళ్లపేటలో జరుగుబాటున్న పది పన్నెండు మధ్యతరగతి కుటుంబాలు తప్ప మిగతా అందరూ రోడ్డుమీదకు వచ్చారు. మాలపేట వాళ్లు మొత్తంగా వచ్చారు. ఆడవాళ్లు వచ్చారు. ఖాళీ కుండల్లో సీవెండి సొట్టబిందెలతో ఎటు చూసినా ఆడవాళ్లే పైగా రోడ్లు పగిలే ఎండ.

ఆడవాళ్లు ముందుగా బాగా చొరవ చేసి అడ్డంగా వచ్చేసి ముఖ్యమంత్రి కారు ఆపేవారు. ఆఫీసర్లకి గాల్పుకొటినట్టయింది.

పోలీసులకు మతి పోయింది. సమయానికి ఆడ పోలీసులు కూడాలేరు. చాలా పెద్ద ఘర్షణ నినాదాలు - మగవాళ్లపై లాఠాచార్జి ఆడవాళ్లపై లాఠీచార్జి జరిపితే గొడవ ఎసెంబ్లీదాక వెళ్తుందని సర్కిల్ కొంచెం ఆలోచించాడు. పరిస్థితి తీవ్రంగానే ముఖ్యమంత్రికి వుందని అర్థమయింది. డిఎస్పిని, డిస్ట్రిక్ట్ కలక్టర్ని చెడామడా తిట్టేశాడు ముఖ్యమంత్రి. నీళ్లకోసం ప్రజలిచ్చిన మహజర్లు పిఏ చేతికిచ్చి ఆఫీసర్ల వైపు తిరిగి -



ఐవాంట్ ఇమ్మీడియెట్ యాక్షన్ తక్షణచర్య తీసుకోండి' అన్నాడు ముఖ్యమంత్రి తీవ్రసర్వంతో ప్రజల్తో మాత్రం చాలా వినయంగా మాట్లాడి వాగ్దానాలిచ్చాడు.

ఇదిలా జరుగుతుండగా తక్షణం వైర్లెస్ మెసేజ్ లు వెళ్లాయి. చుట్టుపక్కలున్న రెండు పోలీసు స్టేషన్లనుంచి రెండుజీపుల్తో పోలీసు 'ఫోర్సు' వచ్చింది. ముఖ్యమంత్రి కారుచుట్టూ పోలీసులు వలయం కట్టారు. ఎంఎల్ఏకి కారులోంచి దిగడానికి ధైర్యంచాల్లేదు. కారు అద్దాలు పగిలిపోయాయి.

మాలపేటకు చెందిన ఎనభయ్యేళ్ల వద్దుడికికుడి మోకాలు చిప్ప పగిలి పోయింది. ఒక పదేళ్ల ఆడపిల్లకు నేల మీద బలమైన గాయం తగిలి, రోడ్డంతా రక్తమండలమైపోయింది. ఇద్దరు యువకులకు చాలాబలంగా గాయాలు తగిలాయి, ఆడవాళ్లు కాళీ అవతారం ఎత్తారు. తమశక్తి అంతా చూపించారు చివరకి గాలిలో కాల్పులు జరిగాయి. కాల్పులకు మాత్రం జనాలు జడసి దోవిచ్చారు.

ముఖ్యముంత్రి అగ్గిరాముడైపోయేడు. డిఎస్పితో మళ్లీ మరోసారి 'ఐవాంట్ఇమ్మీడియట్ యాక్షన్' అని భగ్గుమన్నాడు. అప్పుడు కారు కదిలింది. ఆ వెనుక మిగతా కార్లు కదిలాయి. ఇంతలో పెద్ద పోలీస్ వాన్ వచ్చింది. నలభయిమందిని అరెస్టు చేశామని చెప్పి కొట్టుకుంటూ వాన్లోకి ఎక్కించి తీసుకుపోయేరు.

అందులో అరడజను మంది ఆడవాళ్లున్నారు. గాయాలు తగిలిన వాళ్ల అతీగతీ ఎవ్వరూ చూడలేదు. వాళ్లతాలూకు మనుషులే వాళ్లని రిక్షాల మీదా, చేతులమీదా గవర్నమెంటు ఆస్పత్రికి మోసుకు పోయేరు. అరెస్టు చేసిన వాళ్లమీద రకరకాల కేసులు పెట్టి జైళ్లకు పంపారు. నీళ్లు మాత్రం రాలేదు కాని సాయింత్రం చిన్న వానజల్లు పడింది.

మూడునెలలుగా ఎన్ని విజ్ఞప్తులిచ్చినా జరగని చర్య. ఊళ్లో ఊరేగింపు చేసి నినాదాలిచ్చినా జరగని చర్య. ముఖ్యమంత్రి కారు ఆపి ఎంఎల్ఏ కారు అద్దాలు పగలగొడితే తక్షణమే జరిగింది.

ప్రజలు తమసమస్యలు పరిష్కరించమని కోరుతూ మాపాజర్లు ఇచ్చినా ఊరేగింపులు జరిపినా చీమకుట్టినట్టయినా కదలని అధికార్లూ ప్రభుత్వ యంత్రాంగమూ, పోలీసులూ ప్రజలు పోరాటంలోకి దిగితే లాటీల్తోనూ, తుపాకుల్తోనూ తక్షణ చర్య తీసుకుంటారు.

ఒక పోలీసు ఒక స్త్రీపై ఆత్యాచారం చేస్తే, ఆ పోలీసును ఏమీ చెయ్యకుండా పక్క స్టేషనుకు బదిలీ చేసి, ఆ పోలీసు పై చర్య తీసుకోవాలనీ, అత్యాచారం జరిగిన స్త్రీకి న్యాయం చెయ్యాలనీ ఓరిన మహిళా సంఘ కార్యకర్తలపై లాఠీ చార్జీ చేసి కేసులు పెట్టారు.

విద్యార్థుల సమస్యలు సంవత్సరాల తరబడి పరిష్కరించకుండా నానబెట్టి రాస్తారోకో, జల్లాబందూ చేస్తే తక్షణ చర్య ఫైరింగ్ వరకూ వస్తుంది.

ఎన్జీవోల విషయంలో , దళితుల విషయంతో, తుఫాను బాధితుల విషయంలో ఇటువంటి తక్షనచర్యలే జరిగాయి, జరుగుతున్నాయి.

సహనం నశించిని రాళ్లపేట ప్రజల్లాంటి ప్రజలు ఈ రకం తక్షణ చర్యలకు జడపడం లేదు. ఈకరమైన తక్షణ చర్యల్తోపాలకులు తమ వురి తామే బిగించుకుంటారు.

**(రచన : జనవరి / ఫిబ్రవరి 1996., ప్రచురణ : నలుపు, జూన్ 16-30-1992)**

**10**

# తేరు

లంకిపల్లె

"ఎంత"

"పదిపైసలు"

"అంతకు తక్కువలేదా?"

"లేదు బాబూ"

"బోడి వుంగటం కుట్టినందుకే పది పైసలా?"

కొండ శిఖరంలాంటి తేరు. తేరు నీడలో చెట్టెలుకలా వీరముని. అతని ముందు మదపుటేనుగులా లావుపాటి పెద్దమనిషి.

"వుంగటం చిన్నదే కాని వుంగటం వూడిపోతే చెప్పు కాలికి రాదు"

వీరముని నోరు విప్పాడు. 'రథచక్రాలు చిన్నవే. చక్రాలు సరిగా లేని రథం కదలదు' అనాలనుకొన్నాడు. కానీ, అనలేకపోయాడు.

"ఊఁ, మాటలు మహానేర్పావులా వుంది"

గుడ్లురుమి చూసి, సిల్కు జుబ్బా జేబులోంచి పర్సు తీసాడు పెద్దమనిషి.

"మా పొట్టకూడు దొరకద్దా బాబూ?"

స్వరం తగ్గించాడు వీరముని. గొంతుక్కూచొని చేతులు రెండూ చాపాడు, వెనక్కాళ్ళమీద నిలబడి ముందరి కాళ్ళు పైకెత్తి ఆతురతగా చూస్తున్న వెనక్కాళ్ళమీద నిలబడి ముందరి కాళ్ళు పైకెత్తి ఆతురతగా చూస్తున్న చిట్టెలుకలా. పెద్దమనిషి గొంగళిపురుగును చూసినట్లు చూసి పదిపైసలు విసిరి, విసవిసా నడిచాడు. చీపురులా చెత్త వూడ్చుకొంటున్న ఖద్దరు ధోవతి కొంగును సరిచేసుకొంటూ వెళ్ళాడు. పదిపైసలు నేలబడింది. వీరముని మహాసముద్రంలా పదిపైసలు అందుకొని కళ్ళకద్దుకొన్నాడు. ఆరికేసి తట్టాడు. పదిపైసలు పసిగట్టిన వీరముని పెద్దకొడుకు బేలగా చేయి చాపాడు. కోపంగా అపరాధిని చూసినట్లు చూశాడు వీరముని. పిల్వాఅడు ముఖం మాడ్చుకొన్నాడు. వీరముని పదిపైసలు గోతం పట్టక్రిందవేసి మూశాడు.

"పాలిష్ చేస్తావా?"

"చేస్తాను బాబూ"



"బాగా చేయగలవా?"

"ఆఁ"

బూటుకాలు ముందు జరిపాడు విద్యార్థి బూట్లను కప్పేలా 'బెల్‌బాటం' పాంటు. చెవులు కన్పడకుండా కప్పిన జుట్టు. వెనుకటి రాజకుమారుని వేషం నేటి విద్యార్థి ఫ్యాషన్. బూటు మట్టి దులిపాడు వీరముని. 'పాలిష్' మూడుమార్లు రాశాడు. బ్రష్‌తో పదినిమిషాలు రుద్దాడు. చేతులు నచ్చుకపోయాయి. ఆపేశాడు.

"ఎంత?"
"ఇరవై పైసలు"
"ఇరవై?"

"అవును బాబు, మంచి పాలిష్ బాగానే చేసాను. బూటు అందం పాలిష్ బాగా వుంటేనే. పై మెరుగులు, అలంకారం బాగా వుంటేనే తేరుకు అందం"

"తీసుకో"

ఇష్టంలేని దానం బలవంతం మీద చేస్తున్నట్లు ఇరవై పైసలు గిరాటేసి గిరుక్కున తిరిగాడు హిప్పీ అబ్బాయి. ఠీవిగా నడిచాడు. దర్పం దివిటీలా ముఖంలో వెలిగింది.

వీరముని పైసలు దాచాడు. వీరముని చిన్నకొడుకు నిద్రలేస్తూనే ఏడుపు మొదలుపెట్టాడు. తల్లి పిల్లవాడిని ఒడిలో చేర్చి తట్టుతూ కూచున్నది. చీరెంత నూటిగా వుంది. తేరునీడను తరుముకొస్తున్నట్లుంది. వీరముని గోతంపట్టను నీడలోకి జరుపుకొంటూ కొత్తబేరం కోసం వేయికళ్ళతో ఎదురుచూశాడు. అతని భార్య మునెమ్మ దీనవదనంతో గూడుకట్టుకొన్న వేదనతో పిల్లవాడిని సముదాయించటంతో సతమతమవుతూ వుంది.

మిట్టమధ్యాహ్నం అయింది. నీడ మాయమయింది. ఎండ నిప్పులు చెరుగుతూ వుంది. వీరముని కళ్లు తిరిగేలా వుంటే తేరుక్రిందుగా జరిగాడు. పిల్లలు సొమ్మసిల్లి పడివున్నారు. ప్రక్కనేవున్న పన్నీరులాంటి కోనేటి నీటిలో ముఖం కడుక్కొని వచ్చి పిల్లలను లేపాడు. ముఖాలు కడిగాడు. దగ్గరలోనే వున్న దోసెలమ్మే ముసలమ్మ దగ్గరకెళ్లి మూడు దోసెలు తెచ్చాడు. దోసెలు సత్తుగిన్నెలో పిల్లల ముందు పెట్టాడు. పిల్లలు వాసన మిగలకుండా నాకేశారు గిన్నెను. మగతగా వుంటే నడుం వాల్చాడు వీరముని. మునెమ్మ గిన్నె కడిగింది. కోనేటి నీటిని ముంతతో తెచ్చి పిల్లలకు తాపించింది. మూర్ఛనుండి మేల్కొన్నట్లు కళకళలాడాయి పిల్లల ముఖాలు. రద్దీగా వున్న వీధిని వింతగా చూస్తూ నిలుచున్నారు. మునెమ్మ రథచక్రానికి ఆనుకొని కూచుంది. విషాదమూర్తిలా. వీరముని మనస్సు మగతలో గతాన్ని నెమరువేస్తూ వుంది.

★ ★ ★

పట్టణం పెద్దది. వీధులు వెడల్పాటివి. మిద్దెలు, మేడలు విశాలమైనవి. కాని నిలవటానికి నీడలేదు. నడుం వాల్చి కూచోవటానికి స్థలం లేదు. ఊరు ఎంత పెద్దదైతే తలదాచుకొనే స్థలం అంత ఇరుకై పోతుందేమో మరి! మరయంత్రాల్లా, కీలుబొమ్మల్లా కదిలే మనుషులు. దయాదాక్షిణ్యాల నీడలు ఎవరి కళ్ళలోనూ కన్పడలేదు. ఆతురత, అహం, అవహేళన నిండుగా వున్న మనుషులు. వీరముని పల్లె వదలినప్పుడు అతన్ని పట్టణం ప్రియంగా పిలిచి నట్టింట పీట వేస్తుందనుకోలేదు. కానీ, మరీ ఇంత దారుణంగా వుంటుందని వూహించలేదు.

పల్లెలు మారిపోయాయి. ఎలా? ప్రశాంతి చెదిరిపోతూవుంది. జాలిగుండె తాటిముట్టెలా గట్టిపడిపోతూ వుంది. చేయూతనిచ్చే చేయి కన్పడదు. నిలకడలేని ధరలతో మధ్యతరగతి వారికే తల తిరిగిపోతూ వుంది. ఇక సామాన్యుడి స్థితిగతి ఎంత? సమాజంలో చిట్టచివరి వ్యక్తి సంగతేమిటి?

వీరముని కుటుంబం పెళ్ళి చెప్పులు కుట్టే వృత్తిలో పేరు మోసింది. అందుకు గుర్తుగా, బిరుదులా వారి యింటిపేరు 'పెళ్ళిచెప్పుల వారు'గా స్థిరపడిపోయింది. ఒకప్పుడు ఆ ప్రాంతంలో ఏ యింట పెళ్లి జరిగినా పదిరోజులు ముందుగా పెళ్ళి చెప్పులు కుట్టటానికి తాంబూలం వచ్చేది వీరముని ఇంటికి. ముహూర్తానికి ముందుగా చెప్పులు తీసుకెళ్ళి కొత్తబట్టలు, కానుకల సామాగ్రి అందుకొనేవాడు గర్వంగా వీరముని తండ్రి. వీరమునికి చిన్నప్పటినుండి అవి బాగా గుర్తు. ఎన్ని పెళ్ళిళ్లకు వెళ్ళాడో మరి గుర్తులేదు. అదే వృత్తిలో మరింత నైపుణ్యం సంపాదించాడు వీరముని. పెళ్ళికొడుకు కిర్రుచెప్పుల మీద విఘ్నేశ్వర పూజకు వెళ్తుంటే సంబరంగా చూసేవాడు. కాని కాలం మారింది. పెళ్ళి చెప్పుల తాంబూలం ఎప్పుడో ఆగిపోయింది. కిర్రుచెప్పులు చేసే మనిషి అరుదు పల్లెలో. వీరముని బ్రతుకుతెరువు కష్టమయింది.

పల్లెలో సామాన్యుడి జీవితానికి గొడ్డలిపెట్టు ఎన్నికల తంతు. రగిలే రాజకీయాలు, కక్షలు, కార్పణ్యాలు ఎప్పుడూ ఏదో రూపంలో మండుతూనే వుంటాయి. రావణాసురుడి కాష్టంలా! మరోవైపు పిచ్చి కుక్కల్లా వేటాడే పెద్దల ప్రలోభాలు! అవి పేదల బ్రతులకు అగ్ని పరీక్షలు. అనుకోని అవాంతర పరిస్థితులలో ఎకాఎకిన పల్లెటూరు వదలవలసి వచ్చింది వీరమునికి.

రాయి రాయి కరిగే నడిరేయి వీరముని వున్న ఊరు వదలి పెట్టాడు. కారుచీకటి కాళ్ళకు బంధాలు వేస్తున్నా, పుట్టి పెరిగిన ఊరిమీద మమకారం హృదయాన్ని కలవరపెడుతున్నా, మనసు చిక్కబట్టుకొని, నిదురించే పెద్ద కొడుకును భుజాన వేసుకొని, పనిముట్ల సంచిని చేతికెత్తుకొని పయనం సాగించాడు. సత్తుగిన్నెలు, ముంతమూకుడు, పాతకోక వున్న మూటతో చంకన చిన్నకొడుకుతో వెంటనడిచింది. భార్య. పొద్దుతిరిగే వేళకు పట్టణం చేరుకున్నారు. ఎక్కడా నిలుచునే నీడ దొరకలేదు. అన్ని చెప్పుల షాపుల దగ్గర అడిగి చూశాడు పనేమైనా దొరుకుతుందేమోనని. షాపులవాళ్ళు అతని వాలకం, వెంట సంసారం చూసి నిలుచోనివ్వలేదు. సాయంత్రానికి వీరముని సంసారం కోనేటిగట్టు చేరింది. పిల్లలు వేర్లు తెగిన తోటకూర కాడల్లా వాడిపోయారు. ఆకలికి పిల్లల ముఖం చూడలేక తలదించుకొన్నాడు వీరముని. మునెమ్మ పాతచీర ముడులు విప్పి రూపాయి చేతికిచ్చింది. బాగా నలిగిపోయింది రూపాయి కాగితం. మారుతుందో మారదో అన్న సందేహంతో రైల్వేస్టేషన్‌కెళ్లాడు. రెండు అన్నం ప్యాకెట్లు తెచ్చాడు. పులుసు అన్నం పాచిపోయింది. మజ్జిగ అన్నం పిల్లలకు పెట్టి భార్యాభర్తలు కోనేటి నీటితో కడుపు నింపుకొన్నారు. మసక చీకటిపడుతూ వుంది. విసురుగాలి పెట్టే వాతలకు పిల్లలు తట్టుకోలేక దగ్గరవున్న రథం చాటుకు వెళ్ళారు. మునెమ్మ పాతకోక సర్ది రథం క్రింద పిల్లలను పడుకోబెట్టింది. వీరముని రథచక్రానికి ఆనుకొని కూచున్నాడు. ఏంచేయాలో పాలుపోలేదు. అసహాయత, అశక్తత అతన్ని చుట్టివేశాయి. దుఃఖం ముంచుకొచ్చింది. నవ్వుకొన్నాడు. నవ్వుకొంటూ నిద్రలోకి జారిపోయాడు. తెల్లవారుజామున, కోనేటి చుట్టూ వున్న సీమబాగి చెట్లమీద కాపురం చేసే పక్షుల సుప్రభాతంతో మేల్కొన్నాడు - సిల్కు జుబ్బా విసిరిన పదిపైసలు పట్టణంలో వీరముని మొదటి సంపాదన.

* * *

పిల్లవాడి కేకతో వీరముని మగతనిద్ర వదిలింది. వళ్ళు జలదరిస్తూ వుంది. మునెమ్మ ఆదుర్దాగా వెళ్ళి చిన్నకొడుకును హృదయానికి హత్తుకొంటూవుంది. రిక్షావాలా పేట్రేగిపోయి వాగుతున్నాడు.

"బుద్ధి వుండక్కర్లా? బిడ్డలకంటే సరా?...నడిబజార్లో తేరగ వచ్చిన తేరు నీడలో మీరు కళ్ళు మూసుకు పడుకోండి. వాళ్ళు నడిరోడ్డుమీద శాశ్వతంగా కళ్ళు మూసుకొంటారు..."

వీరముని బడలిక తీరలేదు. ఒళ్ళు విరుచుకొని పనిసంచి అందుకొన్నాడు. ఆ సాయంత్రానికి మరి రెండు రూపాలు ముట్టాయి. రూపాయకు బియ్యం కొన్నాడు. పావలాకు ఒక సట్టికొన్నాడు. పదిపైసలకు ఉప్పుకొన్నాడు. కోనేటికట్ట ఆసరాగా రెండు కాళ్ళు పెట్టి పొయ్యి రగిలించింది మునెమ్మ. తీరా ఎసరు పొంగేసరికి ఎండుగోగుల్లా సర్రున కాలిపోయాయి పలుచటి పేళ్ళు. వుడికీ వుడకని మెతుకుల గంజిని తలా కొంచెం త్రాగారు. నిద్ర ముంచుకొచ్చింది.

వీరమునికి రోజుకు రెండుమూడు రూపాయల ఆదాయంతో నెల గడిచింది. నెలరోజులలో ఐదు రూపాయలు మిగిల్చాడు. మునెమ్మకు పనిలేదు. నడివీధి బంధికానా! పైరు నాటగలదు, కలుపుతీయగలదు. కోత కోయగలదు. కాని పట్టణంలో ఏం పని చేయగలదు? పిల్లల్ని జాగర్తగా రోడ్డుమీదకు పరుగులు తీయకుండా చూడటమే ముఖ్యమైన పని అయింది.

* * *

"ఎంత?"

" పదిరూపాయలు"

"పదిరూపాయలా?"

ఆవులించినంతగా నోరు తెరిచాడు చెప్పుల బేరానికి వచ్చిన మనిషి. వీరముని చూపులు 'ఎక్సరే'ల్లా పెద్దమనిషిని ఫోటో తీసాయి.

"అవును బాబు! ఇలాంటి చెప్పుల ధరషాపుల్లో విచారించి చూడండి. అప్పుడు మీకే అర్థమవుతుంది" నెమ్మదిగా అన్నాడు వీరముని.

"షాపు చెప్పుల్లా వున్నాయా ఇవి?"

పెదవి విరిచాడు పెద్దమనిషి.

"చూస్తూ అడగటం ఎందుకు?..."

"మీరు చూసేవి పై మెరుగులు....నాకు చెప్పుల గట్టితనం కూడా తెలుసు"

చెప్పులు విరిచినట్టు వంచి చూపించాడు వీరముని.

"మరో బేరం చెప్పు"

"ఖరారు బేరం"

"అలాగంటే ఎలా?"

"హెచ్చుగా చెప్పి తగ్గించటం అలవాటు లేదు కానీ, బోణీ బేరం, పావలా తగ్గించుకోండి"

"ఇంతకూ గట్టిగా వుంటాయంటావా?

"నామాట నమ్మకంతో తీసుకెళ్ళండి. గట్టితనం లేకపోతే నా ముఖాన పారెయ్యండి. గట్టితనం వుంటేనే బాబు చెప్పు మన్నిక. పునాది గట్టిగా వుంటేనే గోపురం నిలకడ"

వీరముని వీలైనంత సరళంగా మాట్లాడటానికి ప్రయత్నిస్తున్నాడు. ఏ పుట్టలో ఏ పాము వుందో! ఎవరితో గట్టిగా మాట్లాడి పేచీ వస్తే వున్న నీడనుండి తరుమగొడ్తారో అనే భయం, ఒకవైపు

అతన్ని పీడిస్తూనే వుంది. కానీ, మూసపోయిన మోసంలాంటి సమాజం మీద కోపం అతని అదుపు తప్పుతూ వుంది. అతని అసహనం అప్పుడప్పుడూ నిప్పు మిణుగురుల్లా బయటపడుతూనే వుంది. మాటల్లో, చూపుల్లో పేదవాడి కోపం పెదవికి చేటు. 'తన కోపమే తన శతృవు'. తన శత్రువును అతి నేర్పుతో, సహనంతో జయిస్తూనే వున్నాడు వీరముని. కాని శతృశేషం మిగిలిపోతూనే వుంది.

☆ ☆ ☆

ముసురువాన పట్టింది. జన సామాన్య మామూలు జీవితం స్థంభించిపోయింది. జివ్వున వీచేగాలి నరాలను కదలకుండా బిగించేస్తూ వుంది. జడివాన తుంపర కండరాలను ముద్దగా చుట్టేస్తూ వుంది. ఆరోజు వీరమునికి బేరం బొత్తిగా జరగలేదు. కోనేటి గట్టున ఎంత ప్రయత్నించినా పొయ్యి రగలలేదు. పిల్లలు గువ్వల్లా ముడుచుక్కుపోయారు. కడుపులో ఆకలిమంట నాలుకలు కోస్తూ వుంది. పొద్దు ఎంతయిందో తెలియని వేళ. వీరముని జడివానలో గోతం సంచి గూడగా చేసి తలమీద వేసుకొని వెళ్ళి నాలుగు సంగటి ముద్దలు తెచ్చాడు. పులుసు మంచినీళ్ళలా వుంది. సంగటిముద్దలో వడ్లగింజలు వుడకలేదు. పిల్లలు రెండు ముద్దలు ఆవురావురని మింగేశారు. చలి ఆకలి పెంచుతుందేమో మరీ! మిగిలిన రెండు ముద్దలు వీరముని, భార్య తిన్నారు. వాన నీటిలో చేతులు కడుక్కున్నారు. చుట్టూ నీరేకాని త్రాగటానికి నీరులేదు. కోనేటి నీరు మురికయిపోయింది. కొళాయి నీరు కైలాసతీర్థం. అది దొరకదు వీరమునిలాంటివారికి.

జడివాన విజృంభించింది. తుఫాను చెలరేగింది. రథచక్రాలు వీధి వెల్లువను అడ్డుకొంటున్నాయి. చెప్పులు తడవకుండా మిగిలే 'జాగాను ఎప్పటికప్పుడు సర్దుబాటు చేస్తున్నాడు వీరముని, యాంత్రికంగా నలుగురు నాలుగు చక్రాలకు ఆనుకొని కూచున్నారు. చీకటితెర మరింత దట్టంగా పడింది. గుడిగోపురం మీద విద్యుద్దీపాలు గుడ్డిగా వెలుగుతున్నాయి, ఆరిపోతున్నాయి. కారుచీకటిలో మిణకరపురుగు వెలుగును తలపింపచేస్తున్నాయి. వానహోరు వింత సంగీతాన్ని ఆలపిస్తూ వుంది. ఎంత వానపడ్డా కోనేరు పొంగలేదు. పారలేదు. తుఫాను ఉధృతంగా వుంది. విసురుగాలి వూపుకు కొండంత రథం కదులుతున్నట్లుంది. రథం కదిలితే?! వీరముని గుండె గుబగుబలాడింది.

నాట్యభంగిమలో నడుస్తూ వుంది ఓ కాలేజీ అమ్మాయి, రథానికి ఎదురుగా కోనేటికట్టకు ఆవలివైపు వున్న పెద్ద హోటలువైపు. కదిలే పూలరెమ్మ చుట్టూ 'ఝుమ్మ'ని తిరిగే తేనెటీగల్లా, ఏవేవో గుసగుసలతో కొందరు అబ్బాయిలు వెంట నడుస్తున్నారు. ఆ అమ్మాయికి చిన్నప్పుడు చెప్పులుకుట్టి కాళ్ళకు తొడిగాడు వీరముని. ఆమె చిన్నపాదాలు ముద్దు పెట్టుకోవాలనిపించేంత అందంగా ఉండేవి. ఆమె ఎవరో కాదు వీరముని పుట్టిపెరిగిన ఊరి పినపెద్ద కూతురు. పేరుకు ఊరిపెద్ద. బుద్ధి పేద యింటి గడ్డిన మూచేసే రకం. పెద్దమనిషి కూలికెళ్ళిన తన భార్య మానాభిమానాన్ని దోచుకోబోతుంటే తాను అడ్డుపడ్డాడు. అదే తను చేసిన పెద్ద తప్పు! భార్య అందంగా వుండటం మహాశాపం! అర్థరాత్రివేళ ఇల్లు వదలి రావటానికి కూడా అదే ముఖ్య కారణం. అక్కడ తండ్రి పెద్దరికం పేరుతో పేదల మానాభిమానాలతో దోబూచులాడి దోచుకుంటున్నాడు. ఇక్కడ కూతురు బలిసిన నాగరికత పేరుతో ప్రేమను విందులు చేస్తూ వుంది, జీవితం విలాసాలకే అంకితంగా భావించే షోకుల అబ్బాయిలకు! వీరముని మనసు వికటంగా నవ్వి, నిట్టూర్చింది.

★ ★ ★



కోనేటికట్ట కోలాహలంగా వుంది. రంగుల కాగితాల తోరణాలు, విద్యుద్దీపాలు, ఒకమూలగా ఉపన్యాసవేదిక. 'మైక్' రొద అంతా హడావిడిగా వుంది. ఎవరెవరికో మరి జేజేలు! చెవులకు బ్రద్దలు కొట్టున్నాయి. వీరముని పని ఆరోజుకు ఆపి గోతం సంచి చుట్టిపెట్టాడు. పిల్లలకు కుతూహలంగా వుంది సందడి. మునెమ్మ రెండు చేతులతో ఇద్దరు పిల్లలను పట్టుకొని నిలుచున్నది.

అది రాజకీయ బహిరంగ సభ. ఎన్నికల ఉపన్యాసం. రవ్వల తూటాల్లా విసుర్లు, ఛలోక్తులు, బూతులు! మరో నిషామనిషి ఉపన్యాసం, క్షుద్రదేవత పూనకంలాంటి ఉధృతం! నాలుకలు చాచే జ్వాలల్లాంటి ఎదురుప్రశ్నలు. వీరమునికి అలాంటి ఉపన్యాసాలు పరిచయమే. వాటిని నమ్మటం కాగితం పడవచేసి దానిమీద కాలువ దాటవచ్చునని నమ్మటం కంటే భిన్నంగా వుండదు. అంతలో ఈలలు, లాఠీచార్జీలు, అరుపులు, ఆర్తనాదాలు, పరుగులూ - అంతా పెద్ద గందరగోళం. గందరగోళం తగ్గి మామూలు పరిస్థితి నెలకొనేసరికి రాత్రి పదకొండు దాటింది. నిద్ర కౌగిలిలో ఒరిగిన పిల్లలను పడుకోబెట్టి పొయ్యి రగిలించింది మునెమ్మ. అలాగే ఎన్నో రోజులు జరిగాయి. ఎన్నికల రాజకీయ సభలు, ఉపన్యాసాలు మరెన్నో రోజులు. నడిజాము దాటాకగాని పొయ్యి రగిలించటానికి వీలుపడలేదు మునెమ్మకు. ఏది ఏమైనా రాజకీయ చైతన్యం వుంది. ప్రజలలో స్వాతంత్ర్యం వుంది. అందుకు నిదర్శనం ఈ సభలు. రభస, గందరగోళం!

☆ ☆ ☆

వేసవి నిప్పులు చెరుగుతూ వుంది. వీరముని వంటినుండి చెమట ధారలు కట్టి కారుతూ వుంది. చెప్పుల కుట్లు చకచక పడుతున్నాయి. ఎండవడకు తట్టుకోలేక పిల్లలు మరింతగా రథం క్రిందకు చేరారు. అర్ధనగ్నంగా ఈతాకు చాపమీద పడి నిద్రపోయారు. రథచక్రాలు వడగాలిని, రేగే ధూళిని ఆపుతున్నాయి. రథం వేడిని వెళ్ళగ్రక్కుతూ వుంది. మునెమ్మ ముసుగు ముఖానికి అడ్డుపెట్టుకొని చెప్పుల ముందు కూచొని వుంది. నెలరోజులుగా ఆమె చెప్పుల బేరం చెప్తూ వుంది. బేరం బాగానే సాగుతూ వుంది. రోజుకు రెండు మూడు జతల చెప్పులు అమ్ముడు పోతున్నాయి.

రథానికి దగ్గరలో రంగసామి కొత్తగా పెట్టిన బంకును ప్రారంభం చేశాడు. పూలు, ఫలహారం పంచుతూ వీరముని దగ్గరకు వచ్చాడు. వీరమునిని చూసి మందహాసం చేశాడు. చేస్తున్న పని ఆపి వీరముని బెరుగ్గా చూశాడు. ఫలహారం అందుకొన్నాడు. వీరముని పిల్లలు కూడా నవ్వుతూ రంగస్వామిని చూశారు. కొబ్బరి ముక్కలు రుచి చూచారు. కోనేటి గట్టుకు పరుగులు తీసారు. ఎన్నో రోజుల పట్టణ జీవితంలో వారిని ఆప్యాయంగా చూసి, పలుకరించిన మొదటివ్యక్తి రంగసామి. వీరమునికి పెనుఎడారిలో 'ఒయాసిస్సు'లా కనిపించాడు రంగసామి.

☆ ☆ ☆

పన్నీరులాంటి కోనేటి నీరు పచ్చగా గుడ్డుపట్టిపోయింది. నీటిలో కాలు పెట్టాలంటేనే భయంగా వుంది. కుళ్ళువాసన గుప్పుమంటూ వుంది. ఇదివరకల్లా తెల్లవారేసరికి రోజూ వీరముని పిల్లలు స్నానం చేసేవారు కోనేటిలో. చీకటి పడ్డాక మునెమ్మ ఒళ్ళు కడుక్కొనేది. కాని ఇప్పుడు నీటికి ఇబ్బంది వచ్చింది. పట్టణానికి దూరంగా పంపుసెట్టు బావి వెదుక్కున్నాడు వీరముని. తెల్లవారకముందే పిల్లలను నిద్రలేపటం కష్టంగానే వుంది. కాని తప్పనిసరి. పిల్లలు తను స్నానంచేసి కడివెడు నీటితో వచ్చేసరికి భార్య రథం చుట్టూ వూడ్చి శుభ్రంచేసి పెట్టేది.

వీరమునికి పట్టణంలో కూడా తను భార్యాబిడ్డలతో బ్రతకవచ్చుననే నమ్మకం కలిగింది. అది శూన్య జీవితంలో ఒక వెలుగురేఖ. సమాజం మీద తనలో పేరుకుపోయిన కసి కరిగింది. కాని పూర్తిగా పోలేదు.

ఓనాటి రేయి ఊరు సుఖనిద్రలో వుంది. విసురుగాలి విర్రవీగుతూ వుంది. గుడ్డి కిరసనుబుడ్డి గుటుక్కుమనేలా వుంది. మిట్టమధ్యాహ్నం నుండి చీకటిపడేవరకు క్యూలో నిలబడి ఖాళీ కిరసను సీసాతో తిరిగి వచ్చాడు పెద్దకొడుకు. వీరముని చేతిలోని ఆరెపఱ్ఱు సఱ్ఱున దిగుతూ వుంది. బుడ్డి ఆరిపోక ముందే చెప్పులు పూర్తిచేయాలని చకచక కుట్టున్నాడు. విజృంభించిన గాలికి దీపం రెపరెపలాడుతూ వుంటే రథచక్రం దాపుకు జరిపి పనిసంచి ఆపుగా పెట్టాడు. ఎంత ప్రయత్నం చేసినా దీపం ఆరిపోక తప్పలేదు. రథచక్రాల మధ్య చీకటి చోటు చేసుకున్నది. వీధి కూడలిలో ట్యూబులైటు ఆరిపోతూ వెలుగుతూ కనిపించింది. వీరముని పనిసంచితో ట్యూబులైటు దగ్గర చేరాడు. చీకటి వెలుగుల మధ్య గంటసేపు నిర్విరామంగా పనిచేశాడు. చెప్పులజోడు సరిగా అమరింది. పని పూర్తి చేశానన్న సంతోషంతో, ఉత్సాహంతో రథచక్రాల మధ్య చేరాడు. అంతా చీకటి. చీకటిని చీల్చుకొంటూ వెలుతురు తళుక్కుమని మాయమయ్యింది. మెరుపులాంటి వెలుతురులో భార్య ముఖం చూశాడు. నవ్వుతున్న భార్య పెదాలను ముద్దుపెట్టుకున్నాడు.

☆ ☆ ☆

ఉన్నట్లుండి వీరముని పెద్ద పిల్లబాడికి జబ్బు చేసింది. మూడురోజులుగా వాడిని హాస్పిటల్‌కి తీసికెళ్తూ వుంది మునెమ్మ. రోజు రోజుకూ జ్వరం హెచ్చుతూ వుందేకాని తగ్గలేదు. ఆ ఆలోచనలతో చేయి తడబడుతూ వుంది వీరమునికి. పనిలో శుద్ధం రావటంలేదు. రథచక్రాల నీడ తూర్పుకు వాటాలింది. ఆస్పత్రి నుండి ఎప్పుడో రావలసిన తల్లి, బిడ్డ రాలేదు. వీరముని ఆదుర్దా ఎక్కువయింది. మనసు వికలమయింది. పని ఆగిపోయింది. అనుకోకుండానే ఆరె క్రిందపడింది, చేతిలోనుండి. ఎదురుగా దీనవదనంతో భార్య! గుండె కాలిపోతున్నట్లుంది వీరమునికి. 'ఏమయింది?' అని అడగాలనుకొన్నాడు - కాని మాట బయటకు రాలేదు.

"ఆస్పత్రిలో చేర్చారు"

అన్నది దుఃఖాన్ని ఆపుకొంటూ మునెమ్మ. ఆస్పత్రి వివరాలడిగి తెలుసుకొన్నాడు. పనిసంచి సర్ది, పైసాలు లెక్కపెట్టి, సత్తుగ్లాసుతో బయలుదేరాడు. దారిలో రొట్టె కొన్నాడు. గ్లాసునిండా పాలు కొన్నాడు. పాలు తొణకకుండా నెమ్మదిగా హాస్పిటల్‌వైపు నడిచాడు. హాస్పిటలు గేటు దగ్గర జవాను కాలు అడ్డుపెట్టాడు. డాబుసరి మనుషులు వస్తున్నారు, పోతున్నారు. దీనంగా చూశాడు వీరముని. జవాను ధీమాగా బిగుసుకపోయాడు. వీరముని ఒడివిప్పాడు. మిగిలిన పైసలు చేయిదాటాయి. జవాను కాలు అడ్డుతొలగింది.

పెద్ద డాక్టరు, డాక్టర్లు కాబోయే పిల్ల డాక్టర్లు పిల్లవాడి దగ్గరకొచ్చారు. కొండంత ఆశతో ఎదురుచూశాడు వీరముని. పెద్దడాక్టరు పిల్లవాడి నాడి చూశాడు. కనురెప్పలు తెరచి చూశాడు. ఏదో చెప్పాడు. ఒక పిల్లడాక్టరు కేసు షీటు మీద ఏదో వ్రాశాడు. మరో రోగి దగ్గరికెళ్ళారు, డాక్టర్లు.వారిని వెంబడించాడు చేతులు కట్టుకొన్న వీరముని, అయోమయంగా, దీనంగా. పెద్ద డాక్టరు వీరమునివైపు కోపంగా చూశాడు. వీరముని తలదించుకొన్నాడు. డాక్టరు పాదాలు కన్పించాయి. నిరాశగా పిల్లవాడి దగ్గరకెళ్ళి మంచంమీద తల ఆన్చి కూచున్నాడు. పిల్లవాడిలో చలనంలేదు. స్మారకంలేదు. నర్సు నోరు తెరిపించి గ్రుక్కెడు మందు పోసింది. వీరముని పాలు



త్రాగించటానికి ప్రయత్నించాడు. పాలు గొంతులోకి పోలేదు. వీరమునిలో దుఃఖం వుప్పెనలా పెల్లుబుకింది. నిరాశా రూపంలా మంచం పక్కన కూచున్నాడు.

పొద్దుపోతూ వుంది. భార్య రెండోపిల్లవాడితో వచ్చింది. తిండి మాట గుర్తుచేసింది. యాంత్రికంగా రథం దగ్గర చేరాడు వీరముని. రెండు కుక్కలు వంటచేసిన మట్టిపాత్రతో ఆడుకొంటున్నాయి. కళ్ళకు వొత్తులు వేసుకొని రాత్రి అంతా చెప్పులు కుట్టాడు వీరముని. తంటాలు పడి ఎలాగో డాక్టరు ఇల్లు కనిపెట్టాడు. తెల్లవారేసరికి ఎదురుపడ్డ వీరముని ముఖంచూసి ముఖం చిట్లించాడు డాక్టరు. వీరముని చెప్పులజోడు డాక్టరు పాదాల దగ్గరపెట్టి చేతులు జోడించాడు. జోడు డాక్టరు పాదాలకు అమరినట్లు సరిపోయింది. రెండోరోజుకు పిల్లవాడి జబ్బు నయమయింది. హాస్పిటల్ నుండి వచ్చాడు. నవ్వుముఖంతో పిల్లవాడు.

★ ★ ★

అసుర సంధ్య.

గుడిగోపురం మీద పావురాలు గూళ్ళు వెదుక్కుంటూ రెపరెపలాడుతున్నాయి. గోపురం మీద ఒంటిదీపం గుడ్డిగా వెలుగుతూ వుంది. శ్రమజీవిలో ఆశాజ్యోతిలా బైరాగి గొంతెత్తి పాడుతూ గుడివైపు నడుస్తున్నాడు.

"ధర్మార్థకామ మోక్షాలు జీవా!

అవి జీవిత రథానికి నాలుగు చక్రాలు జీవా!"

వీరముని బైరాగిని చూశాడు. ఆపాదమస్తకం కాషాయ వస్త్రం. చిన్నప్పుడు తనూ యిలాగే గట్టిగా చదివేవాడు పద్యాలు. వాటి అర్థం ఏమిటో అంతు తెలియదు. గోతంపట్ట దులిపాడు. వారంరోజులుగా వీరముని మదిలో, ఏదో పురుగు మెదులుతున్నట్లే ఆలోచన మెదులుతూనే వుంది. రంగసామి బంకుముందుగా వెళ్ళి నిలబడి మెల్లగా నవ్వాడు.

"ఏం, వీరముని చిన్నయానందంలో వున్నావు"

పలుకరించాడు రంగసామి. ఎలా చెప్పాలో తెలియలేదు. మదిలో మెదిలే పురుగును ఎలా బయటపెట్టాలో తోచలేదు. నవ్వుతో పలుకరించాడు రంగసామి.

"కొంత డబ్బు వుంది...."

"పెట్టే చోటే లేదంటావు? ఇలా తీసుకరా..."

కొంత సందేహించాడు వీరముని. సందిగ్ధావస్థలో పడ్డాడు. సలహా ఏదైనా చెప్తాడనుకొంటే డబ్బే ఇమ్మంటున్నాడు రంగసామి! సందేహం ముఖంలో ప్రస్ఫుటం కాకముందే యాంత్రికంగా చిల్లరమూట రంగసామి ముందుంచాడు. రంగసామి లెక్కపెట్టాడు. అరవై రూపాయలు, ముప్పై పైసలు మొత్తం.

"సరే ఇక వెళ్ళు, నీ డబ్బు భద్రంగా వుంటుంది"

వీరమునికి నమ్మకం కుదరక తప్పింది కాదు. తరువాత రోజుకు రెండురూపాయల చొప్పున రంగసామి చేతికిచ్చాడు.

★ ★ ★

పన్నీటి కోనేరు ఎండిపోయింది. ఎంతమంది కడిగిన మురికోమరి పేరుకపోయింది. కోనేటిలో మట్టి బీటలు పారింది. పర్యవసాన దశలో దుర్మార్గుని ఎదను చీల్చిన పాపచింతనలా వుంది. వీరముని పిల్లలు కోనేటిలోకి దిగారు. బురదమట్టితో బొమ్మలు చేశారు. బొమ్మలు నిలవలేదు. అవయవాలు సవ్యంగా అతకని బొమ్మలు చేసి చేసి విసిగిపోయారు. చేతులు, వళ్ళంతా బురద మిగిలింది. బురద కడిగి బట్టలు మార్చింది మునెమ్మ.

పొద్దు గ్రుంకినా వేసవి వేడి చల్లారలేదు. గాలి సమ్మెచేసింది. గడియకొకమారు కడుపున పోసిన నీరు పొంగులా బయటపడుతూ వుంది. వీరముని కొత్త నమూనా చెప్పులు కుడ్తున్నాడు.

కోనేటి కట్ట జనంతో కిటకిటలాడుతూ వుంది. పట్టు పీతాంబరాలు, పూలమాలల మధ్య వుత్సవ విగ్రహంలా స్వామీజీ గీతోపన్యాసం కొండవాగులా సాగుతూ వుంది.

"చాతుర్వణి గుణకర్మ విభాగే..."

స్వామీజీ కంఠస్వరానికి మైకు మరింత గంభీరతను చేకూర్చింది. జనసందోహం ఎక్కువయింది. మునెమ్మ పొయ్యి రగిలించడానికి సందు పడలేదు. వీరముని దూరంగా పిల్లలతో నిలుచున్నాడు. పిల్లలు స్వామీజీని మింగేసేలా, వింత జంతువును చూసినట్లు చూస్తున్నారు. స్వామీజీ వుపన్యాస ం అంతిమస్థాయిలో అఖండంగా సాగుతూ వుంది.

"మన సమాజం రథం లాంటిది. నాలుగు రథచక్రాలమీద సురక్షితంగా వుంది. ఆ చక్రాలు ఏమిటి? నాలుగు వర్ణాలు. వర్ణాలంటే రంగులుకావు. వృత్తిగుణం ఆధారంగా నాలుగు విభాగాలుగా విభజింపబడిన కులాలు. అంటే ఏమిటి? ఇప్పుడున్న కులాలకు అర్థాలు వేరు. నేను మనవి చేస్తున్నవి రాజకీయ కులాలు కావు. రాజకీయ కులాలు వేరు. రాజకీయాలలో కులాలు పుట్టుతున్నాయి. పెరుగుతున్నాయి. కులాల మీదనే రాజకీయం నడుస్తూ వుంది..."

కరతాళధ్వనుల మధ్య స్వామీజీ వుపన్యాసం ఎడారిలో సాగిన నీటివాగులా ఆగిపోయింది. వీరముని నవ్వుకొన్నాడు తనలో. కొండవాగుతో కోనేరు పొంగేనా? కోనేరు పాడేనా?

* * *

"వీరముని!"

రంగసామి పిలుపు విని, పని ఆపి వెళ్ళాడు వీరముని.

"బాబూ!"

"చాపక్రిందకు నీరొస్తుంటే నిమ్మకు నీరెత్తినట్లున్నావు!"

"ఏమిటి బాబూ!"

"పాతికేళ్ళగా మూలబడ్డ రథం కదలబోతూ వుంది.

వీరముని గుండె గుభేలుమన్నది.

"గుండె జారిపోనీకు. ఇంకొక నెలకు గాని రథం కదలదు. ఇంత లోపల గూడు చక్కబెట్టుకో...ఎన్నిరోజులు రథచక్రాల మధ్య సంసారం?"

వీరముని అయోమయంలో అలాగే నిలబడిపోయాడు.



"ఆఁ. ఇంతలోపల మంచి చెప్పులజత ఒకటి కుట్టిపెట్టు"

వీరముని అయోమయం నుండి తేరుకొన్నాడు. మెల్లగా రథంవైపు నడిచాడు. ఏంచేయటానికి తోచలేదు. ఎన్నిరోజులు రథచక్రాల మధ్య సంసారం? పదే పదే అదే మాట మనసులో ప్రతిధ్వనిస్తూ వుంది.

దాదాపు మూడు వారాలు పట్టణ పొలిమేరలన్నీ గాలించాడు. పూరిగుడిసెకు సెంటు స్థలం దొరుకుతుందేమోనని. నిరాశ పేరుకొన్నదేకాని పూరి గుడిసెకు నేల అందుబాటులో లేదు. తిరిగిన చోట్లన్నీ ప్రదక్షిణ ప్రారంభించాడు. అదే పగటిపనిగా. రాత్రిళ్ళు చెప్పులపని మందకొడిగా సాగింది. నిస్పృహ దయ్యంలా ఆవులిస్తూ వుంది.

ఉదయం పదిగంటల సమయంలో ఊరికి దక్షిణంగా మైలుదూరంలో మడిచేతులు కట్టుకొని ఒళ్ళు కప్పుకొన్న కొంతమంది పేదలు, ఆఫీసర్లు కన్పడ్డారు. జిల్లా కలెక్టరు నివేశస్థలాల పంపిణీకి తనిఖీ చేస్తున్నాడని తెలిసి, చేతులు జోడించి తన పరిస్థితి విన్నవించుకొన్నారు వీరముని. వారం తిరక్కముందే ఆరు సెంట్లనేల పట్టాకాగితం అందుకొన్నాడు. వీరముని పెన్నిధి దొరికినట్లు ఆనందించాడు. నాలుగు రోజులకు వీరముని తాటాకు గుడిసె కుక్కగొడుగులా లేచింది. రథచక్రాల మధ్య నుండి సంసారం తరలించాడు మూగబాధతో. ఆ పూరిగుడిసె విశాల పర్ణశాలలా, కైలాసగిరిలా తోచింది వీరమునికి!

కొత్త చెప్పుల జత చేతి సంచిలో పెట్టుకొని పెద్దకొడుకుతో బయలుదేరాడు వీరముని పట్టణంవైపు. నీరెండ నులివెచ్చగా వుంది. పిల్లవాడిని బడిలో వదలిపెట్టి కోనేటి కట్టవైపు నడిచాడు. అప్పటికే అక్కడ చాలా మంది జనం చేరారు. తేరు అలంకరణ కనులపండువుగా వుంది. రథానికి పెద్ద పెద్ద మోకులు కట్టి లాగటానికి ప్రయత్నాలు చేస్తున్నారు. కాని కొండంత తేరు కదలలేదు.

వీరముని కొత్త చెప్పుల జోడు రంగసామి ముందుంచాడు. రంగసామి పాదాలకు తొడిగి చూశాడు. చెప్పులు సరిగా సరిపోయాయి, కాళ్ళకు.

"ఏమిటి నాకోసం కుట్టావా జోడు!"

రంగసామి మందహాసంతో అడిగాడు. యాంత్రికంగా తలవూపాడు వీరముని. అతని చూపు అంతా తేరు మీదనే వుంది. జేబునుండి ఏవో కాగితాలు బయటికి తీశాడు రంగసామి.

"వీరమునీ: నాదగ్గర కూడబెట్టిన డబ్బుతో నా బంకు పక్కనే నీకు చెప్పుల బంకు కుదిర్చే ఏర్పాటు చేశాను. నీ వ్యాపారం బాగా సాగాలంటే మరికొంత డబ్బు కావాలి. ఇది బ్యాంకు సహాయానికి దరఖాస్తు. ఇక్కడ సంతకం పెట్టు."

వీరముని సంతకం చేశాడు, అక్షరాలను గుర్తు చేసికొంటూ. వీరమునిలో ఏదో వ్యక్తం కాని చేతనా నాడి కదలుతూ వుంది. ఉత్సాహంగా చెప్పుకపోతున్నాడు రంగసామి.

"ఏమిటలా చూస్తున్నావు? ఈ చెప్పుల జత నాకోసం కాదు. బ్యాంకు ఏజంటుకు చూపటానికి, నీ పనితనానికి నిదర్శనం ఈ చెప్పులు. అంతో ఇంతో ఖర్చయినా, బ్యాంకు నుండి ఆర్థిక సహాయం తప్పక అందుతుంది."

వీరముని మనసు చేతనా భావనతో ఊయల వూగుతూ వుంది. అతని హృదయం అంతా తేరు రూపం ఆవరించుకొన్నది. గూడులేని గువ్వలకు గుడి గోపురంలా నీడ చూపిన రథం!

రంగసామి వుద్వేగంలో తూచి మాట్లాడుతున్నాడు.

“చూడు వీరమునీ! అది కొయ్య రథం! మనిషి జీవిత రథం అంత కంటే గొప్పది. గుండెబలం, బుద్ధిబలం, పనితనం, పరిశ్రమ ఈ నాలుగు చక్రాల మీద జీవిత రథం నడవాలి. మట్టిలో పుట్టి మట్టిలో పెరిగినా ఈ నాలుగు చక్రాల్ని సమకూర్చుకో గలిగితే మనిషి మాణిక్యమవుతాడు. మణి, మాణిక్యాల మధ్య పుట్టి పెరిగినా, ఇవి లేని మనిషి మసిబొగ్గు....”

వీరమునికి రంగసామి మాటలు సరిగా అర్థం కాలేదు. ఆడచ, మగ పిల్లలు. పెద్దలు, సిల్కుజుబ్బాలు, గళ్ళ లుంగీలు - అందరూ రథాన్ని లాగుతున్నారు. వీరముని చేయి కలిపాడు. రథచక్రాలు మెల్లగా కదిలాయి. తేరు ముందుకు సాగింది.

(ఆంధ్ర సచిత్ర వార పత్రిక, 9-3-79; 16-3-79)



11

# తెల్లవారితే

## కాలువ మల్లయ్య

పీక్కుపోయిన దవడలు, లోతుకుపోయిన కళ్ళు. చిప్పిరెంటికలు మాసికలు పడ్డచీర. చీపురుపుల్లలా ఉన్న కాళ్ళతో శరీరాన్నీడ్చుకుంటూ ఊరిదిక్కు నడుస్తుంది లచ్చమ్మ..... గ్రీష్మంలో ఆకులు రాల్చిన మొండిమానులా, శీరరంపై తాళితప్ప మరే ఆభరణమూలేదు నెత్తిపైనున్న తుమ్మపొరక ముళ్ళు గుచ్చుతుంటే ఆయాస పడుతూ నడుస్తుంది ఊరిముఖం పట్టిన పశువల బట్టలచప్పుడు లయబద్ధంగా వినవస్తుంది ఒక చేత్తో తల పైనున్న పొరకను పట్టుముక్కు కడ్డంగా కొంగు పెట్టుకుంది..... దుమ్ముతో స్నానం చేసినట్టు శరీరమంతా ధూళి పడుతూనేవుంది. చెప్పులులేని కాళ్ళు దుమ్ముతో తెల్లగా అగుపడుతున్నాయి. ఆమె ముఖంలో బాధ..... ఆవేదన....... అలసట...... అలసటగా ఇల్లు చేరుకొని తలపైనున్న తుమ్మపొరక గుడిసె వెనకభాగంలో వేసింది. అక్కడే కుండల్లో వున్న నీళ్ళతో కాళ్ళ కడుక్కొని గుడిసె తలుపు తీసుకొని ఇంట్లోకెళ్ళింది కాళ్ళు విపరీతంగా గుంజుతుంటే నేలపై కూర్చుండిపోయింది. చేతుల్తో కాళ్ళ నొత్తుకుంది అవ్వవ్వవ్వ అంటూ కాళ్ళు చాపింది. అలాగే నేలపై కొరిగింది. ఎర్రమన్నుతో అలుకబడ్డ నేలమన్ను చీరకంటుతుండగా ఆయాసంగా అటు ఇటూ దొర్లింది. కొద్దిసేపట్లో నిద్రలోకి జారుకుంది. వయసును మించిన వృద్ధాప్యాన్ని మోసుకుంటూ కాళ్ళీడ్చుకుంటూ ఇంటికొచ్చిన ఎల్లయ్య నేలపై పడుకోనున్న లచ్చమ్మను చూసి ఏందే గీ సందలు పడంగ పంటన్నవు..... లే .... లే ..... లేసి పొయ్యంటు పెట్టి జెల్దిసి బువ్వండు..... బాగా కలయితంది లే లే'' అంటూ గుడిసెలో నున్న నులకమంచం వాల్చుకొని పడుకున్నాడు. భర్త మాటలకు ఉలిక్కిపడి లేచింది. లచ్చమ్మ...... లేచి పని చేత్త మంటే చేతకావడంలేదు. పొద్దంతా వెనుక కెనుకకు నడుస్తూ మోకాళ్ళబంటి దిగుబాట్లో నాటేసింది. అడుగుతీసి అడుగువెయ్యడమే కష్టంగా వుంది. దానికితోడు ఒడ్డుపైనిల్చొని యజమాని తొందరగా కానియ్యమని గోలచెయ్యడం వల్ల పూర్తిగా అలసిపోయింది లచ్చమ్మ బలవంతంగా లేచి సత్తువ తెచ్చుకొని నిల్చుంది. పొయ్యి దగ్గర కెళ్ళి అందులోని బూడిద తట్టలోకి ఎత్తింది... బయటకెళ్ళి తుమ్మపొరకను చిన్న చిన్న పుల్లలుగా విరుచుకొచ్చి పొయ్యి దగ్గర పడేసింది. మూలకున్న కుండలోనుంచి సోలెడన్ని నూకలు తీసిచేతిలో పోసింది అందులోని తపుడు, మెరిగలు చెరిగింది. రాళ్ళేరేసింది వాట్ని అల్యూమినియం పాత్రలోపోసి మంచినీళ్ళతో కడిగింది..... ఆ పాత్రను పొయ్యిదగ్గర పెట్టి ఓ గూనపెంక తీసుకొని నిప్పు తేవడానికి పక్కింటి కెళ్ళింది. పిడుక నిప్పుదెచ్చి పొయ్యిలవేసింది. ఆ పిడుకను పలగ్గొట్టి నిప్పు పై పెట్టి ఉప్ ఉప్' అని ఊదసాగింది. ఎంత ఊదినా పొయ్యి మండటంలేదు. కలపతో చేసిన పొయ్యిదేగొట్టంతో మళ్ళి ఊదింది. కళ్ళ వెంట

నీరుకారుతున్నాయి.... కొంచెం సేపట్లో పొయ్యి అంటుకుంది. తుమ్మపొరక ముక్కలు దాని పై పెట్టి మళ్ళీ ఊదింది మంటలేచింది నూకలు కడిగివున్న పాత్రను పొయ్యిపై పెట్టింది. పొయ్యిముందు కూర్చొని ఒక్కొక్క పుల్ల పొయ్యిలో పెడుతుంది. చలగావుండే కాళ్ళు పొయ్యి దగ్గరకు చాపి అరచేతులు మంట మీదికి చూపుతూ చలికాగుతుంది. మంచంలో పడుకోనున్న ఎల్లయ్య మూలుగుతున్నాడు.

"ఎందేమో మూలుగపడితిని?' భర్తనుద్దేశించి అంది లచ్చమ్మ.

సలివెడతందే! వణుకత్తంది' మలుచుకొని పడుకొని అన్నాడు ఎల్లయ్య గిటొచ్చి పొయ్యిదగ్గర కూకోలేవు. ఎచ్చగుంటది"

భార్య మాటలు వింటూనే మంచంలో నుండి లేచి కుంటుతూ పొయ్యి దగ్గరకొచ్చాడు ఎల్లయ్య భార్య కొంత దూరములో కూర్చొని పొయ్యి దగ్గరకు కాళ్ళుచూపి మంటపైగా చేతులుపెట్టి చలికాగుతున్నాడు ఎల్లయ్య భర్త కుంటుతూ రావడం చూసిన లచ్చమ్మ ఎందేమో కుంటపడితివి' ' అంది కాలుకు పెద్దముల్లురిగిందే పిన్నీసుతోని తీసిని గని కూసంలొావన్నే పెయినట్టుంది జల జల జలుపుతుంది' అన్నాడు ఎల్లయ్య

"ఏది ఇటు సూడనియ్యి" అని భర్తకాలిని చేతిలోకి తీసుకుంది లచ్చమ్మ ముల్లుగుచ్చిన చోట రంధ్రంలాగుంది రక్తం పేరుకొని వుంది చేతితో మెల్లగా ఒత్తింది. వయ్యా వయ్యి' అని మొత్తుకున్నాడు ఎల్లయ్య లచ్చమ్మ బయటకెళ్ళి ఓ ఇటుక ముక్క తెచ్చి పొయ్యిలో వేసింది. కొంచెం సేపయిన తర్వాత బయటకుతీసి ఓ పేలికలో మలిచింది. దాంతో ఎల్లయ్య కాలును కాపసాగింది వెచ్చటి ఇటుక కాలికి తగులుతున్న కొద్ది బాధగానూ, హాయిగానూ వుంది ఎల్లయ్యకు కొంతసేపు కాపి ఇటుకముక్క బయట పారేసొచ్చింది పొయ్యికెదురుగా కూర్చుంది. అన్నం తుక తుక ఉడుకుతుంది.... మూతతీసి కింద బెట్టింది గంటెతో అన్నాల్ని కలిపింది భర్త దిక్కుచూస్తూ ఏందియ్యాల పొద్దుగాల్నే అచ్చి నవు?" అంది

"ఏం పొద్దుగాల్నే... పొద్దటి నుంచి ఐదెకరాల పెరడికి నీళ్ళు గట్టినం యాట్టకొచ్చింది నీళ్ళు గట్టంగనే ముల్లుగుచ్చి రగుతం గారింది నీళ్ళు గట్టుడు అయిపోయెటాల్లకు పొద్దుగూకే... ఎడ్ల గట్టేసి మాతేసి పొమ్మాన్నాడు పటేలు.... కని నేనే కాలు జలుపుతుందని ఎల్లచ్చిన' అన్నాడు అబ్బోదెన పటేలు పోనిచ్చాడామరి? గయినేనా పోనిచ్చటోడు గని ఇంకో పాలెరోడు ఆపన్జేత్తడని సెప్పి మెల్లగా బయట పడ్డా.... పొద్దందాక కాలువలు తెంపుకుంట నీళ్ళు గట్టన్నంటే ఆలిట్టకచ్చె ఇగ గడ్డాము గడ్డి పీకన్నంటే సేతులు పీక్కపోతాయి ఇగ మన బ్రతుకులే గింతాయే తియ్యి' అంటూ ఉడికిన అన్నం చూసి కొంగుతో పాత్రను పొయ్యిపైనుంచి దించి క్రిందబెట్టింది లచ్చమ్మ చెంబులో వున్న నీళ్ళు చల్లి పొయ్యినార్పింది. ఇంతలో భుజంపై నిలువెత్తున్న గుడిసెలో మూలకు పడేసి బాగాకలయితందె అవ్వ జెప్పన బువ్వెయ్యి' అని బయటకెళ్ళాడు..... కాళ్ళు చేతులు కడుక్కొనొచ్చి నేలపై కూర్చున్నాడు కొడుకు ప్రక్కనే ఎల్లయ్య కూర్చున్నాడు.... నల్లగా పొగబారి నట్టుంది అలసటగావున్న కొడుకు ముఖంలోకి ఆప్యాయంగా చూసాడు... లచ్చమ్మ రెండు అల్యూమినియం గిన్నెల్లో వేడి వేడి నూకలన్నం వేసుకొచ్చి ఇద్దరి ముందు పెట్టింది ప్రొద్దున చేసిన పులుసు గిన్నెను కాళ్ల ముందరకు జరిపింది.... చిప్పలో వున్న చింతకాయ పచ్చడి ఇద్దరి కంచాల్లో చెరికొంత వేసింది అన్నం కలుపుతున్న శ్రీనివాస్ ఆయ్ అయ్' అంటూ కంచంలో నుండి చేతిని పైకి తీశాడు.



"ఏమైంది బిడ్డ ఏమైంది?' అని లచ్చమ్మ కొడుకు దగ్గరికొచ్చింది శ్రీనివాస్ తన రెండు అరచేతులు చూపించాడు..... పొక్కులొచ్చి ఉబ్బివున్న కొడుకు చేతులను చూసిన ఆ తల్లిదండ్రుల హృదయాలు ద్రవించాయి... బాయడుగు బండకన్న గట్టిగుండి..... ఎంత తవ్వినా పెల్లయితె కుల్లపెలేదు తవ్వి తవ్వి సేతులన్ని పొడాయే.... కొద్దుందాక ముగ్గురం మనుషులందవ్వుతే జానెలోతన్న తెగపాయె. పాతుకుపోయినా కొద్ది గట్టిగుంటది. గజాన సూరియ్యమంటేడ్సిరి. రోజు దున్న కయికిలి పడుతలేపాయే అన్నాడు శ్రీనివాస్ తల్లిదండ్రుల,తో కొడుకు చెప్పేది వింటూనే 'చేతులను తన చేతిలోకి తీసుకొని ఆప్యాయంగా నిమిరింది లచ్చమ్మ.

"బిడ్డ నీకు కలుపుకోరాడు సేతులు మండుతయ్... నేంగలిపి నోట్ల పడుతపట్టు" అని అన్నం కలుపుతూ ఒక్కో బుక్క నోట్లో పెడుతుంది.

"అట్టి పులుసుతోని తినబుద్దయితలేదే అవ్వ... కొంచమంత పప్పన్నెయ్యక పెయినవే' అన్నాడు శ్రీనివాస్.

"ఇసిర్న కాడికయిపోయింది బిడ్డ మానెడన్ని పెసల్లు మా వున్నయి అవి ఎండవోసి ఇసుర్తామంటే తీరుతలేపాయె" అన్నం తినిపిస్తూ లచ్చమ్మ అయిత మాయెపట్టు ఎట్లనో నాలుగు బుక్కల్తింటే ఐపోయె గాసింతకాయ తొక్కు కలిప్పెట్టే అవ్వ మంచిగుంది' అని అన్నం తింటూ గీ తొక్కెక్కడిదే అవ్వ" అన్నాడు శ్రీనివాస్.

పొద్దంతా కట్టెలు గొట్టించుకొని అడుగడుగంగ ముత్తెమంత పెట్టింది బేలవ్వ' అన్నాడు ఎల్లయ్య. మంచినీళ్ళు తాగుతూ చెంబు క్రింద పెట్టి అమ్ముడు రాలేదాయె నాయిన్న"? అన్నాడు శ్రీనివాస్

చిన్నకొడుకు జోలితీయగావే ఆపేద-తల్లిదండ్రుల హృదయాల్లో పెట్టి కెలికినట్టయింది.

"పొల్లగాన్ని కర్నవయినే కమ్మినట్టే ఐపాయెు సిన్న పోరి లగ్గాని తెచ్చిన ఐదుసూర్ల కిందికి యాడాది వట్టి పోరడు పన్జేసిన బాకి తనే లేపాయె బుక్కెడంత తిని పొద్దుందాక తెల్లందాక అక్కన్నే సుడాయె..... రొండు మూడు రోజుల కోసారి అట్లచ్చిపోతండు" ఉన్నాడు ఆవేదనగా ఎల్లయ్య.. ఇద్దరూ అన్నం తినడం ముగించారు. ....లేచి వాల్చిన మంచంలో కూర్చున్నారు. బావులు తవ్వుతూ వచ్చిన కూలిపనితో బ్రతకడం కష్టమని, తాను బొగ్గుబాయి పనికి పోతారు కొడుకు చెపుతుంటే వింటున్నాడు ఎల్లయ్య... లచ్చమ్మ అన్నం తినడం పూర్తిచేసుకొని ఖాళీపాత్రతో నీరుపోసి ఆముదం సీసతో కొడుకు దగ్గరకొచ్చింది.... సీసాలో ఆముదాన్ని కొడుకు అరచేతులకు రాసింది... నేల గోనెసంచీ దానిపై పాతబట్టలతో కుట్టిన బొంతవేసుకొని పడుకుంది పాత చీరపై నుంచి కప్పుకుంది.... ఎల్లయ్య, శ్రీనివాస్ చెరో మంచంలో పడుకున్నారు.... ఎల్లయ్య చిరుగుయి బట్టిన గొంగడి కప్పుకున్నాడు. శ్రీనివాస్ చద్దరు కప్పుకున్నాడు... గుడిసె తలుపునుంచి, పైరంధ్రాల నుంచి చల్లనిగాలి సుయ్ సుయ్" మంటు వస్తువు గాలి చల్లగా శరీరానికి తగిలినప్పుడల్లా వాళ్ళు వణికి పోతున్నారు కాళ్ళు దగ్గరకు మలచుకొని కడుపులో తలలు పెట్టుకొని పడుకోవడం ప్రయత్నిస్తున్నారు... కాని వాళ్ళు కప్పుకున్న బట్టలు ఆ మాఘమాసం చలినే మాత్రం ఆపలేక పోతున్నాయి. ఎంత ప్రయత్నించిన నిద్రపోవడం లేదు. పొద్దంతా బండచాకిరీచేసి అలసిపోయినా వాళ్ళ శరీరం ఎముకలు కొరికే చలిని జయించి నిద్రలో కొరగలేక పోతున్నా లచ్చమ్మ కాళ్ళు జల జల సలుపుతున్నాయి. తన నలభై ఐదేళ్ళ జీవితం గూర్చామె మననం చేసుకుంటుంది. పుట్టి బుద్దెరిగినప్పట్నుంచీ పనితోనే బ్రతుకుతుంది తాను. దొరికిన్నాడు తినడం దొరకన్నాడు పస్తులుండటం ఎన్నేల్లు కూలిపనిజేసినా తన కష్టాలు గట్టెక్కడం రోజు రోజుకు తన బ్రతుకింకా దుర్భరమౌతుంది.... తాను కూలిపని ఎన్ని

తిట్లుతిన్నాది? ఏం అభిమానం చంపుకొని బ్రతికింది?.... పిల్లలు చిన్నగా ఉన్నప్పుడు వాళ్ళ నొదిలి కూలి కెళ్ళిన తాను వాళ్ళకి పాలివ్వడానికి ఇంటికెళ్తానంటే యజమానితో తిట్లు,... అవమానకర మాటలు... తాను తన జీవితమంతా పరాయి వాళ్ళ భూముల్లో కేవలం కూలికోసం కలుపుతీసింది నాట్లేసింది అలుకుడు చేసింది... కోత కోసింది. మోతమోసింది నీళ్ళు గట్టింది మరెన్నో పనులుచేసింది ఎన్ని చేసిన పొయ్యికింది కుంటే పొయ్యిమీది కుండదు... పొయ్యిమీది కుంటే కింది కుండదు... పొద్దంతా ఒళ్ళు హూనం చేసుకున్న పస్తులు తప్పవు.

పొద్దంతా పనిచేసిన తనకు ప్రొద్దుగూకిందంటే కొంత తృప్తి కొంత విశ్రాంతి తీసుకోవచ్చు కలో గంజో తాగి కాళ్ళు చాపుకొని పడుకోవచ్చు తెల్లవారితే - ఒంటెద్దు చాకిరీ గబగబా పనికురకడం చేతనైనా కాకున్న యంత్రంలా పనిచేయడం. ఈ రాత్రి రాత్రిగానే వుండాలి. తెల్లవారకూడదు అనుకుంటూ నిద్రలోకి జారుకుంది లచ్చమ్మ ఎల్లయ్య పాత గొంగళి గుండ్రంగా మలుచుకొని పండి తన జీవితం గూర్చి ఆలోచిస్తున్నాడు.... తనకు నలుగురు పిల్లలున్నా అంతా కూలీలే అయ్యారు తన యాభై ఏళ్ళ జీవితంలో గ్రీష్మాలనే తప్ప వసంతం ఎరగడు వ్యవసాయకూలీగా, పాలేరుగా ఎన్నో కష్టాలు పడ్డాడు..... రక్తాన్ని చెమటగా మార్చాడు.... ఎముకలను కలి కలి చేసుకున్నాడు - ఎండలో, వానలో. చలిలో దుక్కిదున్నాడు... విత్తనాలేసాడు మడికట్టు, జంబు, పునాస దున్ని ఒళ్ళు హూనం చేసుకున్నాడు మోట కొట్టాడు. నీళ్ళు కట్టాడు - బంతి కొట్టాడు - బండికట్టాడు - అయినా తనకు మిగిలింది ఆకలి కడుపు - తెల్లవారింది మొదలుకొని మళ్ళీ రాత్రి పడుకునే వరకు పని..... పని - పని - పశువులకంటే అధ్వాన్నమయిన చాకిరీ - రాత్రే కొంత విశ్రాంతి - తెల్లవారితే మళ్ళీ గానుగెద్దు జీవితం - కాళ్ళు గుంజినా డొక్క ఎండినా శరీరమంతా పూర్తిగా అలిసిపోయినా తప్పని పని తెల్లవారకూడదు. రాత్రి ఇలాగే వుండాలి. అనుకుంటూ అర్ధరాత్రి వరకో నిద్రపోయాడు ఏల్లయ్య.

శ్రీనివాస్‌కు బండలను పిండిగొట్టే తన కూళీపని జ్ఞాపకమొస్తుంది పొద్దు పొడిచి పొడవక ముందుపోతే పొద్దుగూట్లో పడేంతవరకు శ్రమచేయాలి - తన చేతులకు బొబ్బలొచ్చినా, బండలు చిల్లి గాయాలైనా ఎంత అలసి సొలసినా పని చేయకతప్పదు - శరీరం జల జలా సలుపుతున్నా ఆరోగ్యం బాగా లేకపోయినా కూలికెళ్ళాలి - లేకుంటే పొట్ట నిండదు - పండుగనక పబ్బమనక అన్నికాలాలు తట్టమోయాలి - తట్టనింపాలి - తవ్వాలి - సూర్యోదయమవుతుంటే చాకిరీ తప్పదు - తెల్లవారకుండా ఉంటేనే కొంతైనా హాయి - అని ఆలోచించుకుంటూ సగం రాత్రి గుడిచాక నిద్రాదేవి ఒడిలో కొరిగాడు శ్రీనివాస్.

వాళ్ళెంత తెల్లవారొద్దనుకున్న కోడిపుంజు మూడవసారి కూయగానే దిగ్గనలేచారు - తెల్లవారడానికింకా గంటుందనగానే ఎల్లయ్య ఆకటెడ్ల మేవడానికై పటేలు ఎడ్ల కొట్టం దిక్కునడిచాడు కొంత సేపటికి తర్వాత శ్రీనివాస్ భుజం పై గడ్డపార పెట్టుకొని బయటకు నడిచాడు.... లచ్చమ్మ తన గృహ కార్యక్రమాల్లో నిమగ్నురాలయింది.

ఎల్లయ్య కుటుంబాల్లాంటి లక్షలాది కుటుంబాలకు సూర్యోదయం భయం భయంగానే దర్శనమిచ్చింది. - వాళ్ళ బ్రతుకుల్లో వెలుగు నింపే సూర్యోదయం వస్తే -? రాత్రినికాక సూర్యోదయాన్నే ఆహ్వానిస్తారందరూ అదే నిజమైన తెల్లవారడం.

(మార్చి, 1985)



12

# కంపనబడ్డ కాకి

## పైడి తెరేష్‌బాబు

గాయత్రి ఎట్లా వుందో!

నడుస్తున్న మార్గరెట్ క్షణకాలం తడబడింది. తన ఇంటినుంచి గాయత్రి ఇంటికి మధ్య దూరం వందగజాలకు మించి వుండదు.

అయినా అయిదార్నిమిషాల నుంచి ఆమె నడుస్తూనే వుంది.

మధ్య మధ్య తడబడుతూనే వుంది.

గాయత్రి ఎట్లా వుందో!

ఎట్లా వుంటుంది-బహుశా బతికే వుంటుంది. లోతైన గాయం చేసి బైటపడ్డ బాకు చివర్న బిక్కుబిక్కుమనే నెత్తుటి మరకలా ఇంట్లో ఏదో ఒక మూల్నా ఎలాగోలాగ వుండే వుంటుంది. అసలే మొండిది.

అంత త్వరగా చావదులే అన్న భరోసా మార్గరెట్ ఆలోచనల్లో ఎక్కడో తళుక్కుమంది.

గాయత్రి వుండే ఇల్లు దగ్గర పడింది.

బతికున్న గుండెకాయని భద్రంగా అరచేతిలో పట్టుకున్న పసిదానిలా మెట్లవేపు నడిచింది మార్గరెట్. ఆమె ఏడవడం లేదు. కాని ఏడుపు లాంటిదేదో ఆమె కాళ్లకు చుట్టుకుని అడుగుల్ని అడుగుల్లా పడనివ్వడంలేదు. గాయత్రిని చూడగానే ఏం మాట్లాడాలి? కాళ్లు మెట్లెక్కుతున్నాయి.

నగరానికి దూరంగా నగరంలో భాగంగానే వున్న ప్రాంతం అది. పొట్ట గడవడం కోసం రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల నుంచి వలస వచ్చిన వాళ్లు ప్రధానంగా కనిపిస్తారక్కడ. అక్కడ ఫ్యాక్టరీలున్నాయి. కార్పొరేట్ ఆఫీసులున్నాయి, ఆస్పత్రులున్నాయి. సినిమాహాళ్లున్నాయి. కూరగాయల మార్కెట్లున్నాయి. మాంసం దుకాణాలున్నాయి. అన్ని కులాలవాళ్లున్నారు. అన్ని వర్గాలవాళ్లున్నారు. అందరినీ మించి ఒళ్ళు పెంచడమే పనిగా పెట్టుకున్న దాదాలు, రౌడీలు వున్నారు. ఎంత తప్పించుకు తలొంచుకు పోతున్నప్పటికీ వాళ్ల బారిన పడే ఆడపిల్లలున్నారు. వాళ్లలో మార్గరెట్, గాయత్రీ వున్నారు.

ఇద్దరూ అందంగా వుంటారు. వయస్సు పాతికేళ్ళకి అటూ ఇటూగా వుంటారు. ఒకే ఆఫీసులో పనిచేస్తున్నారు. ఒకే వీధిలో వుంటున్నారు. ఆఫీసుకు నడిచే వెళ్ళొస్తుంటారు. దాదాపు మూడేళ్ల సహవాసం. ఎక్కువ తక్కువ కులాల ప్రస్తావన వాళ్ళమధ్య రాలేదు గానీ గాయత్రి వాళ్ళింట్లో వచ్చింది. మాటల రూపంలో కాదు, చేతల రూపంలో. మొదటిసారి మార్గరెట్ ఇంటికెళ్ళినపుడు గాయత్రి వాళ్ల నాన్న, అమ్మ ఎంతో ప్రేమగా ఆహ్వానించారు. ఫలహారం చేతికందించారు.

"ఈమె నా ఫ్రెండు, కొలీగ్ మార్గరెట్. ఆఫీసులో అందరం ముద్దుగా మ్యాగీ అని పిలుస్తాం' ' అని గాయత్రి పరిచయం చేసిన తర్వాత మార్గరెట్ చేతికి అందించబోయిన నీళ్ళ గ్లాసు చటుక్కున నేలమీద పెట్టి చరచరా లోపలికెళ్ళిపోయింది ఏదో పనున్నట్టుగా గాయత్రి వాళ్లమ్మ. అది ఇద్దరూ గమనించారు. మార్గరెట్ కన్నా గాయత్రి ఎక్కువగా బాధపడింది. ఆ బాధను చేతికొద్దీ బలవంతాన ఎటైనా విసిరేసి హాయిగా ఎప్పట్లా మాట్లాడుకుందాం అనుకుంటుండగా తన కూతురుకు పింగాణీ కప్పులోను, మార్గరెట్‌కి ఓ సొట్టపడ్డ గ్లాసులోను కాఫీ పట్టుకొచ్చింది గాయత్రి వాళ్ల అమ్మ. ఆ గ్లాసునూ నేలమీంచే అందుకుంది మార్గరెట్.

శతాబ్దాల క్రితం ఎప్పుడో సీసం పోయించుకున్న పురాస్మృతి మార్గరెట్ చెవుల్లో సలసలమంది. కాఫీ వేడిగానే వుంది.

గాయత్రి పెద్దగా మాట్లాళ్లేదు. వాళ్ళమ్మ మాత్రం కుర్చీ దూరంగా లాక్కువి ఎంతో అప్యాయంగా మాట్లాడింది. మార్గరెట్ తల్లీతండ్రీ కారంచేడులో సమాధులుగా మిగిలినందుకు, ఎంతో బాధపడింది. స్వశక్తితో చదువుకుని ధైర్యంగా ఉద్యోగం చేసుకుంటూ ఒక్కర్తే వుండగలుగుతున్నందుకు అభినందించింది. ఆమె మాటల్లో ఎక్కడా తెచ్చిపెట్టుకున్నతనం లేదు. కులంకాని అమ్మాయి తన ఇంట్లో కూర్చుని మాట్లాడుతూ వుందన్న ఇబ్బందీ ఫీలవుతున్నట్టు లేదు. కానీ ఆమె భౌతికంగా దగ్గరగా వున్నా మానసికంగా కొన్ని యోజనాల దూరంలో వుంచి 'చొచ్చొచ్చొ' అంటూందని మాత్రం మార్గరెట్‌కి స్పష్టంగా తెలుసు. ఒంటరితనానికైనా సిద్ధమే కాని ఇలాంటి వాతావరణాన్ని అస్సలు భరించలేదు. ఆ విషయాన్నే ఆ మర్నాడు ఆఫీసులో గాయత్రితో వీలైనంత సున్నితంగా చెప్పడానికి ప్రయత్నించింది మార్గరెట్.

"సారీ మ్యాగీ మావాళ్ళది ఒట్టి చాదస్తం. అఫ్‌కోర్స్ నిన్న నువ్వు ఇంటికెళ్లిపోయాక మా అమ్మకు బ్రెయిన్‌వాష్ చేశాన్లే. మళ్ళీ మళ్లీ ఇంటికి పిల్చి నిన్ను అవమానించడం నాకిష్టంలేదు. తీరిక దొరికినప్పుడు నేనే మీ ఇంటికొస్తూంటాన్లే. దగ్గరేగా!" అంటూ మల్లెలా నవ్వింది గాయత్రి.

ఈ ఒప్పందం మార్గరెట్‌కి నచ్చింది. అప్పట్నుంచి ఆఫీసుకు వెళ్తున్నప్పుడు గాయత్రి మార్గరెట్ ఇంటికి రావడమూ, ఇద్దరూ కలిసి ఆఫీసుకు వెళ్ళడమూ, ఆఫీసు అయిపోయాక ఇంటికెళ్ళే ముందు గాయత్రి స్నేహితురాలి ఇంట్లో కాస్సేపు గడపడమూ అలవాటైపోయింది.

మార్గరెట్ ఇంటికి దగ్గర్లో టీ దుకాణం ఒకటి వుంది. ఆ మధ్య కొంతకాలం నుంచి అక్కడ యాదగిరి బృందం చేరడం, ముఖ్యంగా సాయంకాలప్పూట ఆడాళ్ళను వేధించడం మొదలెట్టాడు.

"చూడండి" మార్గరెట్ వాళ్ళతో చాలా సభ్యమైన రీతిలో సవ్యమైన మాటల్లో చెప్పడానికి ప్రయత్నించింది. "కామెంట్లు చెయ్యొద్దని నేను శాసించను. జోకులెయ్యవద్దనీ చెప్పను. కామెంట్లు, జోకులు విని మేము కూడా సరదాగా నవ్వుకుని ఎంజాయ్ చేసేట్టుండాలి గానీ వాటిని తల్చుకుని పొర్లి పొర్లి ఏడ్చేట్టు వుండకూడదు. ఒక చోట వుండేవాళ్లం. గొడవలెందుకు."

యాదగిరి బృందం ఆమెతో వాదనకు దిగలేదు. కానీ 'గాయత్రే గభాల్న నోరు జారింది. "వీళ్ళకు చేసే హితబోధా దున్నపోతు మీద కురిసే వర్షమూ ఒక్కటే."

ఆ మాటకు అంతా రియాక్టయ్యారు.

"ఏందీ! మళ్లీ అను".

"పోరా" అంది గాయత్రి పళ్ళబిగువున అక్కణ్నించి కదుల్తూ.



"పోతా పోతా-పొయ్యేముందు జర్ర నీకు ఫస్టునైట్ జే సి మల్ల పోతా" నెమ్మదిగా తన వాళ్ళకు మాత్రమే విన్పించేట్టు అన్నాడు యాదగిరి. అనడంతో ఊరుకోలేదు. అన్నంతపనీ చేశాడు.

రేప్!

అత్యాచారం.

విచ్చుకత్తుల బెదిరింపుల్లేవ్! వికటాట్టహాసాల్లేవ్! ప్రతీకారం తాలూకు డైలాగుల్లేవ్! వీలున్నంత పాశవికంగా-పబ్లిగ్గా, బేఫికరుగా పూరేకును వేళ్ళమధ్య నలిపినంత సులువుగా గాయత్రిని రేప్ చేశాడు యాదగిరి.

ఇది జరిగి రెండురోజులయింది.

మార్గరెట్‌కి తెలిపి రెండు గంటలయింది.

మూడురోజుల క్యాంప్ నుంచి ఆవేళే తిరిగొచ్చిందామె. అలవాటు ప్రకారం ఆఫీసుకెళ్ళే ముందర గాయత్రి కోసం ఎదురుచూసింది. సెలవు పెట్టిందేమోననుకుని ఆఫీసుకెళ్లింది. వెళ్లగానే ఈ వార్త. ఆస్పత్రిలో వుందని అడ్రసు చెప్పారు. ఆస్పత్రి కెళ్ళింది. పొద్దుటే ఇంటికి తీసుకెళ్ళారని చెప్పారు ఆస్పత్రివాళ్లు. నేరుగా తన ఇంటికొచ్చింది. గాయత్రిని చూడాలనుకుంది. గాయత్రివాళ్ల తల్లిదండ్రుల్ని చూడకూడదని వుంది. కొద్దిపాటి వూగిసలాట తర్వాత గాయత్రి వాళ్ల ఇంటికి బయలుదేరింది.

కాలింగ్ బెల్ నొక్కింది మార్గరేట్.

కొద్ది క్షణాల తర్వాత తలుపు తెరుచుకుంది.

గాయత్రి వాళ్ళమ్మ! మొహం పీక్కుపోయి వుంది. ప్రవాహం ఎండిపోయిన ఇసుక మేటలు వేసినట్టు కళ్లు వుబ్బి వున్నాయి. మాటల్లేవు. చేత్తో ఒక గదికేసి చూపించింది. మార్గరేట్ అటువైపు నడవబోతుండగా చెప్పులు బైటవిడిచి రామ్మా"అంది.

మార్గరెట్ ఉలిక్కిపడి చూసింది. కొద్ది క్షణాల్లో తేరుకుని చెప్పులు బైట విడిచి వచ్చింది. ఆమెతో పాటు గాయత్రి వాళ్ళమ్మ కూడా గదిలోకొచ్చింది. అటు తిరిగి పడుకుని వుంది గాయత్రి. మెలకువతోనే వుంది.

రెప్పవేత మరచిపోయి ఆమెనే చూస్తూ వుంది మార్గరెట్.

గాయత్రినుంచి బదులు లేదు!

"మ్యాగీ వచ్చిందే"

గాయత్రి శరీరంలో సన్నని కదలిక.

"కూర్చోమ్మా !" అని చెప్పి గదిలోంచి వెళ్ళిపోయింది తల్లి.

మార్గరెట్ నెమ్మదిగా బెడ్ మీద కూర్చుంది మౌనం.

ఏ శబ్దం చేస్తే ఏ గుండె ఎన్ని ముక్కలౌతుందోనన్న భయంతో గుండె గొంతుకలు కవాటాల్ని మూసేసుకున్నప్పటి నిశ్శబ్దం.

"గాయత్రి!"

ఏడుపు! కత్తి అంచులాంటి సన్నటి ఏడుపు!

గాయత్రి యిటు తిరగలేదు. మోహాన్ని చేతుల్లో దాచుకుని ఏడుస్తోంది.

మార్గరెట్ గొంతులో మాటల్లేవ్. నెమ్మదిగా గాయత్రి భుజంమీద చెయ్యి ఆనించింది.

కన్నీళ్ళ పుట్ట పగిలింది.

గాయత్రి గొంతు వెనుక అదిమి పెట్టిన దుఃఖం కవాటాల్ని తన్నుకుని విస్ఫోటనంలా పేలి గదంతా కమ్ముకుపోయింది. మార్గరెట్ బెడ్‌మీంచి చివాల్నలేచి గాయత్రికి ఎదురుగా వెళ్ళి మోకరిల్లి కూర్చుని ఆమె ముఖాన్ని తన చేతుల్లోకి తీసుకుని ఓదార్చాలని ప్రయత్నిస్తోంది. గాయత్రి తల్లి, తండ్రీ పరుగులాంటి నడకతో గదిలోకొచ్చారు. వాళ్ళవెనుకే వచ్చారు రామభద్రం. యాభయ్యేళ్ళుంటాయి. గాయత్రివాళ్ళ బంధువు కాదుకాని కుటుంబానికి బాగా కావలసినవాడు! బస్తీలో పలుకుబడి వున్న మనిషి. ఒక మతతత్వ రాజకీయ పార్టీతో సంబంధాలున్న వ్యక్తి. అతని గురించి మార్గరెట్ బాగానే విని వుంది.

"ఇప్పటికే అది ఏడు జన్మలకు సరిపడా ఏడ్చిందమ్మా. ఇంకా ఏడిపించొద్దు" అన్నాడు రామభద్రం. అతను మాట్లాడిన ధోరణిలో 'చూశావుగా! ఇహ బయల్దేరు' అనే ధ్వని స్పష్టంగా పలికింది.

గాయత్రి కేసి చూసింది మార్గరేట్.

కళ్లు మూసుకునే వుందామె. ధారాపాతంగానీళ్ళు.

పైకిలేచే ప్రయత్నం చేస్తోందని తెలిపి మార్గరెట్ చేతిని గట్టిగా పట్టుకుని గుండెలకు అదుముకుంది గాయత్రి' అప్పుడు చూసిందామె అవాచ్ఛాదితంగా వున్న గాయత్రి గుండెలకేసి రెండు నెత్తుటి ముద్దలకు అక్కడక్కడా చర్మంతో మాసికలేసినట్టున్నాయి. గోటి రక్కుళ్ళు, చీకలు,వంటిగాట్లు స్పష్టంగా తెలుస్తున్నాయి. చర్మానికి ఇవతల అవతల జరిగిన జరుగుతున్న యుద్ధానికి చిహ్నాల్లా వున్నాయని. మిగతా శరీరం, శరీరాన్ని మోసేగుండె ఎట్లా వున్నాయో!

గాయత్రి గాయత్రిలాలేదు. క్రూరమృగం కోరల్లో చిక్కుబడిన కుందేలు పిల్లలావుంది"

"ఎట్లా జరగనిచ్చారీ దుర్మార్గాన్ని. ఇంతమందీ వుండి -" మార్గరెట్ గొంతులోంచి అరుపూ ఏడుపూ ఒక్కసారే బైటికొచ్చాయి.

సమాధానం లేదు.

గాయత్రిని పసిబిడ్డని నిమిరినట్టు నిమురుతూ ఏడ్చింది మార్గరేట్.

"వాడింకా పబ్లిగ్గా బోరవిరుచుకుని తిరుగుతున్నాడంట. ఏం చేస్తున్నారు మీరంతా" కసిగా అడిగింది రామభద్రాన్ని.

రామభద్రం పక్కనున్న ఇద్దరికేసి చూసేడు.

"ఏం చేయగలం తల్లీ అల్పకులం. ఇది చూస్తేనా ఆడపిల్ల. అటు చూస్తేనా గుండెలు తీసిన బంట్లు. పరువూ మర్యాదలు పక్కకి నెట్టి బజారుకెక్కితే రేపు దీని భవిష్యత్తేంగాను"అన్నాడు గాయత్రి తండ్రి.

ఆ మాటలకు గాయత్రి చేతుల్ని విసురుగా వదిలించుకుని పైకి లేచింది మార్గరెట్."ఏ మౌతుండండీ గాయత్రికి పెళ్లి సంబంధాలు రావు. పెళ్ళి కాదు అంతేగా"

"అంతేగా అని తేలిగ్గా తీసి అవతల పారేయడానికి ఇదేమన్నా చిత్తుకాగితమా తల్లీ. పరువుగల కుటుంబంలో పుట్టిన ఒక ఆడపిల్ల జీవితం!"



అంది గాయత్రి వాళ్ళమ్మ.

పెళ్ళికాని కూతుర్ని ఓ పరాయి మగాడొచ్చి చీమన్నలిపినట్టు నలిపేసి వెళ్ళిపోతే వాడి చేతులు నరకాల్సింది. పోయి, చేతులు నలుపుకుంటూ ఈ పిల్లకు పెళ్ళెట్లా అవుతుందోనని మల్లగుల్లాలు పడుతున్న ఆ తల్లి దండ్రుల్ని చూసి అసహ్యంగా మొహం తిప్పేసుకుని చరచర బైటికొచ్చింది మార్గరెట్. ఆ క్షణంలో ఆమెలో ఎంత ఆవేశం వుందో, ఆమెను ఇంకా మాట్లాడనిస్తే ఏమేం మాట్లాడుతుందో, చెయ్యనిస్తే ఏమేం చేయగలదో సరిగ్గా అంచనా కట్టినవాడు రామభద్రం.

" ఇవాళ గాయత్రికయింది. రేపు ఇంకోళ్ళ కవుతుంది. దాదాల జోలికి పోతే ఏమౌతుందోనని పిరికిపందల్లా చేతులు ముడుచుక్కూర్చుంటే రేపు ఏ ఆడపిల్లా ఆడపిల్లలా ఈ బస్తీలో తిరగలేదు. ఆ యాదగిరి గాడ్ని, వాడి బ్యాచిని ఆడోళ్లమే అందరం కలిసి పొర్లిచ్చి పొర్లిచ్చి తన్నాల"అంది మార్గరెట్ ఆవేశంగా.

ఆ ఇంట్లో చేరిన ఆడాళ్ళంతా ఏదో మాట్లాడాలన్న ఆవేశంతో తలమునకలై వున్నారు. వాళ్ళంతా ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక విధంగా యాదగిరి బృందం తాలూకు వేదింపులకు గురైనవాళ్ళే!

"అ అందరం కలిస్తే అదేమంత కష్టమైన పని కాదమ్మాయ్. వాణ్గొక్కణ్ణే తంతే కేవలం వాడు మాత్రమే భయపడ్తాడు. పగ సాధింపుగా ఇంకో అఘాయిత్యానికైనా పాల్పడగలదు. అట్లా కాదు. వాడికీ వాడిలాంటి పోకిరీ వెధవలకి బుద్ధొచ్చేట్టు. పెద్ద యెత్తున ఆందోళన జరగాల" అందొకావిడ.

ఆవిడ మాటల్ని దాదాపు చాలామంది సమర్థించారు. అప్పటికప్పుడు కొన్ని తీర్మానాలు కూడా చేశారు. మార్నాడు ఏమేం చెయ్యాలో చర్చించుకుని ఎవరికళ్ళకి వాళ్ళు వెళ్ళబోతుండగా గాయత్రి వాళ్ళ నాన్న వచ్చాడు.

"ఇది మా కుటుంబ సమస్య. దీన్నెట్లా పరిష్కరించుకోవాలో, పరిష్కారం దొరక్కపోతే కట్టకట్టుకుని ఏ గంగలో దూకాలో మేం తేల్చుకుంటాం. దయచేసి మీరెవరూ తొందరపడి ఈ విషయాన్ని రచ్చకీడ్చవద్దు. ప్లీజ్" అన్నాడు.

"సారీ సార్. ఇది కేవలం మీ కుటుంబ సమస్య ఎంత మాత్రమూ కాదు. ఈ బస్తీవాసుల సమస్య మళ్ళీ మాట్లాడితే ఈ దేశంలో వున్న ఆడాళ్ళందరి సమస్య. మీ ఇష్టాయిష్టాలతో మాకు ప్రయేయం లేదు. గాయత్రి బాధని నిజంగా మీరు అర్థం చేసుకోగలిగితే మీరు ఇట్లా మాట్లాడరు. ఎవళ్ళేం అనుకున్నాసరే మేం ఆందోళన చేసితీరతాం" తెగేసి చెప్పింది మార్గరేట్.

ఆరాత్రి రామభద్రం వచ్చాడు.

"చూడమ్మాయ్. నీ ధైర్యాన్ని అభినందిస్తున్నాను" అన్నాడు.

అతని మాటలకు మార్గరెట్ ఆశ్చర్యపోయింది.

"మధ్య తలపెట్టిన ఆందోళనని ఎంత దూరం తీసుకుపోతావో తీసుకుపో, అంతదూరం నేనూ మీతోనే వస్తాను. గాయత్రి వాళ్ళ తల్లి తండ్రులకు నేను నచ్చజెబుతాను. ఆందోళనకు అవసరమైన ఏర్పాట్లు నేను దగ్గరుండి చూస్తాను"

రామభద్రం మాటలు నమ్మడానికి మార్గరెట్‌కి చాలా సమయం పట్టింది. మార్గరెట్‌ని నమ్మించడానికి రామభద్రానికి మాత్రం చాలా తక్కువ సమయమే పట్టింది.

ఆందోళన మొదలయ్యింది. యాదగిరి బృందం అరెస్టయింది. వార్తలు సిటీ ఎడిషన్స్‌లో వచ్చాయి. నగరం ముక్కుమీద వేలేసుకుంది. రామభద్రం మీటింగులు జరిపించాడు. వాటిలో

మార్గరెట్ మాట్లాడింది. అగ్రనిమ్నవర్ణాల తేడాల్లేకుండా అందరూ 'పోరాటం'లో పాల్గొనాలని పిలుపునిచ్చింది. ఆ పిలుపును వందలాది మైకుల్లోంచి వినిపించాడు రామభద్రం.

పత్రికల మెయిన్ ఎడిషన్స్‌లో వార్తలొచ్చాయి. వార్తల్లో రామభద్రం స్టేట్ మెంట్లున్నాయి. ప్రదర్శనల ఫొటోలొచ్చాయి. వాటిలో రామభద్రం మొహం ప్రముఖంగా కనిపించింది. రామభద్రం ఇప్పుడొక ప్రముఖ నాయకుడు.

యాదగిరి బృందాన్ని వెంటనే శిక్షించకపోతే ఆమరణ నిరాహార దీక్షకు దిగవలసి వస్తుందని ఆందోళన కారులు హెచ్చరించడంతో విషయం హోం మంత్రి దాకా వెళ్లింది. శాసనసభ సమావేశాల తొలిరోజున ప్రస్తావనకొచ్చింది. రాష్ట్రానికి రాష్ట్రం అట్టుడికి పోయింది. మహిళా సంఘాలు చేతులు కలిపాయి. ఉద్యమం మరింత బలపడింది. దోషుల్ని వెంటనే శిక్షించే చర్యలు తీసుకుంటామని, గాయత్రి కుటుంబానికి ఎన్ని విధాల సహాయపడగలదో అన్ని విధాల సహాయపడుతుందని ప్రభుత్వం ప్రకటించింది.

కాస్తంత నిద్రపోయే అవకాశం ఆవేళ లభించింది మార్గరెట్‌కి.

ఇక నిద్ర పడుతుందనగా -

తలుపుతట్టిన చప్పుడయింది.

రామభద్రం వచ్చాడేమోనని గబగబా వెళ్ళి తలుపుతీసింది.

యాదగిరి!

వెనుక అతని అనుచరులు ముగ్గురు!!

పెద్దగా అరవబోయింది. అప్పటికే నోరు మూసేశారు. మార్గరెట్‌కి.

ఇక నిద్రపడుతుందనగా-

తలుపుతట్టిన చప్పుడయింది.

రామభద్రం వచ్చాడేమోనని గబగబా వెళ్ళి తలుపుతీసింది.

యాదగిరి!

వెనుక అతని అనుచరులు ముగ్గురు!!

పెద్దగా అరవబోయింది. అప్పటికే నోరు మైసేశారు. మార్గరెట్ పెనుగులాడింది. ఫలితం లేదు. పెడరెక్కలు విరిచి కట్టేశారు. నోట్లోగుడ్డలు కుక్కారు. బెడ్ మీద వెల్లకిలా పడుకో బెట్టి కాళ్ళు చేతులు మంచానికి నాలుగుదిక్కులా కట్టేశారు.

క్రోదంతో, ఆవేదనతో మార్గరెట్ కనుగుడ్లు ఎర్రబడ్డాయి.లావెక్కాయి. ముట్టుకుంటే పుటుక్కున పగిలిపోయే సబ్బునీటి బుడగల్లా వున్నాయని. మార్గరేట్ మీటికి బంగి ఒంటిమీది బట్టలు ఒకటొకటే వొలుస్తూగుసగుసగా అన్నాడు యాదగిరి "నీ జోలికొచ్చిన్నా? నిన్నే వాడన్నా సతాయించిన్నా? నాకు ఎగెనెస్ట్ ఎందుకైనవ్? రాంభద్రంగానితో షెరికైనవ్. బొందలమీదికి దెచ్చుకున్నవ్!" పళ్ళ బిగువున చేతికొద్దీ ఆమె చెంపమీద చరిచేడు. ఆమెచెంపా మేరకు బుసబుసమని పొంగింది. అమాంతం మృగంలా మీదపడ్డాడు యాదగిరి.

అలా ఒకటి కాదు రెండు కాదు - అయిదు మానవ రంపాలు.



గ్యాంగ్ రేప్! అరవడానికి ఆమెకు గొంతూ లేదు.

కారడానికీ రక్తమూ లేదు.

సాక్ష్యం చెప్పేందుకు ప్రాణమూ లేదు. రికార్డుల ప్రకారం యాదగిరి బృందం పోలీసు కస్టడీలో వున్నారు.

మర్నాడు - రామభద్రం ఆధ్వర్యంలో కొన్ని వార్తలు ప్రచారమయ్యాయి రహస్యంగా!

మార్గరెట్ చావుకి బస్తీవాళ్లు చాలామంది చెప్పుకున్న మాటల సారాంశం ఇది-

"మార్గరెట్ పైకి చాలా స్ట్రిక్ట్‌గా కనిపించినా చాటుమాటుగా చాలామందితో సంబంధాలున్నాయి. ఒకరితో వుండడం మరొకడికి ఇష్టంలేక ఇద్దరూతన్నుకుని ఆఖరికి దాని ప్రాణం తీశారు. పాపం పుణ్యం బగవంతుడికే తెలియాలి. వాని పిల్ల మాత్రం అందరితో కలుపుగోలుగా వుండేది!ప్చ్!"

ఈ మాటలు విని భరించలేక ఆవేశంగా రామభద్రం చొక్కా పట్టుకుంది గాయత్రి.

"నిజం చెప్పు ఇదంతా నువ్వు ప్రచారం చేసింది కాదూః?"

" నాకేం తెలుసు. నేనేమన్నా దగ్గరుండి చూశావా?"చింగిలించుకున్నాడు రామభద్రం.

" ఆ యాదగిరి గాడే కక్షగట్టి మ్యాగీని రేప్ చేసి చంపాడు."

"పోలీసు కస్టడీలో వున్నాడు. వాడెట్టా రేప్ చేస్తాడు!"

" వాడో, వాడి అనుచరులో ఎవళ్ళో మ్యాగీని రేప్ చేశారు."

" ఓకే. రేప్ చేశారు. చచ్చిపోయింది. ఇప్పుడేం చెయ్యాలంట."

"ఆందోళన జరగాలి. దోషుల్ని శిక్షించాలి."

"బాగానే వుంది సంబరం. ఆందోళన చేసి జాతీయ స్థాయిలో సంచలనం సృష్టించడానికి అవిడేమన్నా నైనాసాహ్నీనా? ఆఫ్టరాల్ ఒక క్రిస్టియన్ పిల్ల" అంత ఆవేశం లోనూ నవ్వడానికి ప్రయత్నించేను రామభద్రం.

"వాడ్డూయూ మీన్?" పళ్ళ బిగువున అతని మీది కెళ్ళింది గాయత్రి,

"అవునయ్యా - మధ్య అగ్రకులప్పిల్లవి నీలాంటి వాళ్ళకేదైనా జరిగితే అది దేశ వ్యాప్తంగా సంచలనం అవుతుంది. నీకు జరింగిందానికన్నా నైనాసాహ్నీకి జరిగిందానికన్నా సజ్జల గూడెం మహదేవమ్మ, సెంట్రల్ యూనివర్శిటీ సునీతలకు జరిగింది. మూడు రెట్లు దారుణం అని లోకానికంతటికీ తెలుసు. దేశంలో రోజూ జరిగే మానభంగాల్లో మూడొంతులు దళితులకు జరుగుతున్నవే. లోకానికి ఇదీ తెలుసు. మరి ఇవన్నీ ఎక్కడికక్కడ తొక్కి పెడుతున్నయ్. ఎంచేతనంటావ్? "అని ఓ అగ్ర వర్ణపు నవ్వు నవ్వి" అక్కడే వుంది కీలకం. అది నువ్వు అర్థం చేసుకుంటే ఇంత హైరానాపడవు. రెస్ట్ తీసుకో" అనేసి వెళ్ళిపోయాడు రామభద్రం.

శరీరాల్ని రేప్‌చేసే ఒక యాదగిరినీ, ఏకంగా ఒక జాతి జాతినే రేప్ చేసే రామభద్రాన్ని కళ్ళారా చూశాక గాయత్రి రెస్ట్ తీసుకోగలదా?!

(కర్నూలు జిల్లా మద్దికెరలో దళిత యువతి మార్తమ్మపై పాశవికంగా అత్యాచారం చేసి హత్యచేసిన సంఘటనకు నిరసనగా రచయిత)

13

# కర్రోడు

## కాలువ మల్లయ్య

"Face is the index of the Mind" అన్న వాక్యం నాకు వర్తించదనే నా అభిప్రాయం.... ఎందుకంటే నా ముఖం చూస్తున్న వాళ్లెవరూ నా కంటూ కొన్ని అభిప్రాయాలున్నాయని అనుకోరు... నాలో ఎప్పుడూ ఏవేవో భావాలు సుళ్ళు తిరుగుతుంటాయని నేను ఉన్నత విద్యావంతుడినని, సామాజిక సమస్యల మీద ఎన్నో రచనలు చేసానని నన్ను చూస్తే ఎవరికీ అనిపించదు.... గొప్ప మేధావిని కాకున్నా నేనూ మేధావినేనని, ఏ అభిప్రాయలూ లేకుండా బతకడం మృత ప్రాయమైందని భావిస్తుంటాను నేను..

ఏమాత్రం అందగా లేని నన్ను సౌందర్యారాధకుడని కూడా నన్ను చూస్తున్న వాళ్ళెవరూ అనుకోరు...నల్లవాడిగా, దళితుడిగా ఎన్నో అవమానాల నెదుర్కొన్న నాలో సౌందర్యారాధన ఉందంటే ఎవరూ నమ్మరు...నన్ను నెలరోజులుగా ఓ నల్లటి కుర్రాడి రూపంలో ఓ సమస్య వెంటాడుతుంది. ఆ పిల్లవాడెవరో నాకు తెలియదు. నల్లగా మసికుండలా... ఆరిపోయిన కొర్రాయిలా...సింగరేణి బొగ్గులా...నల్లతనమంతా మూర్తీభవించినట్టుగా ఉంటాడతను...అతన్ని చూస్తేనే నా కసహ్యం...ఒక్కోసారి ఛీకొస్తుంది కూడా...నేను ప్రస్తుతం ఓ యూనివర్శిటీ కే వైస్‌ఛాన్సలర్‌గా వున్నాను. మేధావిగా, నీతిమంతుడిగా నాకు పేరు ప్రతిష్టలూ వున్నాయి. అలాంటి నాకా కుర్రాడో సమస్య కావడం చికాకుగానే ఉంది. మా ఇంట్లో ఎవ్వరూలేని సమయం చూసినా దగ్గరికొస్తున్నాడు. తనకేదైనా పనిప్పించమని వేడుకుంటున్నాడు.

నేనెంత చీదరించుకుంటున్నా కసురుకుంటున్నా ఆ రోజుకు వెళ్ళిపోతున్నాడు. తర్వాత మళ్ళీ వస్తున్నాడు...నేను తలుచుకుంటే అతనికేదైనా సాయం చేయగలను. కాని అతన్ని చూస్తుంటే చేయాలనిపించడం లేదు.

ఇకారోజు ఆ కుర్రాడితో ఏదోటి తేల్చుకోవాలనుకున్నాను...ఇక ముందు నా దగ్గరికి రాకుండా చేయాలనుకున్నాను...ఆ కుర్రాడు రానే వచ్చాడు...

"నేను నీకేం సాయం చేయలేనని మొత్తుకుంటున్నానా దగ్గరకే ఎందుకొస్తున్నావు? పో.... ఇంకెవరి దగ్గరికైనా పో" అన్నానుకోపంగా.

"నాకెవరూ లేరుసార్! అమ్మ ఒక్కతే వుండేది. ఆమెను నేను కడుపులో పడింతర్వాత వెలివేసారట. ఆమె రెన్నెల్ల క్రితమే చనిపోయింది...చనిపోయేప్పుడు మీ దగ్గరికి పొమ్మని చెప్పిపోయింది. బంధువులెవరూ నన్ను దగ్గరకు రానివ్వరు. నేనెవరి దగ్గరికని పోవాలి?" అన్నాడు దీనంగా.



"నా దగ్గరకెందుకు పొమ్మంటుంది మీ అమ్మ మీనాన్నా లేడా?" ప్రశ్నించానతన్ని. "ఉన్నాలేనట్టే సార్."

ఆ బాబుపైనాకున్న అసహ్యాన్ని ఎన్ని విధాల ప్రదర్శించినా వాడు నన్ను వదలకపోవడం నాకు కోపం తెప్పిస్తుంది. పైగా నాపై ఏదో హక్కున్నట్టు వాడి బాగోగులు చూడటం నా బాధ్యతే అయినట్టు ప్రవర్తిస్తున్న ఆ కుర్రాడిని కొంత కఠినంగానే మాట్లాడి పంపిచాలనుకున్నాను.

"మనిషికోమాట. పశువుకో దెబ్బన్నారు. నీకు మాటలతో సరిపోకుంటే తన్ని పంపించమంటావా? పొమ్మని ఎన్నిసార్లు చెప్పాలి? నాదగ్గరకు రావద్దని ఎంత చెప్పినా వినవేంటి? ఏంటిదంతా?" ఆగ్రహం వెళ్లగక్కాను.

అయినా ఆ బాబేం తొణకలేదు.

"ఎందుకుసార్..మీరు నన్ను అంతగా అసహ్యించుకుంటున్నారు. నేనేం తప్పు చేసాను?"

"నీ ముఖాన్ని చూస్తే ఎవరు మాత్రం అసహ్యించుకోకుండా ఉంటారు?"

నామాటలతో మసిబొగ్గులా వున్న ఆకుర్రాడి ముఖం మరింత నల్లబడింది.... చిన్నబోయింది... కొద్ది క్షణాలేం మాట్లాడలేదతను.

"సార్....నేను పుట్టగానే కోల్ ఇండియా బొగ్గు ముద్ద పుట్టిందన్నారట...నేనెలా ఉన్నానో నాకు బాగానే తెలుసుకాని నాకీ రూపం రావడానికి కారణం నేను కాదనుకుంటాను..." అన్నాడు నన్ను చూస్తూ.

"కారణమెవరైతే ఏం కాని నేను నీకేం చేయలేను. నన్ను వేధించకు" అన్నాను.

"నన్నందరూ కర్రోడని వినుక్కుంటారు సార్...నేను కర్రెగా వున్నమాట నిజమే. అందుక్కారణంమా అమ్మోనాన్నో అయ్యుంటారు...మానాన్న ఎలాగుంటాడో నాకు తెలియదు...మా అమ్మ మాత్రం సినిమా నటికంటే అందంగా, మెరుపు తీగవలే వుండేది. మరి నా కొచ్చింది. మా నాన్నావారసత్వమే కద! నాకీ కర్రోడి రూపమిచ్చిన మానాన్నను తిట్టాలాసార్..."

కర్రోడన్న మాట నా హృదయానికి సూటిగా తగిలింది..... ఎక్కడో మనసు పొరల్లో కెలికినట్లయింది...నా హృదయాంతరాలను తాకినట్టయింది. కుర్రాన్ని తొందరగా వదిలించుకోకుంటే ప్రమాదమే ననుకున్నాను.

"నీ కథంతా వినాల్సిన అవసరం నాకేం లేదు...వెళ్లిపో" విసుక్కుంటూ అన్నాను. అసహ్యించుకుంటున్నారు. నేనంటే మీకెంత ఏవగింపో మిమ్మల్ని చూస్తేనే అర్థమవుతుంది. కాని ఒక్కసారి మీరు మీ ముఖాన్ని అద్దంలో పరీక్షగా చూసుకోండి...మీరేపాటి అందంగా వున్నారో మీకే అర్థమవుతుంది. మీ చిన్ననాటి ముకాన్నోసారి జ్ఞప్తికి తెచ్చుకోండి. అంటే సరిగ్గా నా వయస్సున్నప్పటి ముఖాన్ని. ఆముఖం కంటే అందంగా, భిన్నంగా ఉందేమో గుర్తు తెచ్చుకోండి. మీ ఇప్పటి పెద్ద మనిషి డ్రెస్సును తొలగించి చిరిగిన నిక్కరు, అంగీలతో మిమ్మల్ని మీరు చూసుకోండి. మీకు నాకు ఏమన్నాతేడా వుందేమో అర్థమవుతుంది. సరే...పోతున్నామ సార్...ఉన్నొక్క అమ్మపోయింది. చనిపోతూ మీ దగ్గరికెళ్ళమని చెప్పింది. మీకేమోనన్ను చూస్తేనే అసహ్యం.....నేబోతున్నాను........ ఎంతోమంది దిక్కులేని పిల్లల్లా చెత్తకుండీల వెంటో మురికికాలువల పక్కనో హోటళ్లలో చాకిరీ

చేసుకుంటూనే బతుకుతాను. మా అమ్మపేరు చెప్పలేదు కదా సార్... సుజాత" అని నాకు మాట్లాడటానికి అవకాశ మివ్వకుండానే గబగబా వెళ్లిపోయాడు.

ఆ కుర్రాడి మాటలు నన్ను ఆలోచనలో పడవేసాయి. నాలో కల్లోలం రేపాయి. కర్రోడు...కర్రోడు...కర్రోడు ఈ మాటలేనా చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి.

లేచి నిల్చున్నాను...అద్దం ముందుకెళ్లాను...నలుపంతా రాసిగా పోసినట్టున్న నా ముకాన్ని ఆ కుర్రాడి ముఖంతో పోల్చుకున్నాను...నా ముఖమే మరింత నల్లగా కనబడింది. నా చిన్నప్పటి ముఖాన్ని కళ్లముందు సాక్షాత్కరింప జేసుకున్నాను... ఆ రూపం కుర్రాడి రూపం ముమ్మూర్తులా ఒకటి లాగే కనిపించాయి... ఆ కుర్రాడిలో చిన్ననాటి నా ప్రతిబింబాన్ని చూసాను. ... అంటే ఆ బాబు ఆబాబులో నా పోలికలు...తల్లిపేరు సుజాత.

నాలో రకరకాల సంఘర్షణ

నాలుగేళ్ల కింద వరకు నేననుభవించిన క్షోభ, అవమానాలు నా కళ్లముందు కదులుతున్నాయి...నా తల్లి విమల...నా భార్య మాలతి...ఇంకా సుజాత... నా బాల్యం ఒక్కొక్కటే తెరమీది బొమ్మల్లానా కళ్లెదుట కదులుతూ నన్ను గతంలోకి లాక్కెళుతున్నాయి.

డెకొలాం కాట్‌పై వేస్తున్న కుర్లాన్ పరుపు, మీద వెల్లకిలా పడుకున్నాను.

"కర్రోడా...ఓరి కర్రోడా...ఇట్రారా" అన్న అమ్మ పిలుపు విని నేను అమాయకంగా నవ్వాను... నా కప్పుడు ఏడెనిమిదేళ్లుంటాయేమో...అంతకు ముందా పిలుపును ఎన్నోసార్లు విన్నా. నాకు జ్ఞాపకమున్నది మాత్రం ఆరోజునుంచే.

నేను నవ్వడం చూసి అక్కడే వున్న మా మేనమామ, అత్త నవ్వారు.

"వానికి పేరుందికదా! కృష్ణా అని పిలిస్తే నీదేం బోతుంది? పిల్లలనలా కించపరుస్తూ పిలవడమేం బాగుండదు విమలా!" అన్నాడు నాన్న.

"కృష్ణా అన్నా నలుపేకదబావా..అక్క అచ్చ తెలుగులో పిలుస్తుందేంబావో ...నీకు నీ రూపంలో వున్న కొడుకును చూసుకుంటే ముద్దు ..ఎంతైనా కాకిపిల్ల కాకికి ముద్దేకదా!"

మా మేనమామ మాటలకంతా నవ్వారు.

సాధుస్వభావుడు, సజ్జనుడైన మా నాన్న వాళ్లనేమన్లేదు.

అయితే వాళ్లెందుకు నవ్వుతున్నారో నా కర్థం కాలేదు.

మానాన్న ఒక్కడే ఉన్నప్పుడోసారి అడిగాను.

"కర్రోడంటే ఏంటినాన్నా?"అని...

"నల్లగా, అసహ్యంగా వుండే వాళ్లను కర్రోడంటారు...అదో తిట్టులాంటిది. పసివాడివైన నీకుదాన్ని గూర్చి తెలియక నవ్వుతున్నావు." అని నన్ను దగ్గరకు తీసుకున్నాడు నాన్న.

అప్పుడు కాని నన్ను కర్రోడంటూ నవ్వేవాళ్లెందుకునవ్వుతారో అర్థం కాలేదు. కాని నన్ను కన్నతల్లే తన పిల్లల రూపాలను కడుపులో దాచుకొని ఉండలక తల్లే ఇలా పిలవడం నాకు తీరని వేదననే కలిగించింది.



అప్పట్నుంచి నన్నెవరు క(్రోడంటూ నవ్వే వాళ్లెందుకు నవ్వుతారో అర్థం కాలేదు. కాని నన్ను కన్నతల్లే తన పిల్లల రూపాలను కడుపులో దాచుకొని ఉండక తల్లే!

"భార్యా భర్త లిద్దరిలో ఎవరి వ్యక్తిత్వం డామినేట్ చేస్తే పిల్లలకు వాళ్ల లక్షణాలు వస్తాయంటారు. అందుకే మీ నాన్నను నేనే డామినేట్ చేసాను...అయినా నీకు ఆయన రంగురానే వచ్చింది."

నన్ను తన వెంట ఎక్కడికీ రాకుండా ఆజ్ఞాపించిందామె.

నా కంటె కురూపులుగా వున్న ఎంత మంది నల్లవాళ్లున్నారు. మరి వాళ్లంతా నాలాగే అవమానాల నెదుర్కొంటున్నారా? ఎన్నో సార్లనుకున్నాను.

నేను దళితుడిగా పుట్టడం. దానికి తోడు అంత నల్లగా వుండడం నేనవమానాలు పొందడానికి తోడయ్యాయనుకున్నాను.

"వయసుతో వంకలు తీరుతాయంటారు...నువ్వు పెరుగుతున్నకొద్ది నీ శరీరంలో వస్తున్న మార్పులు, వయస్సు నీ శరీరాన్ని ఆకర్షణీయంగా తయారుచేస్తాయి" అన్నాడింకో మిత్రుడు.

అదృష్టవశాత్తునాకు మా నాన్న ఇంటలిజెన్స్ వచ్చింది.

నేనెదుర్కొంటున్నంత అవమానాలతో నాలో పట్టుదల కసి పెరిగింది.

"నవ్విన నాపచేనే పండుతుందంటారు...ఎన్నో అవమానాల నెదుర్కొన్న ఈ సమాజంలో నువ్వు గౌరవింపబడాలి. అందుకొకే మార్గముంది...నువ్వు బాగా చదువుకోవాలి...ఉన్నత స్థితిలోకి రావాలి...' ' అని చెప్పాడు నాన్నోరోజు.

"కృష్ణా! నాకున్న ఉద్యోగం వల్లనీకు ఆర్థికపరమైన ఇబ్బందులు లేవు...నేనైతే ఆ ఇబ్బందులూ ఎదుర్కొన్నాను...నీ కులం పేదరికం, నా నలుపు వర్ణం అన్నీ నన్ను అవమానానికే గురిచేసాయి. నేను బంధువులింటికి ఇతర పార్టీలకు వెళితే కూరలు వడ్డించడంలో కూడా విచక్షణ చూపేవారు. ఆయాలు సాయాలతో వున్న మంచి మాంసం ముక్కలు వాళ్లు తినేవారు. నాకింత బొక్కల పులుసు పోసేవారు. మంచి మంచి ముక్కలు వాళ్లు తింటుంటే నాకు కళ్లంట నీళ్లొచ్చేవి. ఈ అవమానా లన్నింటికీ ఒక్కటే సమాధానం...నువ్వందరిలో గుర్తింపబడేలా చదివాలి...ఉన్నత స్థితిలో కెళ్లాలి" అన్నాడు మరోసారి నాన్న.

నాలో పట్టుదల పెరిగింది. బాగ చదపడం మొదలు పెట్టాను...రెండేళ్లలో అన్నిట్లోనూ నాకే ఫస్టుమార్కు రావడం మొదలైంది.

"క(్రోడా క(్రోడా...నువ్వు క్లాసు ఫస్టురా" అన్నాడు రాజిరెడ్డిసారు.

"చూడడానికి కట్లున్నాడు కాని క(్రోడు చదువుల ఉషారే..."

మెచ్చుకోలులోనూ వ్యంగ్యం....తిట్టుపదం...

నేనే ఫస్టు రాంకులు తెచ్చుకుంటున్నామా అమ్మకు నాపై ఉన్న చిన్నచూపు క(్రోడా అని పిలవడం పోలేదు...బయట అవమానాలు జరుగుతనే వున్నాయి.

నేను కాలేజీ కొచ్చినా చిన్నతనం నుండీ నన్నవమానాలకు గురిచేస్తున్న అంశాలు నన్ను నా మనసును తొలుస్తూనే వున్నాయి. అప్పుడే నాలో అన్వేషణ ప్రారంభమైంది.... ఈ నల్లతనం యొక్క

మూలాలను వెతుకుతూ లోతుల్లోకి వెళ్లడం ప్రారంభించాను...నాలో కొన్ని ఆదర్శాలు చోటు చేసుకుంటున్నాయి. మనుషులను ప్రేమించడం మొదలు పెట్టాను. బాగా చదువుకుంటే గౌరవం కాళ్లదగ్గరకు నడిచి వస్తుందనుకుంటూనే దేనికోసమో వెతుకుతున్నాడు. ముఖ్యంగా మా అమ్మ నన్ను కర్రోడా అని పిలుస్తూ చేస్తున్న గాయానికి మందుగా మా అమ్మకంటే అందమైన అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలన్న నిర్ణయం నాలో బలపడుతుంది. అందుకు మార్గం చదువుద్వారా లభించే ఉన్నత స్థితే....

నా చదువు, పరిశోధన సమాంతరంగానే సాగుతున్నాయి.

"అమ్మా ! భారతీయ పురాణాల్లోని రాముడు, దశావతారాల్లో సంపూర్ణావతారంగా చెప్పబడే శ్రీకృష్ణుడు నల్లనివాళ్లే కదమ్మా! నీకు నలుపంటే ఎందుకంత అసహ్యం" అన్నాను.

"నువ్వు నల్లగున్నావని వాళ్లతో పోల్చుకుంటున్నావా? అని పురాణ కథలు మాత్రమే" అంది అమ్మ.

కథలు అనే దగ్గర నొక్కి మరీ చెప్పింది.

"బాబూ! శ్రీ కృష్ణా అమ్మ ఏదో అంటుందని నువ్వీ విషయం గూర్చి పదే పదే ఆలోచించకు. అమ్మ పైపై మెరుగుల బతుకులనే చూస్తుంది. ఆమెదదో తీరు మనస్తత్వం. దళితులచే గిరిజనులచే, రాక్షసులచే ఇంకెంతో మంది జనాలతో పూజింపబడే లయకారకుడైన శంకరుడు నల్లనివాడే. అయితే ఈ నలుపు తెలుపు భేదం అనాదిగా ఏదో రూపంలో కొనసాగుతూనే వుంది. వున్నవాళ్ల, ఉన్నత కులాల వాళ్ల దేవుళ్లు అందంగా ఉంటే, దళితుల, పీడిత కులాల వాళ్ల దేవుళ్లు ముఖ్యంగా క్షుద్ర దేవతలే...వాళ్లు భయంకరంగానే ఉంటారు. ఈ విచక్షనాల జోలికి పోకుండా బాగా చదువుకో' ' అన్నాడు నన్ను నిమురుతూ నాన్న.

నా జీవిత ఆశయాన్ని నెరవేర్చుకుంటానికి మంచి స్థితిని పొందడానికి చదువునే మార్గంగా ఎన్నుకొని అహర్నిశలూ చదువుతున్నాను. ఇతర విషయాలను అధ్యయనం చేస్తున్నాను.

పోస్ట్ గ్రాడ్యుయేషన్, డాక్టరేట్ డిగ్రీ సంపాదించుకున్నాను. నాకున్న దళితుడనే సర్టిఫికెట్టు నేరుగా యూనివర్శిటీలో రీడర్‌గా జాయినయ్యాను.

నా చదువు., ఉద్యోగం నాకు మెరుపు తీగలాంటి అందమైన అమ్మాయితో పెళ్లయేలా చేసాయి. మా అమ్మకంటే ఎన్నో రెట్లెక్కువ అందంగా వున్న నా భార్యను చూపి అమ్మ దిక్కు గర్వంగా చూసాను.

" కాకి ముక్కుకు దొండపండంటారే. అలా ఉంది. మీ జంట. మీ నాన్న పరంపరే మీకొచ్చింది. ఆ అమ్మాయేం సంతోషంగా ఉంటుందని నేననుకోను." అన్న మా అమ్మమాటలు నాకు హృదయ శల్యంగానే వున్నాయి... అమ్మా మాటలంటున్నపుడెవరూ లేకపోవడం కొంత నయమైంది.

"ప్రేమ, అందం అనేవి హృదయ సంబంధమైనవి...మాలతి నన్ను మనస్ఫూర్తిగా ఇష్టపడింది. కాబట్టే పెళ్ళి చేసుకుంది" అన్నాను మా అమ్మతో

"సరే మీరు సుఖంగా ఉండటం కంటే నాకు కావాల్సిందేముంది?" అంది అమ్మ.

అవమానాల నెదుర్కొన్న నాకు. నా భార్య దగ్గర ఓదార్పు లభిస్తుందనుకున్నాను. ఆమె దగ్గరికెళ్లి కౌగిట్లోకి తీసుకోబోయాను.



నన్ను చూసి గజగజా వణుకుతూ దూరం జరిగిన మాలతిని చూస్తూ అలాగే నిల్చున్నాను. చిన్న చేతులను దగ్గరకు తీసుకున్నాను. కొద్ది సేపాగి మాలతి-

"మీరంటేనాకేమాత్రం ఇష్టంలేదు. ఓ విధంగా చెప్పాలంటే అసహ్యం కూడా. మిమ్మల్ని పరీక్షగా చూస్తేనే నా ఒళ్లు జలదరిస్తుంది. మీ చేయి తాకితే తేళ్లు జెర్లు పాకినట్టే...దయచేసి నన్నిప్పుడు ముట్టుకోవద్దు" అంది.

ఆ మాటలు నా పక్కలో బాంబు పేలినట్టే పేలాయి. నా హృదయం రంపపు కోతకు గుర్తైంది. నా నోటి నుంచి ఒక్కమాట కూడా పెగిలిరాలేదు.

"మీ అకారాన్ని రంగును చూస్తేనే నాకు రోత పుడ్తుంది...కాటుక కొండలా కాలిన కొరకంచులా ఉన్నమీకు నాలాంటి స్త్రీ కావాల్సి వచ్చింది? గంతకు తగ్గ బొంత నన్నట్టెందుకు చేసుకోలేదు?" సూటిగానే అంది మాలతి.

ఆ మాటలు నా గుండెపై సూదులు గుచ్చినట్టే బాధించాయి.

"నేనెందుకు నీలాంటి అందగత్తెను కోరుకున్నానన్న విషయం తర్వాతగాని ఇష్టం లేని దానివి నువ్వెందుకు నన్ను చేసుకున్నట్టు ?" అన్నాను.

"పురుషుడి అందంతో పనిలేదని మీరు మంచి స్థితిలో వున్నారని, మీతే నేనేదో సుఖపడ్తానని నన్ను బలవంతంగా వివాహాని కొప్పించారు మా పెద్దలు. నా గొంతు కోసారు... నాకు చిన్నతనం నుంచీ నలుపంటే అసహ్యం. అయినా మీతో ఈ పెళ్లి తప్పలేదు. నేను మీతో కాపురం చేసినా కళ్లు మూసుకునే తప్ప మనస్ఫూర్తిగా కాదు...దయచేసి కొద్ది రోజులు నన్ను వదిలిపెట్టండి" అంది మాలతి.

నా మనసు తీరని గాయానికి గురై బాధపడ్తుంటే ఆ రోజు రాత్రంతా ఆలోచనతోనే జాగరణ చేసాను. తాళి కట్టిన అధికారంతో భార్యనైనా సరే బలవంతంగా ఆక్రమించుకోవడం నా నైజానికి పడనిది. నా మనసంతా వేదనతో కాగిపోతుండగా నిద్రలేని రాత్రులెన్నో గడిపాను. నెలరోజుల తర్వాత తల్లిగారింటికి పోయి వచ్చింది మాలతి... మా దేహాలు కలుసుకోవడాని కనుమతించింది... తాను చేస్తున్న కాపురం మనస్ఫూర్తిగా మాత్రం కాదని మరోసారి స్పష్టంగా చెప్పింది.

"అటువంటప్పుడు బలవంతపు కాపురాలు దేనికి? విడాకులు తీసుకొని నీ కిష్టమున్న అందగాడితో పెళ్ళి చేసుకోవచ్చుగదా..."

నామాటలు విని సివంగిలా లేచింది మాలతి.

"అలాంటిదాన్నయితే పెళ్లెందుకు చేసుకునేదాన్ని? పెళ్ళంటే మీరేమనుకుంటున్నారు? అటు పెళ్లి ఇటు విడాకులా మనసుకు నచ్చని వాళ్లంతా విడాకులు తీసుకుంటూ పోతే మనదేశంలో మిగిలే జంటలు తక్కువే. మీరంటే ఇష్టమున్నా లేకున్నానా మనసులోకి ఏ మగాడు రాడు. మీరు నిశ్చింతగా ఉండండి. పెళ్లనే ఒప్పందానికి నేనే జీవితమంతా కట్టుబడే వుంటాను" అంది.

"మరలాంటప్పుడు మనస్ఫూర్తిగానే కాపురం చేయొచ్చుగదా?"

"అది నా వల్లకాదు. మనసులో ఓ ముద్ర పడింతర్వాత దాన్ని తొలగించుకోవడమంత సులభంకాదు. అయినా ప్రయత్నం చేస్తాను. అందుకుచాలా కాలం పట్టవచ్చు." అంది మాలతి....

నన్ను ద్వేషిస్తూనే నా శరీరాన్ని అసహ్యించుకుంటూనే నాతో కాపురంచేస్తానంటున్న మాలతి మనస్తత్వం నాకు మింగుడు పడడంలేదు. బహుశ ఏభార్యా తన భర్తతో ఇలాంటి మాటలనలేదేమో! నేనుమా నాన్న పరం పరను మోస్తుంటే నా భార్య మా అమ్మపరంపరను మోస్తానంటుంది. ఆమె మాటలు నన్ను తొలుస్తూనే వున్నాయి. చిన్నప్పట్నుంచి పడ్తున్న అవమానాలకు పెళ్లితోనైనా తెరపడుతుందనుకుంటే ఆ అవమానాలు నన్ను శాశ్వతంగా వెంటాడబోవడం నాకు భరించరాకుండానే ఉంది. నేను భర్తనే అయినా నన్ను క్రోడా బొగ్గుకాలి అంటూ అవమానకరంగా పిలుస్తూనే ఉంది మాలతి. ఆమెను మెల్ల మెల్లగా మార్చుకోవచ్చని నాకు నేను సమాధానం చెప్పుకున్నాను.

నలుపు, దళిత శబ్దాలకు గల మూలాలపైనా అన్వేషణను మరింత ఉధృతం చేసాను. అనేక పుస్తకాలుతిరగేసాను. మేధావులనుకలుసుకున్నాను...వాటిపై వచ్చిన డాక్టరేట్ థెసిస్‌లనూ చదివాను. అనేక సామాజిక విషయాలను తీసుకొని వ్యాసాలు రాసి ప్రచురించడం మొదలు పెట్టాను. మధ్య మధ్యన మాలతితోఅనేక విషయాలను మాట్లాడుతూనే వున్నాను.

“మనపురాణాల్లోని అష్టావక్రుడు కురూపి....కాని అసాధారణ మేధావి. అతని రూపం వల్ల కీర్తి ప్రతిష్టలకేం భంగం కలుగలేదుకదా!”

“కబుర్లు కథలు చెప్పడానికి బాగానే వుంటాయి. కాని నిజజీవితం వేరు.”

“మాలతీ అందమంటేకేవలం ఎర్రతోలు తీర్చిదిద్దినట్టున్నకండరాల సమూహమేనా?పైతోలును తీసి చూస్తే లోపలుండేదంతా మాంసపు ముద్దలన్న విషయాన్ని మరచిపోవద్దు....శారీరక సౌందర్యం కంటే హృదయ సౌందర్యం ముఖ్యం....”

“అంత తెలిసిన మీరు హృదయ సౌందర్యమున్న తుమ్మ మొద్దులాంటి ఓ అమ్మాయిని చేసుకోక నన్నెందుకు చేసుకున్నట్టు?”

ఆమె ప్రశ్నకు నా దగ్గర సమాధానం లేదు.

నా రచనలతో నేను మేధావిగా పేరు తెచ్చుకుంటున్నాను. ఉద్యోగంలోనూ అంచెలంచెలుగా ఎదుగుతున్నాను. నా కున్న కులం సర్టిఫికెట్ ఉద్యోగంలో ఎదుగుదలకు మరింత దోహదం చేస్తుంది.

“మన పిల్లలకు మీ రూపు రాకూడదు...రాదుకూడా” అందో రోజున మాలతి.

“అదెలా సాధ్యం? పిల్లలకు తల్లి దండ్రుల్లో ఎవరివైనా లేక ఇద్దరివి కలిసైనా పోలికలు రావచ్చుకదా” అన్నాను.

“ఎవరి జీన్స్ డామినేట్ చేస్తే పిల్లలకు వాళ్ల లక్షనాలొస్తాయంటారు. నా జీవితాన్ని మీలాంటి క్రోడికి ధారదత్తం చేసినందుకు నాకిదన్నామిగలనివ్వండి.”

ఆమె తర్కంలో ఎక్కడో లోపమున్నట్టనిపించింది నాకు.

నేనెన్నివిధాల ఎదుగుతున్నా నామెతో క్రోడా అని పిలువకుండా నిలుపలేకపోతున్నాను. ఆమె నన్నలా పిలుస్తూ అవమానిస్తుంటేనాలోని పరిశోధనా కాంక్ష మరింత లోతులకెళ్లడానికి దోహదపడింది.



భగవంతుని రూపాన్నే నల్లగా చేసింది. బహుశా నల్లవాళ్లలోదళిత జాతుల్లో ఆత్మ విశ్వాసాన్ని పెంచడానికేమో ననిపించింది నాకు. దక్షిణాఫ్రికాలో మహాత్మాగాంధీ లాంటివాడేవర్ణ వివక్షకు గురికావడం గూర్చి చదివిన నాకు బాధే కలిగింది అతడు పొందిన అవమానాలు అతన్ని మహాత్ము డవడానికి దోహదం చేసాయి. ప్రపంచ వ్యాప్తంగాజాతి, వర్ణ, వివక్షమీద జరుగుతున్న జరిగిన పోరాటాలు నా దృష్టిలో కొచ్చాయి. అందులో నల్లవాళ్ల పాత్ర ఉత్తమోత్తమంగా ఉండటం గమనించాను.

బానిస బతుకులకు వ్యతిరేకంగా తనవారి కోసం పోరాడి బలైపోయిన మొట్టమొదటి తిరుగు బాటుదారుడు స్పార్టకస్‌విప్లవానికి చిహ్నం. అతడు నల్లవాడే నన్న సత్యం నాలో ఆత్మ విశ్వాసాన్ని పెంచింది.

శ్వేత జాతీయుల జాత్యంకారానికి వ్యతిరేకంగా అవిశ్రాంత పోరాటం సలిపిన నెల్సన్ మండేలా కూడా నల్లటివాడే. అతని రంగు అతని గొప్పతనానికేం భంగం కలిగించిందని నన్ను నేనే ప్రశ్నించు కున్నాను.

ప్రపంచ సాహిత్యంలోనే తలమానిక్యాలవంటివైన షేక్స్‌పియర్ ప్రఖ్యాత నాటకాల్లోని నాటకంలో నాయికక్లియోపాత్ర నల్లటిదేనంటారు.

మిత్రులతోనూ తోటి ప్రొఫెసర్లతోనూ రచయితలు, మేధావులతోను అనేక విషయాలు చర్చించాను.

''కృష్ణా! ఈ నలుపు తెలుపుకు మధ్యగల మూలాలు, వేళ్లు మనకు చాలా వెనక్కి వెళితే దొరుకుయి. ఇవి ఆదిమ చరిత్రకాలం నుంచీ వున్నాయనిపిస్తుంది. నలుపుపీడిత జాతికి చిహ్నం. పీడిత కులాల్లోచాలామంది నల్లగానే ఉండటం మనం చూస్తూనే వున్నాం. విదేశీయులైన ఆర్యులు మన దేశం పైకి దండెత్తి మన దేశంలో ఎంతో కాలం నుంచి ఉంటున్నద్రవిడులను దక్షిణాదికి తరిమివేసారు. ఆ ద్రావిడులు నల్లనివారే. ఇప్పటికీ ఆర్యద్రవిడ తేడాలు మన దేశంలో కనీసం మాటల్లోనైనా ఉండటం మనం గమనిస్తూనే వున్నాం. ఉత్తర భారతీయులకు తాము ఆర్యులమని, తామే పాలకులమన్న భావం నరనరాన జీర్ణించుకొనుంది. ఉత్తరాదివారికి దక్షిణాదివారు, ఉన్నత కులాలవారికి చిన్న కులాలవారు నల్లవారు. మనం విదేశాల కెళితే భారతీయులంతా నల్లవాళ్లే వాళ్లకు. మన దేశంలోని అసలు భారతీయులు అంటే మొదట్నుండీ ఉండే ద్రావిడులు నల్లవారుగానేలెక్కింపబడ్డారన్న విషయం మరచిపోవద్దు'' అన్నాడు

సోషియాలజీ ప్రొఫెసర్ సూర్యారావు.

అతని విశ్లేషణ, నాకెంతో నచ్చింది. అందులో ఎంతో లోతుకనబడింది. సూర్యారావు దిక్కు ప్రశంసా పూర్వకంగా చూసాను.

''అమెరికాలో కొన్ని హోటళ్లముందు No Entrance for Black and Dogs అనే బోర్డులున్నాయంటారు...ప్రపంచాన్నే శాసించే స్థితిలో వున్న అమెరికాలో ఇలాంటి జాతి వివక్ష ఇంకా ఏదో రూపంలో కొనసాగుతుండడం సిగ్గుచేటైన విషయమే. ఈ నలుపు తెలుపు శ్వేత శ్వేతే తర ఆర్యద్రవిడ, పాలక పాలిత వివక్షలు ఒకదానితో ఒకటి సంబంధమున్నవాటిగా కనబడ్తున్నాయి నాకు....'' అన్నాను.

"మనవాళ్లింకా ఎన్ని చేసారో చూడు. రాక్షసులని, దేవతలని...రాక్షసులు నల్లగా వికృతంగా వుంటారని దేవతలు అందంగా మంచివారుగా వుంటారని...రాముడు, కృష్ణుడులాంటి వాళ్లకు నలుపు రంగిచ్చినా అది నలుపు కాదని నీలమేఘశ్యాముల వర్ణమని చెప్పారు." అన్నాడు మరో ప్రొఫెసర్.

"నలుపును విచారానికి, నిరసనను తెలపడానికి చిహ్నంగా వాడుతున్నాం. మన సినిమాల్లో గూండాలను, రౌడీలను నల్లగా చూపిస్తారు. ఉత్తమ పాత్రలకు సాంస్కృతం, నీచపాత్రలకు ప్రాకృతంవాడామని సాంస్కృతిక లాక్షణికులు చెప్పారు. అలాగే గ్రాంథికం, మాండలికం లాంటివి. ఇవన్నీ పరస్పర సంబంధం కలిగి వున్నవే. వీటన్నిటి వెనుకా సాంస్కృతికాంశాలెన్నో ఇమిడి వున్నాయి. మాండలికాలను చిన్నచూపు చూసే మేధావులెంతో మంది ఇప్పటికీ వున్నారు"అన్నాను నేను.

"కృష్ణా! ఒక్క నిమిషం గుర్తుంచుకో...సర్వ సంపదలకు సృష్టికర్త దళితుడు. అడవులను కొట్టి సేద్య భూములుగా మార్చింది దళిత జాతులవారే. పంటలు పండించేది అన్ని ఉత్పత్తి శక్తులతో నేరుగా సంబంధాలుండేది దళితుడికే...డప్పుకొట్టేది చెప్పులు కుట్టేది చస్తే మోసేది వెట్టి చేసేది దళితులే...ఉత్పత్తి కోసం తన సర్వశక్తులనూ ధారబోస్తున్నది దళితులే అన్నాడు సూర్యారావు.

నలుపుకిన్ని మూలాలున్నాయని ఇంత చరిత్రుందని లోతుల్లోకి పోతేగాని తెలియలేదు. మరింత లోతుల్లోకి పోయి చూస్తే మరెన్నో విషయాలు తెలిసాయి. ఆదివాసైన మనుష్యుడు దళితుడే...ఆది కవియైన వాల్మీకి గిరిజనుడే. భారత రాజ్యాంగ నిర్మాణ దళితుడే అదిభిక్షువు నల్లనివాడే.

దళిత మూలాలన్నిటినీ వెతికిన నాకు నలుపు చరిత్రను తెలుసుకున్న నాకు నా నలుపు రంగును చూసుకొని బాధ అవమానం పడాల్సిన అవసరం లేదని పంచింది. పైగా అన్ని ఉత్పత్తి శక్తులకు మూలమైన దళితుడిగా పుట్టినందుకు గర్వించాలనుకున్నాను. ఇవన్నీ తెలుసుకున్న నాలో రోజురోజుకూ ఆత్మవిశ్వాసం పెరిగింది.

అనేక సామాజికాంశాలపై దళితుల సమస్యలపై వ్యాసాలు రాసాను. దళితులుగా పుట్టినందుకు కించపడాల్సిన అవసరం లేదని పైగా గర్వపడాలని ప్రముఖ పత్రికల్లో విశ్లేసణాత్మకంగా వ్యాసాలు ప్రచురించాను. అవి దళితుల్లో ఎంతో ఆత్మ విశ్వాసాన్ని కల్గించాయని, కల్గిస్తున్నాయని వాటి ప్రభావం సమాజంపై చాలా వుందని నాకు రోజూ వస్తున్న లేఖలే చెబుతున్నాయి. అయితే ఎంత ప్రయత్నించినా మాలతి అభిప్రాయాలనైతే మార్చలేకపోయాను. నిండైన డ్రెస్ మనిషిలో ఆత్మ విశ్వాసాన్ని పెంచుతుందని అంబేద్కర్ సూటుబూటులో ఎంతో హుందాగా కనబడేవాడని సూటుబూటు వేసుకోవడం ప్రారంభించాను.

నా డ్రెస్ చూసి మాలతి పకపకా నవ్వింది.

"మీరు సూటు బూటు వేసికుంటేదిష్టి బొమ్మకు సూటు తొడిగినట్టుగా వుంది. అంటే మీరిప్పుడు అచ్చంగా దిష్టిబొమ్మలా వున్నారు" అంది.

ఇక అప్పట్నుంచి జీవితంలో మరెప్పుడూ సూటు వేసుకోవద్దని నిర్ణయించుకున్నాను. యూనివర్శిటీ ప్రొఫెసర్నయినా మామూలు దుస్తుల్లోనే వుంటున్నాను.

"అదృష్టవశాత్తు పిల్లలిద్దరికీ నా రంగే వచ్చింది. బతికిపోయారు. నేను చెప్పిందేనిజమైంది" అంది మాలతి.



"నా పోలికలున్నాయి కదా?" అన్నాను నేను.

"పోలికల్నెవరడిగారు? మీ రంగు రానందుకు సంతోషించాలి. వస్తే చచ్చేదాన్నే"

"మాలతీ మనం కలిసి కాపురం చేయబట్టి పదేళ్లు దాటుతున్నా నీలో ఏ మాత్రం మార్పు రాకపోవడం వింతగానే వుంది. నన్ను కర్రోడంటూ పిలవడమూ మానుకోవడం లేదు...నువ్వో అప్సరసవనుకుంటున్నావా? లేక నీ అంత అందగత్తె ఎవరూ లేరనుకుంటున్నావా? నీ తోలును చూసుకొనేకదా నీకంతపొగరు? నేను తలుచుకుంటే నీకంటే ఎన్నో రెట్లు ఎక్కువ అందమున్న స్త్రీతో సంబంధం పెట్టుకోగలను...నీలో సంస్కారమెప్పుడు వికసిస్తుంది? మార్పెప్పుడు వస్తుంది." నా ఉద్యోగస్థితిని మేధావిగా వున్న పేరును మరిచిపోయి కోపంగా అన్నాను"

నా మాటలకు పకపకా నవ్వింది మాలతి

"చీకటికీ మీకు తేడా కనబడదు. అలాంటికర్రోన్ని ఎవరో అప్సరస పెళ్లి చేసుకుంటుందట. చీకట్లో ఏం కర్మ పట్టపగలు కూడా మిమ్మల్ని చూసి ఏ ఆడదయినా దడుసుకుంటుంది. మిమ్మల్ని చూసి ఏ స్త్రీ దగ్గరకు రాదు. మీకంతగా కోరికుంటే ఎవరతోనైనా సంబంధం పెట్టుకోండి. నాకే అభ్యంతరమూలేదు.

ఆ మాటలు నన్ను మరింత వేదనకు గురిచేసాయి. నేనెంత మేధావిగా పేరు ప్రఖ్యాతులు పొందుతున్నా నా దేహం రంగునన్ను వెంటాడుతూనే వుంది. నా దరిదాపులకు కూడా ఏ స్త్రీ రాదన్న మాటలు నన్నుమరింత బాధిస్తున్నాయి. నా ప్రతిభా సామర్థ్యాలకు తోడు నాకున్న దళితుడనే యోగ్యతా పత్రం నను ఏభై ఏళ్లు కూడా చేరుకోలేని వయసులోనే యూనివర్సిటీకి వైస్ ఛాన్సలర్ ని చేసాయి. నా హోదా మరింత పెరిగింది. అయితే భార్య విసిరిన ఛాలెంజ్ నాలో ఆమెను మించిన సౌందర్యవతితో ఒక్కసారైనా శారీరక సంబంధం పెట్టుకోవాలన్నకోర్కెనుబలీయం చేస్తుంది అలాంటి సమయంలో నాతో ఓ అమ్మాయి పరిచయమేర్పరచుకుంది.

ఎంత అందమైన స్త్రీ అయినా ఆమె కాలిగోటికి కూడా సరిపోదు.. సౌందర్యాన్నంతా ఒక్క దగ్గర కుప్పబోస్తే అవుతుంది. అత్యంత నేర్పరియైన శిల్పి చెక్కిన శిల్పంలా ఉందామె అజంతా శిల్పానికి రామప్ప దేవాలయంపైనున్న సుందరి శిల్పానికి ప్రాణ ప్రతిష్ట చేస్తే ఎలా వుంటుందో అంతకంటే అందంగా ఉంటుందామె. కొద్ది రోజుల పరిచయం తోనే ఉపోద్ఘాతమేమీ లేకుండానే

"మీ గురించి మీ రాతల గురించి ఇతర అన్నివిషయాల గురించి నాకు బాగా తెలుసు. ప్రేమించడం లాంటి బరువైన డైలాగులు చెప్పడం నాకిష్టంలేదు. కాని నేను మిమ్మల్ని మనసారా ఇష్టపడుతున్నాను....మీ కభ్యంతరం లేకపోతే మనం పెళ్లి చేసుకుందాం" అంది సుజాత.

ఆ మాటలు విని కొద్దిసేపు తేరుకోలేదు నేను. నా వయసులో సగమైనా లేని అందాలరాశి కర్రోడంటూ ఎందరితోనో అవమానాల నెదుర్కొంటున్న నన్ను పెళ్ళి చేసుకుంటాననడం నాకు దిగ్భ్రాంతినే కలిగించింది.

"నాకు భార్య, పిల్లలున్నారని నీకు తెలుసా? నాలో ఏం చూసి నాతో జీవితం పంచుకోవాలను కుంటున్నావు. నా రూపం కనబడితేనే ఏ ఆడదయినా జడుసుకుంటుందని నా భార్య పదే పదే చెబుతుంటుంది" అన్నాను.

"కావచ్చు ...నా వల్ల మీకుటుంబం ఆర్థిక స్థితిలో ఏ ఇబ్బందులూ ఉండవు. నాకేదైనా చిన్న ఉద్యోగం చూపితే నన్నూ కాబోయేనా పిల్లలను పోషించుకోగలను...నాకు మీ శరీర రంగు కాని బాహ్య సౌందర్యంకాని కనపడడమేలేదు...దాంతో నాకు సంబంధం లేదు. నేనిష్టపడుతున్నది మీ మేధస్సుని.... మనస్సుని మీ మానసిక సౌందర్యాన్ని...మీ ఆర్ద్ర భావాలను" అంది సుజాత.

"శరీరాలతో సంబంధం లేకుండా ఆడమగ ఇష్టపడడం సాధ్యమా?"

"అభిప్రాయాలు కలువనపుడు మనపక్కనున్న వాళ్లయినా ఆమడల దూరంలో ఉన్నట్టే కనబడతారు. అభిప్రాయాల లొక్కటైతే వేలాది మైళ్ళ దూరమూ ప్రక్కనున్నట్టేఉంటుంది. ప్రేమ, ఇష్టం అనేవి మానసికమైనవి."

ఎన్నో ఇతిహాసాలు పురాణాలు తత్వగ్రంథాలు, ఆధునిక శాస్త్రాలన్నిటినీ తిరగేసిన నాకే ఆమెకంత తాత్వికత, మానసిక పరిపక్వత ఎలా వచ్చాయో అర్థం కాలేదు...సుజాత నా కళ్లకిప్పుడు మరింత అందంగా కనబడుతుంది.

నేనింత కాలంగా కోరుకుంటున్నట్లు నా భార్యతో బాదిస్తున్నట్టురంగుతో రూపంతో సంబంధం లేకుండా నన్ను నన్నుగా ప్రేమించే స్త్రీ దొరికినందుకు ఆనందించాలా? లేక? నన్నునేనే ప్రశ్నించుకున్నాను.

నా కుటుంబం, ఉద్యోగహోదా, మేధావిగా నాకున్నపేరు, ఆదర్శాలు, నేను పొందుతున్న అవమానాలు అన్నిటిని గూర్చి దీర్ఘంగా ఆలోచించాను. నా భార్యకు నేనంటే చులకన భావమున్నా మేమిద్దరం శారీరక సౌఖ్యాల ననుభవిస్తూనే వున్నాం. సుజాతతో సంబంధం పెట్టుకుంటే మా జీవితంలో, కుటుంబంలో కల్లోలం లేవక తప్పదు. కాని మాలతిని మించినఅందగత్తైతో శారీరక సౌఖ్యం పొంది ఆమెపై కసి తీర్చుకోవాలని నాలో అంతర్లీనంగా వున్న కోర్కె సంగతి? బాగా ఆలోచించిన నాకు సుజాతతో సంబంధం పెట్టుకోవడమెంత అసంబద్ధమైనదో అర్థమైంది. నాలోని వివేకం కసిని జయించింది. ఆమె ప్రతిపాదనను సున్నితంగానే తిరస్కరించాను.

"నేను మీ కుటుంబంలోని ఏ విషయంలోనూ జోక్యం కలిగించుకోను. మీతో జీవితం చాలు...మీ మేధస్సు నా అందంతో మనకో కొడుకు పుడితేఅంతకంటే కావాల్సిందేముంది?" చివరి ప్రయత్నంగా అంది మాలతి.

"ఈ మాటలు ప్రపంచ ప్రఖ్యాతి వహించిన రచయిత మేధావి జార్జ్ బెర్నార్డ్‌షాతో ఓ అపురూప సౌందర్యరాశి అన్నమాటలు. నువ్వా అమ్మాయంత అందగత్తెవేమోగాని నేను మాత్రం బెర్నార్ట్‌షా అంత మేధావిని కాను...గొప్పవాన్నికాను.... అయితే బెర్నార్డ్‌షా ఆ యువతికిచ్చిన జవాబే నీకిస్తున్నాను...నువ్వన్నట్టు జరిగితే మంచిదే...కాని అందుకువిలోమంగానూ జరిగే అవకాశాలున్నాయి. అపుట్టేవాడకినా అందం మాత్రమే వచ్చిందనుకో కష్టమేకదా" అన్నాను.

ఆమెను పంపించాను... ఆ ఆలోచన మానుకొమ్మన్నాను...అయితే ఆమె రూపం నా కళ్లముందు సజీవంగా, సౌందర్యానికి ప్రతిరూపమన్నట్టుగా కదులుతూనేవుంది.

రెండు నెలలు గడిచాయి. దక్షిణ బారతదేశ యూనివర్శిటీ ఉపాధ్యక్షుల సమావేశానికి మద్రాసు వెళ్లి ఆ రోజే వచ్చాను. దసరా సెలవులు... నా భార్య పిల్లలెవరూ ఇంట్లోలేరు. మాలతి వాళ్ల తల్లిగారింటికెళ్లారు...



ప్రయాణంలో జబ్బుపడున్ననేను మంచంలోపడుకున్నాను. ఉన్నట్టుండి విపరీతంగా వాన కురవడం మొదలైంది. పూనకం వచ్చినట్లు చెట్లూగుతున్నాయి...చలిగాలి ఉధృతంగా వీస్తుంది. చలిలో నా శరీరం వణికపోతుంది. కిటికీలు తులపులు మూసే ఓపిక కూడా లేదు. గజగజ వణుకుతున్ననా శరీరం పై ఓ చల్లని చేయిపడింది. ఆస్పర్శ నాకెంతో ఆత్మీయంగా వుంది. ఎన్ని ఏళ్లుగానేనాస్పర్శకోసమే ఎదురు చూస్తున్నట్టనిపించింది. తరతరాల యుగయుగాల నిరీక్షణ తర్వాత లభించిన స్పర్శలా వుందది. ఓదిక్కు చలిగాలి, వర్షం...వణుకుతున్న శరీరం. నా పరిస్థితిని గమనించిన ఆమె నా శరీరంతో తన శరీరాన్నికలిపింది. నాలో లీనమై పోయింది. మా రెండు శరీరాలేకమై పోయాయి నేనా కలయికలో ఎంతో తాదాత్మ్యం చెందాను. మాలతితో ఇరవై ఏళ్లకు పై దాంపత్య జీవితం గడుపుతున్నానేనింతా తాదాత్మ్యం పొందలేదు. జీవిత కాలనికంతా సరిపోయే సుఖాన్నిచ్చిందామె.

నేనా తాదత్మ్యం నుంచి అలౌకిక మానసికస్తితినుంచి తేరుకునే లోపలే సుజాత ఒక్కమాట కూడా మాట్లాడకుండా వెళ్లిపోయింది.

నాలుగు నెలల తర్వాత నన్నో హోటల్లో కలుసుకుంది...తాను గర్భవతినని, తల్లి దండ్రుల బార్షన్ చేయించుకొమ్మంటే చేయించుకోలేదని , తనని ఇంటినుంచి గెంటివేసారని చెప్పింది.

ఆ మాటలు విన్న నాకాళ్లకింది భూమి కదులుతున్నట్టనిపించింది. ఈ విషయం సమాజానికి తెలిస్తే ఏమవుతుందో ఆలోచించాను.

"సుజాతా! నేను దోషినే కాదనడం లేదు. కాని నేనిప్పుడు నిన్ను ఏవిధంగానూ స్వీకరించలేను. నీయంత మనోధైర్యం నాకు లేదు. ఈ రహస్యం మనిద్దరి మధ్యనే ఉండాలి. ఈసమాజంలో ధైర్యంగా నిల్చుని బతకగలిగే మనోధైర్యం నీకు కలగటానికి కోరుకుంటున్నాను. నన్నుక్షమించు' ' అని పదివేల రూపాయలు ఆమె చేతిలో పెట్టి పంపించాను.

మాలతికి కాని మరెవ్వరికి కాని ఈ విషయం చెప్పదలచుకోలేదు. మాలతికి సుజాత విషయం తెలుసా తెలియదో నాకు తెలియదు. ఆమెలో మార్పు నిజంగా వచ్చిందో సుజాత విషయం తెలుసుకొని తనకేం తెలియనట్టు నటిస్తుందో నాకసలే తెలియదు. కాని సుజాత వెళ్లిపోయిన అన్నెల్లనుంచి మాలతిలో చాలా మార్పురావడం గమనించాను. ఆమె మునుపట్లా నన్ను అవమానపరుస్తూ పిలవడంలేదు నా రూపాన్ని కించపరచడంలేదు. ఆమె స్పర్శలో మాటల్లోని శరీరాన్ని అర్పించడంలో వచ్చిన మార్పును గమనించాను. ఈ మార్పుకు గల కారణాన్ని మాలతినే అడిగాను.!

"మిమ్మల్ని రెచ్చగొట్టి మీలోని ప్రతిభను, మేధావితనాన్ని వెలికి తీయాలనేఅలా ప్రవర్తించాను కానీ వేరేకాదు....మీరంటే నాకేం ఏవగింపులేదు"

ఆమె మాటల్లో ఎంత నిజముందో నాకెంత ఆలోచించినా అర్థం కాలేదు. ఏదేమైనా ఆమెలో మార్పు రావడం నాకెంతో ఆనందహేతువైంది. ఈ సంతోషంలో నేను సుజాత గూర్చి ఆలోచించలేదు. ఆమె ఏమైందో తెలుసుకునే ప్రయత్నం చేయలేదు.

నా ఆర్థిక స్థితిలో మరింత మార్పు వచ్చింది. క్రమక్రమంగా నేను సౌందర్యారాధకుడిగా మారిపోయాను. నాకు తెలియకుండానేనాకు నలుపంటే అసహ్యం ఏర్పడింది.. నేను పడ్డ

అవమానాలు, నన్ను వేదనకు గురిచేసిన సంఘటనలు నన్నుప్రభావితం చేసిన రచనలు నన్ను దళిత సంస్కృతిని ప్రేమించేటట్టు చేసినా దానిపై ఏండ్ల తరబడి పరిశోధనలాంటివి చేసినా ఈ మధ్య నలుపంటే అసహ్యించుకునేట్టు ఎందుకైందో నాకర్థం కాలేదు.

బాబు చివరి మాటలు నన్ను మేల్కొల్పాయి.

లేచి మంచంలో కూర్చున్నాను.

అంటే సుజాత కొడుకైన ఆ బాబునా కొడుకే. నారక్తం పంచుకపుట్టినవాడే. నా పేరు దొర్లింది. నారూపు, నా స్వంత పిల్లలకు రాలేదు. నన్ను మనసారా కోరుకున్న సుజాత కొడుక్కు వచ్చింది. అంటే మరో కర్రోడు నా వారసుడుగా ఈ ప్రపంచంలో కొచ్చాడన్నమాట.

నేనిప్పుడా బాబును పట్టించుకోకుంటే తల్లిలేని, తండ్రెవరో చెప్పుకోలేని ఆ బాబు ఎన్నో అవమానాల నెదుర్కోక తప్పదు. ఆ అవమానానికి తోడు రూపం, రంగుతో వచ్చే అవమానాలు నిజంగా ఆ బతుకెంత రంపపుకోతో నాకు తెలియంది కాదు. రకరకాల ఆలోచించాను.

అయితే రంగు పేరుమీద, కులం పేరుమీద ఎన్నో అవమానాలు పొంది ఎంతో వేదనను భవించిన నేను ఈ మధ్య నలుపునెందుకసహ్యించుకుంటున్నాను? ఈ సమాజంలో నా స్థానం పెరగగానే మేధావిగా నా స్థానం పదిలపడగానే నా భార్యలో మార్పురాగానే నాలో మార్పు వచ్చిందా? దళితుడిగా పుట్టి అందులోని కొన్ని సౌకర్యాలను పొంది తన పరిస్థితి మారగానే దళితులుగా చెప్పుకోవడానికి కిందపడే దళితులనే మాత్రం పట్టించుకోని వాళ్ల కోవలోకే వస్తాడా తాను? నాలోని మానవతా దృక్పథం, దళితులనేమాత్రం ప్రేమానురాగాలునా వ్యక్తిగత జీవితంలోని వేదనవల్ల కలిగినవేనా? ఆవేదనే నన్నురచయితను, పరిశోధకున్ని సామాజిక చిత్రకారున్ని చేసిందా? లేక నా భార్య అందాల మోజులో పడి నేనన్నీ మరచిపోయానా?

నాలో ప్రశ్నలు...ప్రశ్నలు...ప్రశ్నలు..

కాని నేనిప్పుడవన్నిటిని గూర్చి ఆలోచించ దలుచుకోలేదు.

నా కొడుకు మరో కర్రోడుగా బతకడానికివీల్లేదనుకున్నాను.

అతనితో ప్రవర్తించిన తీరు జ్ఞాపకం రాగానేనా కళ్లవెంట పటపటా నీళ్లు కారుతున్నాయి.

సమాజం కట్టుబాట్లు హోదా, రేపునా జీవితంలో, కుటుంబంలో లేవబోయే కల్లోలం ఇవేమీ నాకు గుర్తుకు రావడంలేదు.

నా జీవిత లక్ష్యాన్ని తాత్కాలికంగానైనా మరచిపోయిననన్ను కారణాలేవైనా గమ్యం, దిక్కు మరల్చినా కర్రోడికి మనసులోనే కృతజ్ఞత చెప్పుకుంటూ అతని కోసం పరుగెత్తుతున్నాను.

(ఆంధ్రభూమి, ఆదివారం)



14

# దొరసాని

బోయ జంగయ్య

ఆ వూరు పక్కమ్మటి పాడుబడ్డ దేవాలయం. దానికి కొంత దూరంలో వరుసగా మూడు గదులున్న పెంకుటిల్లు. మధ్య గదినే ముందుకు పెంకులతో పొడిగించబడ్డ వరండా వాకిట్లో ఓ వేప చెట్టు. మూడు వైపుల కాంపౌండ్ గోడ.

వరండాలో వాలుకుర్చీలో రామయ్య పంతులు, పక్కన్న భార్య సీతమ్మ. భర్త ఉత్తరాన్ని చదువుతూ వుంటే, వింటూ మధ్య మధ్యన బరువుగా నిట్టూరుస్తూవుంది.

"మమ్మలిని యింతవరకు చదివించారు చాలు, మా పెళ్ళిల్ల గురించి బాధ పడకండి". ఈ వాక్యంతో, చదువుతున్న రామయ్య కళ్ళల్లోను, వింటున్న సీతమ్మ కళ్ళల్లోను నీళ్ళు తిరిగాయి.

" ఓ ప్రైవేట్ స్కూల్లో చిన్న ఉద్యోగం దొరికింది. మరో మంచి ఉద్యోగం గురించి ప్రయత్నం చేస్తూవున్న"

- మీ కూతురు

మానస

ఉత్తరం మడిచి పక్కన పెట్టి రెండు చేతులను తల కింద పెట్టుకొని వాసాలవైపు చూస్తూ వున్నాడు.

"ఉన్న కాస్త ఆస్తి చదువులకే ఊడ్చుకుపాయె పై చదువులు వద్దంటే విన్నరైతిరి" అంటు బాగా అరిగిపోయిన కాలి మట్టెలను అటు యిటు తిప్పుతూ వేళ్ళకు పడ్డ గంట్లను రాస్తూ అన్నది.

"జరగాల్సిన దాన్ని గూర్చి చెప్పు"

"పంతులమ్మ గారు, ఓ పంతులమ్మ గారు" అంటు దర్వాజా దాటి లోనికి వొచ్చి ఓ ఆనపకాయను మొగానికి ఆనించి -

"మా పందిరి మీద కాసింది" రైతు కూలీ వెంకన్న.

"నీ పేరు ఎంకడు కదా! చూడు పటేలును అడిగి కొబ్బరి కాయలు కోసుకొచ్చి యిచ్చిపో. రేపు శనివారం కదా" అంటూ కుర్చీలో వొర్గుతు అన్నప్పుడు ఎంతో వాత్సల్యం లాంటి కదలిక వెంకన్న' ' సరే అన్నట్టు తల వూపుతూ బయటికి నడిచాడు.

"చూశావా ఈ పంతులు గారిని ఎవరూ పస్తులు వుండనివ్వరు"

బుజం మీద జందాన్ని చేతులతో జరుపుకుంటు అన్నాడు.

"యిదేమన్న కొత్తా" అంటూ సొరకాయతో యింట్లోకి నడిచింది. "రామచంద్రా" అంటు కుర్చీలో వాలిగి కాసేపు కళ్ళు మూసుకున్నాడు. అరవై ఏళ్ళ జీవితాన్ని అద్దంలో చూసుకున్నట్లు గతం కళ్ళ ముందుకొచ్చింది.

వెనకట ఏ ఊరి బ్రహ్మలు ఆ వూరిలో పంచాంగాన్ని అనుసరించి తిథి - నక్షత్రాలను చూసి, పెళ్ళిళ్ల తద్దినాలు భూమి పూజలు నిర్ణయించేవాళ్ళు రోజుకు ఒకటి వచ్చేటట్టు సర్దుబాటు చేసు కోవడం వల్ల తిండి బట్టకు లోటుండేది కాదు. యిండ్లల్లో పెండ్లిండ్లు అయితే ఏది అడిగినా తెచ్చి పెట్టేవాళ్ళు.....

"యిప్పుడు పట్టణాలకు పెండ్లి సామాన్లకు వెళ్ళినపుడు అక్కడే లగ్న నిర్ణయం. అన్ని లగ్గాలు ఒక్కరోజే ఫంక్షన్ హాళ్లల్లో! ఒకటడిగితే ఒకటుండదు. ఆపూటే పెళ్ళి, ఆ పూటే విందు మరో గంటకు హాలు ఖాళీ యిక తద్దినాల మాట దాదాపు మర్చి పోయినట్టే పోతే భూమి పూజలు మేస్త్రీ ఒక కొబ్బరికాయ కొట్టేస్తే చాలు. ఏం కాలమొచ్చెరా నాయనా నీ యింకా ఎలాంటి కాలం రానున్నదో"!!

⋆ ⋆ ⋆

రామయ్య పంతులు భోజనం ముందు కూర్చుంటూ "చూడు మన కష్టాలు గట్టెక్కినట్టే, చిన్నోనికి స్టేట్ ఎక్సైజ్. ఉద్యోగం. చిన్న దానికి కమర్షియల్ టాక్స్‌లో ఉద్యోగం. తాను ఎం.ఏ. చేస్తుందట. అమ్మాయి. ఉత్తరంలో రాసింది. " అని ముద్దను నోట్లో పెట్టుకున్నాడు. ఉత్తరంతో పాటు పంపిన పోటోనే చూస్తూ కూర్చున్నతల్లి." చాలా లావైంది బిడ్డ. ఆ పెద్ద కళ్ళు. పొడవైన జడ, తెల్లని పలువరుస అచ్చం నేను వయస్సులో వున్నప్పుడున్నట్టే వుంది కదండి" అంటు ఫోటోను ముద్దు పెట్టుకుంది.

⋆ ⋆ ⋆

ఆ తరువాత రామయ్య పంతులు యింటికి పోస్ట్‌మెన్ రాకపోకలు పెరిగాయి. ఇంట్లో టివి, బయట లూనా, డెకోలం మంచాలు ,వెండి కంచాలు. ఊరంతా రామయ్య పంతులుగారి కుటుంబానికి పట్టిన అదృష్టం గురించి చెప్పుకోవడం మొదలు పెట్టారు. యిల్లు కళే మారింది. యింతకు ముందు ఓ బాపనాయనా అని పిలిచిన వాళ్ళనాలిక కర్చుకొని "పంతులు గారూ" అని పిలుస్తున్నారు.

ఉద్యోగం చేసే అమ్మాయికి పెళ్ళి చూపులొస్తే పెద్దమ్మాయికి పెళ్ళి అవ్వాలంటున్నారు. పెద్దమ్మాయి సిటీకెళ్ళి నాలుగేండ్లు కావస్తున్నది. ఒక్కసారి కూడా ఆమె యింటికి రాలేదు. ఎవ్వరిని సిటీకి రమ్మనలేదు. అక్కడే కూర్చుని అన్ని నడిపిస్తువుంది.

⋆ ⋆ ⋆

నగరంలో -

"ఈ రోజు మనం డా॥ బి.ఆర్. అంబేద్కర్ గారి జయంత్యోత్సవం జరుపుకుంటున్నాం. ఈ సభకు అధ్యక్షత వహించవలసినదిగ మన జిల్లా కలెక్టర్ బి.యన్.కె.రావు గారిని కోరుతు, వారు అధ్యక్షస్థానాన్ని అలంకరించవలసినదిగా మనవి కరతాళధ్వనుల మధ్య కలెక్టర్ గారు వేదిక నధిష్టించగా, వారి మెడలో పూలమాల.

"ఈ నాటి ఈ సభకు ముఖ్య అతిధిగా శ్రీమతి కలెక్టర్ గారిని తమ ప్రత్యేక స్థానంపై ఆసీనులు కావలసిందిగ ప్రార్థన".

శ్రీమతి కలెక్టరు గారు వేదికను అలంకరించగా ఆమెకు పుష్పగుచ్ఛాన్ని అందించారు.

"మొదట కలెక్టరు గారి తొలిపలుకులు -

"పేదవాడు పైకి రావాలంటే అంబేద్కర్‌ను అనుసరించాలి. ఆయనలాగ కష్టపడి చదవాలి. చదువు బతుకును మారుస్తుంది. ఈ రోజు ఈ స్థాయిలో నేనున్నానంటే - దానికి కారణం చదువు! చదువు!! చదువుకొని పైకొచ్చినాక మీ ఊరిని మీరొచ్చిన పేదవాడలను మరిచిపోకండి" కొందరు చప్పట్లు కొట్టారు. మరికొందరు ఏదో గుసగుసలు, అది గమినించిన కలెక్టరు గారు ఉపన్యాసం ముగించి కూర్చున్నారు. "తమరు మార్చినట్లే వుంది"జనంలో ఓ గొంతు" యిప్పుడు శ్రీ మతి కలెక్టర్‌గారు పేదలకు నూతన వస్త్రాలను పంచిపెడతారు"అంటూ మరో అధికారి లిస్ట్ చదువుతువున్నాడు.

బట్టలు తీసుకోడానికి తీసుకురాబడిన కుంటి. గుడ్డి. ముదుసలి వాళ్ళ ఆ పట్టణానికి చెందిన వాళ్ళే, అధికారి పేర్లు చదువుతుండగ ఒక్కొక్కరే వచ్చి ఆడవాళ్ళు చీరెలను మొగవాళ్ళు దొతులను తీసుకున్నారు. ఆ తరువాత యిప్పుడు శ్రీమతి కలెక్టర్‌గారు తమ సందేశమిస్తారు" అని ప్రకటించారు అధికారి. జనంగోల ఎక్కువైంది, ఎవరూ దేనిని వినిపించుకున్నట్టు లేదు.

"మన కలెక్టర్‌గారు చదువు బ్రతుకును మార్చేస్తుంది అన్నాడు. అది నిజం. వారి స్వానుభవం కూడ, వారు అంబేద్కర్ లాగ ఎన్నో అవమానాలకు గురి అయ్యారు. పట్టుదలతో చదివి పేదరికాన్ని వదిలించుకున్నారు. అయన అంబేద్కర్‌కు అక్షరాల వారసుడు. ఒక్కరిద్దరు బాగుపడగానే పేదరికం పోయిందనలేము. అంతేకాదు ఎవ్వరు కూర్చొని తినకూడదు".

"కూర్చొని తినేది ఎవరంటా" జనంలో నుండి ఓ కేక అదే ఆలోచించవలసి వుంది అలాంటి వాళ్ళకు శ్రమించడం నేర్పవలసి వుంది అందుకోసం అందరం కృషి చేస్తేనే ఈ మార్పు జరుగుతుంది. జైభీమ్ " అంటు సభకు నమస్కరిస్తూ కూర్చుంది. ఆ తరువాత జనగణమన

కలెక్టర్ కారు వైపు నడిచాడు వెనకాల అమ్మగారు అలంకరించిన బ్యూటీ పార్లర్ చెప్పుకోదగ్గదే! ఆ విగ్రహానికి తగ్గట్టు ఆమె వేషధారణ" అంటు వెనకనే నడుస్తున్న మరొకడు కాదు" అంటు గుంపులో నుండి ఓ అజ్ఞాత గొంతు. యిద్దరు కారులో కూర్చోగానే కారు కదిలి రోడ్డెక్కింది.

విన్నారుకదా సూటిపోటి మాటలు" అంటూ కలెక్టర్ ముఖంలోకి చూసింది మానస.

"కొత్తేం కాదు కదా"

"వీళ్ళెన్నడు బాగుపడుతారో" మానస

"అందరు చదువుకున్ననాడు"

"ఏం చదువో ఏంటో కాని నేను కలెక్టర్ భార్యను కానట"

"విని ఊరుకున్నారే"

మౌనంగా మానస వైపు చూశాడు. అప్పుడు ఆమె ముఖం ఎరుపెక్కి అవమానంతో అతలాకుతలంగా కనిపించింది.

కాసేపు మౌనం తరువాత ఓ బరువైన శ్వాస వదిలి కర్చీఫ్‌తో నుదురును అద్దుకుంది.

"ఒకసారి సొంత విషయాన్ని మరొకరు నలుగురిలో నవ్వులాటగా మాట్లాడొద్దన్న విషయం వీళ్ళింకెప్పుడు తెలుసుకుంటారో"

"మనం చెప్పగా చెప్పగా"

"మరి కాలేజీల్లో ఏమి నేర్చుకుంటునట్టు"

"రొట్టె, బట్టా ఎలా సంపాదించుకోవాలనే విషయం"

వీళ్ళ సంభాషణ వింటూ డ్రైవర్ కారు నెమ్మదిగా నడుపుతున్నాడు.

"మీరు వాళ్ళనే సపోర్టు చేస్తున్నట్టు వుంది" అంటూ కలెక్టర్ కళ్ళలోకి చూసింది. అప్పుడామె కళ్ళలో నిష్ఠూరం కదలికలో జాణతనం కనిపించగానే రావు గారి చూపులు మానస మీద ఆగాయి.

కారు కలెక్టర్ బంగళా ముందు ఆపి డ్రైవర్ డోరు తెరవగానే దిగి యింట్లోకి నడిచారు, పనివాళ్ళు బయటికి నడిచారు. అప్పటి వరకు లైట్స్ మాత్రమే వెలుగుతున్న యింట్లో ఫ్యాన్లు కూడా తిరగసాగాయి. గదిలో నిలువుటద్దం ముందు నిలుచోని రావుగారు కోటు బటన్ తీయగానే వెనకనుండి వచ్చిన మానస కోటు నందుకొని హాంగర్‌కు వేసి, ముందుకొచ్చి నిలుచోని టై ముడి విప్పసాగింది. ఇప్పుడు రావుగారు రెప్పవాల్చకుండ అద్దంవైపే చేస్తున్నారు. 'ఏమిటలా చూస్తున్నారు' ' అంటూ షర్ట్ బటన్స్ విప్పుతూ, ఆఫీసు గదిలో టెలిఫోన్ మోగింది, రావుగారు ఫోన్ వైపు నడిచారు. మానస అల్మారా వైపు నడిచి నైటీని తీసుకుంది.

☆ ☆ ☆

తిరుమలేశుని దర్శనానికి వేలమంది క్యూలో నిలుచున్నారు. అధికారులెదురొచ్చి రామయ్య పంతులును. సీతమ్మను ప్రత్యేక మార్గం గుండా గర్భగుడిలోకి తీసుకెళ్ళి దర్శనంగావించి శేషవస్త్రాలు బహూకరించి, తీర్థ ప్రసాదాలను యిప్పించి, ఓ కాటేజిలో బస ఏర్పాటు చేవారు.

"యిది కలా నిజమా!"

"కొంచమాగండి" అంటూ భర్తను సమీపించి అతని భుజాన్ని గిల్లింది.

"వుండవే నిజమేను". అంటూ గిచ్చిన చోట చేత్తో రుద్దుకుంటూ తమను దిగబెట్టి కదిలిపోయె కారువైపు చూస్తూ నిలుచున్నాడు.

"ఇది ఎవరి పని అంటారు. చిన్నోడు చేయించొచ్చా, లేక చిన్నదా?

"పెద్దదాని పనే, ఎం.ఏ సంస్కృతం పాసైంది కదా యిక్కడే దేవస్థానంలో ఏదో పెద్ద వుద్యోగం దొరికిందేమో!" అంటూ అప్పుడే వచ్చిన దేవస్థానం ఉద్యోగి వైపు మళ్ళీ -

"నాయనా ఈ దేవస్థానం అధికారి ఎవరు" అంటు జంధ్యాన్ని ఓ సారి బయటకి లాగి మళ్ళీ లోపలికి నెట్టుతూ అడిగాడు. ట్రేలోని పాలగ్లాసులను టేబుల్ మీదుంచుతూ ఎందుకు అన్నట్టు చూశాడు.

ఆఁఏ కులంవాడు అని " విస్తుబోతుండగ

"ఏం - ఎస్సీ వుండకూడదా"? చూపుల్లో ఓ మాదిరి కసిని కలబోస్తూ అడిగాడు.

"ఆఁ దానికేంయిప్పుడు వాళ్ళు కూడ అర్చకులుగా వున్నారు కదా"

"తమరెవరండి"

"ఎవరైతే ఏముంది. బ్రహ్మంగారు అన్నట్టు వర్ణ సంకరణ జరిగిపోతూనే వుందో 'నీ వెవరు నాయనా"



"నేను యస్సీనే" అంటు వెళ్ళిపోయాడు.

"ఏమండి ఆ పాలను పారపోయండి"

రెండు గ్లాసులను తీసికెళ్ళి వాష్ బేసిన్లో పోస్తూ" కృష్ణార్పణం" అన్నాడు.

"అవి అంటుబడ్డపాలు, కృష్ణార్పణం అంటున్నారేమిటి?"

"పాపం క్షమించుగాక, సర్వార్పితం" అన్నాడు చెంపలు వేసుకుంటూ

మరునాడు ఉదయం దేవస్థాన ఉన్నత ఉద్యోగి వొచ్చి తమరు రామయ్య గారే కధా?"

"చిత్తం" అంటూ చేతులు జోడించి నిలుచున్నాడు.

"యిదిగో మీ ఊరి దేవాలయానికి మూడు లక్షల రూపాయలను దేవస్థానం వారు మంజూరి చేశారు. మీరు మీ ఊరెళ్ళి ఓ కమిటీని వేసి ఆ కమిటి ద్వారా ఈ గ్రాంటును ఖర్చు చేయించండి" అన్నాడు ఆ ఉద్యోగి

ఏమిటో అర్థంకాని చూపులతో వినయంగా ఆ కాగితాన్ని అందుకున్నాడు.

"పోతే మీ దంపతులకు నూతన వస్త్రాలు", అంటు రెండు అట్టపెట్టెలను అందించాడు. ఈ సారి నోరు తెరచి కళ్ళుప్పగించి చూస్తూ అమ్మో ఇదంతా ఎవరి దయ" అని అడిగాడు.

"అంతా వెంకన్న దయ, యిక మాకు శెలవు యిప్పించండి. కారు సిద్ధంగా వుంది వెళ్ళిరండి. ఉంటాం" అంటూ వెళ్ళిపోయాడు.

" దంపతులు గుడివైపు చేతులు జోడించి కాసేపు నిలుచోని ఆ తరువాత కారులో కూర్చున్నారు. కారు కదిలింది.

★ ★ ★

అది మరో ఊరు. వచ్చే పోయే బస్సులు, ఆగే చావడి అది. ఆ పక్కనే వున్న పేటకు వెళ్లడానికి నలుగురైదుగురు నిలుచున్నారు. వాళ్ళల్లో ఊరి మోతుబరి రైతు చంద్రారెడ్డి. పెద్ద గౌడ్ బాలయ్య, ఊళ్ళోని హరిజన వాడ వైపునుండి వస్తున్న జీపును ఆపాలని చేయి ఊపాడు చంద్రారెడ్డి. అది ఆగకుండా దుమ్ము లేపుతూ వెళ్ళిపోయింది.

"ఎక్కడిది జీపు" రెడ్డి

"చదువు వెలుగని రాసి వుంది" గౌడ్

"అట్టనా హరిజనవాడ నుండి వస్తుంటేమన నాగయ్య కొడుకుపోతుండేమో అనుకున్న " రెడ్డి

"ఎవరు కొండయ్య, ఆయనెందుకొస్తడు, రాక ఎన్నేండ్లాయె"

"ఆయన కలెక్టరైండని ఎంత మురిసినం, ఈ ఊరును బాగుచేస్తాడని తల్లి తండ్రులను సుఖపెడతాడని" రెడ్డి

"ఊరు బాగు సేయకుంటమాయె తల్లి తండ్రులకు కష్టం తప్పదాయె యింకా కూలి బతుకే! అదే పూరిల్లు, తాటాకుల పందిరి!!

అవును మొదట ఏమి లేనపుడు మేనపిల్లను చేసుకునే యిన్నో అన్నో యిస్తే అటిని ఖర్చు పెట్టే నౌకరి సాంపాయించె.

యిప్పుడేమో దానికి చదువురాదు. నల్లగుంది మోటుముండ. అంటున్నాడట.

"స్వంత చెల్లె పిల్లలతో పాటుపోతే మాట్లాడనే లేదట, ఓ సారి అన్నపోతే బర్లనుయిప్పిస్తే

అమ్ముకుంటివి, కోళ్ళనిప్పిస్తే చావగొడితివి. ఏం చేసి బతుకుతవు అన్నాడట తమ్ముణ్ణేమో కాలేజీలో చేర్పించి హాస్టల్లో వుండమన్నాడట" రెడ్డి.

"యింకా ఈ సంగతి తెలవదేమో. తల్లి తండ్రి వెళ్ళి కోడలిని నీ వెంట వుంచుకొని, మా కింత పంపితే పూట గడుద్దని అంటే అసలు మీరెందుకొచ్చింద్రని ఆ రాత్రి ఎక్కన్నో వుంచి మరునాడు పంపిచ్చిండట" అప్పటి వరకు వాళ్ళ సంభాషణ వింటున్న మరో పెద్ద మనిషి.

"నాగయ్య కొడుకు సంగతా మాట్లాడేది" దారంతో కట్టిన కళ్ళద్దాలనుండి చూస్తూ అడిగాడు.

అవునన్నట్లు ఇద్దరు తలాడించారు.

"పేరు గూడ మార్చుకుండట, మొన్న మామను పిలిపించి నీ బిడ్డకు విడాకులివ్వాలి అనుకుంటున్న ఎంత కావాలి అన్నాడట. భోరున ఏడుస్తూ వద్దు తండ్రీ సచ్చినా బతికినా నీ దగ్గరే పడి వుంటది. ముద్ద పెట్టు చాలు అంటు కాళ్ళు పట్టుకున్నా కాదంటే కాదన్నాడట" పెద్ద మనిషి.

"కుటుంబమంతా కూలిచేసి పండగలు మాని పస్తులుండి నడిపిస్తే ఆఫీసర్ ఆయినంక ఆడు చేసే పనియిదా?" రెడ్డి

"నీకు యింత పెద్ద నౌకరొచ్చింది యిగ మా పేదరికం పోతుందనుకున్నం అని అంటె

ఒక్కసారే ఎవ్వరి పేదరికం పోదన్నాడట"

"నా బిడ్డను కాదని మరొకరితో సంసారం చేయడం అన్యాయం, అంటే - నీ బిడ్డకు డబ్బు పంపుతునే వున్నా కదా, ఏమాత్రం గోల చేసినా అదీ బందు అవుద్ది " అని పంపించిందట.

★ ★ ★

"ఎక్కువ చదివించడం నాదే బుద్ధి తక్కువ"

"మీ రే మనుకుంటున్నారు"

"మరి నీవు చేసిన పనేమిటి"

"మరో మార్గం కనిపించలేదు"

"అంటే" -

"మన పస్తులు పోవాలి, తమ్ముడికి చెల్లెకు ఉద్యోగం రావాలి"

"ఉద్యోగమే వచ్చింది చూశావు. కాని యిపుడు దాన్ని ఎవరు చేసుకుంటారు"

"మరో ఆఫీసర్"

"ఆఫీసర్‌కు ఎంత కట్నం కావాలనుకుంటున్నవ్"

"నేను చూసుకుంటాను కదా"

"అంటె దాన్ని నీలాగే"

"కాదు తగిన వరుణ్ణి చూసి పెళ్ళి చేస్తాను"

"చేస్తావు, చేస్తావు,' ఎస్సీ కలెక్టర్ బంధువులుగా వీళ్ళు యస్సీలని సర్టిఫికెట్ కూడా తీస్తావు"

ఈ సంభాషణ జరిగినంతసేపు వొకరి ముఖం ఒకరు చూసుకోకుండ వెనుతిరిగి నిలుచున్నారు.

"మన ఆర్థిక నేపథ్యం గురించి కూడా ఆలోచించవల్సి వుంది"

"అయితే ముందు మా చావు చేయించు"



"నాన్నా -" ఒకేసారి ఒకరి ముఖాలు ఒకరుచూసుకున్నారు. కలెక్టర్ బంగళా ముందు లాన్‌లోఈ సంభాషణ.

"లోనికి పదండి -" అంటు అనుకోకుండ తన్నుకొచ్చిన కన్నీరునుతుడుచు కుంటూ తండ్రి చేతులు పట్టుకుంది. రామయ్య మౌనంగా కదలకుండా నాటిన విగ్రహంలా నిలుచున్నాడు. ముక్కుపుటలు రోషంగా కదులుతున్నాయి. నుదుటి విభూది తడిసిపోతుంది.

"కాలాన్ని బట్టి పట్టు విడుపులుండాలి నాన్న"

"నా కడుపున పుట్టి నాకు పాఠాలు నేర్పుతున్నావు"కోపంతో పెదాలు వొనుకుతున్నాయి.

"అంతమాట అనకునాన్నా. మనస్సు మార్చుకుంటే బాగుంటది అంటున్న "

"వేద పారాయణుడు, నిష్ఠాగరిష్టుడైన ఈ రామయ్య పంతులు రేపు చండాలునికి పుట్టే సంతానాన్ని తన ఎదమీద ఎత్తుకొని తిరగాలి, వేలుబట్టి నడక నేర్పాలి, అంతేకదా" అన్నపుడు ఆయన కళ్ళు మరి ఎరుపెక్కాయి.

"మరో జన్మ అంటూ వుంటే కడజాతిలోనే జన్మిస్తాను అన్న మహాత్ముని మాటలు మీరు చదవలేదా"

"అవన్నీ రాజకీయ ఉపన్యాసాలు. వశిష్ట వంశానికి చెందిన ఈ సీతారామయ్య పంచములతో బతుకు పంచుకోవడమా!"

"మరి వశిష్ఠుడు - అరుంధతీ సంబంధం"

"అవి కట్టు కథలు"

"భారతం కట్టు కథేనా"

"సంస్కృతం చదవడం వల్ల నీకు తెలివి ఎక్కువైంది"

"మీరే అనేది కదా నాన్న, మానస నన్ను మించిన పండితురాలు అవుతుందని, చిన్నపుడు నా తర్కం విని"

"అదే యిప్పుడు నా కొంపకు చేటు తెచ్చింది"

"యింతకి అమ్మ బాగుందా నాన్నా"

"ఏడుస్తుంది, ఈకులం కాని కూడుకన్నా,పస్తులే మేలంటుంది. ఊరుకోడై కూస్తుంటే ఎలా తలెత్తుకు తిరగాలి" యిద్దరి మధ్య కొన్ని క్షణాలు మౌనం.

"ప్రస్తుతానికి ఊరొదిలి అమ్మ చెల్లె దగ్గర, మీరు తమ్ముని దగ్గర ఉండుండి. మిగతా విషయాలు తరువాత ఆలోచిద్దాం".

"ఆలోచించింది చాలు" అంటు వెనుదిరిగి గేటువైపు నడుస్తూ జారిన భుజంమీది జరీ అంచు శాలువను సరి చేసుకున్నాడు.

"నాన్నాగారు, నాన్నగారు"

తిరిగి చూడలేదు, ఆగి మాట్లాడలేదు.

లాన్స్‌లో నీళ్ళు పట్టిస్తున్న మాలి వెళ్ళి ఆపుదామని అనుకున్నాడు. ఎందుకో ఆపలేకపోయాడు. పెండ్లికాని పిల్ల పెండ్లి అయిన వాడితో తిరుగుతుంటే యిన్నాళ్ళు ఏం చేసిందో?అని తనలో తాను అనుకున్నాడు. కనపడకుండా పోయేంతవరకు తండ్రి వైపే చూస్తున్న మానస చూపులు ఎదురుగ వున్న పూల చెట్ల మీద ఆగినయి.

మొన్నటి వరకు చెట్లనిండా కనిపించిన పూలు ఈ రోజు లేవు! తనలో కలిగిన సంచలనాన్ని అణుచుకోడానికి మానస లాన్ నుండి గేటు వైపు నడుస్తూ వుంది. గేటు దగ్గర గ్రామీణులిద్దరు కలెక్టరు గారి కోసమని నిలుచున్నట్టుంది. మానస గేటును సమీపించి మూసివున్నగేటు మీద చేతులుంచి, వాళ్ళను పరిశీలనగా చూడ సాగింది.

ఆ దుమ్ము బారిన పాదాలు ఏఏ కోరికలను గమ్యాన్ని చేర్చాలని మోసుకొస్తున్నాయో! ఆ బిక్కు బిక్కుమనేచూపులు ఏ ఆశల్ని దాచుకొస్తున్నాయో! కలెక్టర్ గారుంటే బాగుండు.

అరవై ఏండ్ల పల్లె వాసి, బుర్రమీసాలు, తలపాగ, చెవికి వేలాడుతున్న పోగు, సరిగ్గా ఆయన వయస్సులో సగం వున్న స్త్రీ మెడలో పసుపుతాడు, చేతులకు మామూలు గాజులు, రంగు వెలసిన మాలు చీర ముఖాన పైసంత కుంకుమబొట్టు, తెల్లని పలువరస, ఎండ వానల్లో రంగుమారిన ఓ కూదిరి శరీర ఛాయ.

''ఏం కావాలి''

''కలెక్టరయ్య గార్ని కలవాలి''

''దరఖాస్తు ఏమన్నా తెచ్చారా. దొర వూర్లో లేరు''

''ఎప్పుడొస్తాడు''

''రెండురోజుల తరువాత''

''తమరు''

''యిక్కడే పనిచేస్తుంటాను, చెప్పండి''

అయితే యిది అది కాదన్న మాట అనుకుంటూ ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

''ఏమీ లేదు ఒక మాట అడుగుదామని వచ్చినం. నేను ఆయన మేనమామను.

ఆమాట విన్న మానస మనస్సు కలుక్కుమంది.

బహుశ ఈవిడే ఆమె అయివుంటుంది. అన్న పోలికలు కలుస్తున్నాయి.

''లోపలికి వస్తే ఏముంది - అసలోల్లు లేంది-''

''నా సుమతి కనబడితే జుట్టు బట్టి కొట్టిపోదు'' అంటూ కోపంతో ఊగింది.

ఈ సారి మానసకు ఒళ్ళు జల్లుమంది. ఆయన లేందే మంచిదైంది అనుకుంది.

''ఆమె కూడా ఎమ్మటే పోద్దా అమ్మా'' అని అడిగాడు.

''ఉంచుకున్నదే ఊరేగేటందుకాయె!'' కళ్ళలో కసి, మాట పలకడంలో ఏవగింపు కొట్టొచ్చినట్టు కనిపించాయి.

మానస మౌనంగా చూస్తూ నిలుచుంది. ఎడమ చేతికి కాల చక్రం, కుడి చేతికి బంగారు గాజులు, ఎదలో ఏముందో కనపడకుండా మెడనిండా కప్పుకున్న కొంగు!

ఆ తరువాత వాళ్ళు రోడ్డువైపు, మానస బంగ్లాలోకి నడిచారు. బి.యన్.కే.రావు తిరిగి గేటుపిల్లరుకు వేలాడుతున్నాడు.

తరతరాల తర్వాత వొచ్చిన అవకాశం అందవల్సిన వాళ్లకు అందకుండా పోతుంది. చెందవల్సిన వాళ్లకు చెందకుండా పోతుంది'' అనుకుంటూ, మాలి, ఎండుటాకులను ఏరుతువున్నాడు.

(జూన్, 1993)



15

# దక్షయజ్ఞం

బి.యస్.రాములు

నేను సార్ పెంటయ్యను. అవును అలియాస్ ప్రవీణ్. నిజమే సార్.

నా బతుకంతా పొగ చూరింది. ఈ బతుకులో యిక నిప్పురాదు. ఈ శరీరం బూడిదకాదు. నా బతుకు గుడిసె మొత్తం పొగ చూరిపోయింది. ఇంతంత వంటకు పిడుకల పొగతో యిల్లంతా పొగచూరిపోయింది. ఈ రెక్కలు చూడండి సార్. ఈ బరిబద్ద బొక్కలు చూడండి సార్. ముత్తెమంత వెలుగుకోసం నా యిల్లంతా పొగ చూరిపోయింది. నా బతుకు కాటికి కాకుండా పోయింది. ఇంటికి కాకుండా పోయింది. నాకు ఈ బతుకు మీదే రోసిపోయింది సార్. ఈ శరీరంలో జీవితంలో ఏం మిగిల్చారు సార్.

ఇయ్యాల్ల మీకు దయ గలిగింది. మీకు దయగలిగే సరికి నా గుండె ఎండిపోయింది. నా పొలం ఎండిపోయింది. నా బతుకు ఎండిపోయింది. నా బాధ ఎండిపోయి పరుగు లైపోయింది. ఏడ్వడానికి కన్నీళ్ళు లేవు. మాట్లాడ్డానికి భాషలేదు. ఇప్పుడు మీకు నా మీద దయగలిగింది సార్.

ఏం జరిగిందో ఇప్పుడు చెప్పుమని అడుగుతున్నారు సార్. మీదేం తప్పులేదు. నాదే తప్పు. నా మనస్సు న్యాయం కోసం అని చిక్కుల్లో పడడమే తప్పు. నా ఆలోచనల్లో పడి బతుకు రోసి చచ్చిపోవాలనుకొని చావురాక మీకు చిక్కడమే తప్పు. ఉన్న నిజం చెప్పలేక చిక్కుల్లో పడడమే తప్పు. మీదేం తప్పుకాదు సార్. మీదేం తప్పుకాదు. తెల్లారిలేస్తే మీ కెన్నో పనులు మీకు ఎన్నో కేసులు. మీకు ఎన్నో సెలవులు. నా ఏడ్పు వినే తీరిక మీకు యిప్పుడు దొరికింది. మీరు ఏడువమన్నప్పుడు ఏడ్వటానికి నేను వేసాలు వేసే నటున్ని కాదు సార్. మీరు వినాలని దయ చూపే లోపే నా ఏడుపు ఎండిపోయింది సార్.

సరిగ్గా రెండు సంవత్సరాల మూడు నెలలకు నా కేసు వినడానికి మీకు తీరింది. ఈ లోపు యిదేం బతుకురా అని ఏడ్చి ఏడ్చి మా నాయిన్న చచ్చిపోయాడు. మీరు నాకు బేల్ యిచ్చే లోపలే చచ్చిపోయాడు. తలకొరివి పెట్టటానికని శవం రెండు రోజులు యింట్లోనే మురిగిపోయినాక మీరు బేల్ యిచ్చారు సార్.

నన్ను మీరు ఆరోజు నా మొకమైనా చూడకుండానే జైలుకు పంపారు. యాదికి ఉందా సార్ మీకు. ఏమైనా చెప్పుకునేదున్నదా అని ఆ రోజు అడగలేదు మీరు. ఆ రోజు యిట్లా అడిగి ఉంటే బురదలో దుంకిన రాయిలా అయ్యేవి మీ కాగితాలు. అప్పుడు నా హృదయం బురద బురదగా ఎవరు పెల్లగించినా మీద చల్లేదిగా ఉండేది. మీకు బాధ తెల్సు. మీకు బతుకు తెల్సు. మీకు మీ బతుకు బాధ తెల్వకపోతే అప్పుడడగడం మానేసి యిప్పుడెందుకు అడుగుతారు సార్.

మీకు అన్నీ తెల్సుసార్. తెల్సీ మల్లా నానోటి నుంచి చెప్పించాలనుకుంటున్నారు. నా బతుకును మల్లా నా నోటి నుండి రప్పించాలను కుంటున్నారు. నా కథ మల్లా చెప్పించాలనుకుంటున్నారు. నాకు కథలు చెప్పడం రాదు సార్ నేను చచ్చిపోవాలనుకున్నది నిజమే. దానిగ్గల కారణాలను యిపుడు చెప్పమంటే మనిషి గుండె ఎండిపోయినాక వేదాంతంతో తప్ప వేదనతో ఎట్లా చెప్పగలను సార్.

ఎందుకంటే కాలం గడిచిన కొద్దీ అవసరాలు గతించి అనుభూతులు మిగిలిపోతాయి సార్. అనుభవాల వివరాలు అదృశ్యమై ధృక్పథాలుగా కొనసాగుతాయి. ఆ ముద్రలు జీవితదర్శనాలు సరైనవో కావో యిపుడు తెలియవు సార్. తెల్సుకోవాలంటే ఆ వివరాల్లోకి వెళ్ళాలి. అనుభూతులను, ధృక్పథాలను అవి రూపొందిన అనుభవాల్లోకి తిరిగి అనువదించు కోవాలిసార్. అది చారిత్రక సినిమా కోసం ఆనాటి జీవితాల్ని సంస్కృతిని తిరిగి సృష్టించు కోవడం వంటిది సార్. అది కష్టం సార్.

మీరేమి అనుకోకపోతే ఒక మాట అడుగుతాను సార్. ఆరోజు రాత్రి ఎనిమిదిన్నరకు నన్ను మీ యింటికి తెచ్చారు. మీరు భోంచేస్తున్నారంటే మమ్ములను బయటనే నిలబెట్టారు. మీరు తువ్వాలుతో మూతి తుడుచుకొని సోఫాలాంటి కుర్చీలో కూర్చున్నారు. మా వెంట వచ్చిన పోలీసు మీకు ఏవో కాగితాలు యిచ్చాడు. మీరు వాటిని చదివినారో లేదో, సంతకాలు పెట్టమన్నారు. నన్ను మీరు దూరం నుంచే చూశారు. మీరు లోపలికి వెళ్ళిపోయారు. ఆ రాత్రి నన్ను తీసుకుపోయి మల్లా అదే లా కప్పులో వేశారు.

ఆ రోజు నేను మీ ఎదుట హాజరు పరుచబడ్డ రోజు. సెప్టెంబరు యిరవై మూడో తేది రాత్రి ఎనిమిది గంటలు. ఈదురు గాలి. కరెంటు పోయింది. వర్షం పడుతున్నది. ఆరోజు రాత్రి మీరు ఏ కూరతో అన్నం తిన్నారు సార్. ఎన్ని ముద్దలు తిన్నారు సార్. ఏ కాలు ముందు వేసారు సార్. ఆరోజు మీ యింట్లో పనిమనిషి ఎన్ని గంటలకు యింటికి పోయింది. మీ తెల్ల బొచ్చుకుక్క ఎన్నింటికి నిద్రబోయింది. ఆ రాత్రి గాలి ఈదురుతో వర్షం పడింది. కరెంటు పోయింది. అప్పుడు ఫ్యాన్ ఆగిపోయి మీకు ఎన్ని దోమలు కుట్టినై సార్.

ఇవన్నీ మీరు లెక్కకట్టి చెప్పగలరేమోగానీ నాకష్టాల్ని వివరంగా లెక్కలు తీసి చెప్పలేను సార్. లా కప్పులో మూత్రం వాసన ఎన్ని రోజులు పీల్చానో చెప్పమంటే చెప్పగలను. ఏపూట ఎలాంటి తిండి పెట్టారో చెప్పగలను. ఎవరి మీద ఎందుకు ఎన్ని కేసులు బనాయించారో చెప్పమంటే చెప్పగలను కాని నేనెందుకు చచ్చిపోవాలనుకున్నానో చెప్పమంటే చెప్పలేను సార్. రోజూ చచ్చిపోవటానికి చచ్చిపోయేన్ని కారణాలు ఉన్నాక ఏ రోజు కారణాలని గుర్తుంచుకోవాలె సార్. ఏ ఏ కారణాలని గుర్తుంచుకోవాలె సార్.

ఒక్క మాటలో చెప్పమంటే చెప్తాను సార్. నా పేదరికమే నా చావుకు కారణం సార్. నా అజ్ఞానమే నా చావుకు కారణం. నా పేద కులపు జన్మే నా చావుకు కారణం. మేకనుచూస్తే బ్రహ్మకుకూడా కోసుకు తినబుద్ధి అయిందట సార్. అందరూ నన్ను కోసుక తినాలనుకుంటున్నారు. నా బతుక్కు ఏదైనా మార్గం చూడండి అని బ్రహ్మదేవునికి మేక మొరపెట్టుకున్నదట. నిన్ను చూస్తుంటే నీ మొత్తదనం చూస్తుంటే నాక్కూడా నిన్ను కోసుక తినబుద్ధి అవుతున్నది అని బ్రహ్మదేవుడు నవ్వినాడట సార్. మా బతుకులు మేక బతుకులు సార్. పులికేకాదు తోటి మనిషి కూడా మమ్ముల చూడగానే కోసుక తినాలనిపిస్తుంది సార్.

మమ్ములను మొత్తం కోసుకతిన్నా మంచిగనే ఉండు. అలాల్ చేసేటప్పుడు నరంతెంపి వదిలేసినట్లు.. మా రక్తమంతా కారిపోయి... మా కోరికలన్నీ ఉడిగి రాలిపోయేట్లు మా జీవితాల్ని

కొంచెం కోసి వదిలేస్తారుసార్. నాకు మల్లా బతుకునివ్వడం కోసం జైల్లో పెట్టాననుకున్నారు మీరు. మాకు బతుకునీయడం కోసమే చచ్చిపోకూడదనే చట్టం చేసినట్టున్నారు. కాని మీకు తెల్సా సార్. మీ ఉదాత్త హృదయం మమ్మల్ని బతికిస్తూ చంపుక తింటున్నది. ఆరోజు లాకప్‌లో వారం ఉంచుకున్నాక రాత్రి ఎనిమిది తర్వాతే నన్ను మీ దగ్గరకు ఎందుకు తెచ్చారనుకుంటున్నారు. మరుసటి రోజు ఉదయం ఎందుకు తేవాలనుకోలేదు వాళ్ళు. కోర్టులో అందరి ముందు హాజరు పరిస్తే ఆవేదనతో అన్నీ చెప్పేస్తానని వాళ్ళ భయం సార్. వారం రోజులు లాకప్పులో ఉంచి చిత్రహింసలు పెట్టారు. పోలీసోల్ల చిత్ర హింసలు భరించలేక చచ్చిపోదామనుకున్న మాట చెప్పవద్దని మల్లా కొట్టారు. ఆ హింసలు చూడలేక మూడు వేలు అప్పుతెచ్చి వాళ్ళ చేతుల్లో పోశారు మావాళ్ళు. అందంతా పోనీయండి సార్. అసలు కథ టూకీగా చెప్తాను సార్....

★ ★ ★

"మా తండ్రికి మేం నలుగురం సంతానం సార్. మా అక్కకు చిన్నప్పుడే పెళ్ళయి పోయింది. చెల్లెలు మా లచ్చికి మూడేళ్ళ వయస్సులో అమ్మ పోయింది. కొంత కాలానికి నాన్న మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. ఆమె తనకన్నా చిన్నవాడైన ఆనందరావుకు అలవాటైంది. ఇంత మందిని సాదలేనని ఆమె రెండేళ్ళకే వెళ్ళి పోయింది. ఆనందరావు తన పెళ్ళయ్యేదాకా ఆమెను ఉంచుకున్నాడు. ఆ తర్వాత ఆమె బతుకు ఆమెదై పోయింది సార్.

"…. ఈ కారణంగా మా అక్కను బావను కొంతకాలం యిల్లరికంలా తీసుకొచ్చాడు నాన్న సరిపడక కొన్నేళ్ళకే వాళ్ళు వెళ్ళిపోయారు… ఆనందరావు అక్కమీద కన్నేశాడని ఆ తర్వాత తెల్సింది….. ఇంట్లో ఆడతోడు అవసరం అని భావించాడు నాన్న. నా కలా చిన్న వయస్సులో పెళ్ళయింది సార్.

"… నాకు యిరవై అయిదేళ్ళు వచ్చేటప్పటికే ముగ్గురు పిల్లల తండ్రినయ్యాను. అప్పటి నాభార్య నర్సవ్వకు యిరవై ఏళ్ళే… పన్నెండో ఏట నుండే ఆ యింటి భారమంతా నర్సవ్వ మీదే పడింది. ఇరవై ఏళ్ళకే నలభయి ఏళ్ళ వయస్సు వచ్చేసింది. మా తమ్ముడు అయిదో తరగతితో చదువు ఆపేశాడు. చెల్లెలు మాలచ్చి తరం నుండి మా పల్లెల్లో పెళ్ళి చేసే వయస్సు పెరుగుతూ వచ్చింది సార్.

"… ఆనందరావు నర్సవ్వను కూడా వదిలి పెట్టలేదు సార్. అప్పటికి అతనికి పెళ్ళయింది. అప్సరస అంత అందమైన దొర్సాని అతని కుండగా ఎండిపోయినా చేపలా ఎముకలు తేలి చెమట కంపు కొట్టే నర్సవ్వ మీద కన్నెందుకు పడిందో …తెలియదు. అంతకన్నా విచిత్రం ఆరడుగుల అందగాడు ఆనందరావుండగా దొర్సాని నాపై కన్నేయడం… పై స్థాయి వారితో అక్రమ సంబంధం స్త్రీకైనా, పురుషుడికైనా ఎంత ఆత్మవిశ్వాసాన్నిస్తుందో…సార్!

"…మంచివాళ్ళు తొందరగా పోతారంటారు. ప్రభాకర్ మంచివాడు సార్. తొందరగా పోయాడు. మాకు ప్రపంచాన్ని పరిచయం చేసిపోయాడు. పోయేనాటికి ముప్పయి ఏళ్ళయినా ఉండవు. అతను యింటి కొచ్చినప్పుడల్లా అందర్నీ పేరు పేరునా పలకరిస్తాడు. చదివింది చదివాడు. అయినా లోకాన్ని చదివేసిన విశ్వాసం అతని నవ్వులో…"

"అతడిని చూస్తే చాలు అన్ని కష్టాలు తీరినట్లుగా ఉండేది. మంచి బతుకు పోరాడైనా గెల్చుకోవాలనే ఆశ ఆర్తి కలిగేది. అతని నవ్వులో….అతని మాటల్లో ఏదో శక్తి ఉంది… అలా పరిచయమయ్యాయి రాజకీయాలు…వివరాలు గుర్తులేవు…సభలు… ఊరేగింపులు…పాటలు…జండాలు పాతడం…."

"... ఆ తర్వాత కొద్ది కాలానికే పరిస్థితి మారిపోయింది. ప్రభాకర్ కనుమరుగయ్యాడు. అతని దర్శనమే మహాభాగ్యం అయిపోయింది. అతని జాడ కోసం నీళ్ళను వడపోశారు...చెరువును వడపోయడం ఎవరితరం..."

" ... సార్ వాళ్ళు దొరక్కపోతే వీళ్ళకు జరిగే నష్టం ఏమీ లేదు. కాని చట్టానికి తన పెద్దరికం పోతున్నదని అసహనం పెరిగింది...అసహనం శాడిజంగా మారింది. క్రూరత్వం పడగవిప్పింది. పశుత్వం రాజ్యమేలింది.... అతడు దొరకలేదు. అతన్ని దొరక్కుండా కాపాడుతున్నారని కసి... అత్తమీది కోపం దుత్తమీద..."

"...అలా ఎందరో ఇంటి నుండి లాకప్పుకు...లా కప్పునుండి కోర్టుకు...కోర్టునుండి జైలుకు...జైలులో పాఠాలు....జైలు నుండి బేల్ పై యింటికి...ఇంటినుండి కేసుకోసం కోర్టు హాజరు...కేసు కేసుకూ...వాయిదా నుండి మరో వాయిదాకు నడుమ మారే మా బతుకుల తీరు గురించి ఏ రికార్డుల్లో ఉండదు. ప్రతి కేసులో గలవారి గురించిన ఈ వివరాలు రాసుకుని ఎంక్వయిరీ కమిషన్లేసి చట్టం అమలయ్యే తీరును లోలోతుల్లోకి వెళ్ళి పరిశీలించి ఎప్పటికప్పుడు సరిచేసుకొనే విధానం ఉంటే యిన్ని సమస్యలు ఉండకపోను సార్. ఒక్కమాట అడుగుతాను సార్. ఏమనుకోవద్దు. మేం ఎన్నిసార్ల కేసులు కొచ్చినా కేసులు వాయిదా పడుడేగద. నాలుగుసార్లు రాకపోతే మీకు జరిగిన నష్టమేంది. మీ దెంత దయగల హృదయం సార్! ఎన్నిసార్లు వచ్చినా కేసు వాయిదా వేసుడే అని తెల్సీ నేను రాలేకపోయినందుకు బేల్ క్యాన్సిల్ చేసి జైల్లో వేస్తిరి! దొరా! మీరు మా పెద్దొరకన్న పెద్ద దొరలు మీ తీర్పుకు తిరుగుండది. ఆ పెద్దొర ఆలస్యమైతే అవ్వనక్కను తిట్టి మర్సిపోవు. కాని మీరు చల్లగా మాట్లాడుతూనే జేల్లోకి పంపుతారు. చట్టాలు మీ చేతిలోని బంగారం మీ రెట్లా చెప్తే అట్లా వింటాయి సార్."

"... ఈ బాధలు పడలేక యిల్లు వదిలాను...నేను అడవులు పట్టేనాటికే నాకు ముగ్గురు పిల్లలు. మా లచ్చి జొన్న కర్రలా పెరుగుతోంది... తమ్ముడు కరెంటు మోటార్ల రిపేరింగు నేర్చుకొని కొంత సంపాదించడం మొదలెట్టాడు... నన్ను సర్పంచుగా నిలబడాలన్నారు... నాకూ అదే ఆలోచన ఉండింది. ... చిన్న కులంలో పుట్టడం ద్వారా కోల్పోయిన గౌరవం తిరిగి పొందడానికి అది కూడా ఒక సాధనం అనే విశ్వసించాను... అయితే మీరు పెట్టే తిప్పలు చిత్ర హింసలు యిల్లు కన్నా అడవులు పట్టడమే సుఖం అనుకునేట్టు చేసింది. ఇల్లు వదిలి ఎన్ని ఊర్లు తిరిగానో ఎన్ని అనుభవాలో ఎంత ప్రేమో... ఆ అనుభవాల్లో నిలబడగలిగి ఉంటే సునాయాసంగా ఎమ్మెల్లేగా గెలిచి ఉండేవాడిని టగ్గాఫర్‌గా నిలబడి ఉంటే ప్రభాకర్ పార్లమెంటు సభ్యుడై ఉండేవాడు సార్.

"...న్యాయమూర్తిగారూ...! అవన్నీ పాలకవర్గ రాజకీయాలనుకున్నాం...పాలకవర్గాలక్కూడా శాసనాధికారం...చట్టబద్ధత ఈ ఎన్నికల ద్వారానే వస్తుందని అపుడు మాకు తెలియదు....కాన్షీరాం వచ్చి చెప్పేదాకా ఈ విషయం అంబేద్కర్ చెప్పాడని కూడా తెలియదు సార్. దాంతో పార్లమెంటునే గడగడలాడించాల్సిన ప్రభాకర్ ఎన్ కౌంటర్లో పోయాడు.. ఏ అధికారాన్ని ఎన్నికల్ని గుర్తించ నిరాకరించామో వాటి ద్వారానే నిర్బంధాలకు గురయ్యాం...జీవితాల్ని ఓడిపోయే వ్యూహం ఎత్తుగడలకు నాంది అక్కడే పడింది... అది సమర్థుల్ని అసమర్థుల్ని చేసింది. తాను సృష్టించుకున్న నిర్బంధాలకు తానే భయపడేట్టు చేసింది... పోయి..పోయి.. ఇపుడు ఆకురాలినా భయమే..స్వేచ్ఛగా మాట్లాడుకోవాలన్నా భయమే...చివరకు ప్రజల్ని ..సన్నిహితుల్ని నమ్మాలన్నా భయమే... అన్నిటిమీదా నిషా.. అనుమానం...టెన్షన్స్...అల్సర్స్...కోపం...అసహనం...రహస్యంలో తప్పుడు సమాచారం... అంతా అస్తవ్యస్తం... ఒక పద్ధతి ప్రకారం జరిగిపోయింది... ఆపద్ధతిని రూపొందించిన వాళ్ళు పార్టీలో తమ అధికారం పోగానే హాయిగా ఎంచక్కా భార్యా పిల్లల్తో ....మనుమరాళ్ళతో కాలం

గడుపుతున్నారు....వాళ్ళు మళ్ళీ విప్లవం అని ఊసెత్తితే ఒట్టు... అలాంటి వాళ్ళను నమ్ముకొని ముందటపడి మూతి పళ్ళు రాలగొట్టుకున్న వాళ్ళల్లో నేనొకరిని సార్.

"...మీకా విషయం తెలియదు. అందులో ఉండే ఆనందం ఉత్తేజం మీకు తెలియదు. అడవుల్లో చెట్ల కింద కూర్చుని ఈ ప్రపంచాన్ని మారుస్తామని చర్చలు చేస్తుంటే కలిగే ఆనంద ఆత్మ విశ్వాసం మీ ఊహకు అందదు...పల్లెల్లో గూడెంలల్లో గుడిసెల్లో, గుడ్డి దీపం వెలుగులో మామాటల్లో వాల్లకు బతుకుమీద విశ్వాసం కలుగుతుంటే... ఎండిన చాపల్లాంటి ఆ శరీరాల్లో...మాసిపోయిన ముఖాల్లో రాసిపోసినట్లు ఆశలు చైతన్యం కదలాడుతుంటే మనిషైన వాడెవడికైనా వారి కోసం ప్రాణాలీయాలనే అన్పిస్తుంది.... నా భార్య నర్సవ్వ పొద్దుల్తో ఉన్నప్పుడు ఈ ప్రపంచాన్ని మోస్తున్నది నా కడుపులో కదా అన్నట్టు నిండుగా నవ్వే ఆ నవ్వు చూస్తే నాక్కొంచెం ఈర్ష్య కలిగేది. మేం ఈ ప్రపంచాన్ని మారుస్తున్నాం అనే భావన మాలో ఈ ప్రపంచాన్ని మోస్తున్నది మేమే అనే ఆత్మవిశ్వాసాన్నిచ్చింది.... విప్లవంలో గల ఈసుఖం..... ఆత్మ విశ్వాసం వల్లే ఎన్ని బాధలైనా పడడం సాధ్యపడింది.

"...నూకపెల్లి సారవ్వది ఎంత చక్కని గొంతు.. ఆమె పార్టీలోకి రావడానికి ఎంత కృషి చేశానో... ఆమె చాలా తటపటాయించింది. ... కానీ చేరాక చకచకా ఎదిగిపోయింది. ఆమె కారణంగా నాకు మళ్ళీ పెళ్ళి చేసుకోవాలనే ధ్యాస కలిగింది. ఆమెను ప్రేమించడం ప్రారంభించాను. ఇంటివద్ద పెళ్ళాం పిల్లలు ఉండగా పార్టీలో మరో పెళ్ళాం కావాలా అని కొందరు ఈసడిస్తారు... పార్టీలో కూడా ఎవరితో చెప్పుకోలేని మానసిక ఏకాకితనం తాలూకు జీవితం కూడా ఉంటుంది... చెప్పుకోవడానికి మనిషంటూ తోడులేని జీవితంకన్నా నరకం ఉండదు... ఆస్థితిలో మరో తోడు కోసం మనిషి అభిలషిస్తాడు... సార్!...."

...కాని సారవ్వప్రేమకు నేను ఆనలేదు. ఆమె పార్టీ జిల్లా కార్యదర్శి సుధాకర్‌ను ప్రేమించింది. పెళ్ళి చేసుకొంది. నేను హతాశున్నయ్యాను...కోలుకోలేకపోయాను...ఆమె మనిషిని ప్రేమించలేదు... ఆమె అతని పదవిని హోదాను ప్రేమించింది... బాధతో ఉండబట్టలేక పెళ్ళయ్యాక ఏడాదికి సారవ్వతో ఈ మాటే అన్నాను... ఆమె నవ్వింది... నవ్వుతూనే నన్ను నిలేసింది... అతను నీకన్నా ఎందులో తక్కువ ...చదువులోనా... అందంలోనా...కమిట్‌మెంట్‌లోనా... త్యాగంలోనా... అని అంది. నిజమే.... అతడు నాకన్నా సంస్కారవంతుడు...బాగా చదువుకున్నాడు... ఆ చదువు అతని ముఖంలో ఒక చెప్పలేని కళాకాంతుల్ని ఆత్మ విశ్వాసాన్ని నింపుతుంది. ... అతనికి భాష వస్తుంది. అనుకున్న భావాన్ని చెప్పడం వస్తుంది.

" ... ఒక టీచర్ కొడుకు అతడు.... ఒక రైతుకూలీ బిడ్డను నేను... నాకా సౌందర్యం సంస్కృతీ తెలియవు...... ఆమెకు కావాల్సినవేవో అడగక ముందే సమకూర్చి ఆమె ప్రేమను గెల్చుకోవాలనుకున్నాను... గెల్చుకున్నాను కూడా... అయితే సొంత అన్నయ్యలా చూసుకుంటానంది సారవ్వ... నిజంగా చివరిదాక సొంత చెల్లెలులాగే నన్ను చూసుకుంది. అడవి దోమల్లో ఎన్నోసార్లు మలేరియాతో తీసుకున్నా... అన్నయ్యా అంటూ అన్నీ సమకూర్చింది సారవ్వ... ఎక్కడెక్కడి నీల్లో తాగి అడవుల్లో అమీబియాసిస్ కడుపునొప్పితో బాధపడ్తుంటే సారవ్వ ఎంత విలవిల్లాడేదో ... చెట్టు కింద నిద్రపోయిన నన్ను కాపాడ్డం కోసం సెంట్రీ చేస్తున్న వెంకన్న తానే బలి అయ్యాడు... అక్కడ ఎన్నో కష్టాలు.. ఆకష్టాల్లోనూ ఎంత సుఖం ఉండేది... ఆ సుఖంలో దృక్పధం ఉండేది. మా దృక్పథంలో భాగంగా ఆ సుఖం ఉండేది...."

"....నా దృక్పథం మా వాళ్ళ జీవితాలకు సంబంధించింది. ... పట్నంలో, కోస్తాలో విప్లవం గురించి మాట్లాడే మేధావులు రచయితలు ఎట్లా స్వేచ్ఛగా బతుకుతూ మంచి జీవితం

జీవిస్తున్నారో...పల్లెల్లో మా వాళ్ళు విప్లవం చేస్తూనే అలా స్వేచ్ఛగా మంచిగా జీవించే విధంగా రాజీ ...శాంతి కాలంగా వ్యూహం పెరిగిని బాల్యం... అనుభవాలు నాకలా అన్పించాయి.... నా కెందుకలా అన్పించిందో... కొంచెం చరితలోకి వెళ్తేగానీ అర్థం కాదు న్యాయమూర్తి గారూ...''

''...మీకు తెల్సే ఉంటుంది... చరిత్ర కందని కాలంలో గిరిజన తెగలు ఎక్కడికక్కడ వలసల్ని మాని స్థిరనివాసాలు ఏర్పరచుకున్నాయని... వ్యవసాయం చేయడం నేర్చుకున్నాక స్థిర జీవితం అవసరమైందని. వ్యవసాయం కోసం అడవుల్ని నరికి సాగుచేశారని, వ్యవసాయం ఆధారంగా వృత్తులు ఎదిగాయని... అంతా పాత కథ...''

''... పాత పల్లెల్లో వెలి వేయబడ్డ వాళ్ళు బతుకు కోల్పోయిన వాళ్ళు... అడవులు పట్టి చిన్న గూడేలు ఏర్పర్చుకొని మళ్ళీ కొత్త అడవిని నరికి సాగు చేసికోవడం మొగలొట్టారు. అట్లా వలసలు సాగిన గిరిజనులు మాల, మాదిగ, యానాదులు కొత్త కొత్త ఊళ్ళను రూపొందించుకున్నారు... చెరువులు, కుంటలు నిర్మించుకున్నారు...పోను పోను పాత ఊళ్ళల్లో బతుకు కోల్పోయిన చేతి వృత్తి కులాల యువతరాల వాళ్ళు ఆ కొత్త ఊళ్ళకు చేరేవాళ్ళు... వ్యాపారం కోసం కోమట్లు... పన్నుల కోసం జాగిర్దారుల పట్వారీ గుమాస్తాలు చేరేవాళ్ళు... వీళ్ళ కోసం బ్రాహ్మణుడు చేరేవాడు...క్రమంగా ఊరేవాళ్ళదైపోయేది. పన్నుల కిందా, వస్తు మారకం, బాకీల కింద పొలాలన్నీ వాళ్ళ చేతిల్లోకే చేరిపోయేవి...మళ్ళీ అక్కన్నించి కొందరు గిరిజనులు...యానాది మాల మాదిగలు కొత్త అడవుల్ని సాగు చేసికోవడానికి వలసవెళ్ళే వాళ్ళు...''

''... బహుశా వందయాభయి రెండు వందల ఏళ్ళ క్రితం ఈ కరీంనగర్ జిల్లాకు అటువైపు కరువుల వల్ల కొందరు పొట్ట చేతపట్టుకొని బతకడానికి వచ్చారు. అవి కాటన్ దొర ప్రాజెక్టులు కట్టడానికి ముందే వచ్చిన కరువులై వుంటాయి. మామూత్తాత చెప్పేవాడు.. ఆ వచ్చిన వాళ్ళ బుడ్డగోచితో మూటెడు సామానైనా లేకుండా వచ్చారని. అలా ఒకర్ని చూసి ఒకరు వారి బంధువుల వలస సాగేది...''

''... ఆకాలంలో యాభయి రూపాయలకు ఎకరం మంచి భూమి.... మా తాత కాలంలో ఎకరానికి నూటయాభయి నుండి మూడు వందలే ఉండేది... ఇక్కడివాళ్ళ అమాయకత్వాన్ని చూసి వాళ్ళు పెరిగిపోయారు. వాళ్ళలో చాలామంది కాలక్రమంలో దొరలుగా రూపాంతరం చెందారు నైజాంకు దగ్గరై పన్నులు వసూలు చేసే జాగిర్దార్లు సంపాదించారు.... వాళ్ళకు ఆనందరావు దొర ఎనిమిదో తరం వారసుడు... అతని తండ్రి రాంరావు దొర నాటికి మమ్మల్ని దోచుకోవడం పూర్తయినాలుగు తరాలు గడిచినట్టున్నాయి.

''...పోంగ...పోంగ ... మా వంతు వచ్చేసరికి కొంచెం పెరడు మిగిలింది... ఎనభై ఏళ్ళ కింద కరువుల్లో తహసీలు కట్టలేక సాగులోకి తెచ్చిన నలభయి ఎకరాల భూయిని వదులుకున్నాడట మా తాత. దొరలు పట్వారీలు కల్సి అలాంటి భూములన్నిట్నీ తమ పేరు మీద రాసుకొని వందల వేల ఎకరాలకు ఎదిగారు...''

''... ప్రభాకర్ వచ్చి ఊర్లో సంగం పెడ్దామంటే అందరి తీరు నేనూ సంతోషపడ్డాను ముందువాళ్ళు ఊళ్ళేకొచ్చి డప్పుకొచ్చి కొన్ని పాటలు పాడరు... కొన్ని మాటలు చెప్పారు.... కూలీలు పాలేర్ల జీతాలు పెంచడం... వెట్టిరద్దు :..దండుగల దడవతుల వాపసు అన్నాము.... అంతదాకా సహాయ నిరాకరణతో పాటు సాంఘిక బహిష్కరణ జరిపాము... మూడు వందల ఊళ్ళు కదిలి జగిత్యాల్లో జైత్రయాత్ర జరిపాము...దాంతో రాంరావుదొర కుటుంబంతో సహ పట్నం పారిపోయాడు.కాని ఊళ్ళో పోలీసు క్యాంపు పెట్టించాడు.....''

"కౌలు వసూలు కోసం ఊర్లోకి వచ్చిన రాంరావు దొరను దొరికించుకొని చుట్టూ మూగి ప్రజా పంచాయతీ చేస్తే అందరి కాళ్ళు పట్టుకున్నాడు... పోలీసు క్యాంపు తీసే యిస్తానన్నాడు కేసులు పెట్టి మమ్ముల్ని కోర్టుల చుట్టూ ఖర్చులు ముప్పయి అయిదు వేలు మూడు నెలల్లో యిస్తానని కాగితం రాసిచ్చాడు..."

"...అన్నీ విన్నట్టే విని అయినా యిక ఈఊరురావద్దురో అని అటే పట్నం పారిపోయాడు. కొడుకుల బిడ్డల చదువులన్నీ అక్కడే...పట్నంలో యిండ్ల ప్లాట్ల వ్యాపారంతో ఎంతో సంపాదించాడు.. ఏదో కొరియర్ సర్వీసు కూడా పెట్టారు...మా అత్తగారి ఊరి దొరతుక్కారావు పట్నంలో ఏవో ఏజెన్సీల్తో .... డిస్ట్రిబ్యూటర్లుగా ఎదిగారు..".

"...దొరలు దెంకపోంగానే మా కష్టాలన్నీ పోతాయనుకున్నాం... ఇక అంతా మనదే రాజ్యం అనుకున్నాం. దొరలు గుంజుకున్న భూములన్నీ మళ్ళీ ఎవరికి వారు దున్నుకోవచ్చునుకున్నాం. స్వేచ్ఛగా బతకొచ్చు అనుకున్నాం....గ్రాం పంచాయతి...పంచాయతి సమితి...సినీ బ్యాంకులు అసెంబ్లీలు అన్నీ మావే...అన్నిటామేమే ఉంటామని అనుకున్నాం... ఇట్లా జరుగుతుందనుకుంటే అట్లా చేసి ఉండేవాళ్లం కాదు...ఏమో... ఎప్పటి ఆపద అప్పుడు గట్టెక్కాలనే ఆలోచన... రాంరావు దొర భూమిలో ఓనాడు జండాలు పాతుదాం అన్నాడు ప్రభాకర్ ...ఆ జెండాలు మా భూమిలో దాకా ఎక్కడ పాతుతారో... అని అక్కన్నే ఉండాలని ఉన్నాను...

".... అందర్తో నన్ను తన్నారు...జైల్లో వేశారు... ఏమీ చేయని పాపానికే యిన్ని తన్నులా అని రోషం కలిగింది అవును... యిక అప్పట్నుంచి బేల్‌మీద బయటకు వచ్చాక అన్నల్లో బాగా కల్సి తిరిగింది నిజమే ... నర్సవ్వ అందరికి రాత్రనక పగలనక అన్నం పెట్టింది నిజమే నేనూ నా చెల్లెలూ, పిల్లలూ సద్దులు ... ఉత్తరాలు యిచ్చి వచ్చిందీ నిజమే... ఆతర్వాత అందులో ఒకరు దవాఖానాలో చచ్చిందీ నిజమే... రెడ్డిని ఎన్‌కౌంటర్ చేసినంక నలుగుర్ని వెంటేసుకుని ఊర్లు తిరిగింది నిజమే... సంగాలను మల్లా నిలబెట్టిందీ నిజమే.... నలభయి ఊర్లల్లో పంచాయతులు చెప్పిందీ నిజమే...సిద్ధాంత క్లాసులు పెట్టింది నిజమే ... తుపాకులు పట్టుకొని తిరిగిందీ నిజమే ... నక్సలైట్‌గా మారిందీ నిజమే.... వీటన్నిటీ వెనకా ప్రభాకర్ ఉన్నదీ నిజమే..... ప్రభాకర్ పై స్థాయిలోకి వెళ్తే ఆ స్థానాన్ని పూరించిందీ నిజమే..."

"....అవును... గుర్రాల పెంటయ్య ఆలియాస్ ప్రవీణ్ అని నా పేరు వినగానే దొంగలకు పోలీసులకు లాగుల్లో ఉచ్చ రాలింది నిజమే ... నాలుగు తాలూకాల్లు తిరిగిందీ నిజమే... సారాబందు చేస్తూనే సారా కాంట్రాక్టర్ల దగ్గర లక్షల రూపాయలు పార్టీ ఫండు వసూలు చేసింది నిజమే......వాల్లతో ఎన్నో పనులు వెల్లదీసుకున్నదీ నిజమే .. మాముంగట భయపడ్డట్టు నటించి పోలీసోల్లకు వాల్లు మాజాడలు చెప్పిందీ నిజమే.... మనీ ఆక్షన్ పేరిట దొరల యిండ్లు దోచిందీ నిజమే... అట్లా నాలుగైదేండ్లు గట్టిగా నిలబడిందీ నిజమే...."

".. అయితే పోలీసులు మా పెరట్లో గోదాలను మేపారు. నర్సవ్వను నీ మొగడేడే వచ్చి పోతున్నాడంటా అంటూ చిత్ర హింసలు పెట్టారు. తమ్ముడు లచ్చిరాజం ఆ చిత్రహింసలు , లాకప్ నిర్భంధాలు భరించలేక వీసా తీసుకొని పనిపేరిట అరబ్బు దేశాలకు పారిపోయాడు... నా యిల్లు కూలగొట్టారు... పెళ్ళి కావాల్సిన చెల్లెలు మాలచ్చిని కన్న తండ్రిని ... వదినెల్ని గుంజకు కట్టేసి వాళ్ళ కళ్ళ ముందే ఎస్సయితో అయిదుగురు రేప్ చేశారు... నా తండ్రి మంచం పట్టాడు. రక్తస్రావంతో నా చెల్లెలు చీరెలు విడిచేసేది.... నా కుటుంబం ... పిల్లల బతుకు పల్లేరు కాయలైంది..."

అపుడు తెల్వలేదు గానీ నాకిపుడు దేవుతోంది సార్. మాకు యింత అన్నం పెట్టిన కర్మానికి మేం పోయినాక పోలీసులచ్చి యిల్లును ఆడోల్లను ఆగమాగం చేసే వాల్లు. మొగోల్లు చెట్లు

గుట్టలు పట్టుకొని ఊరుకుదురు. ఆడోల్లు పసిపిల్లలు ముసలోల్లు గొడ్డుగోద ఎటు ఊరుకాలె సార్. విప్లవం కోసం యివన్నీ భరించాలె అని ఊరడించిన మా ప్రేమలో ఎంత క్రూరత్వం ఉంది సార్. ఏదో మంచి పనిచేస్తున్నారని ఆదరించినందుకు సిద్ధాంతం, విప్లవ వ్యూహం తెలియని వాల్లంతా ఇన్ని హింసలకు గురికావాలనుకోవడం ... ఎంత క్రూరత్వం సార్. వాల్లను అడిగి విప్లవ వ్యూహం రూపొందించుకున్నామా. ఏదో పెద్ద అన్నలు చెప్తే అదే నిజమని నమ్మితిమి, జనమూనమ్మి, మా కోసమని వాల్ల పిల్లల వీపులు చిట్లిపోయినై వాల్ల పొలాలు బీడులుగా మార్చారు. మేం దొరల భూములు బీడులు వార్చాం. వేల ఎకరాలు బీడు వారిపోయింది. పనిచేసికొని బతికేవాళ్ళు బతుకును వెతుక్కుంటూ ఊర్లు విడిచి దేశాలు పట్టారు సార్. మేం పాపం చేసుకొని పుట్టినాం గనుకనే యిన్ని కష్టాలని మీకు తెల్సుసార్, మేం లేకి కులంలో పేదరికంలో పుట్టినందుకే మాకు శీలం ఉండదని ఆశలు ఆరాటాలు ఉండకూడదని మీ విశ్వాసం సార్, మీకు తెలియకపోతే మీరు ప్రమాణం చేయించి భగవద్గీత నడగండి సార్. లేకపోతే రాజ్యాన్ని పోలీసుల్ని అడగండి సార్. వాల్లు చెప్పకపోతే నా భార్యను అడగండి సార్. నా భార్య చెప్పకపోతే నా చెల్లెలు చెప్తది సార్. ఎవరు ఎక్కడ గిచ్చిన్రో ఏం చేసిన్రో, ఆమె శరీరంలో మిగిలిన జాగలేదు. ఆమె మానంలోంచి కారేది రక్తం కాదు సార్. వాల్ల ఆనందభాష్పాలు. నేను జైల్లో ఉన్నప్పుడు వదల్లేదు సార్.

.......ఈ బాధలు భరించలేను... ఈ సంసారం వేగించడం నాతోకాదు... రాత్రి పగలూ ప్రాణాలరచేత పట్టుకొని గుబులు గుబులుగా ఎన్నాళ్ళు బతకడం... యిట్లా ప్రతిరోజూ చచ్చిపోతూ బతకడం ఎంతకని...నన్ను కూడా పార్టీలోకి తీసుకుపో అని నర్సవ్వ ఎన్నోసార్లు చెప్పింది. .. ఎలాగో జాడదీసుకుని ప్రభాకర్‌ముందుంచింది... ఆడవాళ్ళం పిరికివాళ్ళం కాదు... కానీ యీ కుటుంబజంజాలన్నీ ఏంది... అవి ఎక్కడనన్నా పోనీ... అని అన్నది... ప్రభాకర్ ఈ సమస్య చూసి తన జీవితంలో మొదటి సారిగా గతుక్కుమన్నాడు. నర్సవ్వకు ఏం చెప్పాలో ప్రభాకర్‌కే తోచకపోతే నాకేం తోస్తుంది.

పిల్లల్ని ఎక్కడో వేరే జిల్లాలో ఏదైనా ప్రభుత్వ హాస్టల్లో వేయాలనుకున్నాం... ఎవరికైనా దత్తత యిచ్చేద్దాం అనుకున్నాం. చెల్లెలు మాలచ్చిని కూడా పార్టీలోకి రమ్మంటే... అంటూ ఆలోచనలు చేశాం... అయితేమంచాన పడ్డ తండ్రి మాటేమిటి... తండ్రిని అట్లా వదిలేసి చెల్లెలు రానంది. తల్లిని విడిచి ఉండడానికి పిల్లలు ఏడ్చేశారు... అదీగాక మా పిల్లలు నల్లగా ఉంటారు...వీళ్ళందర్నీఎవరు సాదాలి.... ఉన్న యింట్లో ... మంచి రంగులో మంచి కులంలో పుడ్తే యివన్నీ పరిష్కారం కావడం యింత కష్టం కాదు... అలాంటి వాళ్ళమీద నిర్బంధం కూడా యింతగా లేదు.... మాదిగోల్ల పిల్లలను ముసలి తల్లి తండ్రులను కొడుకులు... ఎంత పార్టీలో ఉన్నా... ఎవరు దగ్గరికి తీస్తారు. దానికి తోడు ఆశ్రయం యిచ్చినందుకు గురయ్యే నిర్బంధాల భయం ఉండనే ఉంది... ఇద్దరం ఉన్నప్పుడే చాలని చాత... ఒక్కదాన్తో ఎలా సాధ్యం.. మీరే చెప్పండి సార్. మీ భార్య మీ జీతం మీదే ఆధారపడి బతుకుత లేదా సార్... మమ్ముల లాకప్పులో వేస్తే పోలీసులు కొడ్తారని తెల్వదా సార్. పైసలు గుంజుతారని తెల్వదా సార్. నోరు మూసుకుని పండకపోతే నీ మొగున్ని ఎన్ కౌంటర్ల చంపుతం అని బెదిరించి అలవాటయ్యేది తెల్వదా సార్. మొగన్ని అరుగుమీద కావలి ఉంచి ఇంట్లో ఆడోల్లతో కల్లు దాక్కుంటూ·ఏం చేస్తారో! మీకు తెల్వదా సార్.

ఇల్లూ సంసారం .. అంతా శిథిలమవుతుంటే వేదనకు గురికాని హృదయం ఉంటుందా... ఉంటే అది హృదయం కాదు... నాకుటుంబం పిల్లల బాగుకోసం అవి ప్రారంభమైన ప్రస్థానం ఎటుపోతోందో తెలియదు. ఈ త్యాగాల వల్ల నాలాంటి కుటుంబాలేవైనా బాగుపడ్తున్నాయా

అంటే అదీలేదు... అందరూ అష్టకష్టాల్లో నిత్య నిర్బంధంలో కూరుకుపోతున్న వారే... రవంత సుఖం కోసం ఆశపడితే కొండంత కష్టాలు ఎందుకు పడ్డట్లు ... మనసంతా వికలమై పోయింది... పనిచేస్తున్న తృప్తి లేకుండా పోయింది.

"... ఎవరికీ దొరకకుండా ఎంతకాలమని తిరగడం... మా తోవలు జాడలు పోలీసులక్కూడా తెల్సిపోయాయి. దమ్ము (అలసట) వచ్చినపుడు సేద తీరడానికి చూస్తే విప్లవం అంతూ దరీ లేని ప్రవాహం. నిరంతరం ఈదాల్సిందే. విప్లవానికి అవతం ఒడ్డు యివతలి ఒడ్డూ అంటూలేవు... అందులోపడి కొట్టుకుపోవడం తప్ప. కుటుంబాన్ని అలాంటి స్థితిలో వదిలేసి తిరగడం మనిషి లక్షణం కాదనిపించింది. ఎల్లకాలం అలాంటి బతుకు నాతో కాదనుకున్నాను. నా బతుకు నేను బతకాలనుకున్నాను. ప్రభాకర్ ఎన్ కౌంటరైపోయి... తెల్సిన యితరులు యితర ప్రాంతాలకు బదిలీ అయిపోయి వేదన తీర్చేవారే కరువయ్యారు... ఉండేవారు ఉంటారు... పోయేవారు పోతూనే ఉంటారని కొందరు అన్న మాటలు శూలంగా దిగాయి... అంత యాంత్రికతను. కఠినత్వాన్ని హృదయ రాహిత్యాన్ని జీర్ణించుకోలేకపోయాను. ఆ స్థితిలో సారవ్వను ప్రేమించాను. నా ప్రేమను నిరాకరించినప్పటికీ ఒక చెల్లెలుగా చివరి దాకా నా వేదనలో పాలు పంచుకుంది...

"......బయటకు వచ్చిన నక్సలైట్లలో కొందరికి జీపులిచ్చారు. కొందరు షాపులు పెట్టుకున్నారు. కొందరు కాంట్రాక్టర్లయ్యారు, నేనో హోటలు పెట్టుకున్నాను మంచి సెంటర్లో మంచి గిరాకీ అయ్యేది... అయితే పోలీసులు రోజు వచ్చుడు... తినుడు... బిల్లు అడిగితే ఏవో కేసుల్లో ఉన్నావని మళ్ళీ కొత్త కేసులు పెట్టడం... ఏ బందు పిలుపులొచ్చినా యిదే సందు అని తీసుకుపోయి లాకపులో వేయడం...

ఎవరికి చెప్పుకోవాలి... ఎవరున్నారని... నా కోసం మాట్లాడేవారెవరున్నారని... కొంచెం మంచిగా బతికే ప్రతీ ఒక్కరినీ పెట్టీ బూర్జువా అని తిట్టితి. కుల పెద్ద ల్ని కులగజ్జిగాల్లని తిట్టితి. రాజకీయాల్లో తిరిగే వారిని మీ వన్నీ దోపిడీ పాలక వర్గాల రాజకీయాలని తిట్టితి. వాల్లు ఓట్లు అడగవస్తే చెప్పుతో కొట్టాలి అని చెప్పితి. వాల్లకు వోటు వేయవద్దని మీటింగులు పెట్టితి. ఇలా అందరికీ కంటయిపోతి ఎవరితో మంచి మాటుందని ఇపుడు వాళ్ళు ఎందుకు సహకరిస్తారు సార్.

"పైగా నేను బయటకు వచ్చాక వారిలో చాలా మందికి కొత్త సమస్య లెదురయ్యాయి. వాల్ల రాజకీయాలకు, కుల పెద్దరికానికి, వారి పలుకుబడికి ఎక్కడ పోటీ అవుతానో అని వాళ్ళకు గుటగుట తగిలింది. వీడు ఎన్‌కౌంటర్లో ఛస్తే ఎంత మంచి గుండు అని బాదాయె... ఎందుకు పట్టుకపోయి సంపుతలేరా అని ఆశ్చర్యం... తమ గుట్లన్నీ ఎక్కడ చెప్తాడో అని నాపై లేని పోనివి కల్పించి పోలీసోల్లకన్నా ముందే వీల్లకే నన్ను లోపల నూకుదామని ధ్యాస..... ఇలాంటి వాళ్ళు నాకెలా సాయం చేస్తారు సార్.

" ...మల్లా మల్లా పోలీసులు పట్టుకపోవుడు... తినుడుకు హోటల్ ఎట్లా నడుస్తుంది... హోటల్ తీసేసి కొంతలోను తీసుకొని ఆటో కొన్నాను. వాల్లు రాత్రిల్లు ఆటోల అడ్డాకాడికి వచ్చి... ఇంట్లుంటె కూడవదలక పనుంది పా అని ఆటోలో ఎక్కి తీసుకపోయి అన్నల జాడ చెప్పమనిరి.

నా వల్ల అనుమానం ఏందంటే నా మీద పెట్టిన పెద్దింటి కేసుల్లో పదకొండు కేసులు కొట్టేశారు నా గోడు చూసి పార్టీలో ఉన్న ఆనాటి నా దోస్తులు కొందరు కేసులకు సాక్ష్యాలు రాకుండా కట్టుదిట్టం చేశారు... అందుకని నాకు యింకా వాల్లతో సంబంధాలున్నాయంటారు...

...ఇక్కడ ... ఎన్ని తీర్ల కష్టాలో... మేం వాళ్ల కన్న తండ్రిని చంపినపుడు కండ్ల నిండా పూసినవాళ్ళున్నారు... వాళ్ళకు నేను పార్టీలోంచి వెళ్ళిపోయినన్నా కనికరం ఎందుకుంటుంది... ఇదే సందు అని ఎవరు అడ్డం రారు అని యింకింత ధైర్యంగా సాక్షుల్ని తయారు చేవారు. పార్టీ ఆదుకొని వాళ్లను బెదిరించింది. అప్పుడే .. అట్లా కాదని వాళ్ళు నన్ను ఆక్సిడెంటులాగా చంపాలని చూశారు...

"... సార్ ఈ లొల్లిలో దిగకపోతే నేను ఎపుడో సర్పంచు అయ్యేవాడిని. దొరలు చాలా తేలికగా ఉండేవాన్ని. అట్లా ఊరంతా ఉత్సాహంగా ఉన్నప్పుడు

'అన్ని పదవులు పోటీలు వదులు కున్నారు దాంతో ఎందుకు పనికిరాని పురుషోత్తం రెడ్డి సర్పంచాయె... ఇపుడు బలిసిపోయె... ఈ పిరికిపంద కాల్లునేను పట్టుకోవాల్సి వచ్చె...'

నా కింద పనిచేసిన నాలెముచ్చు రాజిరెడ్డి అపుడు సర్పంచైపోయె... ఇపుడు మండలాధ్యక్షుడైపోయె... రాజిరెడ్డి సరెండర్ కాంగానే బామ్మర్దులు విమానం కాడికిపోయి ముఖ్యమంత్రిని ఎదురుకున్నట్లు వాళ్ల పార్టీలకు రారమ్మని పూలదండలేసుకొని పిలుచుకున్నారు.... సరెండరయ్యాక కూడా కొందరు అట్లా పెరిగారు. ఇపుడు రాజిరెడ్డిని కలెక్టర్, ఎస్పీ కూడా గౌరవించవట్టిరి. వాడు మీదికి లేవడాన్ని వాని కులం ఉపయోగపడ్డది. నన్ను అణగదొక్కడానికే నాకులం చిన్నదైతే సరెండర్ అవుతామని నమ్మిచ్చి ఎన్‌కౌంటర్ పేరిట చంపేసిరి... కులం పెద్దదైతే సరెండర్ కాగానే పనికి రాని నక్సలైట్లు కూడా ప్రముఖ నక్సలైటవుతాడు... కులం చిన్నదైతే అంతదాకా ఉచ్చపోసుకున్న గాడిద కొడుకే ఈ గాడిదకొడుకేనా అని ఉచ్చిపోపిస్తాడు. వాల్లు వరుసమారినా కులం మారలేదు. వాల్లు పార్టీ మారినా పవరు మారలేదు. అయిదువేల కోళ్ళఫారం పెట్టుకున్న రాజిరెడ్డి యిపుడు మండలాధ్యక్షుడాయె. నీ నక్సలైట్ రాజకీయాలు వద్దని చికెన్ సెంటర్ పెట్టుకున్న రామేశ్వర్ రెడ్డి రెండు సార్లు మంత్రయిపోయాడు. నా బతుకు యిలా అయిపోయింది.... పాలకవర్గాల్లో బంధు మిత్రులున్నోల్లేనక్సలైట్లలోను మంచి బతుకున్నది. వాల్లు పోలీసులకు దొరికినా దొరల్లాగే మాట్లాడుతారు. చక్కని భాషలో మాట్లాడి అబ్బ ఎంత పెద్ద మేధావి అన్పించుకోగలరు. మాకు అంత భాషరాదు. అంత సిద్ధాంతం రాదు. వస్తే వల్ల తీరే నేను కూడా చీలిపోయినా అంటూ ఒక పార్టీ పెట్కుకోకపోదునా సార్.

నాతో పనిచేసిన వాల్లు నలుగురు నాలుగు దిక్కులైపోయారు. వేణు గోపాల శాస్త్రి ఏదో దినపత్రికలో సబ్ ఎడిటర్ అయ్యాడు. విశ్వరూపరావు ఏ క్లాసు కాంట్రాక్టరయ్యాడు. ఎమ్మెల్సీ చేసిన ఎమ్మెల్లే బావరిది కొడుకు తిరుపతి రెడ్డి ఓ ప్రయివేటు కాలేజీకి ఇంఛార్జి ప్రిన్సిపాల్ అయ్యాడు ఇట్లా ఎవరి కులం తీరు వాల్ల బతుకులు... వెరి చదువు తీరు వాల్ల బతుకులు... సరెండరైనా కూడా బతుకులు గెల్చుకున్నారు. జీతాలు కుదుర్చుకున్నారు.... నాకేం దొరికింది. ... ఉన్న జీవితం కుక్కలు చింపిన విస్తరైపోయింది.

నాకు తెల్సినవాల్లు లేరని కాదు... మా ఊళ్ళో ఉన్నారు... మా ముత్తవ్వ పొందించిన ఊర్లో పుట్టిన వాడే అచ్చుత శర్మారా వంటారతన్ని... అతడికి విప్లవంలో పెద్ద పేరే ఉంది. ఇపుడు పట్నంలో నాలుగు లక్షలు పెట్టి అపార్టు మెంటు కొనుక్కొని పట్నంలో ఉంటున్నాడు. కాని తన తోలు కాపాడుకోవడం ఎట్లా నో అతనికి తెల్సినంత ఎవరికీ తెలువది. స్టేట్ మెంట్ యిచ్చి పేపర్లో తన పేరు చూసుకోగానే అతని ప్రాణం చల్లబడుతుంది. అతడు ఏ కేసు కొసదాకా పట్టించుకున్నాడని అతనికి పేరు కావాలి పేరున్నోల్ల గురించైతే పట్టించుకుంటాడు. మీటింగు పెడ్తాడు మాలాంటి వాల్లకైతే వాల్లు యివుండేవే గదా... అని సముదాయిస్తారు. కాని వాల్ల వీపుమీద దెబ్బకాదు గదా...

తలుపు మీద కొడితేనే పోలీసుల నిర్బంధం నశించాలని దేశమంతా బొబ్బలు పెడుతారు. గవర్నరు ముఖ్యమంత్రులదాకా ఉరుకుతారు... అడిగితే క్షేమం పోలేదు... మా చుట్టాలు నా భార్యను వాళ్ల దగ్గరికి తీసుకపోయారు అంటారు. వాళ్ల కులపోల్లు అన్ని పార్టీల్లో ఉన్నారు...ఇట్లా అరెస్టు కాగానే అట్లా వెంటనే విడుదలయ్యే ఎన్నో రూపాల్లో పనిచేస్తారు.

....మేం ఛస్తే వాల్లు కవిత్వం రాద్దామని చూస్తారు. అది చూసి మనం చస్తే మనకూ యింత పేరు వస్తుందని నాలాంటోల్లు మల్లా అందులోకి ఉరికి నచ్చుటానికే వాల్లు రాస్తారు. పెద్ద రాజులు యుద్ధాలు చేస్తూ యిలాగే వీరగాథలు పాడించి సూన్యాల్లోకి భర్తీ చేసుకునేవారు... పల్లె చప్పించిన పల్నాటి బొబ్బిలి యుద్ధం, మహాభారతం వగైరా వీరగాథలన్నీ అందుకు ఉపయోగించుకున్నది. వాల్లకు కావాల్సింది మేం వాల్ల సైన్యంలో చేరడం... అంతేగాని మేం బతికి ఉంటే పౌరహక్కుల వాల్లయినా విప్లవ రచయితలైనా ఎందుకు పట్టించుకుంటారు సార్.

... నన్ను జేల్లో వేస్తే నా యింటికి పోయి మందలించిన (పరామర్శించిన) వాల్లు లేరు. చదువురాని మాలాంటి నక్సలైట్లను చూస్తేనే వాల్లకు ఉచ్చపడుతుంది. రోడ్లమీద కల్సినా మాట్లాడవద్దంటారు... ఇంటికిపోతే ఎందుకు వచ్చావంటారు....నేను వాల్ల యింటికిపోతే వాల్ల మీద నిర్బంధం పెరుగుతుందట... నాతోకలవరు. మాట్లాడరు... కాని వాని ధ్యాసంతా విప్లవం గురించేనట... విప్లవం అని అన్నా వాల్ల బతుకు పువ్వుల్లో పెట్టినట్లు సాగాలట. వాల్ల ఉద్యోగాలు... వేల జీతాలు...వాల్ల పిల్లల సదువులు...సుఖాలు...గౌరవాలు అన్నీ భద్రంగానే ఉంటాయి. నేను కోరుకున్నదీ అదే.... మా పల్లెల్లో కూడా విప్లవం చేస్తున్నా కూడా మా వాల్ల బతుకులు అట్లానే సజావుగా సాగే అవకాశాలుండాలని. అది వారికి తప్పయిపోయింది. అది దిగజారుడుతనం అన్నారు. అలా అన్న వాల్లే పార్టీలో పదవి పోగానే హాయిగా ఉద్యోగాలు, వృత్తులు చేసుకొని బతుకుతున్నారు... కానీ కనీసం వాల్లు ఒక పాలకవర్గ పార్టీ నాయకులు పట్టించుకున్నట్టయినా...పౌరహక్కుల సంగం పట్టించుకున్నట్టయినా ప్రజల గురించి పట్టించుకోవడం లేదు... పార్టీలో నాయకత్వాలు ఉన్నంతసేపు మాత్రం నా అంత మొనగాడు లేడన్నట్టు ప్రవర్తిస్తారు... దేకే గుద్ద తనది గాకపోతే కాశిదాకా దేకుమంటారు వీళ్ళంతా... హింసలు దెబ్బలు త్యాగాలు తనవి తన కుటుంబాలవీ కాకపోతే చాలు... అన్ని వ్యూహం ఎత్తుగడలు కరెక్టేనంటారు... నీ అన్నం నాకు పెట్టు. నీకు ఆకలి కాకుండా మందిస్తా నన్నట్లు వాళ్ళు ఇవాలిటి అభివృద్ధి నంతా సొంతం చేసుకుంటూ రేపటి అభివృద్ధి మీకంటారు. అందుకు విప్లవించాలంటారు. వాల్లు చక్కని చదువులు చదువుకుంటూ తీరిక్కా ఉద్యోగాలు వృత్తులు చేసుకుంటూ పిల్లల్ని విప్లవం వాసన అంటకుండా యింగ్లీషు మీడియంలలో చదివించుకుంటూ రోజా పెళ్ళాం పక్కలో పడుకుంటూ అన్ని సుఖాలు అనుభవిస్తూ అయిదారేళ్ళు పనిచేసి వచ్చిన నాలాంటి వాళ్ళను దిగజారిపోయాడని వదిరే గాడిద కొడుకులను చెప్పుతో పళ్ళు రాలగొట్టాల... ఏ త్యాగాలు చేయకుండానే విమర్శించే వీళ్ళ పెళ్ళాలను... బిడ్డలను ...రేప్ చేసినపుడు తెలుస్తుంది...

‘‘..... వాల్లు ఇండ్లు కట్టుకుంటారు... పెండ్లాం పిల్లలతో హాయిగా సంసారం చేస్తారు... వాల్లకు మంచి ఉద్యోగాలు కావాలి. మంచి కీర్తి కావాలి... వాల్ల కీర్తికి మా నిర్బంధాలు, మా చావులు సాధనాలుగా ఉండాలే తప్ప...వాల్లు మమ్ముల్ని వాల్లలాగా బతకాలనుకునే మనుషులగా చూసిందెపుడు... ఇలాంటి వాల్ల ఉపన్యాసాలు పాటలు విని, వాల్లు రాసే పుస్తకాలు చదివి చెడిపోయాను. అజ్ఞాతసూరీడు కొండపల్లి సీతారామయ్య... పీవీరావు... ముక్కు సుబ్బారెడ్డి, చెంచయ్య, కళ్యాణ్ రావు అందరూ యింతే...రేపు గణపతీ.... ఆదిరెడ్డీ... యింతే... అయ్యావారు

చెప్పే మీది మాటలువిని తీర్థం పోతే అతడు... గుడిలో ...నేను చలిలో ... అన్నట్టే అయింది. వాళ్ల చెల్లెల్లకు, బిడ్డలకు, మరు దళ్ళకు కట్నాలు లేకుండా లగ్గాలవుతాయి. మాకేం వచ్చింది.... వాల్లంతా ఏనుగుల్లాంటోల్లు... ఏనుగుచచ్చినా పదివేలు బతికినా పదివేలు... వాల్లు పార్టీలో పనిచేసినా బయటకొచ్చినా ఎన్‌కౌంటర్‌ల్లో పోయినా ... వాల్లకయ్యే నష్టంలేదు. వాల్లకు దేశంలో పట్టనంత పేరొస్తుంది. వాల్ల పెండ్లాం పిల్లల సాయం కోసం దేశమంతా కదిలివస్తుంది సార్.''

ఒకాయన మనుమరాలు పేరు మీద యిరవై లక్షల యిల్లు కట్టుకున్నాడు... నాక్కూడా అజ్ఞాత సూరీడులా ముక్కు సుబ్బారెడ్డిలా కొండపల్లి సీతారామయ్యలా సాదాగా బతకాలని ఉంది నలభయి ఏండ్లు విప్లవంలో తిరిగి వేల మంది చావులకు కారణమైనవాడు మల్లా సాదా జీవితం జీవించే హక్కుంది గానీ.... నాలుగైదేండ్లు తెల్సీ తెలియక అందులో తిరిగి మల్లా యింటికి వస్తే మాకు సాదాగా బతికే హక్కులేదెందుకు?

"... విప్లవంలో చేరి జీవితాన్ని ఓడిపోయాను. జీవితాన్ని గెలుచుకోవాలని విప్లవంలో చేరితే విప్లవం నాకు ఓడిపోయే జీవితాన్నిచ్చింది సార్.''

* * *

"... నిర్బందం పెరగడానికి పెంచడానికి ఎవరి కారణాలు వారికున్నాయి సార్. నిర్బంధం లేకపోతే రిక్రూట్‌మెంటు పదిశాతమైనా ఉండడంలేదు... అటుచూస్తే నక్సలైట్ల బూచిలేకుండా లక్షలు కోట్లు ఆడిట్ లేకుండా తినడానికి సందు ఎలా దొరుకుతుంది... ఎన్‌కౌంటర్ల పేరిట చంపకపోతే వాల్లకు పాత పగలు తీరేదెలా... ప్రమోషన్లు వచ్చేదెలా... నిర్బంధాలు లేకుండా నిలదీసే అవకాశాలుంటే దోచుకునేదెలా, రేపులు చేసేదెలా... ప్రభుత్వానికి తమ అవినీతి అసమర్థతను పమస్యల్ని పరిష్కరించలేని అలసత్వాన్నించి దృష్టి మళ్ళించడానికి నక్సలైట్ల సమస్య లేకపోతే ఎలా...

.... ఇటు చూస్తే కోస్తాలో కదిలిన లక్షల మందిలో నూటికొక్కరైనా హోల్‌టైమర్ కాలేదు... వాల్లకు బాధలే లేకపోతే మీటింగులకెలా వచ్చారు. వాల్లకు బాధలున్నాయి. బతికే అవకాశాలూ ఉన్నాయి. అందుకని లీడర్లుగానే తప్ప కేడర్‌గా యిరవై ఏండ్లల్లో యాభయిమందైనా కార్యకర్తలు రాకపోయిరి ఆ వచ్చిన ప్రతివాడూ' నా మాట మీంచే విప్లవం నడవాలని కోరేవాడే తప్ప.... ప్రజల మాట పట్టించుకున్నదెన్నడు సార్.

"... మేం ఎన్నికల్లో దిగితే తామెక్కడ ఓడిపోతామేమోనని ఎన్నికల్లో దిగవద్దనేమాకు పాలకవర్గ పార్టీ నాయకులు ఎన్నిరకాలుగా సాయం చేశారో... ఎన్ని దేవుల్లకు మొక్కారో... ఆ దేవుల్లకే ఎరుక సామాజిక అన్యాయాల్ని కొంచెం గట్టి నిలదీస్తే అన్నల్తో సంబంధాలున్నాయని తన్నించాలంటే నిర్భందం లేకపోతే ఎట్లా

సాధ్యం... యిట్లా నిర్భందం ఉండాలని కోరుకోవడానికి ఎవరి కారణాలు వారికున్నాయి....''

కాన్షీరాం మీటింగులకు అయిదు లక్షలమంది వచ్చారు. ఆర్నెల్లు తిరగకముందే అభ్యర్థులకు అయిదేవేల ఓట్లన్నారాలలేదు. నక్సలైట్ల మీటింగులకు పదిలక్షల మంది వచ్చారని నిర్భంధం పెట్టుడే సార్. ఓ అయిదేండ్లు అవకాశాలిస్తే దాని అసలు స్థానంలోకి ఎండుకపోతది. మీరే నిర్భంధం నీరు పోసి రోషం నారుపోసి అమాయకులను నక్సలైట్లుగా మార్చుతున్నారు సార్. స్వేచ్ఛ వుంటే అన్ని పార్టీలను నిలదీస్తారు. ఎదురు తిరుగుతారని ఎవరి కారణాలు వాల్లకున్నాయి సార్.

"...ఈ ఆవుల పోట్లాటలో దూరిన మాలాంటి లేగల కాళ్ళు విరిగాయి. మాకేం మిగిలింది. మా లచ్చి పెండ్లి కోసం నాలుగు దిక్కులు తిరిగి అప్పులు దూసుకవచ్చాను. నేను విప్లవంలో తిరిగినా కట్నం లేకుండా మా చెల్లెను పెండ్లి చేసుకోవడానికి ఎవరూ ముందుకు రాలేదు. కొందరు విద్యార్థుల్ని యువజనుల్ని అడిగాను... ఒక అమ్మాయి ఉంది. వాళ్ళ అన్న విప్లవంలో కెళ్ళాడు. ఆమె పెళ్ళి కావాలి కొంచెం కుంటి.... కొంచెం నలుపు పోలీసుల్లో రేప్ చేయబడింది... అని మాత్రం చెప్పలేదు. ఏ కులమో కూడా చెప్పలేదు. చాల చక్కగా ఉంటుందనే చెప్పాను. విప్లవం పట్ల చక్కని అవగాహన ఉంది... మీ రెవరైనా పెళ్ళి చేసుకుంటారా అని అడిగాను. వాళ్ళ ఆదర్శాలు మీటింగుల మేరకే. ఆ ఆదర్శాలకనువుగా జీవితాల్ని మలుచుకోవాలని లేదు. వాళ్లకు బాగా చదువుకొని ఉద్యోగం చేసే భార్యలు కావాలట. ఇద్దరూ ఉద్యోగాలు చేసుకుంటూ విప్లవాల గురించి మాట్లాడతరట అంతేగాని విప్లవంలో ప్రాణాలర్పించినవారి భార్యలను చెల్లెండ్లను కూతుళ్ళను పెళ్ళి చేసుకోరట... సాది సవరించాల్సిన నాలాంటివాళ్ళు యిల్లు వదిలేసి విప్లవంలో కలిశాక నిత్య నిర్బంధంతో పాటు ఆర్థిక బాధలు మీరు పడుతుంటే మా వాళ్ళు చదువుకోవడం ఎలా సాధ్యం ... చదువుకున్నా ఉద్యోగాలు సాధించడం ఎలా సాధ్యం ... ఆ చదువూ ఉద్యోగాలూ ... ఇతరుల పాలయ్యాయి. విప్లవంతో పని లేకుండానే యిపుడు వారు హాయిగా బతుకుతున్నారు....

మా చెల్లెల్ని రేప్ చేసిన విషయం తెల్సీ కొంచెం ఎక్కువ కట్నంతో తల్లీ దండ్రీ లేని పేదవాడు చేసుకోవడానికి ముందుకొస్తే ఎంతో సంతోషించాము. మానవత్వం యింకా బతికే వుందనుకున్నాం. కాని పెళ్ళి కట్నంతో షాపు పెట్టుకొని ఆ షాపుతో డబ్బూ గౌరవం పెరిగాక మా లచ్చిని వదిలించుకోవలని చూశాడు.... పోలీసులు చేసిన రేప్ గురించి గుచ్చి గుచ్చి అడిగి వారితో అక్రమ సంబంధాలు అంటగట్టి వేధించడం ప్రారంభించాడు.... ఆ బాధలకు తాళలేక బావిలో దూకింది. చావుదప్పి కుంటిదైపోయింది. వాడు వదిలేశాడు.... ఆకలి ఆగలేక మాలచ్చి ఎవరికో అలవాటైంది. ... అది తెల్సి మళ్ళీ పెళ్ళి చేయలేని నిస్సహాయతతో కుమిలి కుమిలి ఏడ్వడం తప్ప ఏం చేయలేకపోయాను. మొదట అలవాటైన వాడు మోసంచేశాడు... దానికిపుడు తిరుగుబోతు అనే పేరొచ్చింది. లక్షల మంది విద్యార్థి యువజనుల్ని ఆర్గనైజ్ చేసినా వాళ్ళ సంస్కృతిని ఏం మార్చగలిగాం... వాల్లల్లో ఏ ఒక్కరైనా మాలచ్చిని పెళ్ళి చేసికొంటే దాని బతుకు యిట్లా మారి ఉండేదేనా... విప్లవంలో తిరుగుతూ అందరికి అన్నాలు పెడ్తూ చెప్పిన పనల్లా చేసే మా లచ్చిని కులపోల్లు చేసుకోవడానికి భయపడిరి... అంత తెలివిగల దాన్ని చేసుకుంటే చెప్పినట్లు వినదని. మా మీది నిర్భంధం వాళ్ళమీద కూడా పడుతుందని మరో భయం... అన్నీ కల్సి మాలచ్చి బతుకు యిట్లా అయిపోయింది.

* * *

"... వెనక్కి తిరిగి చూసుకుంటే సాధించిందేమున్నది సార్. నిర్భంధాలకు తాళలేక నర్సవ్వ తల్లి గారింటికి పోయి... మా లచ్చి అమ్మమ్మ బంధువులింటికి పారిపోయి... మందులూ ఆర్పుకునేవాళ్ళులేక మా నాయిన్న పోయాడు. తమ్ముడు అరబ్బు దేశం నుండి పంపిన పైసల్తో వీసాకోసం చేసిన అప్పులే తీరలేదు... విప్లవంతో సంబంధం లేకపోయినా తమ్ముడు అరబ్బు దేశం నుండి రాగానే లోపలవేసి చిత్రహింసలు పెట్టి సంపాదించిందాంట్లో సగం వాళ్ళే గుంజుకున్నారు. నా ఒక్కడి కారణంగా నా వాళ్ళు ఎన్ని కుటుంబాలు పాడైపోయాయి. నేనూ నా వర్గం వాళ్ళూ ... మా కులం వాళ్ళూ విప్లవంలో ఏం బావుకున్నారు.

"... నా పిల్లలు యిక నా మాట వినకుండా అయ్యారు.... వారితోవ వాళ్ళు చూసుకున్నారు. పెద్దోడు దేవయ్య ఆనందరావు పెట్టిన హోటల్లో జీతానికి కుదుర్చుకున్నాడు. ఆనందరావు కొన్న

ప్రయివేటు బస్సుమీద చిన్నోడు కాంతయ్య క్లీనర్‌గా పనిచేస్తున్నాడు... నా కూతురు ఆనందరావు తమ్ముడు బ్యాంకు ఆఫీసర్ యింట్లో స్వీపరుగా పనిచేస్తోంది.దొరలే కాపాడుతారనే భరోసాతో అట్లా నిర్భంధం బారి నుండి బయటపడ్డారు.

ఆనందరావు వాళ్ళు ముగ్గురన్నదమ్ములు.... వాళ్ళిపుడు వేర్లుపడ్డారు. భూములు పంచుకున్నారు. రాం రావు దొర గుండెపోటుతో పోయాడు. నేనే కలలో కనపడి గుండె ఆగిపోయిందని బదునాంచేశారపుడు. ఆనందరావు తమ్ముల్లు పట్నంలో చదువుతున్నపుడు యివే సంగాల్లో తిరిగాడరు. అలా పెద్దపెద్ద అన్నలంతా వారికి తెల్సు. మా తాత తండ్రులు వెనకట ఎప్పుడో దొరల్లా సాగించుకొని చేసిన తప్పులకు మమ్మల్ని శిక్ష అనుభవించుమంటారా... అని అడిగి సానుభూతి సాధించారు. మా కోసం కాదు. మా పిల్లల చదువుల కోసం పెండ్లిల్ల కోసం మా భూములైనా అమ్ముకోనీయరా అని అడిగారు. మధ్యవర్తుల ద్వారా పార్టీ ఫండు పార్టీకి చేరేది కొంత భూమి సంగానికి విరాళంగా వచ్చేది. వాల్లకు అనుమతి లభించేది.

"...అయినా అపుడు అన్నలు భూముల్ని అమ్మనీయనిదే నయమైందని ఆనందరావు... అతని తమ్ముళ్ళూ అన్నలకు మనసులో జోహార్లు అర్పిస్తుంటారు. ఆనందరావు తమ్ముని పిల్లలు మా లచ్చితో నన్ను పొగుడుతూ ఉంటారట... మీ అన్న విప్లవం చేసి మమ్మల్ని ఆ పశువుల రొచ్చు... బురదపొలాలు... ఎండల్లో బతికే బాధ తప్పించాడని... అవును మరి. వాళ్ళిప్పుడు ఏ సీ కారునుండి కాలు కింద పెట్టకుండా బతుకుతున్నారు. మా పోరాటం కొత్త బతుకు దోవకోసం కన్నతండ్రే కొట్టి పంపినట్టయి వాళ్ళు కొత్త ప్రపంచాన్ని గెలుచుకున్నారు. బావిలోని కప్పల్లా మా జీవితాలు దృక్పథాలూ కుదించుకుపోయాయి. వెనకట గురుకుల విద్యాభ్యాసం పూర్తయ్యాక రాజు కొడుకునూ మంత్రి కొడుకునూ పది వరహాలిచ్చి రాజు మంత్ర కొడుకులం అని చెప్పకోకుండా రెండేళ్ళు తిరిగి ప్రపంచాన్ని తెల్సుకొని రమ్మంటే రాజ్యాలే గెల్చుకొచ్చినట్టుగా ... ఇక్కడి దొరలు పల్లెలు వదిలాక సేట్లయ్యారు. పారిశ్రామికవేత్తలయ్యారు.

కాంట్రాక్టర్లయ్యారు. రాష్ట్రనాయకులయ్యారు, డాక్టర్లయ్యారు. ఇంజనీర్లయ్యారు. ప్రయివేటు కాలేజీల ఓనర్లయ్యారు. ప్రభుత్వ అధికారులయ్యారు. ఊర్లలోంచి పారిపోయిన దొరలు, వర్గ శత్రువులంతా బాగానే బతుకుతున్నారు. ఎక్కడా వాల్ల పరువుకూ పవరుకూ భంగం రాలే వాళ్ళకు జరిగిన నష్టం ఏముంది. అహంకారం వదులుకొని కొంచెం వినయాన్ని నేర్చుకోవడం తప్ప ఆనందరావు తమ్ముడు హరిగోపాల్ రావు దొర యూనివర్శిటీ రీడరై పౌర హక్కుల సంఘంలో ప్రముఖ పాత్ర నిర్వహిస్తున్నాడు. అప్పుడు వాల్లు అమ్ముదామనుకున్నప్పుడు ఎకరానికి అయిదు వేలున్న భూమి యిపుడు లక్ష రూపాయలైంది. పార్టీ ఫండు ఎంత యిచ్చినా... కొంత భూమి ఫ్రీగా యిచ్చినా వాళ్ళకేం నష్టం....

మద్దునూరు తేజేశ్వర్రావు దొర విప్లవం వర్ధిల్లాలని దేవుళ్లకు రోజూ కొబ్బరికాయ కొడుతుంటాడు. పారిపోయి పట్నం వచ్చి వందకోట్లు సంపాయించుకున్నాడు. ఇంకో పదేళ్ళ ముందు విప్లవం వచ్చి ఉంటే వెయ్యి కోట్లు సంపాదించి ఉండేవాన్ని... ఇంకా ఈపిల్లల్ని పట్టుకొని ఎందుకు వేలాడుతుంటారని తనవారిని సముదాయించడంతోనే ఇక్కడ భూస్వామ్య వర్గం ఇపుడా వర్గంగా అదృశ్యమై పారిశ్రామిక యాజమాన్యంగా ఎదుగుతోందని చాలా మందికి తెలియదు. అంటే నిన్నటి జగిత్యాల పల్లెలు పోరాటంతో ప్రాజెక్టు నీళ్ళతో ... రాష్ట్రంలో అత్యంత అభివృద్ధి చెందిన నేటి గుడివాడ పల్లెలయ్యాయి. భూముల్ని పంచడం పోయి ఇన్ఫార్మర్లు వగైరా పేరిట భూస్వామ్యేతరుల్ని కాల్చి చంపడం కూడా దీన్నే స్పష్టం చేస్తున్నది... అయితే విప్లవ సంస్కృతి కారంచేడు చుండూరుల్లా కులపోరాటాలు జరక్కుండా కాపాడుతున్నది...

తేజేశ్వర్రావు దొర అనేదాన్లో ఎంతో నిజం ఉంది. పదేళ్ళ ముందే... సరిగ్గా చెప్పాలంటే యిరవై ఏళ్ల ముందే విప్లవం వచ్చి ఉంటే... రాజకీయార్థిక సాంస్కృతిక సామాజిక రంగాల్లో తెలంగాణా వాటా తెలంగాణాకు దక్కి ఉండేది... ఆంధ్ర షుగర్స్... నాగార్జున ఫర్టిలైజర్స్ వంటి సంస్థ లెన్నో యిక్కడి దొరలూ

ఆకథసిం ఇ రెస్తా వారి దోపిడి విస్తరణను అడ్డుకొని ఉండేవారు... వారిని అధిగమించి ముందుకు సాగి ఉండేవారు. విద్యాభివృద్ధి యిరవై ఏళ్ళ ముందే అభివృద్ధి జరిగేది. అపుడు ఇక్కడ తెలంగాణా జిల్లాలో రూపొందిన గుంటూరు పల్లెలు " ఉనికిలోకి వచ్చే క్రమేణా ఏర్పడేది కాదు... ఇక్కడ భూస్వాములు పారిశ్రామిక వేత్తలుగా ఎదుగుతుంటే ఈ పోరాటాలే ఉండేయి. కావున కోస్తావాళ్ళ ఆధిపత్య విస్తరణ యితరుల పారిశ్రామిక వేత్తలుగ ఎదుగుతుంటే ఈ పోరాటాలే ఉండేయి కావున కోస్తా వాళ్ళ ఆధిపత్య విస్తరణ యితరుల పారిశ్రామిక విస్తరణ ఇక్కడి భూస్వాముల అభివృద్ధి అరికట్టింది. తద్వారా ఇక్కడి భూస్వాములకు వ్యతిరేకంగా సాయుధ పోరాటాలు చేయాల్సి వచ్చింది...

... సార్! మీరు కోస్తావారే కావచ్చు. జడ్జీహోదాలో ఉన్నారు గనక న్యాయం వైపు ఆలోచించండి సార్. నిజం చెప్పకండి సార్ 1956లోనే తెలంగాణా అనేది ఒక ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడి ఉంటే యీ సమస్యలు వచ్చి ఉండేవా సార్. మీ కోస్తాలాగే ఇక్కడి దొరలు పారిశ్రామిక వేత్తలుగా ఎదిగి ఊళ్ళు వదిలి పట్నాలకు తరలిపోయేవాల్లు కాదా! అపుడు వాల్లు ఉండుమన్నా ఊర్లో ఉండేవాళ్లు భూస్వామ్యం యిలా కరుడు కట్టుకు పోయేదా!తహసీలు దారుకు ప్రమోషన్ వస్తే గిర్దావరుకు తహసీల్‌దారుగా ప్రమోషన్ వచ్చినట్టు జూనియర్ అసిస్టెంటుకు గిర్దావరుగా అంచెలంచెలుగా ప్రమోషన్ వచ్చినట్టు - ఇక్కడి దొరలు భూస్వాములు పారిశ్రామిక వేత్తలుగా ఎదిగితే మేం కనీస గుమాస్తాలుగా, టీచర్లుగా,. కార్మికులుగా నైనా ఎదిగి మా మీదే నాయకత్వంగా మారి ఒక్కటిగా ఉందామని చెప్తే ఏం జరిగింది సార్. మా బతుకును ముంచింది. తెలంగాణాలో వున్న అవకాశాల్ని కోస్తావాల్లే కొట్టుకుపోయారు. బడ్జెట్‌లన్నీ అటే తరలించుకున్నారు. రాజకీయాధికారమూ వాల్లదే అయిపోయింది. ఇపుడు నక్సలైట్ల పేరు చెప్పి మాకు అభివృద్ధిని అందకుండా చేస్తున్నారు సార్!.... ఏ గడీ కోసం.. ఏ గడీ ఆధిపత్యం కోసం ఉండాలని ఆయనా...పోవాలని మేమూ పోరాటం చేశామో ఆ గడీని యిపుడా మద్దునూరు దొర ఆ వూరికీ ఆ వూరి స్కూలుకూ విరాళంగా రాసి యిచ్చి తన కృతజ్ఞత ...విజ్ఞత తెలుపుకున్నాడు.... ఆ విజ్ఞతే ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం కోసం విప్లవపార్టీల్తో ఐక్య సంఘటన కట్టాలని చూస్తోంది... ఇలా ఈ విప్లవ పార్టీలు చెప్పేది వర్గ దృక్పథమైనా ఆచరణలో అగ్రకుల భూస్వామ్య వర్గాన్ని నయా ధనిక పారిశ్రామిక ప్రాంతీయ బూర్జువా పాలకవర్గంగా ఎదిగించడానికి మాత్రమే పరిమితమైంది.

"... నిజం చెప్పాలంటే ఏ కొందరు అహంకారులకో తప్ప దొరలకు యిప్పుడు విప్లవం అంటే కోపం ఎందుకుంటుంది... అప్పుడు ఒక్క పల్లెల్లోనే వాళ్ళుండేది. ఇపుడు పల్లెల్లో వాళ్ళే ... పట్నంలో వాళ్ళే. అన్ని పార్టీలు వాళ్ళవే... మాలాంటి వాళ్ళను ఎట్లా పొగపెట్టి వెళ్ళగొట్టాలో వాళ్ళకుకులంతో అబ్బిన విద్యే... ఆ వెలమ ...రెడ్డి దొరలే ... విప్లవ పార్టీలక్కూడా నాయకులయ్యారు... వాళ్ళంతా అచ్చంగా భూస్వాముల పిల్లలు కాదు... పేదరికం నుండి ఎదిగి అగ్రకుల భూస్వామ్య బూర్జువాగా ఎదగాలనుకుని అగ్రకుల పెటీ బూర్జువా నుండి క్రమంగా ... నయాధనిక వర్గ స్వభావాన్ని సంతరించుకున్నవాళ్ళు...కొండపల్లి మొదలుకొని ఆదిరెడ్డి... గణపతి దాకా అంతావాళ్ళే....

"....దొరలు పల్లెల్లోంచి పట్నాలకు పారిపోక ముందు... పట్నంలోని వ్యాపారాలన్నీ కోమట్లు... పద్మశాలి...విశ్వబ్రాహ్మణ...గౌడ..తదితర శూద్రకులాలే చేసుకునేవారు... ఇపుడవి కూడా దొరలపాలే

అయ్యాయి...రెడ్ టెర్రర్ వారిని పాజిటివ్‌గా అంతగా చైతన్యవంతం చేసి అభివృద్ధి సైన్సును కైవసం చేసుకునేందుకు పరిగెత్తించింది... అంబేద్కర్ రిజర్వేషన్ల ద్వారా ఈ నూతన అభివృద్ధినే అభివృద్ధి చెందాల్సిన వర్గాలకు అందాలని కోరాడు... విప్లవ క్రమం సరిగ్గా దాన్నే అసాధ్యం చేసి అగ్రకులాలకు సుసాధ్యం చేసింది...నిర్బంధం బరువంతా అభివృద్ధి చెందాల్సిన వర్గాలకు కులాలకు... అభివృద్ధి అంతా అగ్రకులాలకు పాలకవర్గాలకు ఇట్లా అప్పగించడానికే విప్లవం... ఈ విషయం అపుడే తెల్సి ఉంటే అందులో చేరి ఉండేవాడిని కాను. ఇపుడా గతంతో లాభపడింది లేకపోగా పీడలా వెన్నాడుతోంది... ఇరవై ఏళ్ళ విప్లవంలో మాకు లాభించిందేమిటి సార్... ఆత్మ విశ్వాసం తప్ప...

"సరిగ్గా ఆలోచించే దొరలకు పాలకవర్గాలకు యిపుడు విప్లవం అంటే ప్రేమా భయమూభక్తీ .. అందుకని అంతగా అవసరమైనపుడు ఎన్‌కౌంటర్ కాకుండా వాళ్లే కాపాడుతుంటారు... వాళ్ళకది ఎంతో సులభం... ఆఫీసర్లూ.. పోలీసు అధికార్లూ ...నాయకులూ అంతావాళ్ళే... వాళ్ళవాల్లే.. లేదా వాళ్ళు చెప్తే వినేవాళ్ళే......

"న్యాయమూర్తి గారూ.. యిట్లా జరిగిపోయిందని నాకు ఎవరి మీదా కోపం లేదు... గోడకు కొట్టిన బంతిలా తిరిగి మాపైకి విరుచుకుపడే పోలీసుల మీదా కోపం లేదు నాకోపం ఈ పాలకవర్గాల మీదా కాదు... ఇది కోపం కాదు... ఆవేదన ... బాధ... దుఃఖం...కన్నీళ్ళు... ఈ చరిత్ర నిర్మాణం యిట్లా ఎందుకు తల కిందులైంది... ఇరవై ఏళ్ళల్లోనూ ఆశలు తలకిందులయ్యాయి. తలకిందులైపోయిన దొరల ఆశలు ముందుకెట్లా సాగాయి. విప్లవంలో అణగారిన అభివృద్ధి ఎందుకు అసాధ్యమైంది ఇట్లా పోరాటఫలితాలు ఎందుకు తిరగబడ్డాయి. ఎంత పోరాటం చేశామనేది ముఖ్యంకాదు... దాని అభివృద్ధి... ఫలితాలను ఎంత మేరకు చేజిక్కించుకున్నాం అనేది ముఖ్యం.... ప్రయోగాలు మాపాలు... ఫలితాలు వాల్లపాలు... నిర్బంధాలు త్యాగాలు మాపాలు.. అనుభవాలు నాయకత్వాలు అభివృద్ధి వాల్ల పాలు...యిలా ఎందుకవుతున్నదన్నదే నాబాధ.....

"...ఓనా విప్లవమిత్రులారా... కాలం గడిచిన కొద్దీ అనుభూతులూ నశిస్తాయి. అనుభవాల చరిత్ర కూడా అదృశ్యమవుతూ ఉంటుంది. వాటినించి పుట్టే దృక్పథాలు మాత్రం ముందుకు సాగుతూనే ఉంటాయి. అందువల్ల చరిత్రంటే దృక్పథాల చరిత్రే ... అందుకే కొత్త అనుభవాల నుండి పుట్టే దృక్పథాల ననుసరించి మనిషి తన చరిత్రను నిరంతరం తిరగరాస్తూ ఉంటాడు... నా వాళ్ళు ఏడుతరాల ... స్పార్టకస్‌లచరిత్ర తిరగరాయాల్సే ఉంది. అదిట్లా అసమగ్రంగానే ఉంటుంది. అసమగ్రత అనే నిర్వచనం మీ దృక్పథాల ననుసరించి మనిషి తన చరిత్రను నిరంతరం తిరగరాస్తూ ఉంటాడు.. నా వాళ్ళు ఏడుతరాల స్పార్టకస్‌ల చరిత్ర తిరగరాయాల్సే ఉంది. అదిట్లా అసమగ్రంగానే ఉంటుంది. అసమగ్రత అనే నిర్వచనం మీ దృక్పథానికి సంబంధించినది...

".....సార్... నా వాళ్ళకు పోరాటం చేయడమే తప్ప ... దాని లాభాలు పొందడం తెలువది. నా వాల్లకు రోషం ఆవేశమే తప్ప లౌక్యం తెలుపది. లౌక్యం ముందు తుపాకులు ఓడిపోతున్నాయి.... నావాల్లకు చావడం తప్పబతుకును గెల్చుకోవడం తెలువది... వేల ఏండ్ల నుండి సకల సరుకులు కళలు సృష్టించిన మా చేతుల్తో వాటిని మార్కెట్" చేసికొని అమ్ముకోవడం తెలియని అణగారిన కులాలవాళ్ళం..."

"... మా సరుకులు కళలు ప్రపంచాన్ని ఆకర్షించాయి... దాంతో ప్రపంచం నుండి యిక్కడకు వలసలు దండయాత్రలు సాగాయి. మా సరుకులు తిన్నవాల్లు... స్వార్థపరుల దేశాన్ని వాల్ల

కప్పగించారు.... మాకు భాషరాదు... భావం చెప్పడం రాదు... మాకు చరిత్ర లేదు. నాది చరిత్ర కాదు... ఎవరి చరిత్రనో... నాయకత్వాన్నో మోయడమే నాపని...."

"...అటు చూస్తే పోలీసుల బాధ... యిటు చూస్తే యిన్ఫార్మర్‌గా మారానేమోనని ఆరాలు తీయడం... నిజాయితీని శంకించడం కన్నా చిత్రహింస ఏం ఉంటుంది సార్. ప్రభుత్వాలే భయపడి పోలీసు స్టేషన్లనే పట్నాల్లోకి తరలిస్తున్నారు.... ఎమ్మెయిలకుమంత్రులకు....చీటి రాస్తే.... భయానికో భక్తికో అడిగినంత పైకం పార్టీ ఫండుగా సమర్పించి సగౌరవంగా సాగదోలే స్థితిలో ... అన్నం పెట్టారని ఆశ్రయం యిచ్చారని... అమాయకుల్ని చిత్ర హింసలు పెట్టడం ఎందుకు సార్ భయంతోనే అన్ని పనులు అన్ని పార్టీల నాయకులే చేసి పుడ్తున్నపుడు అభిమానంతో చేయడం తప్పెలా అవుతుంది సార్... నా భార్య అభిమానంతోనో... భయంతోనో నాకు తెలియకుండా మళ్ళీ ఒకటి రెండు సార్లు సద్దులు ... సమాచారం మోసినందుకు అంత పెద్ద శిక్షనా సార్... అటు అన్నలూ నమ్మలేదు... అదును చూసి పట్టించడం కోసమే అనుకున్నారట సార్... అందుకే అటు పోలీసులకు, ఇటు నక్సలైట్లకు యిద్దరికీ వ్యతిరేకంగా అంబేద్కర్ సంఘాల ఆధ్వర్యంలో లక్షమందితో నిజామాబాదులో తీసిన ఊరేగింపులో నేను కూడా పాల్గొన్నాను సార్.

"....సార్ ఇపుడు మాఅడుగడుగూ... అనుమానపు నీడల్లో అంచనా వేయబడుతున్నాయి. మా మాటల్లో లేని రెండర్థాల కోసం రెండు పక్షాలు డిక్షనరీలు తిరగేస్తున్నాయి... సార్ నిత్య నిర్బంధం వల్ల మాలోని మంట చల్లారిపోయింది... ఈ బతుకు పొగచూరిపోయింది. విప్లవం వండుకునే యింతంత వంటకు స్వేచ్ఛాప్రాణవాయువు అందక నా యిల్లంతా పొగచూరి పోయింది... నా చరిత్రంతా మసిబారిపోయింది. ఇపుడు ఈ బతుకంతా నిప్పులేని పొగ...మా జీవితాలు యిపుడు సగం కాలిన కమురు వాసన... ఇక్కడ మనుషులిపుడు ఒక్కసారిగ మండి చావరు... నాకు మరణ శిక్ష విధించండి సార్.. అటు మంటకూ యిటు బూడిదకూ కాని ఈ బతుకును ఉరితీయండి సార్... నేను ఒక వ్యక్తిని కాదు... లక్షలాది కోట్లాది తెలంగాణా నేలతల్లిని... నా బిడ్డల్నీ చెల్లెల్లని మనువాడి దేవదాసీలా వేశ్య అనే బోర్డు మెడలో కట్టి నాకు మరణశిక్ష విధించండి... నా తెలంగాణా కిపుడు స్వేచ్ఛకావాలి... మేం రూపొందించుకున్న ఊళ్ళు మావి కావాలి... మేం అడవి నరికి సాగుచేసిన ఈ సమస్త భూములు మావికావాలి... ఈ అభివృద్ధి ఫలాలన్నీ మాకు చెందాలి. మేం అభివృద్ధి చెందాలి. మాకు స్వేచ్ఛ కావాలి. కొంచెం బతుకు మారాలని కోరుకున్న కర్మానికి ఈ సమాజాన్నంతా మార్చే బరువును తలకెత్తిన ఏనుగుపాదాల విప్లవ వ్యూహాల బరువు నుండి కూడా స్వేచ్ఛకావాలి. మరణశిక్ష మాకు అన్ని స్వేచ్ఛల నిస్తుంది. అందుకే ఇది నా మరణ వాగ్మూలంగా నమోదు చేయాలని కోరుతున్నాను..."

" ....హ....హహ.... నేను అన్ని ఏర్పాట్లు చేసుకొనే వచ్చాను సార్...చావవలసినన్ని నిద్రమాత్రలు మింగే ఈ మరణ వాగ్మూలం యిస్తున్నాను. నా తెలంగాణా తననుతాను ఆత్మహత్య చేసుకుంటున్నది సార్.

".... ఓనా ప్రపంచ ప్రజలారా....కాలకమురు కంపుకొడ్తున్న ఈ శవంతోసంభోగాన్ని అరికట్టి మానవత్వాన్ని రక్షించండి... మా స్వేచ్ఛసమానత్వం కోసం సహకరించండి."

పెంటయ్య అలియాస్ ప్రవీన్ కోర్టుహాల్లో అకస్మాత్తుగా పడిపోయాడు... చివరి అరుపులకు అందరూ గుమిగూడారు.... కోర్టు హాలులో కోలాహలం... వ్యాన్...వ్యాన్... డాక్టర్...డాక్టర్... ఫోన్....ఫోన్... అరుపులు, కోర్టుహాలు కిక్కిరిసిపోయింది. ఆగడబిడలో న్యాయమూర్తి కలం విరిగిపోయింది.

(విపుల మాసపత్రిక, డిసెంబర్ 1997)

# 16 నడిమింటిబోడెక్క బసివి రాలయ్యేద

నాగప్పగారి సుందరరాజు

ఇ పొద్దు బడి తప్పొయ్యేదని సానా సంతోసుము పడుతుండాను. నిన్న సంకరప్ప అయివారు సెప్పిన సక్రొడ్డి ల్యక్కులు సెయ్యలేదు. కర్నుము అయివారికి ఇదే పొందు నన్ని తొన్నేకి యట్లరా దేవుడా! గండుము గడిసేదని అలాసన సేసు కంట వుంటే నడిమింటి పెద్దమ్మొచ్చి కార్యుములోకి పిలిసేద.

మాయమ్మ యేమో వొపరే! బడికి పోదురా అనిసెప్ప్య.

వొప్లే నరసక్కా..... నీకింతుగూడ బుద్ధి లేదు సూడుప్లే. నీవేమన్నా అనుకో ఇంట్లో కార్యము పెట్టుకొని ఈ పొద్దన్న ఇంత పొద్దుగాలుగ వొచ్చి ఆ పనీ ఈ పనీ సూసుకోకుపోతే యట్లప్లే. వాక్కొడుకు కొడుక్కాదు వొగుబిడ్డ బిడ్డగాదు అనేర. నాకి సేసే వొళ్ళు యెవురుండారు. నువ్వే సెప్పు. ఈ పొద్దన్న నువ్వింత ఆ పిల్ల దెగ్గిరుండి పూజార్లు అడిగినివి అందిస్తే బాగులేదా. అది ఆసులే తిక్క పిల్లట్లాది. బసివి రాలుని తలస్తాము అనిన పొద్దుట్నుంచి వొగిటే యేడుపు యేదుస్తుండాది. యంత సెప్పినా వూరుకోదు. నన్ని బసివురాలు ఇడద్దండో...యెవుడుకన్న కూలి సేసుకొని తినేవోనికి ఇచ్చి పెండ్లి సెయ్యండి. రెక్కులు కస్టిము సేసుకొని బతుకుతామని వొగిటే కదా రూడన్నా బసివిరాల్ని ఇడుసుకుంటే కొండ్లుముందు వుంటారని ఆస. నీడ పాట్న సుకంగ వుంటాది ముసులు ముప్పుతనానికి మిమ్మల్ని మడసనంగా సూసుకుంటాదని మా ఆలాసన అంటాని వొగిటే యతార సెసుకుంట మా యమ్మకి సెపుతుండాది నడిమింటి బెలిగింటి పెద్దమ్మ.

పదక్కే...వొస్తాను పదా పొయ్యిమీద బూవుడుకుతాది గెంజి వొంచి వొస్తాను పదా అనె మాయమ్మ.

ఏంప్లే... ఇంట్లో కార్యుము పెట్టుకుని బూవొండుకుంట కుసునేవ్వా. సానా యక్కద దప్పిందానువ్వు వున్నట్లుండానే. అనిడిన నడిమింటి పెద్దమ్మ.

పిల్లల్లుండే పని గదిక్కే. కార్యమన్నంక యాలా తప్పుతాది కదా. పిల్లొల్లుకి ఆకిలయినప్పుడు ఇంట్లో వుంటే యేసుకొని తింటారు. ల్యాకపోతే పనిసేయి నీకుండ గుద్దెనుక యేడుసుకుంట తిరుగుతారు. అంటాని మా యమ్మ పడసాల కట్ట మింద నుంచి పొయ్యి గడ్డతాకి పాయ.

వొప్పొ... .సాల్రాప్పా. యల్లల్లు బీలుయల పదివేవగాని. ఈ పొద్దు వొగిటి బడికి పోకుంటే ఆడేమిదేసుముకుంటుపడేదేందు. బోడెక్కని బసివురాలు ఇడుస్తుండాము కదా సుట్టాలంతా వొచ్చేర విల్లికి యేమన్న నీళ్ళు గీళ్ళు అందిచ్చుకంట బడికి పోతానని పలకా బుక్కులు తీసుకునేవునే. అంటాని బెలిగెంత వద్దమ్మమా ఇంట్లో నుంచి బయిటికి పొయ్యిడిస.

గాలికాలుము బయట ఈదురుగాలి ఈస్తుండాది. గవాసులెంట గాలి లోపులికి వొస్తుంటే పొగ బయటికి పొయ్యేకిల్యాక ఇంటినిండ ముసురుకునేద. పొగదెబ్బికి కండ్లు మండుతుండాయి. కండ్లోనుంచి ముక్కులో నుంచి నీళ్ళు కారుతుంటే మాయమ్మ వొగుసేత్తో సీమిడి సీది పొయ్యిలో యేసి కొంగుతో సమట తూడుసుకుంట గజి వొంచుతుండాది. ఇదే సొందురా నాయనా బడి తప్పిచ్చుకునేకని సేతిలో పలకా బుక్కాలు గూట్లో సప్పిడి కాకుండ పెట్టిడిసి మెల్లిగ బయిటికి జారుకునేన.

పెండ్లికి యేసినట్లు పందిరి యేసిడిసేర. కోడెక్కోళ్ళు ఇంటికాట్నించి మాదిగ్గేరి నిండయేసిడిసేర. కల్లెన్నోళ్ళు ఇంటి కాన్నుంచి మా ఇంటి వరకు వొగిటే పందిరి యేసిడిసేర. రంగులు నాటి తడుకులు యేసి బసిరాకుతో పందిరి యేసింటే గేరంతా యంత బాగుండాదని. పందిరి కిందకుంద్రంగన్నోళ్ళు ఇల్లు, పులిగెమ్మవ్వోళ్ళు ఇల్లు, కల్లెన్నోళ్ళు ఇల్లు, గుంతుకంటి అయమ్మోళ్ళు ఇల్లు. మా పెద్దిల్లు మా సిన్నిల్లు. నట్టనడుము బోడెక్కోళ్ళు ఇల్లు యంత కళకళలాడుతాదని. బోడెక్కోళ్ళు ఇంటి ముందు నాలుగు బసిరికట్లు నాలుగు దిక్కులు తుక్కనాటి ఆటికి జమ్మాకు కట్టేర యరుమొన్ను సున్నుమునట్లు పెట్టేర. మద్దిలో కుంకుమ బుక్కు పిండితో బొట్లు పెట్టేర. నాలుగు గుంజులు నడిమిద్దిలో కమ్మిరి పోరిసి సాసుకుము యేసేర. ముందురు పక్క రెండు దిక్కులు రెండు రాసులు జొండ్లు పోసి మూడు ఆకులు రెండు వక్కులు పెట్టేర. వొగ పక్క కలుసుము పెట్టేర. కలుసుము మద్దిలో ఆకులు పెట్టిన గిన్నిలో ఈబీతిపొందుతీసుకుని కల్లెను కొడుకు మల్లన్న మామ అందిరికి అడ్డు బొట్లు పెడుతుండాడు. బోడెక్కోళ్ళు వలన్న పెలిగెన్ను మల్లన్న మామ పణమింద పెట్టిన ఈ బీతిపొందు అడ్డు బొట్లు మింద మద్దిలో కుంకుమ బొట్టు పెడుతుండాడు. ఇంతులోకి తలారి నాగన్న మల్లన్న మామని అరిసిడిస.

వొసస్...మల్లగా ...పొల్లొల్లుకి ఆడొళ్ళుకి రెండు రెండు బొట్లు పెట్టు , మొగొళ్ళుకి మూడు మూడు బొట్లు పెట్టు. శ్యాస్త్రుము తప్పుకూడుదు. తెలిసేదాన్ని అదేమరి మరిసి పోకుండ సెయ్యి. లేదంటేనాకిట్లీ అనిడిస.

ఓ తలారాతినీ ...నాకి తెలుసులా సామీ. అవుతులు గేర్లో వుసేనక్కని బాసివిరాలుని ఇడిసినప్పుడు నేను కార్యుము సేసేది సూస్తిని. అనమక్కని బసివిరాలుని ఇడిసినపుడు నేను దెగ్గిరుండి సూస్తిని పులిగెమ్మవ్వని బసివిరాలు ఇడిసినపుడు కూడా సూసేనుకాని సరింగ గురుతులేదు. అపుడు నాను సిన్ని పిల్లోన్ని అనుకో. ఇదేమన్న పెద్ద ఇసిత్రుమా. నాకి ఇడిసి పెట్టండిమరి. ఈ పొద్దు' బోడెక్కని బసివిరాలు ఇడిసే పనంతా నేనే సేస్తాను. యేమనుకునేర మడినన్ని. మిమ్ముల్ని వొగిటి గూడ అడిగితే అపుడు అనండి. అవుర్రా మల్లగాడు పెద్ద ముసులోని లక్కయంత బాగ సేసేడ కార్యుము అనల్ల అనిడిస మల్లన్న మామ.

యే మండమ్మా... ఇంగా అయ్యేద్నాలేదా. యాలా తప్పుతాది పిల్లని తీసుకు రాండమ్మా. కర్నుము సామి సెప్పిన మూర్తానికి కరెట్టుగా ద్యావుర్లు గట్టల్ల. రాండి రాండి. ఇంగా యేటికి పొయ్యి సోసుము సేస్కొని రావల్ల ఇంగా యాడ పొద్దు వుండాదని అట్లా తాసికారుము సేస్తూండారని లాలప్ప తాత కూతేసిడిస.

"జుమ్చుక్నక్-జుమ్జుమ్చుక్నక్- జుమ్ జుమ్ చుక్నక్" అంటాని బ్యల్దాని బైనే ఆయప్ప జమిడికి అనిపిచ్చే తలకాల అందిరి సెవులు నిగిరి బొడిసిడిసేవ.

ఇంగేమి సూస్తారు తీసుకోండలేయ్. ఇంగా యంతసేపని కాస్తారు ఆ తప్పిట్లుని - అని కంద

రప్ప పెద్దప్ప అనే తలకాల "జగ్గణకణకణ, జగ్గణకణకణ, జగ్గణకాన్" అంటాని తప్పిట్లు, తాసాలు వర్రర్రర్రాని మోగుతుండాయి.

యక్కక్కట్నుంచో వొచ్చిన బసివురాళ్ళంతా ముందు గుంపుగ నిలబడి పాట్లు పాడుతుండారు. మద్దిలో వొగ పెద్ద బసివురాలు వొడి నిండ గాజులు పోసుకుని రెండు సేతుల్లో రెండు యాపమండ్లు పట్టుకోని యెంటుకులు ఇరుబోసుకుని మకుమునిండబండారు బూసుకోని పణిమింద కుంకుము బొట్టు పెద్దిది పెట్టుకుని, కండ్లు మూసుకోని మెల్లి మెల్లిగ నడుస్తుండాది. ఇంగా పులిగెమ్మవ్వ పెయ్యిలోకి వొచ్చినట్లు లేదు. అంద్కనేమొ ఆయమ్మ యేమేమి వూగుకోకుండ మట్టసనంగా కదులుకుండ నొడుస్తుండాది.

మొగొల్లంతా తపిట్లు సుట్టూర సేరేర, తప్పిటోళ్లు మెగిరెగిరి కొడుతుండారు. బైనే ఆయప్ప జమిడికి సుట్టు బసివురాళ్ళు ముసురుకునేర. జమిడికి శబుదుము, తప్పిట్లు తాసేలు అన్ని కలిసి వొగిటే రొవుసుమింద వాగుతుంటే సుట్టుముట్టు వూర్లుకి ఇనిపిచ్చేతట్లుండాది.

యనకాల బోడెక్క యేడుసుకుంటా ముసుగేసుకోని తలకాయి వొంచుకోని మెల్లి మెల్లిగ నడుస్తుంటే ఆయమ్మ సుట్టు అవుతులు గేర్లో ఆ డోళ్ళు ఇవుతులు గేర్లో ఆడోళ్లు. వూర్లునుంచి వొచ్చిన సుట్టాలు సానామంది ముగుబడిసింటే తిర్నాలు నాడు తేరుసుట్టూరుగ వూరంతమంది కదిలి పొయ్యినట్లుండాది.

సిన్నసిన్న పిల్లకాయలంతా క్యాకులేసుకుంట యెగురుకంట ముందుముందు పారిపోతుండారు.

జాతర యల్లబారినట్లు మాదిగేర్లో నుంచి వూరేగింపు బయలు దేరిడిస. సవురమ్మ గుడితాకి వొచ్చి, వొగకాయి కొట్టుకొని గోందిరొడ్డొళ్ళు ఇంటి ముందెళ్లి ఈడిగి రంగయ్యొళ్ళు ఇంటికాట్నించి సింతమాకుల్లోని బాయితాకి వొచ్చేతలకాల రెండుగంట్లు సేపు అయ్యింటాది.

వక్కపొడి కొరికే తలకాల పారిపొయ్యి పారొచ్చేంత దూరములేదు ఇది. అట్లా దానికి ఇదింత వూరేగింపు వొచ్చేదానికి రెండు గంట్లు టెయిము బట్టేద్నంటే ఇంగ సూస్కోండి ఈ జనుము యంత యెగుగుడుము యెగిరేర్నో, యంత యెగురుడుము యెగిరేర్నో, యంత కుసీసేస్కుంట కునుసుకుంట వొచ్చేర్నో.

ఇంగ తప్పిట్లు ఆపండప్పా తప్పిట్లు ఆపితాగేవొళ్ళు యెవురో బిరీన కొల్లూసరాయి తాగండి. బీడీలు గీడీలు తాగి తప్పిట్లు కాపుకోని రెడీ గుండల్ల నూడీ, తాసికార్యుము సెయ్యి కుండ పిలిసే తలకాల యెత్తుకోవొళ్ళ అంటాని సెప్పి దుబ్బీరన్నబాయిగడ్డ తాకి పాయ.

తప్పిట్లు కొట్టేవొళ్ళు తప్పిట్లు యండికి పెట్టి ఈడిగి రంగయ్యొళ్ళు ఇంటిముందు దుమ్ములోనే కుసినిడిసిరి. ఈడిగి రంగయ్యొళ్ళు ఇంటి ముందుర కట్టమింద వూర్లో వొళ్ళు కుసునేర. దుమ్ములో కుసునేర. దుమ్ములో కుసునేకి ఇస్టుము లేనోళ్ళు నిలబడుకొనే వుండారు.

బాయి గడ్డమింద ఆడొళ్ళు గుంపులు గుంపులు నిలబడేర. మొగొళ్ళంతా అట్లా దూరము నిలబడేర అది సూసేకి అగాదుము లోతు బాయి. నాకి బుద్ది వొచ్చినప్పట్నించి ఆ బాయిలో సుక్కునీళ్ళు వూరిందిలేదు. వాండ్లు కాలుము పడిన్నీళ్ళు మూడు దినాలకి, రెట్లు గాలే పెంచుమిందికేసిన నీళ్ళు లక్కపీరుసుకు పోతాయి. యండ కాలుము అయితే ఆవుర్లావుర్లు బాయిలో నుంచి. ఇంత నీళ్ళుకి కొరువు వుండే వూరు ఈ దేసుములో యావూరు వుండుదేమో.

మాదిగ్గేర్లో యే కార్యుము అయినా గంగకంటాని పొయ్యిరావల్లని సెంబునిండో కడుపునిండో

నీళ్ళు తీసుకొనిచ్చి. వొట్టి బాయిలోకి దిగి బొట్లు బెట్టిన రాయి మిందే తెచ్చిన నీళ్ళు గుమ్మరిచ్చి శ్యాస్త్రము అయ్యి పొయ్యిడిసేదని అనిపిస్తారు.

ఇపొద్దు బోడెక్కని బసివిరాల్ని ఇడిసేకార్యము అంటే సానా పెద్ద కార్యము. సుట్టు ముట్టు పండెడూర్లు మంది సూసేకొచ్చేర. దూరాబారుము నుంచి సుట్టాలు గిట్టాలు వొచ్చింటే వూరంతుటికి పండుగున్నట్లు వుండాది. కల్లేగొట్టు పూజార్లు, గట్టుమల్లయ్య, గొరువయ్యులు, వులిగి పెద్దమ్మ, ఇంగా రానేరాలేదు. వాళ్ళందరికి బొస్సు అబ్బినట్లు లేదు. వొస్తారు వొస్తార్లే ద్యావుర్లు కట్టే తలకాల అనుకొంటుండారు.

బాయి గడ్డ పెయ్యి మెటికిలు మిందమ్యాకు పోతుమ్మడికి యాపాకు మండ్లు కట్టి, పణమింద కుంకుమ బుక్కపిండి పెట్టి దాన్ని దువ్వుతుండారు పెద్ద మనుసులు. బంగారప్పోళ్ళు ఇంటిముందుర బసిరి మానుకాడ అయిదేండ్లు నుంచి పులిగెమ్మవ్వకి ఇడిసిన బోడెక్కోళ్ళు దున్నుపోతుని కట్టేసి పెట్టేర.

అయిదేండ్లు కింద ఇన్నూర్రూపాయిలికి పెదరొడ్డోళ్ళు యనుగొడ్డుకి పుట్టిన దున్నుపోతు పిల్లని బొడెక్కోళ్ళు నాయిన నడిమింటి కందారప్పకొని పులిగెమ్మకని ఇడిసిడిసేడ. అది సముచ్చురుము తలకాల నేమి కంటోళ్ళు ద్యావురు పోతని సుట్టుముట్టు వూరోళ్ళు అందిరికి తెలిసేతట్ల తిరిగి మేసి బలిసిడిసేద. వున్నట్లుండి వొగు సొమ్ముచ్చురుము కనబడుకుండ పొయ్యిడిసెద. బోడెక్కోళ్ళు తిరిగిన వూర్లేకుండ తిరిగితే, అక్కడ యక్కడో పడుముటుదిక్కు కనుడు దేసుములో వుండాదని తెలిసి మాదిగొళ్ళందురు ఇంటికో మనిషి పొయ్యి అదిలిచ్చు కొచ్చేర. అయిదేండ్లు అయ్యే తలకాల దాన్ని సూసేకి బయిమయ్యేతట్ల వుండాది. బోడెక్కిని యప్పుడు బసివిరాల్ని ఇడుస్తారో ఈ దున్నుపోతు బాధ యప్పుడు తప్పుతాదో అంటాని రెయితులు అపలాసన సేసుకుంట వుండ్రి.

వొగునాడు బోడెక్కోళ్ళు నాయిన్ని బజార్లోకి పిలిసుక్కని వూర్లో వోళ్ళంతా పంచాద పెట్టిడిసేర.

ఏం కందారప్పా! ద్యవురుపోతు వూరందురు సేండ్లోపడి పయిర్లు పాడు సేస్తుండాదని వూర్లోరెయితులందురు బాధపడుతుండారు. మడి నువ్వు ఏమంటావో సెప్పు-అంటాని కాలుమింద కాలేసుకుని యడుముసేత్తో మీసుము దువ్వుకుంట పెద్దరెడ్డి అడిగిడిన.

రేడీ రూము ముందు పందులు పొర్లాడే దుమ్ములో మాకాళ్ళు మద్దిలోకి మాసేతులు పెట్టుకుని కునిసిన నడిమింటి కందారప్ప. నెత్తిమింద రుమాలు తీసి సంకులో పెట్టుకొని రెండు సేతులు యెత్తి మొక్కి మాట్లాడేది మెదులు పెట్టిడిన.

నిజిమేరొడ్డీ! పయిర్లు కాపుకొచ్చిన మాట నిజమే. నా ద్యాపురుపోతు యాట కొచ్చిన మాట నిజమే. రవుసు మింద వున్నింది రైయ్యిమని పొయ్యి పయిర్లు మింద పడి మేసింది నిజిమే. మడి నన్నోమి సెయ్యిమంటావు రొడ్డీ. వూరు కట్టిడి పకారుము. మాకులా చారుము పకారుము మా యింటి దేవితి పులిగెమ్మ మొక్కిబడి పకారుము సొతనయిన పనిసేప్తిని. అప్పుడు సెయ్యి తిరుగుతుండా రెండు నూర్లు పెట్టి నీ మాట పకారుము నీ యెనుగొడ్డుకి పుట్టిన దున్నుపోతునే కొని ద్యావరుకి ఇడిస్తిని. ఇప్పుడు కార్యము సెయ్యల్లంటే సిన్నపనా మాయట్లా సన్నాళ్ళకి అయ్యేపనికాదు. నాబిడ్డ ఇంకా పెద్దమనిషి అయ్యిలేదు. పసిపిల్లిని పట్టుకుని బసినిరాలిని ఇడసల్లంటే మెనుసు యెగుదుసూడి రొడ్డీ - అంటాని నడిమింట కందార్థప్ప అంటాండగానే...

యేమలే కందరగా ...యేమంటివి. నీ బిడ్డ పసిపిల్లా. నోట్లో యేలుబెడితేకొరుకుదేమతినీ యదమింద కొంగు తీసేస్తే సారుట్లావు వుండావిపొండ్లు. వూర్లో మొగొళ్ళంత ఆమాదిగి బోడెక్కిని

యప్పుడు బసివిరాల్ని ఇడుస్తారా. యప్పుడు బొట్టుకట్టి పెట్టుకుందామని యెదుర సూస్తుంటే. యేమి వగులుమింద యాట్లాడుతుండావు మాదిగతినీ...దానికేల్యా అంటారు పెద్దోళ్ళు "మాలోన్ని సెప్పకుండతన్నల్ల - మాదిగోన్ని సెప్పి తన్నళ్ళ"ని - సానా రవుసు మింద మాట్లాడిడిస బాయిగడ్డ అనుమంతు.

పెదిరెడ్డి అతిని మాట్లుకి అడ్డుము తగిలి "నూవ్వుండప్పా అనుమంతూ నేనుండాను గదా. మాట్లాడేకి" ...ఏం కందారప్పా ఇప్పుడు సెప్పు నీ బిడ్డికి వొయి సింత.

పదేండ్లు రొడ్డీ!

అవుర్రా మొగోడా ! నీ బిడ్డికి పదేండ్లని నువ్వు సెప్పితే నమ్మేకి మేమేమన్నా తిక్కనా కొడుకులు అనుకునేవున్నా. తిక్కనా కొడుకులు అనుకేనేవునా ఆ పిల్లని సూస్తే పదయిదేండ్లన్నా దాటుంటాయనిపిస్తాది. ఆ పిల్లికి పెండ్లి సేసింటే ఈ పాటికి నలుగురు పిల్లులన్న పుడుతుండ్రి. అయినా పదేండ్లు అయితేనేమతినీ. పొయ్యి నేడు నాను వులికి జాత్రికి పొయ్యిటి. అడసూస్తే నాకే అచ్చర్యుము యేసేట్టు సిమింత సిమంత పసిపిల్లుల్నిబసివురాళ్ళుని ఇడుస్తుండారు. మీరు నిజుము సెప్పితే ఇంటారు. అపద్దుము సెప్పితే ఇంటారు. మాయమ్మ తోడు సెప్పతుండాను... వొగూరొళ్ళు సంకలో పిల్లనే బసివిరాళు నిడిసిడిసిరి. మగా అంటే మూడేండ్లు వుండువస్సా. దీనికేమంటారు. సెప్పండప్పా అంటాని బాయిగడ్డ అనుమంతు లాపాయింటు తీసి కట్టమింద కుసినిన పెద్ద మనుసులు, వూర్లో వాళ్ళుని కట్టకింద దుమ్ములో కుసినిన మాలొళ్ళు మాదిగోళ్ల అందిరిని నిక్కి నిక్కి సూసిడిస.

నిజమే గద కందారప్పా! అన్ని వూర్లులోన పదేండ్లుగాని లేని పిల్లోల్ని బసివిరాలుని ఇడుస్తుంటే మనూర్లో మాత్రుముయేంటికి ఇడును గూడుదు సెప్పు. మీ మాదిగోళ్లకి యంత సెప్పినా అర్తుముగాదు. కొమ్ము నరసప్ప బిడ్డవులిగమ్మని బసివిరాలుని ఇడిసినప్పుడు ఇదే రంకు. మస్తానమ్మ బిడ్డ అనుమక్కని బసివిరాల్నుని ఇడిసినప్పుడు ఇదే రంకు. మస్తానమ్మ బిడ్డ అనుమక్కని బసివిరాల్నుని ఇడిసినప్పుడు ఇదే రంకు. యాటకని మిమ్ముల్ని నోరుసుకునేది సెప్పండప్పా. అనిడిసరెడ్డి.

అదిగాదు రొడ్డి. బూము బుట్రులేనొళ్లుము. యాదో మీ కింద కూలీ నాలీ సేసుకోని బతికే వొళ్ళము. మా మింద అట్లా కొప్పు అయితే యట్ల ద్యావురా మీరేయట్లన్నా దెయిదలసండని కీసన్న తాత మెట్టసనంగా మాట్లాడిడిస.

నువ్వు సెప్పకందారప్పా అస్సులు నీ బాదేందో అందురు ముందు ఇప్పిసెప్పిడి. అని పెదిరెడ్డి ఆడ్రేసిడిన.

సరేరొడ్డీ. మీరు సెప్పితే కాదంటానా కాదని మేము ఈ వూర్లో బూడిదేసేమ్నా.పెట్నా మీరే కొట్నా మీరే. మీ మాట పకారమే నాబిడ్ని బసినిరాల్ని ఇడిస్తాను - అంటాని వొప్పేసుకు నిడిస నడిమింటి కందారప్ప.

అది సరేనప్పా. మడి ద్యావుర్ని సేసేకి ఇబ్బందులు గిబ్బందులు వుండావంటివి. కీసన్నగూడ అదిమాట్ని సెప్పిడిస. ఆ సంగితి కూడా ఇపిడే కడా తేంపులు పిసుకుంటే కార్యుము సేసేకి కర్నుము సామి మూర్తుము కడుతాడుమడి. కర్నుముసామి గూడ యాయాల్నుంచి కదులుకుండ యెంటికి కుసేనేడ అనుకునేర.

కార్యుము అంటే మీకు తెలీంది యేముంది. గొడ్డీ. కర్చుకందాయిమువుంటాది కదా అనే కందారప్ప.

మడి అదేనప్పా. నిన్ని సెప్మనింది. యంత కొర్చు అయితాది. సెప్పితే వూర్లో వొళ్ళు అంతా కలిసి తలాకింత ఇచ్చిడిస్తారు. "వొండుకొని తినిందానికి వొగిటే రకుమంట. అడుక్కోని తినిందానికి ఆరవయ్యి ఆరువంటకాలంట". అంటాని వూరికే అనేర్నా పెద్దోళ్ళు.... అడుగడుగు నీ కర్చుయంతో అంటాని వొగవ్యాస్తుము యేసి సెప్పిడిస పెదిరెడ్డి.

అదిగాదు రొడ్డీ. వూరంత మంది ఇచ్చేది వొగెత్తు. మానూరి పెదరొడ్డోళ్ళు వొగెత్తు. అంటాని మా పెద్దొళ్ళు యప్పట్నుంచో కతులు సెప్పుతుంటే ఇంటుండాము. మా ఆసంతామీమిందే కద రొడ్డీ. మడి మీ మాటేంటో సెప్పనేలేదు. అంటాని అడ్డుముతగిలి మాట్లాడిడిస గుంపులో నుంచి లాలప్పతాత.

మీ పెద్దోళ్ళు సెప్పితే ఇనే మంటావేనువ్వు సూల్లేదు. ఈ వూర్లోనే కాదు ఈ ఆలూరు తాలూకాలోనే నేమికంటి పెది రొడ్డోళ్ళంటే సానామంచొళ్ళని పేరు తెచ్చుకునేమకదా. మేము ఇనాము ఈకుండా ఈ వూర్లో యెవుడన్నా కార్యుము సేసుకునేడ్నా యేమి. సెప్పులాలప్పా...సెప్పు అంద్కనే కదా కందారప్పని కర్చెంతో సెప్మని పదిమంది ముందే అడుగుతుండాను అనిడిస పెదిరొడ్డి.

వొలేయ్ కందారుగా.... నీకేమన్నా మతిపొయ్యేద్నేమిలేయ్.... పెద్దిరొడ్డి పెద్ద నోటికేసైకొని అడుగులే ఇస్తానంటుంటే. అక్కడా ఇక్కడా సూసుకుంటా నెంగిసిల్లి లక్కనెత్తి గీక్కుంటుండావే. అందికే అంటారు మడి ..." మాదిగోనికి మల్లివువ్వు ఇస్తే మడిసి గుద్దులో పెట్టుకునేన్నంట". అంటారు పెద్దొళ్ళు వొలేయ్...రా ...రాంరా..ఇట్లురా ...అంటాని నడిమింటాయప్పని గుంపులోకి పిలిసి గుసుగుసుమనిసానా సానా ఇసయాలు సెప్పుతుండారు.

మాదిగోళ్ళుకి రొవుంత ముందు మాలోళ్ళు గుంపు కుసునేద. వాళ్ళు కేమి పట్టినట్లు లేదు. వూరికే సూసుకుంట కూసునేర. అవుతులు పక్క బాయెళ్ళు గుంపు వుండాది. నబీసావొళ్ళు వోట్లుపక్క తరుకొళ్ళు గుంపుకుసునేద. వాళ్ళకి యడమపక్క కటికేవొళ్ళు.దూదేకులోళ్ళు కుసునేర. రేడీరూము కాంపోండుని ఆనుకొని వున్నిన మంగులుసాపులు యనక పక్క మంగులోళ్ళు అంతా కుసునేర. మంగులోళ్ళుకి యెనికి పక్క సాకులోళ్ళుకుసునేర. రొడ్డోళ్ళు సరిగ్గ పింజిరోళ్ళు, బలిజేవాళ్ళు, బైనేవొళ్ళు, ఈడిగొళ్ళు, క్వామిటొళ్ళు, కమ్మొళ్ళు పెద్ద మనుసులు కట్టమింది వుండారు. మిగిలిన కులాలొళ్ళు అంతా రేడి రూము సుట్టూరుగ కుసేనేర. అన్ని కులుపోళ్ళందురు వున్నీన పండ్లన్నీ ఇడిసి పెట్టుకొని మునిమాపునేరేడీ రూముతాకి వొచ్చి కుసునేర

నడిమింటాయప్ప మా పెద్దమనుసులు సెప్పినివన్నీ ఇని పైకిలేసి రొడ్డికి సెపుతుండాడు...'

జొన్నుబూకోసుము రెండుమూట్లు జొండ్లు. సామికి యడేసేకి, పెద్ద మనుసులికి సాబూ పెట్టేకి వొగుమూట వొరిబీము. ద్యావురు నంజిరిలోకి యచ్చుము, ఆకులు పూజికి, దీపారాజినికి, పెద్దమనుసులు ఇనాము తప్పిడి గొట్టేవొళ్ళు కర్సు - వాళ్ళు తాగే సారాయి కొల్లుకి. పూజార్లు, బసివిరాళ్ళుకి ఇచ్చేకి, అదీ ఇదీ కలిసి రెండు వెయ్యిలు అయ్యితాదేమొ సూడిరొడ్డీ - అనె.

దుడ్లేమన్నా సెట్లుకు కాస్తాండాయనుకునేవునా. యేమిరా కందారుగా! నీ బిడ్డిని బసివిరాలుని ఇడిసేకి రెండు వెయ్యిలు అయ్యితాదేమొ సూడి రొడ్డీ - ఆనె.

దుడ్లేమన్నా సెట్లుకు కాస్తాండాయనుకునేవునా, యేమిరా కందారుగా! నీ బిడ్డని బసివిరాలుని ఇడిసేకి రెండు వెయ్యిలు అయితాదా? ఇదే రెండు వెయ్యిలికి కర్నాటుకుములే అయితే పదిమందిని బసివిరాల్లునిడచ్చు. నీ బిడ్డేమన్నా బూలోకుము రంబనుకునేవున్నా అతిలోకుము సుందరమ్మ అనుకునేవున్నా ల్యాకుపోతే వూర్లో యెవ్వురు సూన్నట్లు సూపరమ్మ అనుకునేవనా. నువ్వు

రెండువెయ్యిలు రూపాయిల అనేతలకాలా ఇచ్చేకి. ఇంతుకు ముందు మీ మాదిగొళ్ళు పిల్లుల్ని యంత మందిని బసివిరాల్ని ఇల్లేదు. మేము దుడ్లు ఈలేదు. యంతిచ్చేవొళ్ళుము...మాకి బుద్దొచ్చినపట్నుంచి బసివిరాలు కర్సుకింద అయిదారు నూర్లు యెయ్యి రూపాయిలంటే మహా కస్టిము అప్పా! అట్లా దానికి వొగేసారి రొండు యెయ్యిలంటే మిమ్మల్ని యేమన్నా తిక్కనా కొడుకులు అనుకునేవునా అంటాని లేసి అడిగిడిన కమ్మ నారానప్ప.

మీరు వూరుకోండప్పా. నేనుండాను కదా మాట్లాడేక. అది కందారప్ప వొగిని మాట కాదు గదప్పా. వాళ్ళ మాదిగోళ్ళంత కలిసి మాట్లాడుకునిందే మనికి సెప్పేడ. అయినా వాళ్ళనని యేమిలాబ్ము సెప్పండప్పా. మిండ్లుకు బుట్టిన గోర్మెంటును అనల్లగాని. అమ్మబోతే అడివయ్యేద కొనుబోతే కొరియ్యేద. సంచినిండా దుడ్లు కండానిపోతే సంతులోకి, నారుట్లోకి గూడరావు సొరకులు. బసివిరాలు కర్సుంకిందికిచ్చే రెండు యెయ్యిలికి లేని పోనీ మాట్లన్నీ అని యెంలాబ్ము సూడండప్పా మన పూరికట్టిడి పకారుము మాదిగి కందారప్ప తన బిడ్నీ బసివిరాలుఇడిసేకి సొంతోసంగ వొప్పుకునేడ. ఈ కార్యముకు అయ్యే కర్సులో సొగుబాగుము నేనొకున్నే బరించుకుంటాను. మిగిలింది వూరందురు కలిసి ఇయ్యండి. ఇంటికి రూపాయి యేసుకున్నా ఇట్లా కార్యాలు పదిసెయ్యచ్చప్పా. దీనికంత రాద్దాంతుముయేంటికిగ్గాని...కందారప్పా ఇంగపొయ్యి కర్నుముసామి సెప్పినట్లు మలుకులు పున్నుముకు నీ బిడ్డ పెద్దమనిషి అయితాది కదా. అందుకని అరెద్దులు కార్తి యిన మూడుదినాలుకి నీ బిడ్నీ బసివిరాల్ని ఇడిసిడి యేమండప్పా వూరందరికి ఇది సమ్మొతుమేకదా అని పెదిరొడ్డి పంచాదతెంపే తలకాల యెవురింటికి వాళ్ళు యెగురుకుంట పొయ్యిడిసిరి.

ఆ పొద్దు రేడీ రూము కాడ జరిగిన పంచార పొద్దునుంచి ఈ పొద్దు బోడెక్కిని బసివిరాల్ని, ఇడిస్తే వొరుకు నెలదినాలు వూరువూరంతటికి పండుగున్నట్లే వుండాది. కాకుపోతే సద్దు సంగిట్లోకి జారి పొయ్యిన జొన్నగింజలక్కబోడెక్క వొగితి ఆ పొద్దట్నుంచి ఈ పొద్దు వొరుకు వొగిటే తరాగా యేడుస్తుండాది.

నీళ్ళులేని బాయిలో బోడెక్కకి గంగుసానుమని ఇంటి కాటినుంచి కడుపులో యెత్తుకొచ్చిన నీళ్ళు నెత్తిమింద పోసిడిసిరి. పాత బసివిరాళ్ళంతా కలిసి బోడెక్కకి ఇంటికాట్నించి కట్టిచ్చు కొచ్చిన తెల్లిసీర తెల్లిరెయికి ఇప్పిదీసి. ముందుగాలుగునే కట్టిపెట్టిన యాపాకు మండ్లుతో పయ్యంత సుట్టిడిసిరి. వొంటి మింద బట్టల్యాకుండ యాపాకు మండ్లుతోనే కాళ్లు కాడ్నుంచి గొంతుకాటి వొరుకు యాపాకుతో పెయ్యి కనపడకుండ నుట్టిడిసుర. ఇదేదో ఆదిముకాలుములో మనుసులు ఇట్లుండే వొళ్ళంటాని బాయిగడ్డ మింద వుండే ముసులోల్లు అనుకుంటుండారు.

బోడెక్క వొగిటే తరాగా యెక్కుళ్ళు బట్టే తట్ల యేడస్తుంగాది. వూరుకోమ్మే.... వురుకకుండు." అమ్మ" కార్యమప్పొడు యేడుకూడుదు. పులిగమ్మవ్వకి క్వాపొమ్మస్తే జీవితాంతుము ఇట్లే యేడుసుకుంట బతుకుమని పొప్మ పెడతాదంట మట్టసనంగా బసివరాలు అయినోళ్ళని పచ్చనాకులక్క నల్లుగ బతుకుమని వరుము ఇస్తాదంట. యేడద్దులేమ్మే యేడొద్దు. ఇంగ అయి పొయ్యిడిసేద కదా అంటాని వొగ ముసిలి బసివిరాలు సముదాయిస్తుండాది.

పయినింద యాపాకులుతోకట్టింటే సేతుల్నీ కాళ్ళు కదిలిచ్చేకి కస్టంగా వున్నట్లుండాది. బోడెక్కకి ఇపుడు బసివిరాళ్ళు యేమిసేసినాసేతులు అడ్డుము పెట్టేకిల్యాక పాయబసివిరాలు అనుమక్క డ్యాగురులోని బుక్కుపిండి తీసుకొని బోడెక్కముకుమునింద బూసిడిసేద. బసివిరాలు వుసేనక్క కుంకుము బొట్టు పెట్టేద. ఇంగోగాయమ్మ యగ్గట్టిన కొప్పుని ఇప్పిదీసి యెంటుకులు ఇరుబోసేద

యడముకాలు అరికాలకి అరిసేతికి మసిబొట్టు పెట్టి డిసేర. కాళుకిసేతులుకి పొసుపుపూసింటే పూలు పూసిన గూర్నాలు సేన్లక్క వుండాది బోడెక్క, జిట్టతగులుతాదని మసిబొట్టు పెట్టేర.

"అక్కుల్ జోవ్... జోక్కుల్‌జోవ్... జోగోజోగో" అంటాని మూడుసార్లు "జోగులు తట్ట" పట్టుకుని బసివి రాళ్ళుఅందురు జోగేసిడిసిరి. బోడెక్కతుక్కు తిరిగి మూడు సార్లు, పడుమటు తిక్కు మూడుసార్లు తూర్పు తిక్కు తిరిగి మూడు సార్లు మెత్తుము తొమ్మిది సార్లు జోగేసి ..ఉదోవ్ ఉదో...ఉదోవ్ ఉదో"... అంటాని జోగులుతట్లు యడమ బుజుమింద పెట్టుకుని కుడిసేత్తో యపాకు మండ్లు పట్టుకుని బసివిరాళ్ళు అందురు క్యాకులేసిడిసే తలకాల బయినే అయప్ప జమిడికి బుజాని! తగిలిచ్చుకుని "జుమ్‌చుక్‌నక్... జుమ్‌జును: చుక్‌నక్...జుమ్‌జుముచుక్‌నక్" అంటాని వాయించ.

బుడ్డుమారప్ప టంకాయి తీసుకుని పైకెత్తి బాయిగడ్డ మెటికులు మింద యేసి కొట్టే తలకాల సిచ్చులు పిచ్చులు అయ్యిడిసేద. ఆ కొబ్బరి ముక్కులు యేరుకునేకి పిల్లోళ్ళు తండ్లాడుతుంటే తప్పిటోళ్ళు "కణ కణ జగ్గణకణకణ...జగ్గణ కణ కణ...జగ్గణ కణ కణ" అంటాని వూపు అందుకు విడిసిరి. యాడంటాడే కుసినీన వాళ్ళూ నిలబడి నోళ్ళు బాయితాకి వురికొచ్చిడిసిరి. బాయిలో నుంచి ఆడోళ్లందురు గుంపుగా నిలబడి బోడెక్కని మద్దిలోకి యేసుకోని మెల్లి మెల్లిగ మెటికులుయెక్కిచ్చుకుంట పెయికి తీసుకోని వొచ్చేర.

బంగారొప్పోళ్ళు ఇంటిముందు బసిరి మామకింద కట్టేసిన ద్యావురుపోతుని తాళ్ళు ఇప్పి సుమరు నూరుమంది. బుమయిన మొగోళ్ళు ఇగ్గి పట్టుకునేర. దున్నుపోతుని యక్కడ కదులునీకుండ ముక్కులో నులుక్కి రెండు తాళ్ళు కట్టేర. కొమ్మలికి రెండు తాళ్ళు కట్టేర. నాలుగు కాళ్ళుకి నాలుగు తాళ్ళు కట్టేర. గొంతుకి రెండు తాళ్ళు కట్టేర. ద్యాల్లోనుంచి ముందురు కాళ్ల మద్దిలోకి గుదిగి కట్టి కట్టేర. నూరుమంది మొగోళ్ళు పెయినే ఇగ్గిగ్గి పట్టుకుంటుంటే దున్నుపోతు బుసులు కొటుకంట అక్కడా ఇక్కడా సిమ్ముట్లాడు తాండాది.

ద్యావురుకి మూడు దినాలు ముందు పోతుని పట్టుకుని కట్టేసి ముక్కుకుట్టి ముగుతాడు యేసేర. రేపు ద్యావురనంగా తిరిగి ద్యావురుపోతును కాళ్లు గట్టి కిందికేసి బండిగగూటాలు, బానేకట్లు, ఆనుసుకట్లు తీసుకుని తిరిగీన తుక్కల్లా కొట్టి కడుపులుతో సన్నీళ్ళు యెత్తేర. అయిదేండ్లు అడ్డు ముల్యాంకుడ రాజ్జిమేలే వాళ్ళు వేసినట్లు మేసి బూంమింద కాలు పొందుబెట్టుకోకుండ సిమ్ముట్లాడుకంట తిరిగిన పోతును కట్టేసి కొట్టిండే కొట్టుడానికి పెయ్యిలోపల యముకులునంజిరి ముద్దు ముద్దు అయ్యిపొయ్యింటాది. దాని నంజిరిని కురాకు వొండుకొని తినినా రుసి వుండుదు.

అట్ల అణగొట్టింటే అది ఇంగా యక్కడ బడితే అక్కడ సిమ్ముకొని పొయ్యేకి సూస్తుండాది. పాయిము మొగొళ్ళంతా తాళ్ళు ఇగ్గిపట్టి నిలేస్తుండారు.

ద్యావురుపోతు నంజిరి కాపుదనుమొళ్ళు తింద్రుగదా. వూర్లో నంజిరి తినేవొళ్ళందిరికి కలిసి రెండు మ్యాకుపోతుల్ని ద్యావురికి ఇడిసేర. ఇంగా రొంతు ద్యావురికి ఇడిసేర. ఇంగా రొంతుమంది కోళ్ళని

ద్యావురికి ఇడిసినమ్యాకుపోతుల్ని ద్యావురికి ఇడిసేర. ఇంగా రొంతుమంది కోళ్ళుని ద్యావురికి ఇడిసేర.

ద్యావురికి ఇడిసిన మ్యాకుపోతుల్ని నాకారుపిల్లోల్లు తాళ్ళుతో పట్టుకుని ఆఏటికి యాపాకు తిని పిచ్చకంట యెగురుకుంట వొస్తుండారు. మ్యాకు పోతులు యనక తప్పిటోళ్ళు వుండారు.

తప్పిట్లు కొట్టేవోళ్ళని ముందికి అడుగేయ్యనీకుండ తాగినోళ్ళంత సావుసేను. జగ్గిలేసుకుము రాకేనురోలు ఆడుతాండారు. తప్పిటోళ్ళు గూడా ఆడేవొళ్ళు సరింగ యెగురుకంట తప్పిడి కొడుతుండారు. తప్పిడి రంగన్న అయితే రూపాయి బిల్లులు తప్పిట్లోకి యేపిచ్చుకుని కింద నుంచి సిటుకులు కొడితేతప్పిట్లో దుడ్లన్ని పేయికెగిరి కిందపడుతుండాయి కిందపడిన దుడ్లని యేరుకొని యేరుక్కొని జోబులోకి యేసుకుంటుండాడు. అది సుసితత్తారి గుడ్డాయప్ప రెచ్చిపొయ్యి రూపాయి నోటుని మొంట్లో సడేపిచ్చి తాసే కొట్టకంట, ఆపుకోకుండ కంటి రెప్పలుతో రూపాయి నోటుని పట్టుకుని పెయ్యికి లేసిడిసేడ. తప్పిటి రంగన్నకి రోసుమొచ్చి పావులా బిల్లులు న్యాలుమిందేసి తప్పిడి కొట్టుకంట ఆపుకోకుండ తలకాయి బార్లేసి పొండుకొని మగుముని మొంట్లో అట్లా ఇట్లా పొర్లాడిచ్చి పావులా బిళ్ళని పణమింద అంటిచ్చుకుని పెయ్యికి లేసి తప్పిట్ని మెగిరెగిరి కొడుతుంటే సుట్టుముట్టుసూసేకి ముసురుకునిన జనుము ఈలులు యేసి క్యాకులు యేసి అరుసుకంట యెగురు తుండారు.

తప్పిట్లోళ్ళుకి యెనకాలే దాసిరి లసమక్కగలుస్తంబుము పట్టుకుని గంట కొట్టుకంట, దీపారాజ్జిము వొత్తిని యెగేసుకంట వొస్తుండాది. ఆయమ్మ యనుకునే బైనే ఆయప్ప జమిడికి వాయిస్తుండాడు. ఆయప్పయనకాల్నే జోగులు తట్లు పట్టుకొని జోగేసుకుంట 'ఉదో ఉదో' అంటాని బసిరాళ్ళు వొస్తుండారు. బసవిరాళ్లు యనక దుబ్బీరక్క కలుసుము పట్టేద. కడాకి ఆడోళ్లంత గుంపు గుంపు నడుసుకుంట మద్దిలో బోడెక్కిని నడిపిచ్చుకుంట వొస్తుండారు.

బోడెక్కిని సూసేకి యక్కుడక్కుడోళ్ళు యగుబడుతాండారు. గుంపులో వుండే బోడెక్క సరింగ కనబడుదు. దూరుమునుంచి సూసే వొళ్ళుకి బోడెక్క ఇరుబోసుకుని నెత్తి బండారు పూసుకునిన మగుము రోంతురోంత కనబడతాండాది. మద్దిలో మద్దిలో ఆడోళ్ళు అట్లా ఇట్లా కదిలినపుడు పెయకచంత ల్యాకుండ సుట్టిన యాపాకు కనబడతాంది. తేరుపరిసట్లా జనుము కండ్లు కొట్టుకోకుండ బోడెక్కిని సూసేకి తండ్లాడుతాండారు. వొగిటే తరాగ బోడెక్క యేడిసీ యేడిసీ కండ్లు యఱ్రగ సింతు పిచ్చుకులు అయ్యేద కన్నీళ్ళు తూడుసుకునేకి బోడెక్క తలకాయి వొంచుకున్నపుడు ఆ గుంపులో నుంచి యేమేమి కనుపడుదు.

వూరేగింపు బాయిగడ్డతా నుంచి ఈడిగిరంగయ్యోళ్లు కల్లుప్యంటుతాకి వొచ్చే తలకల్ల. గోయిందు రొడ్డోళ్ళుమిద్దిమింద వూర్లోజనుము సేరేర. బోడెక్కిని సూసేకి వొచ్చిన వూర్లో ఆడోళ్లంతా గోయిందు రొడ్డోళ్ళు ఇంటిమింద, బడేసా వొళ్ళు మిద్దిమింద. ఇంగా తురుకొళ్లు బాయెళ్ళు. వొడ్డేవాళుతి మిద్దులు మింద నగ్గా జనుము నిలబడిడిసేర.

యేమి సిపారస్తయిన జనుము కలిసేర్రా! ఇట్లా జనుము పెద్దిడ్డోళ్ళు పెండ్లికి గూడ కలిసుండ్రు సూడండప్పా! సూసేమగాని, యంతు మందునో బసివిరాళుని ఇడిసేది. బోడెక్క అద్రుస్టుమే అదృస్టుము అంటాని మంది అంతా అనుకుంటుండారు.

వూరేగింపు సవురమ్మగుడితాకి సేరేద. మావూర్లో పులిగెమ్మవ్వగుడి లేదు. అంద్కునే సవురమ్మవ్వ గుడిలోనే వొగుమూలుకి జొండ్లు పోసి, జొండ్లు మింద మరువుపెట్టి మరువు మింద ముంత పెట్టి, ముంతు మీద పీసుతీసి టెంకాయి పెట్టి దానికి మూడు బండారుతో అడ్డు బొట్లు పెట్టి, దాని మింద పూలుదండ యేసి దేవుతిని సేస్తారు. దానికే కొత్త బట్లు సుట్టి, బట్లు కట్టిచ్చేమ అంటారు. సాతనైనోళ్ళు యెండితో మీసాలు, కండ్లు సేపిస్తే ఇంగా కలిగినోళ్ళు మగుమే సేపిచ్చికోవచ్చు కార్యుము సేస్తారు. ఈ పొద్దు బోడెక్కిని బసివిరాలుని ఇడిసేకి అట్లే సేస్తూండారు.

సల్లు నీళ్ళు కడువతీసుకోనొచ్చి పాదాల కట్టకడిగిడిసిరి. బండారు పూసి కుంకుమ సల్లి నిమ్మకాయిలు వుల్లి గడ్డు కోసి గంద్రాగొడ్లి, యాటకొడివెండ్లుకి పూజ్జేసి ట్యంకాయి కొట్టిడిసిరి. పోతుని బోడెక్కిని గుడిసుట్టు మూడుసార్లు తిప్పకోని వొచ్చి గుడికి ముందుగాల పాదాలు కట్టకాడ నిలిబెట్టిడిసిరి. ఆడోళ్ళుని పిల్లొల్లుని దూరుము జరిపిడిసిరి. కొత్త వూర్లోళ్ళుని ఈడ్యాడవుండొద్దండప్ప. మడసనంగా సెపుతుండాము దూరుముపోండి. యేమండప్పా ఇది పెద్ద మనుసులు మాట యేరే వూరోళ్ళు పాలికండాని పొయ్యేకి వొచ్చింటారు. వుండూరొళ్ళంతా పెయినిండ కండ్లు బెట్టుకొని ఆయుధాలు పట్టుకొని వుండండని లాలప్పతాత క్యాకేసడిస.

పదేండ్లు దాటిన పిల్లొల్లు నుంచి ముసిలి ముసిలొల్లు వరుకు మొగొళ్లంతా, కట్లు కటార్లు, బల్యాలు, బాకులు, పిడికత్తులు, యాటకొడివెండ్లు గంద్రాగొడ్డెండ్లు అనుసుకట్లు పురిబల్యాలు బానేకట్లు, బండిగూటాలు పాదాలు కట్టకాడ పెట్టి పూజ్జేసినవన్నీ తలాకొకిటి మా మాదిగోళ్ళంత తీసుకుని డిసేర. పెండ్లయిన మొగొళ్ళు పెండ్లాల తాలిబొట్టుని కుడిసేతికి కట్టుకునేర. పెండ్లి నోళ్ళు మలతాడు తీసుకొని కట్టుకునేర. ఇట్లా తప్పడు యేమన్నా అయ్యిపానుము బోతే మోచ్చుము వొస్తాదని నమ్ముకుము. బాయేళ్ళు గూడా వొగురో ఇద్దరో వొచ్చి నిలబడేర. ద్యావురుపోతుని నరికినపుడు దాని రొగుతుముయంత దూరుము సిట్లుతాదో అంత దూరుములో కొత్తు వూర్లొళ్ళుని వున్నీ కుండ దూరుము పొమ్మ నేరగదా. ఇంగ మిగిలిన మావూరొళ్ళంత దున్నపోతుని ఈ యేడు యెవుడు మూడేట్లుకి నరుకుతాడోనని సూసేకి తొక్కులాడు తుండారు.

అయిదారేండ్లు నుంచి ఆదే పనికి గంద్రాగొడ్లి సేపిచ్చుకుని కొబ్బిరి బల్లుము. సెలిమిండి ముద్దులట్లాయచ్చుముతినుకంట అయిదారుమంది వుండారు. పూరుముకాలుములో అయితే వొగిటే యేటికి దున్నపోతుని నరికేవొళ్ళు అని మా తాతొళ్ళు సెపుతుండారు. డోనుమొద్దు అట్లా దున్నపోతుమ్యడిని వొగిటే యేటికి తుంట్లు బడేతట్ల యట్ల నకుతారప్పా అంటాని అచ్చర్యము పొయ్యెవొళ్ళుము. ఇప్పుడు నానాకు మొందులు కూడుతినే ఈ నాయండ్లు సాతనేమయితాది. అట్లాదానికే మూడేట్లుకి కన్నా మూడేట్లుకి నరకుమని కట్టిడి సేసేర. నరుకు లేనోనికి వొగుమీసుము కొరిగిచ్చి వూరేగిస్తారు. మూడేట్లుకి నరికినోనికి మూడు తులాలు బంగారుము ఇస్తారు. ఇంతకత వుండాది కనుకే మరివొగినిమింద వొగుడు పోటీపడి యడీగంద్రగొడ్డెండ్లు అదే పనికి సేపిచ్చుకుని పిక్కమింద కండ పురి తిరిగేతట్లా యచ్చుము తిని బలుస్తారు. పై పందాలు గూడ నగ్గా కాస్తారు.

ఈయేడు ద్యావురు పోతుని నరికే వొంతు తలారి నాగన్న కొడుకు రామిగిరికి వొచ్చేద. తోడు పెండ్లికొడుకు లక్క వొగురు నరుకుల్యాకపోతే కార్యుము ఆగిపొయ్యిఆపుచారుము అయితాదని మిగిలిన అయిదారు మందిని నరికేకి వుండల్లని పెద్ద మనుషులు వొప్పందమంట. అంద్కని రామగిరి సరిగ్గ, దుబ్బిరన్న కొడుకు ముక్కిడి రామాంజిని, రోగాయప్ప కొడుకు ఈరుగాడు, సిన్నాయప్ప కొడుకు మల్లికార్జిని, కీసన్న కొడుకు నరసప్ప యెదిరింటి కందా రప్పకొడుకు ఇసువురప్ప, గోసులు పోసుకుని అంగీలు వుప్పేసి రెక్కిలికి తాయెత్తులు కట్టుకుని, కుడిసేతి కండకనానికి పెండ్లాలు తాలిబొట్లు కట్టుకుని, మీసాలు పురిపెట్టి తొడగొట్టి ఆయుదాలికి మొక్కి గంద్రాగొడ్డెండ్లు తీసుకొనెర.

దున్నపోతు ముందుకాళ్ళు కింది నుంచి కాడేమాను యేసి గొంతుని కాడేమాను మిందపెట్టి యక్కుడొళ్ళు అక్కడ బిగబట్టేర. యెనికిపక్కి కూడ దున్నపోతుని కదిల్నీకుండ కడుపుకిందికి అవుతులు నించి, ఇవుతులు నించి, కాడేమాండ్లుయేసి ఇరుగుబట్టుకునేర.

రామిగిరి వొచ్చి ద్యావురుపోతు మ్యడకాడ నిలబడి రెండు సేతులుతో గంద్రాగొడ్డిలిని పైకెత్తి ద్యావురుపోతుమ్యడమిందమెల్లిగ అనిచ్చి పైకెత్తి అట్లరెండు సార్లు సామిని మొక్కి నట్లు సాంపులు

సూసినట్లు సేసి వొగుసారి నిక్కి నీలిగి గంద్రాగొడ్డులిని బలుముకొద్ది రెండుసేతులుతో పైకెత్తి వాటుము సూసి అడ్డుము బెట్టి వొగిటేయేటు నరికితే సరి, దెబ్బకి దున్నపోతు తలకాయి తెగితుండు బడిడిస దున్నపోతు తలకాయి కాడిమాను మిందు నుంచి యాలడపడేతలకాల గొంతుకింద యేలంక కరుసుకునీన తోలుగూడ తెగిపొయ్యిడిసేద. తప్పిట్లు తాసాలు జమిడికులు, బసివిరాళ్ళ "ఉదోఉదో" అరుపులు మద్దిలో వొగిటే క్యాకులు ఈలులు యేనుకుంట రామిగిరిని పెయికెత్తి పూలుదండ్లుయేసి యెగురేస్తుండారు అరుసుకుంట.

మూర్తుము దాటి పోతాది పదండప్పా పదండని బోడెక్కిని గుళ్ళోకితీసుకుని పొయ్యి పూజ్జేసి జోగుళ్ళు యేసి "ఉదో ఉదో" అనిడిసరి పయ్యంత సుట్టిన యాపాకుమండ్లు ఇప్పి ఆదరాబదరా పసుపు పచ్చసీర, రెయికి తొడిగిచ్చి ద్యావులు కట్టముందు నిలిబెట్టిచ్చి కర్నుము సామితో కాలు తొక్కిచ్చి బయినే రామన్నతో దావుర్లు కట్టిపిచ్చిడిసిరి.

అయిపాయ నడిమింటి బోడెక్క బసివిరాలు అయ్యేద ఈ పొద్దుట్నుంచి నడిమింటి బోడెక్కిని యెవుని సాతనైతే వాడు పెట్టుకునేకి వూర్లో వొళ్ళంత కాపులు కాస్తుంటారు.

సీత్తకార్తిలో అరవయ్యి ఆరుమొగుకుక్కలు సొంగు కారుసుకుంట అడుకుక్క తాకి వొచ్చేకి సూసినా సాతనైన వొగిటే వొగు మొగుకుక్క యెక్కిపిట్లేసుకున్నట్ల వొయిసు అయిపోయ్యే వొరుకు ఇంగొర్ని దరికి రానీకుండ బసివిరాలుని వొలుసుకుని తినేకి యక్కడ దప్పిన్నాయాండ్లు అందురు యెదురు సూస్తుండారని మాయమ్మ ఇంగా యేమేమొ సెప్పుతుంటే......

బోడెక్క ఇంగా పెద్దమనిషికూడా అయిలేదు కదయ్యా. ఈ పొద్దు బసివిరాలుని ఇడిసేరకదా అద్యావుర్లు గట్టిన పూజారాయప్పకాలు దొక్కిన కర్నుము సామి, కంకుసుము గట్టిన గొరువయ్య ముగ్గురు ముసిలినా బట్లు కలిసి, సామి కార్యుమని ఆ పిల్లిని ఈ రాతిరికే వొగుడయినంక వొగుడు పక్కులో పొండు బెట్టుకుంటారంట అన్నిము పున్నిము యెరుగుని నడిమింటి బోడెక్కిని బసివిరాల్ని సేసి బజారికి యేసిడిసిరి. పెద్దమనిసి అయ్యే తలకాలేయంతమంది ముట్టుకుంటారో పొయిము అయ్యిపొయ్యే తలకాల యంతమంది పిల్లుల్ని పుట్టిస్తారో ముసిలిముప్పుతనానికి ముద్దేసేకి యెవురు మిగులుతారో ఆ బగుమంతునికే తెలల్ల తల్లోయ్...తలుసుకుంటేనే బయమయితాది అంటానీ దీర్గాలు తీసిడిస గుంతకంటి మస్తానమ్మ పెద్దమ్మ.

ద్యావురుపోతుని నగులుగోసి తోలు ఇడిపిచ్చి నంజికుప్పులు యేస్తుండారు. ఇంటి కొకిటి లక్క కుప్పులేసేర. మేము పెద్దింటి. మాదిగొళ్ళుము. మాకి మేలేటు ఇయ్యల్ల మానాయిన సానా వగులు ముగాడు కదా అట్లాతాకిరాడు. మా పెద్ద ప్పకే మొయంతుసేపు నేన్లు అంటాని సేన్లోపడి స్లేన్నోనే సచ్చిపోతుండాడు. మా ఇంటికి నేనే పెద్ద కొడుకుని. సిమింతున్నా ఈడు సిట్లు పడరాదని మాయమ్మ నాకి బిరుదు ఇచ్చేద.

త్యామ్మేత్యారాదా! గుడికట్టకాడ ద్యావురనంజిరి కుప్పులేసేది అయిపాయ. నీకిడ్యాగురు కడిగేదే కాలేదు. యట్లాగో అట్లాగ వుంటే వున్నీ త్యామ్మె అంబని డ్యాగురు తీసుకుని గుడితాకి పొయ్యి ద్యావురుపోతునంజిరిలో మా పెద్దింటి కుప్ప యెత్తిచ్చుకుని నెత్తిమింద పెట్టుకుని ఇంటికివొస్తుంటే పెయినకాకులు, గద్దులు నడిమింటి బోడెక్కిని వూర్లో వొళ్ళు తన్నుకు పొయ్యినట్లు నంజిరికండ్లుని తన్నుకుపొయ్యికి గంగురాటుముతిరిగినట్లుతిరుగుతుండాయి.

నేనేమన్నా సిన్న మొగోన్ని అనుకునేర్నా. నెత్తిమింద నంజిడ్యాగిరి పెట్టుకుని యడమసెత్తో డ్యాగురు పట్టుకుని కుడిసేతుల్లోని సిల్లా కట్టితో సాము కట్టి తిప్పుకంట కాకులు గద్దుల్ని నంజిరికండ్లుని తన్నుకు పోనీకుండ ఇల్లుసేరిడిసెన.

(మాదిగోడు కథల సంపుటి నుండి)

17

# గుడిసె గుండెల్లో....

## పులికంటి కృష్ణారెడ్డి

అది ఒక చెట్టు. ఎగిరే గువ్వకూ నడిచే అవ్వకు తల్లి ఒడిలాంటి చెట్టు. ఆ చెట్టు ఉండేది ఒక బాట పక్కన. ఎప్పుడూ రాక పోకలతో రద్దీగా ఉండే ఆ బాట ఉండేది ఒక పట్టణం. ఆ పట్టణం ఉండేది ఆంధ్ర రాష్ట్రంలో ఆ రాష్ట్రం ఉండేది ధర్మం నాలుగు పాదాల మీద నడిచిన భారతదేశంలో ఆ చెట్టు కింద కూర్చొని చెప్పులు కుట్టుకొంటున్న ముత్యాలు గుండె ముత్యాల పందిరే అయింది ఆ పాట వింటూంటే!

పాట మైమరపులో ముత్యాలు చేతిలో 'అరె' ఆగింది ఉన్నట్లుండి ఏదో అడ్డుపడ్డే ఆగిన తెల్ల చీమల బారులా కుడుతున్న కుట్టు ఆగింది. అంతవరకు ఎడమచేతి వేళ్ళలో కలగలసి ఆడుకొంటూ ఉండిన తెల్లని నూలు దారం అలుపు తీర్చుకొంటూ ఉంది. అతడి అరికాలి కింద చెప్పు మాత్రం కలిగినవాడి కాళ్ళను అలంకరించాలని ఆత్రత పడుతున్నట్లుంది.

ముత్యాలు చూపు తన ముందు గువ్వలా ఒంగి కూర్చున్న బుల్లి రేడియో మీద నిలిచింది. రేడియోలో పాట శ్రావ్యంగా వినిపిస్తూ ఉంది.

గాలివానలకే తలలొగ్గేసీ

ఉన్నవాళ్ళకే చేతులొగ్గేసీ

బడికీ బడికీ ఒదగని కూనల

చలికొదిలేసీ కుమిలేవాడా!

తన బతుకును చూసి ఎవరో ఆ పాట తన కోసరమే పాడుతున్నట్లు అనిపిస్తే ముత్యాలు భారంగా ఒక్క నిట్టూర్పు విడిచాడు.

చీమకున్న దొక పుట్టరా

చిన్న గువ్వకున్న దొక్క గూడురా

తోడుండీ గూడేలేని - నీ

గోడు తేరే మార్గము రా!

"నిజమే గదా! పోగులంతా యాడేడ తిరిగి తిందో ఏం పాడో చీమ. రేత్రయ్యేకుందికి పుట్ట చేరుకుంటుంది. గువ్వ గూడా అంతే కదా? రెక్క లాల్లార్చుకుంటా కడుపాత్రం ఎట్టెట్ట ఎగిరినా,

యాడేడ తిరిగినా పొద్దట్టా కుంకేకుందికి గూడు చేరుకుంటుంది. కానీ, నా బతుకట్టా కాకపాయనే? పుట్టింది, పెరిగింది, బతికింది, బతకతా ఉండేది అంతా ఈ రోడ్ల మిందనే గదా? ఏమి జల్మాలో పాడు జల్మాలు. సిగ్గూ సెరము రొండూ లేని జల్మాలు. కడాన ఆడదాన్తో అచ్చటా ముచ్చటా తీర్చుకోవాలంటే గూడా ఈ రోడ్లే గెతి. చీచీ! ఈ కనాగష్టమైన బతుకులకంటే నోర్లేని జీవాలే మేలు!''

ముత్యాలు ఆలోచనలతో అవసరం లేకుండా రేడియోలో పాటకు పల్లవి పల్లవిస్తూ ఉంది. ఆ పాట తనకు తెలియని గమ్యాన్ని తెలుపుతూ ఏదో హితబోధ చేసినట్లుంటే ముత్యాలు చూపును రేడియోపై నిలిపాడు. పాఠం చెప్తున్న అయ్యవారి ముందు విద్యార్థిలా పాటను చాలా శ్రద్ధగా వింటున్నాడు - కదిలీ మెదలకుండా, ఆ చెట్టులో తానూ ఒక భాగమైనట్లుగా.

''ఏంది మావా? చేసే పని చెట్టుమిందికెక్కించేసి శానా స్రెద్దగా ఇంటా ఉండావే? ఏం కత? రేపు ఎప్పుడన్నా రేడియోలో పాటేమన్నా పాడ బోతావా?'' ఎక్కడెక్కడో తిరిగి తిరిగి నందెడు టైరు ముక్కల్ని ఏరి తెచ్చి పక్కన కుప్పబోస్తూ అతడి పెండ్లాం ముత్తమ్మ అడిగింది. కొంటెగా చూస్తూ

''ఆఁ పాడ్తా, పాడ్తా! నువ్వు తీరుబాటుగా కూసోని...''

''ఎప్పుడు మామా అంత బాగ్గెం?''

''ఈ జల్మంలో కాదులేయే పిచ్చిమొకమా! నువ్వు ముందుగా ఆ పాట ఇనే.''

ముందు చూపు కలిగి నువ్వూ

మురికి గుంటలే పూడ్చుకుంటే

ముచ్చటైన ముత్యాలపందిరై

ఒక చక్కని గుడిసే నీదవుతుంది.

చరణం పూర్తయింది చరణం పూర్తి అవడంతో మళ్ళీ పాటకు పల్లవి వినిపిస్తూ ఉంది.

''నిజమే గదంటే చెప్పు, నువ్వే చెప్పు. చీమకు ఉండాదొక పుట్ట. చిన్న గువ్వకు ఉండాది ఒక గూడు. కడాన ఎలకక్కూడా ఒక బొక్క ఉండాది గదే? మనకు ఏముండాది?''

''దేముడిచ్చిన చెట్టునీడ!''

''రేపు దొరలొచ్చి లెయ్‌రా కొడకా అంటే?''

''ఇంకొక చెట్టు ఎదురుచూస్తా ఉంటిందిలే మామా!''

''ఈ చెట్టు కాకపోతే ఆ చెట్టు. ఆ చెట్టు కాకపోతే ఇంకొక చెట్టు. ఇట్లా ఎల్లకాలం చెట్లకిందనే ఎందుకు బతకతారు? యాడైనా అంత మిట్టా గట్టూ చదరం చేసుకోని ఒక గుడిసె యేసుకోమంటా ఉండారే!''

''ఎవరు మామా?''

''ఇయ్యరవదాకా రేడియోలో పాడిన పాట! చెవల్లో చెట్లేమన్నా మొల్చినాయా నీకు?''

''రేడియోలో పాడిన పాటనా? ఇంక అయినట్టే కాపరం....''

"అంటే? రేడియోలో పాటంటే అంత అలుసైపోయిందన్నమాట?"

"రామ రామ! రేడియోలో మాటన్నా, పాటన్నా ఎగతాళి చేస్తే నా తల ఎయ్యి ముక్కలై పోదా? అయినా మామా నాకు తెలియకుండా ఉండా, ఈ రేడియోలో చెప్పేదంతా జరగతా ఉండాదంటావా?

"ఎందుకు జరగదే ఎఱ్ఱిమొకమా! జరగక్కుండా పొయ్యేటట్లుగా ఉంటే ఎందుకు చెప్తారే?"

"మామా! వాళ్ళేందే మనకు వొరగబెట్టే సేటట్లు చెప్తానే ఉంటారు. మనం ఇంటానే ఉంటాం. ఇంటా ఊరికే ఉంటామా? కలలు కంటానే ఉంటాం. కలలు ఎప్పుడైనా, యాడైనా నిజమవతాయా పాడా! అందుకే వాళ్ళు అట్లానే ఉంటారు, మనం ఇట్లానే ఉంటాం."

"అయితే, ఇప్పుడేం చెయ్యాలంటావ్?"

"ఏమీ చెయ్యాల్సిన పనిలేదు. పొగులు మాటలు పనికి చేటు, రేత్రి మాటలు నిద్దర చేటని తెల్సుకోని మన పని మనం చేసుకోవాల.

"ముత్తమ్మను చూస్తూ ముత్యాలు ముసిముసిగా నవ్వాడు.

"ఎందుకు మామా నవ్వతా ఉండావే?"

"నువ్వు నీతి బోదకాలు చేస్తా ఉంటే..."

"ఆ పని చేసేది నేనుగాదు మామా! అప్పుడప్పుడు మన తావుకొచ్చి చినిగిపోయిన చెప్పులు కుట్టించుకుంటాడే పొడుగు పొడుగు నామాల అయ్యోరు, ఆయన కతలు చెప్పి కాసులియ్యకుండా పోయ్యేది. ఆయన ముందర నువ్వన్నా కూసో, లేకపోతే నీ ముందర ఆయన్నన్నా కూసోపెట్టుకో'
'.

ముత్యాలు నోరు మూత పడింది. బుల్లి రేడియో మీద నుంచి చూపు పనిమీదికి మళ్ళింది. అలవాటు పడిన చేతులు, వాటి పని అవి చేసుకొంటున్నాయి. అయినా, ముత్యాలు మనసు మాత్రం మనసులో లేదు.

"పరుల పంచలే తరిమికొట్టే
పరిగెత్తిపొయ్యే పిరికోడా!"

మాటిమాటికి ఎవరో ఎత్తిపొడుస్తున్నట్లుగా ఈ మాటలు చెవుల్ని తూట్లు పొడుస్తున్నాయి. ముత్యాలు ఆలోచనతో పోటీ పడ్తూ పని జోరుగా సాగుతూ ఉంది.

అప్పుడే పొద్దు వాటారింది. చీకటి పడకముందుగానే అంత ఉడకేసుకోవాలన్న ప్రయత్నంలో పడింది ముత్తమ్మ!

బుల్లి రేడియోలో పాటలు వినిపిస్తూనే ఉన్నాయి. అయితే, అవి సినిమాలో యుగళగీతాలు ముత్తమ్మ మూడురాళ్ళ పొయ్యిముందు కూర్చొని కట్టెలు ఎగదోస్తూ మైమరచినట్లు ఆ పాటలు వింటూ ఉంది. ఆమె ఎండిన పెదవుల మీద తొలి నవ్వులు మిలమిలలాడుతున్నాయి. కానీ, ముత్యాలు చెవుల్లో మాత్రం ఆ పాటే! తనను ఒక పిరికివాణ్ణిగా చిత్రించిన పాటే! తన అసమర్థత మీద దాడి చేసిన పాటే చెవుల్లో గింగురుమంటూ ఉంది.

ఎవడో తన సంసారాన్ని పగబట్టి మెడలో నుంచి చెట్టు నీడకు గెంటేసినట్లు తెగ బాధపడి

పోతున్నాడు. ఎంత ఆలోచించినా ఎవడా పని చేశాడో అతడి మనసుకు తట్టలేదు. తనకు తానుగా మాత్రమే చెట్టు కిందికి రాలేదు. ఎవ్వడూ రాడు కూడా, అయితే, అలా రావడానికి కారకుడెవడు?

ముత్యాలు గుండెలు కుతకుత ఉడుకుతున్నాయి! ముత్తమ్మ చేటలో ఏరిపిస్తూ ఉండిన బియ్యాన్ని ఎసట్లో వేసింది. కుండమీద మూత పెట్టింది. అయితే, మంట లేకనే కుతకుత ఉడుకుతన్న ముత్యాలు గుండెలపై మూత పెట్టలేకపోయింది.

ముత్యాలు చేతిలో 'అరె' కనక్ కనక్‌మని చెప్పులో దిగబడ్తూ ఉంది. తన బతుకును చెట్టు కిందికి నెట్టినవాడు కనిపిస్తే వాడి గుండెల్లోకి కూడా ఇలీనే దిగబడ్డానన్నట్లుగా!

కాలం గంతులు వేస్తూ ఉంది తనకేమీ పట్టనట్లుగా.

ఆ బాటమీద కార్లు, మోటార్లు పరుగులు తీస్తున్నాయి లారీలు వాటితో పోటీ పడుతున్నాయి. లాగలేక లాగుతుంటే లాగు బండ్లు, తొక్కలేక తొక్కుతుంటే రిక్షాలు కదులుతున్నాయి. అన్నీ కలసి ముత్యాలు మొగాన దోసెడు దుమ్ము కొట్టాయి. చెట్టుకింద కూర్చొని చెప్పులు కుట్టుకునే వేధవ ఇలా ఆలోచించకూడదన్నట్లుగా!

ముత్తమ్మ కూడు వండిన పొయ్యి మీదనే అంత కూర గూడా వండింది. కాళ్ళూ చేతులు కడుక్కొనింది. కూటి కుండను. కూటి చట్టిని చెట్టుబోదె చాటుకు చేర్చింది. ముత్యాలు కూడా పనిముట్లను తోలు సంచిలో భద్రపరిచాడు. రేడియోను ఆపుచేశాడు. రెండింటిని చెట్టుబోదె పక్కకు చేర్చాడు. అప్పుడు ఒళ్ళు విరుచుకొంటూ ముత్తమ్మను ముద్దుగా చూశాడు.

ముత్తమ్మ కూడా ముసిముసిగా నవ్వుతూ - నువ్వేమీ అనుకోనంటే ఒక మాట అడగనా" అనింది.

ముత్తమ్మను వింతగా చూశాడు ముత్యాలు.

"ఏంది మామా ఎప్పుడూ చూడనట్టు నువ్వట్టా కొత్తగా చూస్తా ఉండావే?"

" ఈ పొద్దు నువ్వు మరీ ఇంతగా అడగతా ఉంటే?"

"అదిగాదూ మామా! పొద్దుగూకులూ వంచిన తల అట్టా ఎత్తకుండా రెక్కలు ముక్కలు చేసుకుంటావు గదా? అట్టా మాదిర చెమటోడ్చి సంపాయించిన దుడ్లు ఎత్తుకోనిపోయ్ ఆడ చెల్లించకపోతే నిద్దర పట్టదా మామా?"

"ఈ పొద్దుటి నుంచీ ఇంక తాగబొయ్యేది లేదే?"

"సత్తింగానా మామా!"

"నీమిందొట్టే!"

సేద్యగాడికి కూడా ఒక మగబిడ్డనా అన్నట్లు చెట్టు కింద ముత్యాల్లో ఇంత చైతన్యం వస్తే సహించలేనట్లుగా కర్మసాక్షి కనుమరుగయ్యాడు!

పొద్దుగూట్లో కాదు, ముత్తమ్మ కండ్లల్లో పడింది. ఆ కండ్లు మిలమిలా మెరిసిపోతున్నాయి. తాళిగట్టిన నాటి నుంచి మాట తప్పని తన మగవాడి మాటతో ఒళ్ళు పులకరించింది. మామను ముద్దులతో ముంచెత్తాలని గుండె ఎగిరెగిరి పడింది. అయితే, ఉండేది చెట్లు నీడలో అనుకునేకుందికి అడుగు ముందుకు పడలేదు. అయినా, ముత్తమ్మ ముసిముసిగా నవ్వుకొనింది

రేడియోలో విన్న పాట మనసులో మెదిలి! అవును గదా! అందాలమేడ కాకపోయినా ఇప్పుడు అడ్డంగా ఒక గుడిసే ఉండి ఉంటే? ముత్తమ్మ పెదవుల మీద పువ్వులు పూస్తున్నాయి!

" ఏందే ఎర్రిమోకమూ? నీకు నువ్వే అట్టా నవ్వుకుంటూ ఉండావు. నవ్వు నవ్వు! నవ్విన నాపచేను పండిన నాటికి గదా నా మొగతనం తెల్సేది" అంటూ ముత్యాలు ముందుకు నడిచాడు.

"పొద్దుగూట్లో పడ్తానే అంత చుక్క నోట్లో పడకపోతే ఇల ఇల్లాడి పొయ్యే మణిషి ఇంతగా మాట్లాడ్తా ఉండాడే? ఈ పొద్దుటి నుంచి తాగనని నా మింద ఒట్టేసినాడే? అదే నిజమైతే ఇంకేం? ఇంకైనా పిలకాయిలకు కడుపు చూసి అంత కూడు పెట్టచ్చు" అని ఆలోచిస్తూ ముత్తమ్మ చెట్టుబోదెకు చేరగిలపడింది.

అంతవరకు ఆ చెట్టుకింద బొమ్మరిల్లు కట్టుకొని ఆడుకొంటూ ఉండిన పసిపాప ఉన్నట్లుండి ఆ బొమ్మరిల్లును తుడిపేసింది. ఒక్క లగువులో వచ్చి ముత్తమ్మ మీద వాలిపడింది. తల్లి గుండెల్లో తపన ఆ పసి గుడ్డుకేం తెల్సు? తనకు దొరికిన అవకాశాన్ని హాయిగా అనుభవిస్తూ ఉంది ఆ ఎద మీద.

ఆ అమ్మాయికంటే పెద్ద వాళ్ళు ముగ్గురు కొడుకులు.

అందరికంటే పెద్దవాడు బస్టాండ్‌లో, రైల్వేస్టేషన్‌లో 'బూట్ పాలిష్', బూట్ పాలిష్ అంటూ కాలు ఒక చోట నిలపకుండా తిరుగుతూ ఉంటాడు. తమ బతుకు కొంతకు కొంత పాలిస్ అవుతుందన్న ఆశతో. రెండోవాడు మూటలు మోస్తున్నాడు తండ్రి మోస్తున్న మోత ఎంతో కొంత తగ్గిస్తామన్న సదుద్దేశంతో మూడో వాడు ఒక పెద్ద చెప్పుల ఫ్యాక్టరీలో పని నేర్చుకుంటున్నాడు. కులవత్తికి వారసుడు కావాలన్న పట్టుదలతో!

పొద్దు కుంకితే అందరికీ ఆ చెట్టు నీడే శరణ్యం.

ముత్యాలు ఎక్కడికి పోయాడో? ఎందుకు పోయాడో? ఎప్పుడు తిరిగొస్తాడో ఏమో అని ఆలోచిస్తూ ముత్తమ్మ కొడుకుల కోసం ఎదురు చూస్తూ ఉంది.

ఎవరికోసరం ఎదురు చూడకుండా కాలం గడిచిపోతూనే ఉంది. ముత్తమ్మ ఎద మీద వాలిన పసికూన అలానే కిందికి జారి తల్లి తొడ మీద తలవాల్చి ఎప్పుడో కన్ను మూసింది. అప్పుడు ముత్తమ్మ కొడుకులు ఒక్కొక్కరుగా చెట్టు కిందికి చేరారు. ఆ పూట తమ సంపాదన అమ్మ చేతుల్లో పెట్టారు. అప్యాయంగా ఆమె పెట్టింది తిన్నారు. ఆ తరువాత ముగ్గురూ మూడు దోవలయ్యారు. ఈ విశాల ప్రపంచంలో నడుం వాల్చడానికి జానెడు స్థలం దొరకకపోదులే అన్న ధైర్యంతో అంతవరకు పలచబడిన రోడ్డు మీద ఉన్నట్లుండి మనుషులు గుంపులు గుంపులుగా నడుస్తూ ఉంటే, మొదటి ఆట కూడా ఇడ్సి పెట్టేసినారే? ఈ మొగోడు ఇంకా రాలేదే? యాడికి పోయ్‌నాడబ్బా " అని ముత్తమ్మ వేదన పడ్తూ ఉంటే అప్పుడు ముత్యాలు కాళ్ళీడ్చుకొంటూ చెట్టు కిందికి చేరాడు.

" ఇయ్యాలరవదాకా యాడికి పోయ్యుంటివి మామా? సిల్మాకేమన్నా..."

"ఆ ! మన బతుకులకు అదొగిటే తక్కువ" అంటూ నిట్టూరుస్తూ కూలబడ్డాడు ముత్యాలు.

"నిద్దర పడక లేచింది మొదలుకొని చూస్తా ఉండా. నీ కత ఏందో నాకు అంతు చిక్కలా. నీ తలపాడు నీది కానీ... నువ్వు ముందంత ముద్ద తిను." ముద్దుముద్దుగా పలికింది ముత్తమ్మ.

ఆ మాటతో మారు పలక్కుండా ముత్యాలు పైకి లేచాడు. కాళ్ళూ చేతులు కడుక్కొని కూర్చున్నాడు. ముత్తమ్మ మూకుడు ముందు పెట్టింది. అన్నం వడ్డించింది. తవుడు బుట్టలో తలదూర్చిన గొడ్డులా తలెత్తకుండా తింటున్నాడు ముత్యాలు.

ముత్తమ్మకు ఏం మాట్లాడాలో పాలుపోలేదు. మాట్లాడకుండా ఉండడానికి వల్లకాలేదు. అందుకే -

" పొద్దుగూట్లో. పడేటప్పుడు ఎలబారిపోతివి. ఇయ్యారవదాకా..."

" ఈ పొద్దుటితో ఈ చెట్టుకు, మనకు రుణం తీరి పొయ్యిందే!"

" నువ్వు మాట్లాడే మాట ఏమన్నా బాగుండాదంటావా మామా?"

"బాగాలేదు కాబట్టే గద ఈ పని చేస్తా ఉండేది."

"నువ్వు చెప్పేది బలే బాగుండాదే కత. ఇన్నాళ్ళు బాగుణ్ణింది ఇప్పుడెట్లా బాగలేకుండా పోతుంది?"

"నన్నేమన్నా అంత తిననిస్తావా? లేకపోతే ఈ దెప్పుళ్ళే తినమంటావా?"

అ మాటతో ముత్తమ్మ మూతి ముడుచుకొని కూర్చొనింది. ముత్యాలు వంచిన తలెత్తకుండా నాలుగు మెతుకులు నోట్లో వేసుకొన్నాడు. చేతులు కడుక్కొన్నాడు. మూతి తుడుచుకొంటూ వెళ్ళి చినిగిన సంచిపట్ట మీద చిన్నారి కూతురి పక్కన కూర్చున్నాడు. భవిష్యత్తు ఆశాజనకంగా కనిపిస్తూ ఉంటే వెల్లకిల పడుకొని ఆలోచిస్తూ పైకి చూస్తున్నాడు. చూస్తూంటే ఇన్నాళ్ళుగా తమకు నీడనిచ్చిన చెట్టు కనిపిస్తూ ఉంది. మనసు బాధగా మూలిగింది. ఆ చెట్టు కొమ్మ సందుల్లో నుంచి చూస్తుంటే ఆకాశం విశాలంగా కనిపిస్తూ ఉంది. ఆకాశంలో చుక్కలు తన ఆశలకు అద్దం పట్టినట్లుగా మినుక్ మినుక్ మంటున్నాయి.

తప్తిగా గుండెల నిండుకు గాలిపీల్చుకొన్నాడు ముత్యాలు, ముత్తమ్మ అంత ఎంగిలిపడింది. కుండా చట్టి కడిగి చెట్టు బోదె మాటులో ఒకదానిపై ఒకటి బోర్లించి పెట్టింది. ఈ తరువాత వచ్చి మగని పక్కన కూర్చొనింది "మామా! నా కడుపులో ఏందో చెయ్యేసి దేవినట్లుండాదే!"

"ఎందుకే?"

"రొండోవాడు కడుపులో పణ్ణెప్పుడు గద మామా మనమీ చెట్టు కిందికొచ్చింది. లచ్చణంగా నలుగురు పిలకాయలైనారు. చన్నీళ్ళకు ఏన్నీళ్ళుగా వాళ్ళూ అంతో ఇంతో సంపాయిస్తా ఉండారు. కలిసొచ్చిన చోటు గదా? కాలు ఎలపెరుక్కోని పోవాలంటే నాకేమో అదొకమాదిరిగా ఉండాది మామా!"

"ఒసే పిచ్చిదానా? ఇయ్యారవదాకా ఊరంతా తిరిగింది ఎందుకని?"

"నా కెట్టా తెలిస్తింది మామా?"

"ఇంతకంటే మంచి చోటే ఎతికి పట్నానే?"

"యాడ మామా?"

" బస్టాండ్ పక్కపక్కన్నే, ఇదే మాదిరి చెట్టు చెట్టుకు ఎదురుగుండా సిల్మాకొటాయి. ఈ పక్కా ఆ పక్కా పోలుపుగా ఓటళ్ళు ఇరవై నాలుగు గెంటలూ ఇసికెస్తే రాలని జనం...

"ఈడమాత్రం మనకేం తక్కవయింది మామా?"

" తక్కవనిగాదే తిక్కమొకమా? చెట్టు పక్కనే బాదు. మోకాటిలోతు గుంతలూ, మిట్టలు, ఆ గుంతల నిండుకు జలదారి నీళ్ళు, ఆ నీళ్ళల్లో పందులు పొల్లాడ్తా ఉండాయి. దాన్ని అట్టా చదరం చేసుకోని ఒక చుట్టుగుడిసె ఏసుకుంటే?....

"ఆశకు కూడా ఒక మితం ఉండాలి. అది అయ్యే పనేనంటావా?"

" అదిలోనే అపశకునం కూతలూ... ఈ కుండగోకుళ్ళూ...."

" పీకినా గోకినా నీ మేలుగోరే కద మామా? ఏ పూటకాపూట జానడు పొట్ట పూడ్చుకుండేదే గగనమై పోతా ఉండే మోకాటిలోతు గుంతలు పూడ్సేసి నడుమెత్తు గోడలు పెట్టుకుండేదంటే మాట్లా మామా?"

నిజమే! నీ మాట నేను కాదనలా. అయినా, దిన దినానికి ఊరెంత మారిపోతా ఉండాదో చూస్తానే ఉండావు గదా. ఊరు మారిపోతా ఉణ్ణెట్టు మణుసుల బుద్దులు గూడా మారిపోతా ఉండాయి. యాడజూసినా పాత మిద్దెల్ని పగలగొట్టి కొత్త మిద్దెలు కట్టుకుంటా ఉండారు అట్టా మాదిర పగల గొట్టి ఈదుల్లో కుప్పబోసిన రాళ్లూరప్పల్ని, మట్టిని బండ్లు ముప్పై రూపాయలు కూలీ. నీ ముగ్గురు కొడుకులూ మూడు తట్టలు, నువ్వూనేనూ చెరొక తట్ట చేతికెత్తికుంటే ఎంతసేపే? కూలికి కూలీ గిట్టుతుంది, గుంతలూ పూడ్తాయి."

ముత్తమ్మ నోరు కుట్టేసినట్లు మౌనంగా వింటూ ఉంది.

" ఎట్టుండాదే మన ఐడియా?"

"ఇనేదానికేం బెమ్మాండంగా ఉంది"

"అంటే? చెయ్యాలగద అంటావా? సే! చూస్తానే ఉండు. దినానికి ఎట్టలేదన్నా పది రూపాయలకు తక్కవగాకుండా తాగతా ఉంటినా? ఇప్పుడు నిలపేసినానా? ఆ లెక్కన నెలకెంత మిగులుతుంది మున్నూరు రూపాయలు. ఒక పూట తిని ఒక పూట తినకుండా ఓపికపట్టే నాలుగు కూసాలు, పది వాసాలు, అంత బోదకసువు - గుడిసె లెయ్‌మంటే పైకి లేయ్‌దా?"

"ఎందుకు లెయ్‌దు మామా? బెమ్మాండంగా లేస్తుంది అయితే, చెప్పినట్లు చెయ్యాలగదా?

ఆ మాటతో ముత్యాలుకు ఎక్కడ లేని రోషం పుట్టుకొచ్చింది.

పెనుమూరు ముత్యాలమ్మ సాచ్చిగా, చంద్రగిరి మూలస్తానమ్మ సాచ్చిగా, ఆ కొండమిందుండే ఏడు కొండలోడి సాచ్చిగా, నీ సాచ్చిగా నెల తిరిగే లోపల గుడిసె కడగాలు లెయ్యకపోతే..."

ఒక పుల్లతో నేల మీద పిచ్చిగీతలు గీస్తూ మామ చెప్పే మాటలు అలకిస్తూ ఉన్న ముత్తమ్మ చివుక్కున తల పైకెత్తింది. ఆ నోటి నుండి మాట ఎంత దురుసుగా వస్తుందో తనకు తెలుసు. అందుకే గబుక్కున అరచేత్తో అతడి నోరు మూసింది.

ముత్యాలు అప్యాయంగా ఆమె నడుము పై చెయ్యి వేశాడు. అలాగే పక్కలోకి లాక్కున్నాడు.

ఆ రోజు తెల్లారింది! ఆ చెట్టుకింద కాదు, బస్టాండ్ పక్కన చెట్టుకింద!

తూర్పున పటం ఎగిరింది తొలి వెలుగురేఖలు ఊరి మీద పరుగులు తీస్తున్నాయి చీకటి ఒడిలో నిశ్చలంగా తలదాచుకొన్న ఊళ్ళో చలనం ఊపు అందుకొనింది. కడుపాత్రం తాపత్రయంగా మారింది. వీధుల్లో కదలిక, బస్‌స్టాండులో కదలిక, చెట్లమీద - కలయిక - ఉదయం ఒయ్యారంగా సింగారించుకొని కదలినట్లుంది.

ముత్తమ్మ కోడి కూతతో నిద్ర లేచింది. బుడిగలో నూనె అంత అరచేతిలో వేసుకొనింది. ఉచ్చి మీద తడుముకొన్నట్లు రుద్దుకొనింది. మూడు ముంతల నీళ్ళు నెత్తిన కుమ్మరించుకొనింది.అక్కడక్కడా చిమటలు కొట్టి పాతదైపోయినా పెండ్లికి కొనుక్కొన్న నారపట్టు చీరనే కట్టుకొనింది. తడి ఆరని తల నుండి నీళ్ళు బొట్లు బొట్లుగా పడుతున్నాయి - ముత్యాలు కండ్లనుంచి రాలుతున్న ఆనందబాష్పాల్లా! ఆదరాబాదరా గుడిసింటిని అలికింది. ముగ్గులు పెట్టింది. ఆ ముందురోజు సాయంత్రం ముత్యాలు తెచ్చిన వేంకటేశ్వరుడి పటాన్ని నట్టింట పెట్టింది. పూలు పెట్టింది దీపం వెలిగించింది. అయ్యవారు పెట్టిన లగ్నానికి సరిగ్గా పాలు పొంగించడానికి పొయ్యి రగలిస్తూ ఉంది - ముత్యాలు హడావిడి పడ్తుంటే!

బస్టాండులో టవర్ క్లాక్ ఆరుగంటలు కొట్టింది. అందుకోసమే ఎదురు చూస్తున్న ముత్యాలు వేంకటేశ్వరుడి పటం ముందు 'టప్' మని టెంకాయ కొట్టాడు. కర్పూరం వెలిగించి హారతి పడుతుంటే, ముత్తమ్మ బిడ్డలతో కలిసి పడిపడీ మొక్కింది.

పొయ్యిమీద పెట్టిన పాలు పొంగి 'చుయ్' మన్న శబ్దం వినివించింది.

ఆ గుడిసె గుండెల్లో ఆనందం పొంగి పొరలింది! చుట్టుగుడిసె ఆ గుడిసె ముందర పందిరి. ఆ పక్కన్నే నాలుగు తడికలు అడ్డంగా ఒక పెరడు - ఇంటిల్లిపాది రెండు నెలలు రాత్రనక పగలనక పడిన కష్టానికి ఫలితం - ప్రపంచాన్నే తొలిసారిగా చూస్తున్న అనుభూతి! వాళ్ళ ఆనందంలో వాళ్ళుంటే మనిషి పాలిటీ సైరన్ చెవులు చిల్లులు పడేటట్లు కూతేసింది. " అయ్యో అప్పుడే ఎనిమిదైపొయ్యిందే గెంట" అని ఆత్రతపడ్తూ ముత్యాలు ముగ్గురు కొడుకులు ఎవరి పనులకు వాళ్ళు బయలుదేరారు. వాళ్ళతో కలిసి ముత్యాలూ...

"ఈ పొద్దు ఒక పూట ఇంట్లోనే ఉండిపోరాదా మామా?"

మొగాన్ని చింకిచేటంత చేసుకొని అడగలేక అడిగింది ముత్తమ్మ. ముత్యాలు ముసిముసిగా నవ్వాడు.

"ఎందుకు మామా ఆ నవ్వు?"

"పొగులు మాటలు పనికి చేటు,రేత్రి మాటలు నిద్రపన్నేటు' అని చెప్పింది నువ్వా నేనా?"

ముత్తమ్మ మూడు వంకర్లు తిప్పింది మూతిని.

"రేత్రికి ఎట్టా నిద్దర పన్నేటు తప్పదు గదా... మల్లా ఇప్పుడెందుకులే, అంటా కొంటెగా చూస్తా ముత్యాలు చెట్టు కిందికి చేరుకొన్నాడు. మామ పట్టుదలకు ముత్తమ్మ గుండె తేనెపట్టే అయింది.

ముత్యాలు చెట్టు కింద కూర్చున్నాడు. తోలు సంచి విప్పాడు పనిముట్లు సర్దుతున్నాడు. అనుకొన్నది సాధించిన ఆనందంతో అతని గుండె గూడు విడిచిన గువ్వే అయింది! ఉన్నట్లుండి తలపైకి లేచింది.

చూపు గుడిసె మీద పడింది. రెప్పార్చకుండా గుడిసెను చూస్తూ గుండెల నిండుకు గాలిని పీల్చుకున్నాడు. చిరునవ్వు, పెదవుల మీద చిందులేస్తూ ఉంది. ఇట్లానే ఒళ్ళొంచిపని చేసుకుంటే గుడిసె మిద్దెగా మారేదెంతసేపు' అని అనుకొంటాడు. అంతలోనే చేతిలో పని చెవిపట్టి లాగుతుంది. తలవాలిపోతుంది. ఎడమ చేతివేళ్ల సందున దారం, కుడిచేతిలో 'అరె' పంతాలు పడుతుంటే ముత్యాల సోలుపులా కుట్టు ముందుకు సాగిపోతూ ఉంటుంది. ఆ దినం ముత్యాలుకు క్షణం ఒక యుగంగా గడుస్తూ ఉంది. ఎప్పుడు పొద్దు గూట్లో పడుతుందా? ఎప్పుడెప్పుడు వెళ్ళి గుడిసెలో పడ్తామా? అన్న ఆత్రత!

తలదాచుకోవడానికి ఒక గుడిసె కట్టుకొన్నామన్న తప్తి, ఇంకా ఒళ్ళొంచి కష్టపడ్తే గుడిసె మిద్దెగా మార్చుకోవచ్చు అన్న ఆలోచన. మనసు పూర్తిగా పని మీద లగ్నమైతే పొద్దు గడిచినట్లే తెలయలేదు.

పొద్దు గూట్లో పడింది.

ముత్యాలు మూటాముల్లె సర్దుకొన్నాడు. పనిముట్లను తోలు సంచిలో భద్రపరచుకొన్నాడు. చేతిలో మూట, చంకలో సంచితో పైకి లేచాడు. ఒక్క క్షణం చూపులు గుడిసె మీద నిలచాయి. శుక్లపక్షం. త్రయోదశి నాటి వెన్నెల. ముత్యాలు గుండెల్లోని ఆనందాన్నే నేల మీద నుంచి నింగికి వెదచల్లినట్లయింది. ఆ వెలుగు వాగులో తన చుట్టూ గుడిసె పూల తెప్పలా తేలుతున్నట్లనిపించింది. తనకు తెలియకనే కాళ్ళు గుడిసె వైపు తేలిపోతున్నాయి. గుడిసె చేరుకొనేటప్పటికి ముత్తమ్మ ముసిముసిగా నవ్వుతూ ఎదురొచ్చింది. ఒక చేత్తో చేతిలో మూటను, ఇంకొక చేత్తో చంకలో సంచిని అందుకొనింది. ఇద్దరూ గుడిసెలోకి నడిచారు - జంట గువ్వల్లా!

ఆ పూట ముత్తమ్మ ముగ్గురు కొడుకులకు మూడు వేళలా రెండు కూరల్తో కడుపులు చూసి కూడు పెట్టింది. తలా రెండు రూపాయలు చేతిలో పెట్టి 'సిల్మాకు పొండిరా' అనింది. వాళ్ళు పలువులు విప్పిన దూడలే అయ్యారు. అప్పటికే ముద్దుల కూతురు ఎప్పుడూ లేని గోరుముద్దల రుచిని అనుభవించి హాయిగా నిద్రపోతూ ఉంది.

అప్పుడు ముత్తమ్మ, ముత్యాలు ఒకరికి ఎదురుగా ఒకరు కూర్చున్నారు. ఒక మూకుడులోనే కూడు నంజి నంజి తింటూ ఒకరికొకరు తినిపించుకొంటూ మధ్య మధ్య ముసిముసినవ్వులు నంజుకొంటూ కొత్త దంపతులను మరిపించారు. గుడిసె వాకిలికి తడికె తలుపు అడ్డంగా పెట్టారు. ఆ ముందు రోజు కొని తెచ్చుకొన్న కొత్త చాప పరుచుకొన్నారు. పడుకొన్నారు. ఏ చెట్టు కిందనో అటొకరు ఇటొకరుగా పడుకునేవాళ్ళు ఇన్నాళ్ళకు, ఇన్నేండ్లకు ఒకరి పక్కన ఒకరుగా, ఒకరి చేతుల్లో ఇంకొకరుగా ఇద్దరిమధ్య గాలి దూరనంతగా గాఢంగా!... ఆ రాత్రి ఆ గుడిసెలో ఆనందం అణువణువునా విస్తరించింది. ఆ రోజు కూడా తెల్లారింది!

అయితే, చాలా కాలంగా జబ్బు వాతపడి నాలుగు గోడల మధ్య నలిగిన మనిషి ఉన్నట్లుండి వెలుతురును చూసినట్లు, ఆ దంపతుల ఆనందం గుడిసింటి ముంగిట ముత్యాల ముగ్గులు పోసింది.

★ ★ ★

ముత్యాలు చెట్టుకింద కూర్చున్నాడు. భావ స్ఫోరకంగా కుదిరిన కవితను కవి మాటిమాటికి చదువుకొన్నట్లు, చూడ ముచ్చటగా చిత్రించిన చిత్రాన్ని చిత్రకారుడు తనివితీరా చూసినట్లు ముత్యాలు ఒక్కసారి గుడిసెను చూశాడు. స్పష్టమైన చిరునవ్వు పెదాల మీద చలిస్తూ ఉంటే ఆ కండ్లతోనే బుల్లి రేడియోను చూశాడు. రెండు చేతులతో జవురుకొని ముద్దు పెట్టుకున్నాడు. తనకు ప్రేరణ ఇచ్చినందుకు కృతజ్ఞతగా ముందు పెట్టుకొన్నాడు. మనసులో ఏదో అమాయకమైన విజయానందం అంతరంగం మేలుకొనింది. పట్టుదల పెరిగింది. పని జోరు హెచ్చింది.

ముత్తమ్మ గుడిసెలో అప్పుడే ఇంట్లో అడుగు పెట్టిన కొత్తకోడల్లా అటు ఇటూ తిరుగుతూ సర్దిపెట్టిన మూకుడు ముంతనే మళ్ళీ మళ్ళీ సర్ది పెడ్తూ ఉంది.

కాలచక్రగమనంలో సూర్యకిరణాలు చురుక్కు చురుక్కుమంటున్న వేళ! "ఎవర్రా లోపల?"

ఆ గద్దింపుతో అదిరిపడింది ముత్తమ్మ. చేతిలో ముంత జారి కిందపడింది. మూడు వొప్పులయింది. అదేమీ పట్టించుకోకుండా గబగబ గుడిసె బయటికి వచ్చింది. వచ్చింది. వచ్చినట్లే కదిలీ మెదలకుండా నిలబడింది, కంటి మీద రెప్ప పడకుండా చూస్తూ!

ఎదురుగా పోలీస్ ఇన్‌స్పెక్టర్ నలుగురు పోలీసులతో రోడ్డు మీద పోలీస్ వ్యాన్.

ముత్తమ్మకు అంతా అయోమయంగా ఉంది. ఒకసారి ఇన్‌స్పెక్టర్ని, ఇంకొకసారి పోలీసుల్ని, మరొకసారి పోలీస్ వ్యాన్‌ను మార్చి మార్చి చూస్తుంటే -

"ఏందే అలా చూస్తున్నావ్? ఎక్కడే నీ మొగుడు?" డీజల్ ఇంజన్ కూతలాగా గీ పెట్టింది ఇన్‌స్పెక్టర్ గొంతు.

ముత్తమ్మ గుండెలు అదిరాయి. ఆ అరుపుతో పూరిగుడిసె కప్పు పైకెగిరి పోతుందేమో అనిపించింది. ఆమె పిచ్చి చూపుల్తో కలపడానికి కన్నీళ్ళు తొందర పడుతున్నాయి!

"ఏమిటా చూపులు? అడిగేది నిన్నేనే?" రెక్కమాని ముందు ఆగిన రైలు కూతలా రెట్టించిందా గొంతు.

నాలుక తడి ఆరింది. పెదాలు ఎండి పోతున్నాయి. ఎంత ప్రయత్నించినా మాట పెగలడం లేదు. ఎండిపోతున్న పెదాల్ని తడుపుకోవడానికి తంటాలు పడ్తూ, మాటిమాటికి చెట్టు వైపు చూస్తూ, చెట్టుకింద.... చెప్పలు కుట్టుకుంటూ... చెప్పలేక చెప్పింది మాటల్ని తుంచి తుంచీ ముత్తమ్మ!

"పిలువ్ వాణ్ణిలా!"

పిలుపు అవసరం లేకనే ముత్యాలు అక్కడికి పరుగుల మీద వచ్చాడు, గుడిసె ముందు పోలీసు అవతారాలు కంటపడేసరికి.

"ఏరా? ఎవడ్రా నిన్నిక్కడ గుడిసె వేసుకోమనింది?"

"రేడియో వాళ్ళయ్యా."

ఆ మాటతో విరగబడి నవ్వాడు ఇన్‌స్పెక్టర్.

అతడు ఎందుకలా నవ్వుతున్నాడో అర్థం కాకుండా ముత్యాలు, ముత్తమ్మ అయోమయంగా ఒకరిమొగం ఒకరు చూసుకొంటున్నారు.

"ఆకాశవాణి అనుమతించిందనలేదు, అంతవరకు నయమే."

ఆ వ్యంగ్యాన్ని అర్థం చేసుకొనే స్థితిలో లేడు ముత్యాలు. పోలీసులు మాత్రం ముసిముసిగా నవ్వు కొన్నారు. ఇన్‌స్పెక్టర్‌గారి చమత్కారాన్ని అభినందిస్తున్నట్లుగా.

"గంట టైమిస్తున్నా. కుండా చట్టీ చేత పట్టుకొని కుదురుగా బయటికి నడు. లేకుంటే మా వాళ్ళే ఆ పని చేస్తారు."

పోలీసు దర్పం బుసలు కొట్టిందా మాటల్లో.

"అయ్యా! అయ్యా! పందులు పొల్లాడ్తా ఉణ్ణె బురదగుంటలు... రేత్రనక పొగులనక ఒక్క దినమా? రొండు దినాలా? రొండు నెలల పాడగనా నేను, మా ఆడది, ముగ్గురు బిడ్డలు - కడుపు గట్టి, కన్నగసాట్లుపడి, ఏసుకున్న గుడిసె..." ముదురు మొగంలో అలిసిన కండ్లల్లో కన్నీటి బొట్లుగా రాలాయి మాటలు.

"మాతో చెప్పుకొని ఏం ప్రయోజనంరా! వెళ్ళి ఆ రేడియో వాళ్ళతో చెప్పుకో. వినకపోతే నష్ట పరిహారానికి కోర్టుకు కూడా పోవచ్చు!"

ఎంత ఎకసెక్కెమో ఆ మాటల్లో?

ఎగ్గొట్టుకొస్తున్న ఏడుపును దిగమింగుకొంటూ ముత్తమ్మ తట్టాబుట్టా బయటికి తెచ్చి పెడ్తూంటే-

"నీకెందుకే అంత తొందర నీయమ్మా నాయాలి ముండా" అంటూ ముత్తమ్మ చేతిలో కుండను పెరుక్కొన్నాడు. అంతే! బూటుకాలు ముత్యాలు వీపు మీద విరుచుకుపడింది. 'అమ్మా' అంటూ బోర్లబొక్కల పడ్డాడు ముత్యాలు. చేతిలో కుండ వొప్పులొప్పులైంది.

ఇంకొకడి చేతిలో లాఠీ కర్ర పైకి లేచింది.

ముత్తమ్మ అడ్డపడింది.



"అయ్యా! అయ్యా! ఆయన్ను ఏమీ అనకండయ్యా! నేను ఎప్పుడో నెత్తిన నోరు పెట్టుకొని మొత్తుకుంటి, ఎవరు యాడ ఉండాల్నో ఆణ్ణే ఉండాలని. చెప్తే చెవుల్లో ఏసుకోకపాయ. అది ఆడదో, గాడిదో చెప్పిన మాట ఇనిపించుకోక పొయ్యిందానికి ఇప్పుడు అనుబవించాల్సి వచ్చె అయినా, మా బోటి పేదోళ్ళు ఏం చెయ్యగలగతారయ్యా కొట్టే ఏడ్చేది తప్పిస్తే! ఈ ఇంద్రబవనాన్ని కాళీ చేసేదానికి గెంట ఎందుకులేయ్యా" అంటూ ముత్తమ్మ మాటల్ని కన్నీళ్ళతో కలగలిపింది.

అర్ధగంట లోపుగానే చెట్టు కింద బతుకులు చెట్టు కిందికే చేరాయి.

అర్ధగంటకు ముందు ఆ గుడిసె ముందు ఆగిన పోలీస్ వ్యాన్‌లో నుంచి పోలీసులు దిగారు పోలీస్ వ్యాన్ అలా వెళ్ళేసరికి ఇలా వచ్చి ఆగిన వ్యానులో నుంచి ప్లాస్టిక్ టిన్నులు, పీపాలు దిగాయి. ఒక పక్క టిన్నులు, పీపాలు దిగుతూ ఉంటే, ఇంకొకపక్క సేల్స్ కౌంటర్ తయారయింది. సాయంకాలంలోగానే లగ్నాలు, పూజలతో నిమిత్తం లేకుండా ఆ గుడిసెకు ఎదురుగా బాటకు పక్కగా 'ప్రభుత్వ సారా దుకాణం' అన్న బోర్డు వెలిసింది.

ముత్తమ్మ, ముత్యాలు చెట్టు కింద చేతులు ముడుచుకొని కూర్చొని ఆ గుడిసెను చూసినంత సేపు చూశారు నిస్సహాయంగా. పేగు తెంచుకొని బయట పడ్డ పిండం మరలా తల్లి గర్భం చేరలేనట్లు వాళ్ళు ఆ గుడిసెలోకి పోలేరని తెలుసు. అయినా, తొట్టి మరులు వదలలేదు. రెప్పార్పకుండా ఆ గుడిసెను చూస్తుంటే గుండెల్ని రెక్కల పురుగులు తొలుస్తున్నట్లు బాధ. తట్టుకోలేకుండా ముత్యాలు తలవాలిపోయింది మోకాళ్ళ సందుల్లోకి మూగగా రోదిస్తున్నాడు. చెట్టుబాదెకు చేరగిలబడి ముత్తమ్మ అశోకవనంలో సీతమ్మను తలపింపచేస్తూ ఉంది. వాళ్ళ బాధను చూడలేనట్లుగా కర్మసాక్షి కనుమరుగయ్యాడు.

కృష్ణపక్షం. చీకటి తన యాత్రకని బయలు దేరింది. గంట గడవకముందే తిరుగుముఖం పట్టింది, విదియ చంద్రుడు అడ్డు పడడంతో. వెలుగు వెన్నెల పాలనురుగులా లోకమంతా విస్తరించింది. ముత్యాలు ఉన్నట్లుండి తలపైకి లేపాడు. గుడిసె తట్టు చూశాడు. శుక్లపక్షంలో త్రయోదశినాటి వెన్నెల్లో పూల తెప్పలా కనిపించిన తన గుడిసె ఇప్పుడు తల విరబోసుకొన్న దయ్యంలా కనిపిస్తూ ఉంది ఒక్క ఊపులో పైకి లేచాడు. కండ్లు చింతనిప్పుల్లా మండుతున్నాయి. అటూ ఇటూ చూశాడు. లోకం తన పని తనదిగా సాగిపోతూ ఉంది. చెట్టు కిందికి చూశాడు. ఏడ్చిఏడ్చి నీరసించి ఇక ఏడవడానికి కూడా ఓపిక లేక ముత్తమ్మ చెట్టుబోదెకు చేరగిలపడింది. చిన్నది తల్లిగుండెల మీద బల్లిలా హత్తుకొని నిద్రపోతూ ఉంది. కొడుకులు ఇంకా చెట్టుకిందికి చేరలేదు. ముత్యాలు గబామని వంగి సంచిలో మూటకట్టి పెట్టిన దుడ్లు తీసుకొన్నాడు. ఒక్క ఊపులో గుడిసె ముందుకు చేరుకున్నాడు.

మూట విప్పాడు. దుడ్లు ఇచ్చాడు. ఒకటీ, రెండూ, మూడు. పొట్లం మీద పొట్లం గుటగుట తాగేశాడు. అప్పుడు గుడిసెకాదు, గుడిసెలో మనుషులు వాణ్ణి గుర్తించారు ఒకరి మొగం ఒకరు చూసుకొన్నారు. చూపులు కలిశాయి. తలలు పంకించాయి ప్రతిబంధకాన్ని తొలగించుకోవడమే మంచిదన్న ఆలోచన కార్యరూపంలోకి దిగింది. పొట్లం మారింది. అది కల్తీసారా! ముత్యాలు గమనించే స్థితిలో లేడు. చేతిలో దుడ్లున్నంత వరకు తప్ప తాగాడు. గిరక్కున వెనక్కు తిరిగాడు. తూలుతూ పడ్తూ లేస్తూ నడుస్తున్నాడు.

ఆ స్థితిలో ముత్యాలుకు బూటుకాలితో తన్నిన పోలీసు గుర్తుకొచ్చాడు. లాఠీ కర్ర పైకెత్తిన పోలీసు కనిపిస్తున్నాడు. కల్తీసారా కడుపులో లేపిన మంట గుండెల్లోకి పాకింది.

ఒరే పోలీసోడా! నేను దిక్కూదరీ లేని యదవననే అనుకో. నన్ను కొట్టేదానికి లాఠీ కట్టి పైకెత్తితిరే? ఆ కట్టె నువ్వు ఎట్టాపట్టుకుంటా ఉండావో తెల్సా నీకు? ఒకసారి చూసుకోరా! హ్హా హ్హా హ్హా!" నవ్వినంత సేపు నవ్వాడు ముత్యాలు. నవ్వు ఏడుపుగా మారింది.

"ఒరే! ఎగిరి ఎడం కాల్తో తంతివే? ఆ నీకాలికి బూట్సులు కుట్టింది ఎవుర్రా?.... నేను నీకాలికి దెప్పరం తగలకుండా నీడిస్తే - నువ్వు నా తలకాయ మింద నీడ పెరుక్కుంటావా? మీకంటే గొడ్లు మేల్రా. చచ్చినా గూడా మా చేతికి పని, మీ కాళ్ళకిందికి చెప్పులిస్తా ఉండాయి. ఆ నోర్లేని గొడ్లు అవసరం ఉంటేనే అపకారం చేస్తాయి. మీరట్లా కాదు గదరా? కలిగినోళ్ళ కాళ్ళు పట్టుకుంటారు. లేనోళ్ళ జుట్లు పిడేసి పట్టుకుంటారు. అవునుగదా! కొట్టినా కోసినా మాకెవురుండారని గదామీ దిమాకు" అని ఏడుస్తూ బోర్లబొక్కలా పడ్డాడు ముత్యాలు .

లేచేదానికి ప్రయత్నిస్తాడు. లేవలేడు. లేవలేక ఏడుస్తాడు. ఏడుస్తూ లేచేదానికి ప్రయత్నిస్తాడు. లేస్తూ పడిపోతాడు. పడిపోతూ ఏడుస్తాడు. ఆ స్థితిలో పొడుగు పొడుగు నామాల అయ్యోరు గుర్తుకొచ్చాడు.

ముత్యాలు ఒక్క ముంపులో పైకి లేచాడు. అయ్యవారి రెండు భుజాలను ఒడిసి పట్టుకొన్నట్లుగా పిడికిళ్ళు బిగించి -

చెప్పు అయ్యోరా చెప్పు. నీ పాత చెప్పులు కుట్టిస్తా పైసా తీసుకుంటినా? లేదే? మరి నువ్వు పెట్టిన లగ్గణం ఏమాయ? సరిగ్గా నువ్వు పెట్టిన లగ్గణానికే గుడిసెలో పాలు పొంగిస్తినే? అదేం లగ్గణం అయ్యోరా? దినం మారకనే దానికీ నాకు రుణం తీరిపాయనే? నువ్వు గూడా నాకు ఇట్టా మాదిర అన్యాయం తలపెట్టచ్చునా? పోనీ, నువ్వు చెప్పిన కతలన్నీ ఏమాయ? కతలు కంచికి నేను చెట్టుకిందికి అయిపాయనే బతుకు? తక్కువ జాతోడని నువ్వు గూడా నన్ను తక్కువ చూపు చూసినట్టుండదే? లేకపోతే ఇట్టా ఎందుకవుతుంది అయ్యోరా?" నోటికి వచ్చినట్లు వాగుతూ, పడ్తూ లేస్తూ, పడుతూ, నవ్వుతూ ఏడుస్తూ ఏడుస్తూ నవ్వుతూ, ఏడవలేక నవ్వలేక పండ్లు పట పట కొరుకుతూ ముత్యాలు చెట్టుకిందికి చేరాడు.

"ఇరవై ఒకటో శతాబ్దం ఆరంభంలోనే మానవుడు చంద్రమండలం మీద స్థావరం ఏర్పరచుకోవడానికి వీలవుతుంది. ఈ అణుకేంద్రంలో శాస్త్రజ్ఞులు అది సాధించడానికే అహోరాత్రాలు కృషి చేస్తున్నారు అని అణు శాస్త్ర కేంద్రాధికారి మొన్న జరిగిన విలేకరుల గోష్ఠిలో తన విశ్వాసాన్ని స్పష్టంగా వెలిబుచ్చారు."

అంతకు ముందే చెట్టు కిందికి చేరిన ముత్యాలు కొడుకులు రేడియో పెట్టుకుంటే వార్తలు వినిపిస్తున్నాయి. ఎగిరి ఒక్క తన్ను తన్నాడు ముత్యాలు. బంతిలా ఎగిరి చెట్టు బోదెకు తగిలి, బుల్లి రేడియో ముక్కలు ముక్కలైంది.

ఆ శబ్దంతో ఎగిరి పడి లేచింది ముత్తమ్మ.

ముక్కలు ముక్కలైన బుల్లి రేడియోలా ముత్యాలు ఆ చెట్టుకింద కుప్పగా కూలిపోయాడు. అది కంటపడేసరికి ఆమె గుండె చెరువయింది. చివ్వులా లేచింది.

వెళ్ళి అతని పక్కన కూర్చొనింది. వాలిపోయిన తలను ఎత్తి తొడమీద పెట్టుకొనింది.

ముత్యాలు ముత్తమ్మ మొగంలోకి వెర్రిగా చూస్తున్నాడు!



''మామా! మనం రెక్కలు ముక్కలు చేసుకొని చెమటోడ్చి కట్టుకుణ్ణె గుడిసెను పెరుక్కుణ్ణారేకానీ, మన చెమటను పెరుక్కుండేదానికి ఏ యదవ తరమవుతుంది మామా? ఇన్నేండ్లుగా కడుపులో పెట్టుకొని కాపాడిన చెట్టునీడ ఉండానే ఉండాది. దీని కెందుకు మామా ఇంత యాదన పడ్తా ఉండావే?''

ముత్తమ్మ సముదాయించే ప్రయత్నం చేసింది.

''ఓసే పిచ్చి మొకమా! హ్హాహ్హాహ్హా! యాదనా? ఎందుకే? యాదనాలే, ఇచారమూలే. ఇప్పుడు ఏమైపోయిందని విచారపడాల? హుఁ! ఇదిగాకుండాబోతే దీనెబ్బట్టాంటిది, యాడ? అడ! ఊఁ! చంద్రమండలం మింద ఇయ్యారవదాకా రేడియోలో చెప్పినారే! ఇన్లేదంటే నిద్దరమొకమా? ఇంకమిందటా, ఆఁ! మణుసులు చంద్రమండలం మింద గూడ ఇండ్లేసుకోవచ్చుంట! హ్హిహ్హిహ్హి! అందుకేనే పోతా ఉండా, అందురికంటే ముందుగా. ఈడెట్టా ఎనకబడిపాయ్ ఏడస్తా ఉండాం. ఆడికైనా ముందుముందుగానే పోతే, గుడిసిల్లా? ఎందుకే ఏకంగా మిద్దిల్లు కట్టుకుండేదానికే. జాగా, యాడ? అడ! చంద్రమండలం మింద!....

ఎక్కిళ్ళు మీద ఎక్కిళ్ళు. ఎడతెరపిలేకుండా వస్తున్నాయి. ముత్తమ్మ తలమీద ఎక్కిళ్ళు ఎడతెరపిలేకుండా వస్తున్నాయి. ముత్తమ్మ తలమీద తట్టింది. గొంతుమీద రుద్దింది. ఎద మీద నిమిరింది. ముంతతో నీళ్ళు తాగించే ప్రయత్నం చేసింది. ఎంత ప్రయత్నించినా గొంతులోకి పోలేని నీళ్ళు దవడల మీద జారిపోతున్నాయి. 'మామా! మామా' అని పిలుస్తూనే ఉంది. అంతలోనే తేల గుడ్లు పడ్డాయి. పండ్లు గిట్టుకున్నాయి. ముత్యాలు తల ముత్తమ్మ తొడ మీద వాలిపోయింది.

ముత్యాలు గుండెల పై ముత్తమ్మ, చుట్టూ కొడుకులు. ఆ చెట్టుకింద కాకి శోకం.

పోలీస్ స్టేషన్‌లో సారా కాంట్రాక్టర్ మూర్తి కృతజ్ఞతాభావం డబ్బుగా మారి ఇన్‌స్పెక్టర్ జేబులో చేరి చేతులు మారితే గుడిసెలే కాదు, గుండెలు తీసే శక్తి తనదని విర్రవీగుతూ ఉంది.

''నెలనెలా మామూలు మామూలే గదా'' అంటూ కాంట్రాక్టర్ ఇన్‌స్పెక్టర్ చేతులు కలుపుకొన్నారు.

పాలపుంత మీద ఒక ధూళి రేణువు ఫక్కుమని నవ్వింది.

(ఇండియాటుడే, సెప్టెంబర్, 21.1999)

18

# అరిటాకులు

## చల్లపల్లి స్వరూపరాణి

'ఒరే! పనమటేపున సీతారామయ్య గోరోకేటూ..... ఆళ్ళ మనవరాలుని మన రమేషుగోడు తీసుకు పోయేడంటరా...! అన్నాడు నాగరాజు ఏసుబాబుతో

'ఎవుర్రా యమ్మాయి...? మన బల్లో వచ్చే శిరీష నా.... కాకపోతే ఆ యమ్మాయితో వుండే లావణ్య నా....?' అడిగాడు ఏసుబాబు వుత్సాహంగా.

'ఓర్నాయనా! నాకు మన పల్లెలో ఆడపిల్లల పేర్లే తెలియవు సరిగ్గా. నీకా వూళ్లో ఆడప్లిలల పేర్లు ఎట్టా తెల్సినయిరా....?' ఆశ్చర్యపోయాడు నాగరాజు.

'అట్టను కొంటే నాడు మాత్రం మన పల్లిలో మొగ పిల్లల పేర్లు తెల్సా ఏంది...? ఆడపిల్లలైయ్యయిత్ మన చుట్టు వక్కల వూళ్ళోళ్ళయి కూడా తెల్సు...! బడ్డాయి పోతూ అన్నాడు.

'సర్లే గానీ ఆ పిల్ల పేరు శిరీష ననుకుంటా మనోడు కాల జీకొచ్చిందాన్ని అటు సుంచట్ తీసుకోపోయేడంట యిపుడు వూళ్ళో ఈ సంగతి బెల్లం వుడికినట్టు వుడికి పోతందిరా...!'

రమేష్ నాగయ్య రెండో కొడుకు. పెద్ద కొడుకు లాజర్ బుద్ధిగా చదువుకొని విజయవాడ దగ్గర పల్లెటూర్లో 'టీచర్‌గా పని చేస్తున్నాడు రమేష్ తెనాలి వియస్సార్ కాలేజీలో బియస్సి రెండో సంవత్సరం చదువుతున్నాడు. యింటి నుంచి డెయిలీ సర్వీస్ చేస్తాడు. రమేష్ తర్వాత యిద్దరాడ పిల్లలు సబిత, తబిత. సబిత పొన్నూరు గర్ల్స్ కాలేజిలో ఇంటర్ మొదటి సంవత్సరం చదువుతూ రోజూ కాలీజీకి బస్‌లో వెళ్ళి వస్తుంది. తబిత వున్న వూర్లోనే జిల్లా పరిషత్ హైస్కూల్లో పదో క్లాస్ చదువుతుంది.

నాగయ్య తండ్రి కాలం నుంచే కులీనాలీ చేసుకునే సంసారం వాళ్ళది అతని తండ్రి పిచ్చయ్య రైతుల దగ్గర జీతం వుండేవాడు. వాళ్ళు సంవత్సరానికి పది బస్తాల వడ్లు, జత బట్టలు యిచ్చేవాళ్ళు. అతని తల్లి సువార్తమ్మ కూడా వూళ్ళో పాచి పని చేస్తూ వాళ్ళిచ్చిన కళ్ళాలు వూడ్చుకుని చాలీ చాలని బతుకులు ఈడ్చేవాల్ళు. నాగయ్య తల్లి దండ్రులు ఒక్కడే సంతానం కావడంతో ముసలి తల్లి దండ్రులు, తనూ, తన భార్య భాగ్యం, పిల్లలు కలిసి ఉమ్మడి సంసారంగా వున్నారు. నాగయ్యకు వెనకా ముందు ఆస్థిపాస్థులు లేకపోయినా చాల కష్టం మీద బతుకీడుస్తూనే పిల్లల్ని నలుగుర్ని చదివించుకుంటున్నాడు. తన యింటి పేరు గల వాళ్ళు పల్లెలో ఎవరెవరో. తండ్రి పిచ్చయ్య వేరే

వూరు నుండి బతకడానికి ఆవూరొచ్చి అక్కడ స్థిరపడిపోయాడు. ఒంటి గాడయినా నాగయ్య నెమ్మదస్తుడిగా పేరు తెచ్చుకొని యిరుగూ పొరుగూ వాళ్ళతో కలిమి గోలుగా వుంటూ వచ్చాడు.

నాగయ్య ఒకింటి వాడై సంసార భారం అతని నెత్తిన పడే నాటికి వూర్లో పరిస్థితులు కొంత మారిపోయాయి. వూర్లో రైతులు ఎవరొ సొంతగా వ్యవసాయం చేసుకోవడం ఏదో అందరూ పిల్లల చదువుల కోసమని, వ్యాపారాలని చెప్పి గుంటూర్, విజయవాడ, హైదరాబాద్‌ల్లో కాపురాలు పెట్టారు. ఏవో కొన్ని కుటుంబాలు తప్ప చాలామంది పొలాలు కౌలుకిచ్చి యింటెడు గొట్టుని అయ్య సిలకంత యింటిలో ముసిలీ, ముతకనీ వాళ్ళ మానానికి వాళ్ళని వదిలేసి రెక్కలు కట్టుకొని పట్టణాల వైపు ఎగిరిపోయారో. వాళ్ళు సంవత్సరానికోసారి వచ్చి కౌలు వవసూలు చేసుకుపోతూ అప్పుడప్పుడూ వూళ్ళో జరిగే పెళ్ళిళ్ళకీ, పేరంటాలకీ తళుక్కు మనడం తప్ప వూరితో సంబంధాలు పెద్దగా కొనసాగించడం లేదు. ఎప్పుడూ కోళ్ళూ గొడ్లతో కళకళలాడే గొడ్ల చావిళ్ళు యిప్పుడు కోళ్ళ ఫారాలుగా రూపాంతరం చెందాయి. కొన్ని చావిళ్ళ స్థానంలో చాకలి వాళ్ళు రాతిగోడ యిళ్లు కట్టుకున్నారు. చావిళ్ళ దగ్గర చిన్న చిన్న మంచాలు వాల్చుకొని వూళ్ళో రాజకీయాలు చర్చించుకునే పనికి వాళ్ళు యిళ్ళల్లోకి చేరారు. పాలకేంద్రం దగ్గర, రేడియో రూం దగ్గర గుంపులు గుంపులుగా చేరి చీట్ల పేకలాడే యువతరం పలచబడి పోయింది. కొందరు పట్నాల్లో క్లబ్బులకు బార్‌లకు బదిలీ అవగా మిగిలిన వాళ్ళు కొందరు ప్రైవేట్ టీవీ చానళ్ళ, గ్యాస్ కనెక్షన్ల డీలర్లగా, కొందరు ఫైనాన్స్ కంపెనీలు నడుపుతూ బిజీ అయి పోయారు. మొత్తానికి అందరూ కలిసి బురద అంటకుండా ఎండకు ఎండకుండా సుఖంగా డబ్బు సంపాదించడం కనిపెట్టారు. పావరోలమీదా, పాచి పనులు చేసే పని మనుషుల మీద కర్ర పెత్తనం చేసే పెద్దింటి ఆడవాళ్ళు టీవీల ముందో చతికిల పడ్డారు.

వూరులో పాటు వాడకూడా కాలానుగుణంగా మార్పు చెందింది. రైతుల దగ్గర పాలేర్లుగా, జీతగాళ్ళుగా వుండే స్థితినుంచి వ్యవసాయ కూలీలుగా, కౌలుదార్లుగా పల్లె జనం పరిణామం చెందారు. వ్యవసాయ కూలీల పరిస్థితి ఎక్కడ వేసిన గొంగడి అక్కడనే అందన్నట్టుంది. కౌలుదార్లు గా మారిన వారు పండిన పంటలో కౌలుకు పోను తిండికి కొంత మిగిల్చుకొని సంవత్సరమంతా నిశ్చింతగా బతకగలిగే స్థితికి ఎదిగారు.

పల్లెలో బుటినిట్టాడి యిండ్ల స్థానంలో రాతిగోడల యిళ్ళు పెంకుటిళ్ళు వచ్చాయి. వూరికీ వాడకీ మధ్య సరిహద్దుగా వున్న చర్చి ఎలిమెంటరీ స్కూలు దగ్గర అంబేద్కర్ విగ్రహం వెలసింది. పల్లెలో పీ.జీ చదువుతున్న వాళ్ళు ఐదారుగురు వుంటే, ఇరవై మంది దాకా డిగ్రీలు చదువుతున్న వాళ్ళు, యింటర్ చదివేవాళ్ళు వున్నారు. ప్రతి సంవత్సరం ఏప్రిల్ పద్నాలుగన క్రిస్మస్ పండుగంత ఘనంగా జరుపుతున్నారు చదువుకన్నా యువకులు, అద్దెవల్లి అరవయ్యో నంబర్ చీరలు కట్టే ఆడవాళ్ళు చాలా మంది వాయిల్ చీరల్లోకి దిగారు. చింపిరి జుట్టుతో పేడకళ్ళకోసం బుట్టలు తీసుకొని రోలల దగ్గర పడిగాపులు  పడే పల్లెలో ఆడపిల్లలు నున్నగా తల దువ్వుకొని ముద్దుగా ఆకుపచ్చ లంగా, తెల్ల జాకెట్ వేసుకొని స్కూలు కెళ్తున్నారు. కొన్ని సంవత్సరాలుగా వూళ్ళోకి బస్ సౌకర్యం వున్నా దళిత వాడ దగ్గర ఆగేదికాదు. యిప్పుడు అంబేద్కర్ బొమ్మ దగ్గర బస్ షెల్టర్ ఏర్పడింది.

కుల వృత్తుల్ని నమ్ముకొని యిన్నాళ్ళూ బతుకీడుస్తున్న మాదిగ, చాకలి, మంగలి కులాల వాళ్ళు చాలావరకు తమ వృత్తుల్ని వదులుకోక తప్పలేదు. మాదిగ యిళ్ళ ముంగిట్లో వుండే పనిరాళ్ళు అదృశ్యమైపోయాయి. వాళ్ళు కూడా పక్కన వున్న మాలోల్లలా వ్యవసాయ కూలీలుగా కౌలుదార్లుగా మారారు. మాలల కంటే తక్కువ సంఖ్యలోన నయినా చదువుకునే మాదిగ పిల్లల సంఖ్య పెరిగింది. చాకలి, మంగలి కులాల్లో దళిత వాడతో పోలిస్తే చదువుకునే వాళ్ళు చాలా తక్కువ. చాలామంది మగపిల్లలు పదో క్లాసులో చదువు మానేసి పక్కటూళ్ళలలో మెకానిక్ షెడ్డులలో పనికి కుదురుకొన్నారు. పెద్దవాళ్ళు కొంతమంది వ్యవసాయ కూలీలుగా, కౌలదార్లుగా మారారు. ఆర్థికంగా, విద్యాపరంగా చాకలి, మంగలి కులాలు మాల, మాదిగలకన్నా వెనకబడినా సాంఘిక హోదాకు తమని తాము అధికులుగానే భావించేవాళ్ళు.

గ్రామంలో యిన్నే మార్పులు వచ్చినా గ్రామ సర్పంచ్ పదవి మాత్రం వూరి గడప దాటి వాడలోకి అడుకు పెట్టలేదు. పార్టీలు మారాయి. సర్పంచ్ పదవి తూర్పు వైపు ఆసామిల నుంచి పడమటి వైపు ఆసాముల చేతుల్లోకి మళ్లీ పడమటి నుంచి తూర్పుకి బంతిలా ఎగురుతుంది. కానీ కింద పడడం లేదు. వాడంతా ఏదో ఒక పార్టీకీ ఓటు బ్యాంకు అనుకోడానికి యిప్పుడు వీలు కాకుండాపోయింది. దళితులకు పొలాలు కౌలుకిచ్చే వాడు ఏ పార్టీకి ఓటు వెయ్యమంటే ఆ పార్టీకి వెయ్యక తప్పడంలేదు. ఈ విషయంలో సమిష్టి ప్రయోజనాలు, వ్యక్తిగత యిష్టాలనేవి లేకుండా వాడ రాజకీయాలు అయోమయంలోకి నెట్టబడ్డాయి.

నాగయ్య తండ్రి పిచ్చయ్య పాలేరుగా పని చేసిన సుందరయ్యకి పెద్ద తనమొచ్చింది. పిల్లలు పట్టణాల్లో కులాసాలకు మరిగి వ్యవసాయంవైపు కన్నెత్తి చూడడం లేదు. పొలం కొంత అమ్మి గుంటూర్‌లో డైలీ ఫారాలు పెట్టారు. నాగయ్య వాళ్ళ దగ్గర నాలుగెకరాలు కౌలుకి తీసుకొని సేద్యం చేస్తూ ఆ కుటుంబంతో అణకువగా వుంటూ వచ్చాడు. వ్యవసాయం చిన్నదే కాబట్టి వసూల్లో కూలిచ్చి ఎవరినీ పెట్టుకోకుండా పిల్లల్ని, ముసలి వాళ్ళని, భార్యనీ అడ్డం పెట్టుకొని తంటాలు పడుతూ కౌలుకి పోను సంవత్సరమంతా తిండికి గింజలు మిగిల్చుకొని నాగయ్య నిబ్బరంగా బతుకుతున్నాడు. పెద్ద కొడుకు లాజరు పనిలో చెయ్యి అందిస్తూనే శ్రద్ధగా బియ్యేడి వరకు చదువుకొని లేత వయసులోనే వుద్యోగంలో స్థిరపడ్డాడు. అతని భార్య నిర్మల కూడా బియ్యేడీ టీచర్!

నాగయ్యకు ఆడపిల్లలు సబిత, బబిత లతో కూడా ఏ యిబ్బందీ రాలేదు. యిద్దరూ చదువులో తెలివైన పిల్లలే! అతనికి వచ్చిన చిక్కల్లా చిన్న కొడుకు రమేష్ తోనే ! తన అన్న, యిద్దరు చెల్లెళ్ళు ఏమీ పట్టించుకోకుండా తమ పనేదో తాను చేసుకుపోతుంటే రమేష్ మాత్రం అన్ని విషయాలు పట్టించుకొంటాడు. అతనికి వూరినిండా స్నేహితులే! కాలేజీలో కూడా రమేష్ పేరు బాగా వినిపిస్తుంది. చుట్టప్రక్కల వూర్ల నుంచి కాలేజీ స్టూడెంట్స్ రమేష్ కోసం యింటికొస్తూ వుంటారు. ఎప్పుడూ ఏదో ఒక మీటింగ్ వుందంటూ హడావిడిగా తిరిగే రమేష్ అంటే నాగయ్యకు చిరాకు. యింటిమీదకు ఎప్పుడూ ఏ గొడవ తెచ్చి పెడతాడోనని గుండెని గుప్పెట్లో పెట్టుకొనే వాళ్ళు. చివరకు వాళ్ళు అనుకున్నంత పనీ అయ్యింది.

శిరీష వూర్లోనే పెద్ద రైతు సీతారామయ్య పెద్ద కొడుకు బిడ్డ, ఆమె తండ్రి శివరాం వ్యవసాయం చేస్తూ కుటుంబంతో విజయవాడలో వుంటున్నాడు. ముసలి తల్లి దండ్రుల కోరిక ప్రకారం శిరీషని

తాతయ్య, నాయనమ్మల దగ్గర వుంచారు. శిరీష తెనాలి జె.ఎమ్.జె కాలేజీలో బియ్యే మొదటి సంవత్సరం చదువుతుంది. యింటి నుంచి రోజూ కాలేజీకి బస్‌లో వెళ్ళి వస్తూ వుంటుంది. హైస్కూలు చదువునుంచి రమేష్‌కు శిరీష తెలుసు. యిద్దరూ ఒకే బస్‌లో తోసుకువెళ్ళి వస్తూ చనువుగా వుంటూ వచ్చారు. శిరీష రమేష్‌తో మాట్లాడడం బస్‌లో తరచుగా తెనాలి వెళ్ళి వస్తుండే శిరీష బంధువులు, చుట్టు పక్కల వాళ్ళు గమనించారు. ఆమెను ఎవరూ మందలించలేదు. కానీ కొందరు గుర్తు తెలియని వాళ్ళు రమేష్ చదివే కాలేజీకొచ్చి శిరీషను ప్రేమించడానికి రమేష్‌కు అర్హత లేదని అతని కులం తక్కువ తనం గురించి అవమానంగా మాట్లాడారు. చివరకు ఆమెతో మాట్లాడితే అతని శవం లేస్తుందని వచ్చిన వాళ్ళు వార్నింగ్ యిచ్చి వెళ్ళారు. రమేష్ మనసు వుక్రోషంతో వుడికి పోయింది. అతని స్నేహితులు కూడా ఈ విషయంలో చాలా పట్టుదలగా తయారయ్యారు. అంతవరకు రమేష్‌కు శిరీషకు పెళ్ళి చేసుకోవాలని, తమ పరిచయం పేర ప్రేమని స్పష్టత లేదు. అసలు వాళ్ళిద్దరు కూడా ఈ విషయం గురించి ఏనాడూ వివరంగా మాట్లాడుకోలేదు. ఇదంతా జరిగాక రమేష్ శిరీష విషయంలో నిశ్చితాభిప్రాయానికొచ్చాడు. అతని అభిప్రాయానికి స్నేహితులు కూడా నారు పోసి నీరు పోశారు.

గొడవ జరిగాక రమేష్ శిరీషకు విషయమంతా చెప్పాడు. ఆమెకు రమేష్ పట్ల ప్రేమతో కూడిన సానుభూతి ఏర్పడింది. రమేష్ పై బయటినుంచి వత్తిడి పెరగడంతో శిరీష కాలేజీకని వచ్చి రమేష్‌తో కలిసి అదృశ్యమవ్వడంతో వూరు వూరంతా ఈ వార్త గుప్పుమంది. విజయవాడనుంచి శిరీష తండ్రి గుంటూరులో వుంటున్న ఆమె బాబాయి క్షణాల్లో వచ్చారు. దగ్గర బంధువులతో రహస్యంగా మంతనాలు జరిపి శిరీషను ఏదో విధంగా వెనక్కు తీసుకు రావాలని వాగయ్య దగ్గరకు మధ్యవర్తులను పంపారు.

అర్థరాత్రి అందరూ నిద్రపోయాక సీతారామయ్య మనుషులు చడీ చప్పుడూ లేకుండా నాగయ్య తలుపు తట్టారు. ఆ సమయంలో వాళ్ళను చూశాక నాగయ్యకు చెమటలు పట్టాయి. యింటిల్లిపాదీ వులిక్కిపడ్డారు.

అందరూ మౌనంగా వున్నప్పుడు 'నాలుగచ్చరాలు నేర్చి మీ మాలోళ్ళు ఎంత మిడిసి పడుతున్నారురా... లంజాకొడుకులు....' అన్నాడొక ఘనలాయన.

'యియ్యానికైనా కయ్యానికయినా సమవుజ్జీలుండాలి మీరు సీతారామయ్యగారి కాలి గోటికి సరిపోతారంటరా....! చూడరా నాగా...! నువ్వెప్పుడూ ఒకళ్ళనొక మాటన్నోడివి కాదు. నీమొహం చూసి వూరుకొంటున్నాం. మర్యాదగా మా పిల్ల ఎక్కడున్నా తీసుకొచ్చి అప్ప చెప్పండి.!' అన్నాడు వాళ్ళల్లో ఒక వ్యక్తి.

నాగయ్య చేతులు జోడించి భయంగా 'ఆడెక్కడున్నాడో నాకు నిజంగా తెలవదు దొరా! నామాట నమ్మండి!' అన్నాడు.

'ఓరి దొంగ తొత్తికొడకా! ఏమీ ఎరగనట్టు నాటకాలాడితే మాత్రం నీలల్లాయి కబుర్లు నమ్మడానికి మేవేమన్నా దద్దమ్మల్లా కనబడతున్నామా నీకు....! నీ పెద్ద కొడుకెక్కడరా వుండేది...?' గద్దించాడు ముసలాయన

నాగయ్య పూడుకుపోయిన స్వరంతో 'బెజవాడ దగ్గర పామర్రులోనండి...' అన్నాడు.

'యిప్పటికైనా మించిపోయింది లేదు మర్యాదగా మా పిల్లను మాకు ముట్టచెబితే సరి లేకపోతే నీకూ ఆడపిల్లలుండారన్న సంగతి మర్చిపోకురా నాగా...!' తగ్గు స్వరంతోనే గుడ్లు రొప్పుతూ అన్నాడు యిందాకటి వ్యక్తి.

ఆ మాటలు రాత్రి చీకటినీ, నిశ్శబ్దాన్నీ చీల్చుకొని నాగయ్య గుండెని పేల్చివేశాయి. వచ్చిన వాళ్ళు వెళ్ళింది కూడా గమనించకుండా కొయ్యబారిపోయి కూతుళ్ళిద్దరి వైపు చూస్తుండిపోయారు.

రమేష్ ఆచూకీ యింట్లో వాళ్ళకు కూడా తెలియలేదు. అతని స్నేహితులు మాత్రం శిరీష, రమేష్ పెళ్ళి చేసుకున్నట్టు చెప్పుకుంటున్నారు.

వూళ్ళో రైతులంతా ఒకటై పల్లెమీద కయ్యానికి కాలు దువ్వమన్నాడు. సర్పంచ్ రంగంలోకి దిగి రమేష్‌ను గాలించడానికి మనుషులను ఏర్పాటు చేశాడు.

సీతారామయ్య కొడుకులు రమేష్ శిరీషను కిడ్నాప్ చేసినట్టు పోలీస్ కేసు పెట్టారు. నిమిషాల మీద పోలీసు జీపులు నాగయ్య యింటి ముందాగినాయి. ఎన్ని ప్రశ్నలడిగినా, బండబూతులు తిట్టినా నాగయ్య రమేష్ ఆచూకీ చెప్పకపోయేసరికి పోలీసులు నాగయ్య దంపతులను అరెస్టు చేసి స్టేషన్‌కి తీసుకెళ్ళి చిత్రహింసలు పెట్టి లాకప్‌లో వుంచారు. యింటిదగ్గర ఆడ పిల్లలిద్దరు, ముసలివాళ్ళు ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని నస్సహాయంగా మిగిలిపోయారు. సబిత, బబిత బయటికెళ్తే ఏమౌతుందోనని బిక్కుబిక్కుమంటున్నారు. నాగయ్య దంపతులను పోలీసులు అరెస్టు చెయ్యడం అన్యాయమని వాడజనం రహస్యంగా అనుకున్నారుగానీ రైతులకు ఎదురు మాట్లాడితే తమకాలు పొలాలు ఎక్కడ చేజారి పోతాయోనని ఎవరూ పోలీసులకు అడ్డు చెప్పలేదు. బిక్కుచచ్చిపోయి జీవచ్ఛవంల్లా మిగిలిన పిల్లల్నిగానే, ముసలి వాళ్ళనిగానీ ఎవరూ ఆదరించలేదు.

విషయం తెలియగానే రమేష్, లాజర్ పరుగు పరుగున వచ్చి పడ్డారు. తమ తల్లిదండ్రులను అరెస్టు చెయ్యడం చిత్రహింసలు పెట్టడం అన్యాయమని, రమేష్ శిరీషను కిడ్నాప్ చెయ్యలేదని తామిద్దరూ ప్రేమించి పెళ్ళి చేసుకున్నామని పిటిషన్ పెట్టారు.

శిరీషకోసం పోలీసు కుక్కల్లా గాలిస్తున్న సీతారామయ్య మనుషులకు ఆమె చాలా రోజులుగా తెనాలిలోనే రమేష్ స్నేహితుల యింట్లో వుంటుందని తెల్సింది. స్కూటర్ల మీద తిరుగుతూ వెదుకుతున్న వాళ్ళు శిరీష కంట పడగానే ఆమెను వున్న ఫళాన ఈడ్చుకొచ్చి బండిమీద ఎక్కించుకొని యింటికి తీసుకొచ్చారు. శిరీషను యింట్లో గుంజకు కట్టేసి గొడ్డును కొట్టినట్టు కొట్టారు.

రమేష్ తన భార్యను ఎవరో అపహరించుకు పోయారని కేసు పెట్టాడు. శిరీషను పోలీసులు ప్రశ్నించగా ఆమె రమేష్ వట్టి వెధవ అనీ చాలా కాలంగా తన వెంట పడుతున్నాడని కాలేజీ నుంచి తనను కిడ్నాప్ చేసి తన నగలు కాజేశాడని అతనితో తనకు పెళ్ళి కాలేదని అందరి ముందు చెప్పింది. ఈ మాటలకు రమేష్ మతి చలించింది. శిరీషను పెళ్ళి చేసుకొని కొన్ని నెలలుగా ఆమెతో కల్సివుండి ఆమె కారణంగా తన తల్లి దండ్రులు పోలీసుల చేతిలో చిత్రహింసలు అనుభవించి తన కుటుంబం మొత్తం వీధిన పడడం చివరికి శిరీష నోట యిటువంటి మాటలు వెలువడడం కళ్ళారా చూసిన రమేష్‌కు పిచ్చి పట్టినట్లయ్యింది.

కొద్ది రోజుల్లోనే శిరీష అమెరికాలో వుంటున్న తమ బంధువుల అబ్బాయిని పెళ్ళిచేసుకొని ఆకాశ మార్గాన ఎగిరి పోయింది. అరిటాకు - ముల్లు సిద్ధాంతం తిరగబడి నవ్వింది.

(అప్రచురితం)

**19**

# చరిత్ర

## వి. చంద్రశేఖరరావు

నిన్నటి ప్రపంచానికి చెందిన గోవు! నాలుక బయటకు వెళ్ళుకొని వచ్చి, ముట్టె నిండా రక్తం నేలంతా దాని రక్తమే! నేలకడ్డంగా పడి ఉంది. సగం మరణం. సగం చేతనం. ఒక శతాబ్దం నేలకొరిగి నట్లుగా ఉందా దశ్యం!

రాత్రి వచ్చిన కవల.

అది మొదలు ! అంతకుముందో కబురు!

"రక్త పాతం జరక్క తప్పేలా లేదు. బాణా కర్రలు. వేటకత్తులు. కొడవల్ళు తయారుగానే ఉన్నాయి! రక్తాన్ని ధారపోస్తే గాని నిలుపుకోలేని జీవితాలు. నాయనా! ఒరే! మరింక ఇవి చివరి మాటలే అయితే, అమ్మను పదిలంగా చూసుకోరా!"

మనోహరరావు పత్రికాఫీసు మెట్లు ఎక్కుతున్నాడు. తన చావును తనే మోస్తున్నట్లుగా ఉన్నాడు. అతను సాయంకాలం కోసం, చీకటి కోసం ఎదురు చూస్తున్నాడు. కానీ చీకటింక ముసరనేలేదు. గట్టిగా నిట్టూర్చి. ఒక నిర్ఫితిని సూచించే ఠీవిలో నిలబడి "హుమ్"! అనుకుని, తన గదివైపు నడిచాడు. పాదం కింద జిగటజిగటగా, రక్తం పారినట్లుగా, ఉలిక్కిపడి పాదాన్ని వెనక్కు లాక్కున్నాడు. కాళ్ళ కింద రేపటి వార్తాపత్రిక. దాహంగా, ఆకలిగా, అసహనంగా ఉన్నాడతను. అసహనం అడుగు అడుగుకూ పెరుగుతంది. గాలిలో ఏవో రహస్య స్వరాలు. అతని చెవిలోనే ఏదో రహస్యాన్ని స్వరాలు. అతని చెవిలోనే ఏదో రహస్యాన్ని ఊదుతున్నట్లుగా సాయంకాలం అయిదుగంటలే! మొదటి పేజీ ప్రూఫులు తెచ్చి చూపాడో కుర్రాడు. అక్షరాన్ని చేత్తో తడిమాడు. పురెల్ని తడిమినట్లుగా , ఒళ్ళంగా జలదరింత, నల్లటి, దుఃఖపు సాయంకాలం బరువైన చరిత్ర పుస్తకంలా మనోహరరావు!

"పర్సనల్ లెటర్ ఒకటుంది. మీ టేబుల్‌పై పెట్టాను"! ఆఫీస్ బాయ్ టేబుల్ పై తెల్లటి కవరు పెట్టాడు. మినియేచర్ గోవులా తెల్లగా నిర్మలంగా ఉంది. చిరునామాదారుడే తెరవాలని, అర్జంటు కబురు త్వరగా డెలివరీ చేయండని కూడా దానిపై రాసి ఉంది. ఎందుకో ఆ ఉత్తరాన్ని చదవాలనిపించ లేదు మనోహరరావుకు టేబుల్ పైనుండి ఉత్తరం లాక్కుని గబగబా జేబులో కుక్కుకున్నాడు.

"నిజానికి నాస్టాలజియా వేరు. జ్ఞాపకాలు వేరు. నాస్టాలజియా ఒక మరుపు. గతంలోకి కుచించుకుపోవటం! జ్ఞాపకాలు అట్లాకాదు గతాన్ని స్పృశిస్తూ భవిష్యత్తులోకి ప్రయాణిస్తున్నాయి. గొప్ప రచయిత తన అనుభవాన్ని సామూహిక జ్ఞాపకంగా మార్చి, ఒక సత్యాన్ని ఆవిష్కరిస్తాడు. ఆ సత్యం ఒక్కోసారి అధికారిక చరిత్రపై ప్రకటించిన యుద్ధం కూడా అవుతుంది."

మనోహరరావు లిటరరీ కాలం కోసం వ్యాసం రాస్తున్నాడు. సుందర అనే రచయిత రాసిన 'చరిత్ర' నవలపై సమీక్షా వ్యాసం రాస్తున్నాడు. 'చరిత్ర' దళిత నవల. తొంబయి ఆరులో రాసింది. దళిత సాహిత్యంలో దానినో మైలురాయిగా చెప్పుకుంటారు.

చరిత్ర నవలలో సుందర తన గ్రామం గురించిన, తన బాల్యం గురించిన జ్ఞాపకాల్ని రాశాడు. తన శ్రమ, తన కష్టం, తన చదువు, తన పట్టణ జీవితం అన్నింటినీ డైరీ రూపంలో రాశాడు. జీవితం ప్రతి దశలోనూ కులం తన మెడకు చుట్టకొన్న అనకొండలా అతని నెట్లా గొంతు నులిమిందీ చెబుతాడు. క్రిస్టియన్ మతాన్ని పుచ్చుకోవటం, చర్చిలో అతని సంబంధం, సిటీలో ఉద్యోగం, వాజూకు భాష, ఖరీదు జీవితం, తన జాతి నుంచి తను ఎట్లా ఎలియనేట్ అయ్యిందీ, చివరకు అంతట్నీ వదిలేసి, మళ్ళీ తన గ్రామానికి తన మూలాల్ని వెతుక్కుంటూ వెళ్ళటం వివరిస్తాడు.

చాలారోజులుగా ఈ నవల మనోహరరావు గుండెను నలుపుతుంది. కనపడకుండా పోయిన గాయమేదో, చర్మాన్ని చీల్చుకొని వెలికివచ్చినట్లుగా ఉండేది.

పుస్తకంగా రాకముందు, ఆరునెలల పాటు సీరియల్‌గా వచ్చిందీ నవల. మామూలు వారపత్రికలలో, దినపత్రికలలో కాక ఉస్మానియా యూనివర్శిటీ హాస్టల్ పబ్లిష్ అయ్యే 'దళిత సూరీడు' అనే వాల్‌పేపర్‌లో ఈ నవల సీరియల్‌గా వచ్చింది. ఉదయాన్నే అలారం మోత కన్నా ముందే లేచి, హడావుడిగా తలకో మఫ్లర్ చుట్టుకొని, చలిలో యూనివర్శిటీ వూపు నడిచేవాడు. వణికే చేతుల్తో, వెచ్చటి ఊపిరిని ముక్కుల్లోంచి ఉఫ్ ఉఫ్ అని ఊదుకుంటూ, ఒక శీతల దుఃఖంలోంచి, వెచ్చని ఊహలోనికి ప్రయాణిస్తున్న వాడిలా ఉంటాడు. అందోళనగా, ఒక అబ్సర్డ్ పోయమ్‌లా ప్రవర్తించే వాడు. హాస్టలు గేటు ముందున్న బంకు దగ్గర ఆగి, సిగరెట్టు కొనుక్కుని, నికోటిన్ పొగల్ని గుండెల నిండా పీల్చుకొని, ఒక అద్భుతమైన అనుభవం కోసం చూస్తున్న వాడిలా ఉద్రేకపడేవాడు. రీసెర్చి స్కాలర్స్ హాస్టల్ నోటీసు బోర్డులో ఉన్న దళిత సూరీడు అనే నాలుగు పేజీల వార్తాపత్రికను, అందులోని చరిత్ర సీరియల్‌ను చదివేవరకు అతని ఆరాటం తగ్గేది కాదు. చదువుతున్నంతసేపూ గొప్ప ఉద్రేకం, సంచలనం కలిగేవి అతనిలో కథలోని ఊరు అతనికి తెలిసినట్టే ఉండేది. సుందర రాసింది నవల కాదని, ఎవరిదో బాగా తెలిసిన వ్యక్తి జీవిత చరిత్ర అని అతని నమ్మకం. ఆ జీవిత చరిత్ర తనది కూడా అయ్యుండ వచ్చిన అతని అనుమానం.

చీకటి ముసిరిన వేళ, సాయంకాలాల్లో, వందలాది, వేలాది కాకులు ' కావ్ కావ్ మంటూ, రెక్కల్ని టపటపలాడించుకుంటూ గుడిసెలపూ ఎగరటం గురించి రాసిన అధ్యాయం.. అతనికి బాగా చిన్నప్పటి సంఘటనకు పోలి ఉండేది.

అదొక సందడి. గొప్ప యుద్ధపు పాటను వింటున్నప్పుడు కలిగే తత్తరపాటు! ఆ కాకులు రావటం కోసం సాయంకాలం నాలుగునుంచే పిల్లలందరూ ఎదురు చూసే వాళ్ళు చెట్లు, గుడిసెలు, ఆ ప్రదేశమంతా నల్లటి పూలతోటలా మారేది. ఒక సాయంకాలం 'ఢాం ఢాం' అనే తుపాకీ చప్పుళ్ళలో

నేలంతా అదిరింది. (ఆ తుపాకీ చప్పుళ్ళలో నేలంతా అదిరింది. (ఆ తుపాకీ ఎవరు కాల్చారో ఇప్పటికీ ఎవరికీ తెలియదు) కాసేపటికి గుడిసెలపైన, చెట్ల కొమ్మలపైన విరిగిపడ్డ రెక్కలు, తెగిన తలలు, ముక్కులు, కాళ్ళు, ఆకాశమంతా నల్లని ఈకల మబ్బులు ఈ దశ్యమంతా మనోహరరావుకు తెలిసిందే! ఈ దశ్యం, తరువాత జరగబోయే విషాద సంఘటనను చెప్పడానికి వాడుకున్న మెటాఫర్ అని కూడా అతనికి తెలుసు.

గ్రామానికి, మాదిగ పల్లెకీ మధ్యన ఉంది శ్మశానం. అతనికి రెండు తరాల ముందునుంచీ మాదిగలలో క్రిష్టియానిటీ ఎక్కువగానే ఉంది. శవాన్ని ఖననం చేసి, సమాధి ఫలకాన్ని అక్కడ పెట్టడం అనవాయితీ, "మా కొంపల పక్కనే శవాన్ని కుళ్ళబెడతారా?" అంటూ గొడవ మొదలు పెట్టారు అసాములు. ఒక అర్ధరాత్రి శ్మశానం గోడను పగల గొట్టుకుని, ట్రాక్టరు శ్మశానం అంతా వీర విహారం చేశాయి. సమాధి పలకలు నేలకూలాయి. మరీ లోతుగా పూడ్చని సమాధుల్లోంచి, ఎముకల పోగులు బయటకు వచ్చాయి. గుండెల్ని చీల్చి నట్లుగా గొల్లుమన్నారు. పల్లెలోవాళ్ళు రాత్రికి రాత్ర కర్రలతో, పలుగులతో, గొడ్డళ్ళతో ఊరిపై పడ్డారు. వాములు తగలబడ్డాయి. గొడ్లతాళ్ళు తెగి, మందలు పొలాన పడ్డాయి. గ్రామం మధ్యలో యుద్ధమే జరిగింది. మరుసటి రోజు ఊళ్ళోకి పోలీసులొచ్చారు మగవాళ్ళంతా కనబడకుండా వెళ్ళిపోయారు.

పోలీసులు, మాదిగపల్లె పై బడి. గుడిసెల్ని తగలబెట్టి, ఆడవాళ్ళను అల్లరిపెట్టిన ఆ మారణ కాండ ఒక చరిత్ర అయింది. ఆ గొడవలు జరిగే నాటికి మనోహరరావుకు ఎనిమిదేళ్ళు.

ఆ సంఘటన యధాతధంగా చిరత్ర నవలలో రాయటం అతనికి విస్మయంగా ఉంది. ' ఈ సుందర ఎవరో నాకు బాగా పరిచయమున్న వ్యక్తి " అనుకున్నాడు. " నా గురించే కాదు, నాయన గురించిన కబుర్లు కూడా తెలిసిన మనిషే " అనుకున్నాడు ఆ గొడవల్లో మనోహరరావు తండ్రికి కాలు విగిరింది. గాయానికి కట్టు కట్టక, క్రమంగా సెప్టిక్ అయ్యి, కాలు తీసివేయాల్సిన పరిస్థితి వచ్చింది. 'కుంటి అయ్యవారు' అని వాళ్ళ నాన్నను పిలిచేవారు. నవలలో ఈ కుంటి అయ్యావారే ప్రొటోగనిస్టు.

మనోహరరావు తన వ్యాసాన్ని ముగిస్తూ "నవలలో రచయిత తనను తాను రెక్కలు విగిరిన పక్షిలా వర్ణించుకుంటాడు. అయితే తన రెక్కలు విరిగినతనమే, తన జాతిలో తిరిగి కలిసే ఒక మహోద్యమానికి మొదలుకావటం కూడా రచయిత గుర్తించాడు. తను, తన బలం, తమను తాము విముక్తం చేసుకునే ఒక ఉద్యమంలోకి అడుగు పెట్టినట్లుగా, ఆశావహంగా నవల ముగుస్తుంది" అని రాశాడు.

వ్యాసాన్ని డి.టి.పి.కి పంపి బలంగా నిట్టూర్చాడు మనోహరరావు కుర్రవాణ్ణి టీ, సిగరెట్లు పట్టుకురమ్మని పంపించాడు. జేబులోని ఉత్తరం నిలవబెట్టిన శవంలా బరువుగా తోచింది. క్రమంగా నిశ్శబ్ధం. చీకటి ఆఫీసు పొడవునా పరచుకున్నాయి. ప్రూఫ్‌రీడింగ్ కోసం వ్యాసం మళ్ళీ అతని దగ్గరకు వచ్చింది. ప్రూఫ్ లొద్దు, నగిషీలొద్దు' అంటూ పేజీలు తెచ్చిన కుర్రవాణ్ణి కసురుకున్నాడు.

ఒంటరితనం, నిస్తేజం అతన్ని చుట్టుముట్టాయి. అర్ధంకాని భయం. గుండెలు గుబుల గుబులుగా "ఇంత ఆలస్యం అయ్యిందేం?" అని టీ తెచ్చిన కుర్రవాణ్ణి విసుక్కున్నాడు. "రోడ్డు మధ్యలో బర్రె ఒకటి చచ్చి పడి ఉంది! అటూఇటూ ట్రాఫిక్ ఆగిపోయంది. పదిమంది కలిసి

లాగుతున్నా బర్రె కదలటం లేదు'' కుర్రవాడు బర్రెను తొలగించే కార్యక్రమాన్ని వివరిస్తున్నాడు. ఉలిక్కిపడ్డాడు మనోహరరావు. గుండెలు పెద్దగా డబ్‌డబ్ మని కొట్టుకున్నాయి. కలలోంచి ఇట్లా రోడ్డుపైకి బర్రె శవం రావటం - సాదాసీతా జీవితం ఇంత మెటాఫిజికల్‌గా అయ్యిందేం అని విస్తుపోయాడు. ఏ దుఃఖానికి, ఏ చావుకు ఇది ప్రతీకో అని కలత పడ్డాడు.

హఠాత్తుగా అతనికి ఉస్మానియా హాస్టల్ వైపు వెళ్ళాలనిపించింది. నోటీసు బోర్డు, వాల్‌పేపరు 'దళిత సూరీడు' చూడాలనిపించింది. ఎందుకో తను ఎదురుచూసే వార్త అందులో ఉండవచ్చని కూడా అతనికెందుకో అనిపించింది.

మెల్లగా రోడ్డు పైకి వచ్చాడు. రోడ్డు పొడవునా వాహనాలు క్రిక్కిరిసి ఉన్నాయి. గేదె శవం ఇంకా అట్లాగే ఉంది. పోలీసులు, ఫైర్ సర్వీసు వాళ్ళు విశ్వ ప్రయత్నం చేస్తున్నారు, దాన్ని తొలగించాలని.

రోడ్డు అంచున అట్లాడే నడుస్తూ చాలా దూరం వెళ్ళాడు. కొన్ని దీపాలు వెలిగి, కొన్ని దీపాలు వెలగక, రోడ్డు కాస్త చీకటిగా, కాస్త వెలుతురుగా కలలో వాతావరణంలా ఉంది. అబిడ్స్ దాటి, తిలక్‌రోడ్డు వైపు నడిచాడు. ఆంధ్ర సారస్వత పరిషత్తు, నాటక వారోత్సవాలు అంటూ పెద్ద బేనర్, ఏడు గొప్ప తెలుగు కథల్ని నాటకాలుగా మార్చి ప్రదర్శిస్తున్నారు రోజుకొకటి చొప్పున, ఆ వేళ కాళీపట్నం రామారావు గారి యజ్ఞాన్ని ప్రదర్శిస్తున్నారు.

"నాటకం సగానికి పైనే అయిపోయింది! ఇంకిప్పుడేం చూస్తారు! రేపు రండి మరో నాటకం మొదటున్నంచి చూద్దురుగాని!''గేటు దగ్గరి మనిషి ఉచిత సలహా!

"అసలు నాటకాల్ని నేను మధ్య నుంచే చూస్తాను. ప్రశ్నలన్నిటికీ సమాధానాలు దొరికేది అప్పట్నుంచే'' అతని ఆశ్చర్యాన్ని పట్టించుకోకుండా లోపలికి వెళ్ళాడు.

హాలు దాదాపుగా నిండి ఉంది. సేటజీ పైన, నాటకంలో శ్రీరాములు నాయుడు సభ తీరి ఉన్నాడు. అప్పల్రాముడు దిగులుగా, శూన్యంగా కూర్చున్నాడు, హాలులో గొప్ప ఉత్కంఠ. ఒక మూల నున్న సీటులో కూలబడ్డాడు మనోహరరావు దానికి కుడి వైపు చెయ్యి విరిగి ఉంది. సీటు కాస్త లోపలికి ఒరిగి, రంగస్థలం ఎక్కడో పైన ఉన్నట్టుగా ఉంది. అతను కూర్చున్నచోటు నుండి సగం రంగస్థలం మాత్రమే కనిపిస్తుంది. అతను కూర్చున్న సీట్లోంచి చూస్తే అప్పల్రాయుడు, అతని సంతానం మాత్రమే కన్పిస్తున్నారు. తీర్పు చెప్పే శ్రీరాములు నాయుడు, మిగిలిన ఊరిపెద్దలు మాటలు మాత్రం వినిపిస్తున్నాయి. మనుషులు కనబడటం లేదు.

పదేళ్ళనాటి అప్పుకు, గోపన్న షావుకారుకు అప్పల్రాముడికి మిగిలిన రెండెకరాల భూమి అమ్మి పైకం తీర్చడానికే నిర్ణయించాడు శ్రీరాములు నాయుడు. పత్రాలపై సంతకాలు పెట్టే ముందు, మాల మాదిగెలెట్లా దోపిడీ చెయ్యబడ్డారో, షావుకార్లు, అసాములు ఎట్లా పైకి ఎదిగారో వివరిస్తున్నాడు అప్పల్రాముడు. ఇది యాభైయేళ్ళ క్రిందటి మాట... అప్పటికి ఇక్కడున్న జనంలో మీరెవ్వరూ పుట్టలేదు....''

తన సీట్లోంచి చూస్తే స్టేజీపై అప్పల్రాముడు ఒక్కడే కనిపిస్తున్నాడు. అప్పల్రాముడిలో తన తండ్రి పోలికలు కనపడ్డాయి మనోహరరావుకి. తండ్రి రామయ్యను పంచాయితీ బోర్డు మెంబరుగా ఎన్నుకోవాలని ఊళ్ళో అంతా తీర్మానించారు. "మాదిగ పల్లెను దువ్వి, ఓట్లు కాజేయడానికి ఇదో

కుట్ర! వద్దయ్యా!'' అంటూ మనోహరరావు పోరాడు. ''బస్తీల్లో చేరి నాజూకు మాటలు నేర్చిమమ్మల్ని మరిచిపోయిన నీకు మా పల్లె ఊసులేల?'' ఒక్కమాటలో తండ్రి అతనిని దూరంగా విసిరివేశాడు. తరవాత రెండేళ్ళ లోనే మనోహరరావు తండ్రి మార్కెటింగ్ సొసైటీకి చైర్మన్ అయ్యాడు. ఎన్నికలయిన రెండోరోజునే తండ్రి అనుచరుడొకణ్ణి. డొంకలో పట్టుకొని పొడి చేశారు. దాని పై కేసు లేదు. ఎఫ్.ఐ.ఆర్ లేదు. మాదిగ పల్లెలోని కుర్రాళ్ళందరినీ తీసుకొని హైదరాబాద్ వచ్చాడు రామయ్యా. అసెంబ్లీ ముందు టెంటు వేసి నిరాహారదీక్ష మొదలు పెట్టాడు. న్యూస్ కవరేజికి మనోహరరావే వెళ్ళాడు. ''ఈ వయసులో ఎందుకు నాయనా నీకీ గొడవలూ! నువ్వూ. అమ్మావచ్చి నా దగ్గర ఉండక!'' మనోహరరావు మాటలకు కోపంగ అసహ్యంగా, తిరస్కారంగా చూశాడు అతని తండ్రి. ఆ రాత్రి పోలీసులు టెంటు పీకివేసి, కూర్చున్న జనం పై ఎడాపెడా లాఠీ ఛార్జీ జరిపారు. తల పగిలి తండ్రి హాస్పిటల్‌లో చేరాడు. తండ్రిని చూడడానికి వెళ్ళినప్పుడు ''నాయనా మనోహరా! లాఠీచార్జికి వ్యతిరేకంగా ఊళ్ళో పెద్ద ఊరేగింపు జరిగినాదట కదా! నువ్వు అందులో ఉండావా నాయనా?'' అని అడిగాడు.

మనోహరరావు ముఖంలో నెత్తురు చుక్కలేదు. ''ముఖ్యమైన సంపాదకీయం రాస్తూ...'' నీళ్ళు నమిలాడు మనోహరరావు. నాటకం చూస్తున్నంత సేపూ మనోహరరావులో పెద్ద పెట్టున దుఃఖం కలిగింది. పశ్చాత్తాపం కలిగింది. గొప్ప  పోరాటంలో భాగం కాలేని తనపై తనకే విరక్తి కలిగింది.

స్టేజీపై చిన్న అంతరాయం... ''ఒరేయ్! ఒరే కొడుకా! నువ్వు బానిస బతుకు బతుకుతావా లేదా సస్తావా!'' అంటూ కొడుకును బానిసను చెయ్యలేక వాణ్ణి కత్తితో సటుక్కున నరికి గోనెసంచిలో వేసుకొచ్చి స్టేజీపైన దబ్బున కూలవేసి... ''నువ్వూ తండ్రివే! నేనూ తండ్రినే! ఎవరు గొప్పో నువ్వే చెప్పు!'' అంటూ తండ్రిని సీతారాముడు అడిగే సమయానికి - కరెంటు పోయింది. గొప్ప చీకటి. జనంలో విసుగు. అసహనంగా అటూఇటూ కదులుతున్నాడు.

మనోహరరావు సీట్లోనే కూర్చున్నాడు. అంత చీకట్లోనూ అప్పలరాముడు స్పష్టంగా అతనికి కనిపిస్తున్నాడు. ఆ చీకట్లో ఏదో పూనినవాడిలా మనోహర రావు స్టేజీ వైపు నడిచాడు. క్రమంగా దష్టిలోంచి అప్పలరాముడు తొలిగిపోయి తండ్రే కన్పిస్తున్నాడు. ''నాయనా! నువ్వు మహానుభావుల కోవలోకి చెందిన వాడివి!'' అని చెప్పాలని మనోహరరావు కోరిక, ''నన్ను క్షమించవే! పరికి సన్నాసిని నాయానా!'' అంటూ ఆయన కాళ్ళు పట్టుకోవాలని మనోహరరావు ఆలోచన. ''మరింక ఈ నగరం వదిలి నీ దగ్గరకు వస్తానే!'' అని చెప్పాలని అతని నిర్ణయం.

ఒక పూనికతో అట్లాగే స్టేజీ పైకి ఎక్కాడు మనోహరరావు కరెంటు వచ్చి, లైట్లు వెలిగి అప్పలరాముడు కాళ్ల ముందు కూలబడి పెద్దగా ఏడుస్తున్న మనోహరరావు కనబడ్డాడు ప్రేక్షకులకు.

ప్రేక్షకులలో ఆశ్చర్యం. అయోమయం సీతారముడు పాత్రధారి. అతన్ని భుజం పట్టుకొని లేవదీసి బయటకు తోశాడు.ఇ ద్దరు వాలంటీర్లు, అతన్నో పిచ్చివాడిగా భావించి స్టేజీపై నుంచి బయటకు లాక్కువచ్చారు. ఆ ప్రయత్నంలో మనోహరరావు చొక్కా చిరిగింది. ట్రాన్స్‌లోంచి కొద్దిగా తేరు కొని, అక్కడ ఉన్న అరుగు పై కూలబడ్డారు మనోహరరావు. అయితే వాలంటీర్లిద్దరూ అతన్ని రెండు బుజాలు పట్టుకొని గేటు బయటవరకూ లాక్కు వెళ్ళారు.

రోడ్డు మీద అట్లాగే అచేతనంగా ఉండి పోయాడు మనోహరరావు. ఒంటి నిండా, బట్టల నిండా దుమ్ము, అతనికి చాలా దుఃఖంగా ఉంది దుఃఖం అట్లా అవమానకరంగా బయటకు గెంటి వేసినందుకో లేక తండ్రికి క్షమాపణ చెప్పే అవకాశం పోయినందుకో క్షణంపాటు అర్థం కాలేదు.

ఇల్లా ఈరత్రి పూట వెతుకులాట మాని ఇంటికి వెళ్ళి, తన గదిలో వెచ్చగా, నాలుగు ఆఫ్రికన్ పుస్తకాలపై కాళ్ళు నిగడతన్ని పడుకొని, టి.వి.లో పార్లమెంటు లైవ్, సౌండు పెద్దగా పెట్టుకొని.. ప్రజాస్వామ్యపు 'లైవ్' చప్పుళ్ళ మధ్య హాయిగా నిద్రపోతేనో? అనుకున్నాడు.

లేచి నిలబడి వీధి చివరిదాకా వెళ్ళాడు. వీధి మధ్యలో పోలీసెవడైనా కనిపిస్తే తనకు జరిగిన అవమానాన్ని ఇంటిపైని చొక్కాని సైతం చింపివేసిన వైనాన్ని గురించి రిపోర్టు చెయ్యాలనుకున్నాడు. పోలీసు రోడ్డు పక్కనున్న ఛాయ్ బంక్ దగ్గర నిలబడి ఉన్నాడు. ఇద్దరు అసహాయమైన ఆడవాళ్ళతో బేరాలాడుతున్నాడు. వాళ్ళు జాకెట్టులోంచి ఒక్కొక్కటే రూపాయలు బయటకు లాగుతున్నాడు. "ఛత్!" అనుకుని రోడ్డుకున్న మరో మలుపులోకి తిరిగాడు.

డిసెంబర్ రాత్రి చలి. ఒంటిపైన చొక్కా కూడా చిరిగి ఉంది. వణికించే చలి. కత్తులు పట్టుకుని కనబడని మనిషెవడో పొడుస్తున్నట్టుగా చలి. రోడ్డు కెదురుగా అటు కాస్త దూరంగా అంబేద్కర్ విగ్రహం సూటు వేసుకొచ్చిన బుద్ధుడిలా.

హఠాత్తుగా రోడ్డు నెలల తల్లిగా మారి, వందలాదిగా మనుష్యుల్ని ప్రస వించడం మొదలు పెట్టింది. ఏ వీధి లోంచి వస్తున్నారో వెంటనే పోల్చుకో లేకపోయాడు. తెల్లటి మంచులోంచి నల్లనల్లగా బయటకు వస్తూ, వాళ్ళు ఈ లోకపు మనుష్యులు కాదేమోనని పించింది. అతనట్లా నిలబడి వుండగానే, వాళ్ళు అతణ్ణి తోసుకుంటూ, హడావుడిగా వెళుతూన్నరు. పైకి ఎగగట్టుకున్న పంచెలు, పల్లెటూరి జనం తలకు, భుజాలకు చుట్టుకొని ఉన్నారు. "ఎవరు? ఎవరు మీరు?" తనను తోసుకుంటూ వెళ్ళు మనుష్యుల్ని ఆపి అడిగాడు. 'దండోరా...' ఛలో అసెంబ్లీ... ఎబిసిడిల కోసం పోరాటం' నాలుగైదు వైపుల నుండి సమాధానాలు వచ్చాయి. వాళ్ళట్లా చలికి వణుకుతూ పెద్ద పెద్దగా కబుర్లు చెప్పుకుంటూ, గడ్డ గట్టిన వాగులా రోడ్డుపై ప్రవహిస్తూ వెళుతున్నారు. 'దరడమ్‌డం... డరడమ్‌డమ..' గుంపు మధ్య పెద్దగా పాడుతూ ఉన్న మ్యూజికల్ గొంతు వినబడింది. ఆ మనిషిని గుర్తుపట్టాడు మనోహర రావు. మోహనసుందరం. ఉద్యమాల మనిషి. అన్నీ తెలిసినవాడు. భవిష్యత్తు గురించి నాలుగు మంచి మాటలు చెప్పగల 'సూత్ - సేయర్' అతను మనోహరరావు పక్క నుంచే వెళ్ళాడు. వెళుతూ వెళుతూ, క్షణం సేపు ఆగి, తన ఒంటి పైని శాలువాను మనోహరావు పైకి విసిరి వెళ్ళిపోయాడు. దండోరా మనుషులు అట్లా రోడ్డు పైనుంచి వెళుతూను ఉన్నారు. వాళ్ళు అట్లా మలుపు దాటారో లేదో, హడావుడిగా ఇద్దరు మనుషులు ఆ వైపు పరిగెత్తటం కనిపించింది మనోహర రావుకు, వాళ్ళ లోంచి ఒకడు, బొడ్డులోని తుపాకీని సరిచూసుకోవటం కూడా చూశాడు మనోహరరావు వాళ్ళ గుంపును అందుకొని అందులో కలిసిపోవాలని పరిగెడుతున్నారు. "మోహన సుందరం! బహుపరాక్!" అని చెప్పాలనుకొన్నాడు. చలికి బిగుసుకుపోయిన కండరాలు తెరుచుకోలేదు. గొంతులో కేక గొంతులోనే ఉండగా తుపాకీ పేలిన చప్పుడు వినిపించింది. 'వామ్మో! దేవుడో! నాయనో!' అంటూ అరుపులు వినిపించాయి.

మనుషులు చచ్చి పోతున్న శబ్దం. గుంపు చెదిరిపోతున్న శబ్దం పెద్దగా ఏడుస్తూ కేకలు పెడుతున్న శబ్దం వినిపించాయి మనోహరరావుకు .

వీధిలో హడావుడి. దీపాలు భగ్గుమన్నాయి.జీపులు, కార్లు మెల్లమెల్లగా రోడ్డు నాక్రమించాయి. క్లిక్‌క్లిక్ మంటూ ఫోటోలు, ప్రశ్నలు, ఇంటర్వ్యూలు ... వార్తసేకరణ 'హలో మనోహరరావుగారూ! ఎంతసేపయింది వచ్చి?' క్రైమ్ రిపోర్టర్ రెడ్డి, మనోహరరావును అపాడు. చరిత్ర మొదట్నుంచీ ఉన్నాను పరాకుగా అన్నాడు మనోహరరావు. అంత లోని ఉలిక్కిపడి ఇప్పుడే ఇట్లా అ మలుపునుంచి వస్తున్నాడు అన్నాడు "ఏమిటిది? చొక్కా చిరిగి, మీ పైన దాడి ఏదయినా..." అతతగా అడిగాడు రెడ్డి " నో, నో!" అంటూ తల ఊపాడు. "అన్నట్టు సార్! మీకో టెలిగ్రాం వచ్చింది! నిన్నటి నుంచీ నా జేబులోనే ఉండిపోయింది! ఎక్కడన్నా కనిపిస్తారేమోనని జేబులోనే పెట్టుకున్నాను" అంటూ టెలిగ్రాం అందించాడు రెడ్డి.

మనోహరరావు బిగుసుకుపోయాడు. టెలిగ్రామ్‌ను అతని చేతుల్లోంచి లాక్కుని. దాన్ని చించి చదవకుండానే జేబులో కుక్కుకున్నాడు. క్షణమాగి, అతనివైపు తిరగి " ఇందులోని విషయం నాకు ముందే తెలుసు!" అన్నాడు మనోహరరావు దుఃఖ గంభీరంగా, మనోహరరావు శరీరమంతా పొడవాడి గాయంలా మారి, గాయం పొడవునా మరణ వార్తలే ప్రవిస్తూ... యూనివర్శిటీ ల వైపు ప్రయాణం మాని ఇంటి దోవ పట్టాడు.

అర్ధ రాత్రి పన్నెండు గంటలు. సరిగ్గా పన్నెండు గంటలు తన గదిలో ఒక్కడే మనోహరరావు. డెస్కు పై ఆ రోజే వచ్చిన రెండు రిజిష్టర్డు పార్శిల్పు, డెస్క్‌పైనే టీకప్పు అందులో చల్లారిన ముదురు ఎరుపు రంగు ద్రవం. ద్రవంతో సహాయ టీ కప్పు మరణించిన సంతోషంలా ఉంది. గది నిండా గుట్టలు గుట్టలుగా నిశ్శబ్దం. మహిషం ఆవులించినట్లుగా మత్తుగా, దిగులుగా, జేబులోని ఉత్తరం, టెలిగ్రామును కూడా బయటకు తీశాడు. టేబుల్ పైని పార్శిళ్ళ పై పెట్టాడు. మొత్తం నాలుగు మరణాలు! ఏది ముందు?' అనుకున్నాడు.

బరువుగా లావుగా ఉన్న పార్శిలు విప్పాడు. చరిత్ర నవల పేజీ తిప్పితే 'మనోహరానికి తన దారిని, రూట్సుని తెలుసుకుంటాడనే ఆశతో..." సుందర. బ్రాకెట్లో కుంటి అయ్యవారు ఇంకో బ్రాకెట్లో వీరపోగు రామయ్య. దిమ్మెర పోయాడు మనోహరరావు భయంగా, దిగులుగా మరోప్యాకెట్ విప్పాడు. డెమ్మీసైజు ఫోటో. తలలేని, ఒట్టిమొండెము. తెగిన మెడపై రక్తం. ఎండి, నల్లగా, కమిలి భయంతో బిగుసుకుపోయాడు మనోహరరావు. ఎదురు చూసిన మరణం తప్పించుకుందామన్నా సాధ్యం కాని మరణం. భీకరంగా, కడుపులోని పేగుల్ని తోడేంత భయంకరంగా, టెలిగ్రాం చించాడు." ఫాదర్ కిల్డ్ బ్రూటల్లీ! స్టార్ట్ ఇమ్మీడియట్లీ!"

ఉత్తరం తెరిచాడు "నాయానా!మీ అయ్యను చంపేశారు! దినానికైనా రాకపోతివే! దేనికి భయపడుతూన్నవు. చావుకా? పల్లెకు రావడానికా? లేక మీ అయ్యకా?" అమ్మ వీరపోగు దేవమ్మ. అట్లాగే ఆ ఉత్తరాలపై వాలిపోయి పెద్దగా ఏడవడం మొదులుపెట్టాడు మనోహరరావు.

20

# బ్యాగరోళ్ళు

గుంపు వెంకటేశ్వర్లు

తూర్పు కొండల మధ్య కణకణ మండే నిప్పు కణికలా సూర్య కిరణాలు ప్రకాశిస్తుంటే చీకటి మటుమాయమౌతుంది. పక్షులు, జంతువులు, మేతకు పరుగులు తీస్తున్నాయి. పాలెర్లు పనుల్లో నిమగ్నం అయ్యారు. స్త్రీలు 'పాసికసులు ఊడుస్తూ న్నారు. మరికొందరు బహిర్భూమికి వెళ్తున్నారు'.

ఏనాడు రాని సీతారాం రెడ్డి 'వెలివాడ'కురాగా దండాలు రెడ్డి అని నాగన్న అన్నాడు. ఏమి 'నాగా మీ వెంగళరెడ్డి గతించాడు. నల్గురి బ్యాగరోళ్లకు చెప్పి తొలుకరా అన్నాడు. ఓ ....అట్లాగె రెడ్డి అన్నాడు. సీతారాం రెడ్డి ఇంటికి వెళ్ళిపోయాడు.

నాగన్న, చెన్నయ్య క్రిష్ణయ్య, ఈశ్వరయ్య, నల్గురు బ్యాగరోళ్లు సీతారాం రెడ్డి ఇంటి దగ్గరకు వెళ్లి దండాలు రెడ్డి అని మొక్కారు. ఏమి లేదర్రా మీ నల్గురు నాల్గు దిశలకు వెళ్లి బంధువులకు సావు కబురు చెప్పి రావలిరా! ఆజ్ఞాపించాడు. నల్గురు తమ ఇల్లకు వస్తూ ఏ దిశలకు ఎవరెవరు వెళ్ళాలని చర్చ ప్రారంభించారు.

నాగన్న 'దండగ మాన్యం చేసి విత్తనం వెయ్యాలి ఈ రోజు వెయ్యకుంటే విత్తనమే పడదు ఏమి చెయ్యాలో దిక్కు తోచడం లేదన్నారు''.

ఈశ్వరయ్య తప్పెట మాన్యం వరి పైసాలు కొట్టేది వుంది. ఈ రోజే దరిద్రపు నాయాలు సచ్చాడు పీడ విరుగుడయ్యాంది'' అన్నాడు.

చెన్నయ్య, క్రిష్ణయ్య '' ఈ వృత్తి మనకున్నందుకు ఎన్ని పనులున్నా తప్పదు. ఏమి చేస్తాం అంతా మన కర్మ '' అనీ! నల్గురు నాల్గు దిశలకు ప్రయాణం కట్టారు.

తూర్పు దిశకు నాగన్న భవనాసి దాటి బాపురం, నందికుంటకు పోయి చెప్పాలి. వెళ్ళు చుండగానే 'టిక్కటీవ పిట్ట' అరుపులు శకునమని త్ప్....త్ప్...అంటూ పోతూ సావు కబురు చెప్పబోతే దారి జరగదనీ! మనసులో అనుకొంటూ ఈ పిట్టకు చనిపోయింది ఎలా తెలిసిందో! అరుస్తూ నేను వెళ్ళక ముందే కబురు సీతారాం రెడ్డి బామర్ది బంగిరెడ్డికి తెలుస్తుంది. వారి ఇంటి మీద పిట్ట వెళ్తుంది అనీ! ఆకాశం వైపు చూస్తూ నీరసంతో పోతున్నాడు.

ఈశ్వరయ్య వీరాపురం వెళ్లి బంధువులకు చెప్పాడు. సద్దన్నం వుంటే తినమని వెంగళరెడ్డి వియ్యంకుడు వినాయక రెడ్డి అనగా !-ఈశ్వరయ్య ఇలా అన్నాడు వద్దు రెడ్డి ' సావు కబురు చెప్పడానికి వచ్చినోళ్ళు అన్నంతినకూడ్దు' పొద్దులేదు. ఇంకా ఊర్లకు చెప్పాలి అని వెళ్లిపోయాడు.

చెన్నయ్య చెరుకు చెర్లకు వెంగళరెడ్డి చెల్లి చెంచమ్మకు చెప్పడానికి పోయాడు. సావు కబురు చెప్పగానే 'బోరున విలపిస్తూ అన్న వెంగళరెడ్డి ఊరుకు బయలు దేరింది. చెరుకు చెర్ల నుండి చంద్రగిరి బయలు దేరాడు.

కిష్టయ్య కిష్టాపురంలో వున్న సీతారాం రెడ్డి చిన్నమ్మకు చెప్పి తిరుగు ప్రయాణం పట్టాడు. సీతారాం రెడ్డి చిన్నమ్మ ఇలా అన్నది ' నాకు ఉదయమే అనుమానం వేసింది నా యెడమ కన్ను అదిరిందని ' అంటూ ప్రయాణం కట్టింది.

నల్గురు బ్యాగరోళ్లు సావుకబురు చెప్పొచ్చేటప్పటికి సాయంత్రం ఐదు గంటలు కావస్తున్నది. బంధువులందరు వచ్చారు. ఒక్కరు తప్పా, కూతురు అంకాలమ్మ అమెరికా నుండి రాలేదు. ఫాక్స్‌లో మెసేజ్ ఇచ్చారు. వస్తున్నామని కబురు అందింది'

సీతారాం రెడ్డి బ్యాగరోళ్లను పిలిచి ఎలా చెయ్యాలి చెప్పండి అన్నాడు. 'మీ తాతల కాలం నుండి దహనం చేసే ఆచారం వుంది. పూడ్చే పద్ధతి లేదన్నారు' రాత్రి ఎనిమిది గంటలు కావస్తుంది. ఉదయమే దహనం చేసే ఏర్పాట్లు చేస్తే బాగుంటుంది అని సలహా ఇచ్చారు.

వెంగళరెడ్డి మిత్రులు అనుభవాలు- పెనవేసుకొన్న అనుబంధాలు నెమరు వేసుకొంటున్నారు. రాత్రి పది గంటలు కావస్తుంది. దాసరి చంద్రయ్య బేతాళకథ ప్రారంభించాడు' భార్య భారతమ్మ మరణ వార్త వినగానే 'స్పృహ' కోల్పోయి తేరుకోలేదు.

'కొక్కరకో..! అని కోడి కూత కూయగానే అమెరికా నుంచి అంకాలమ్మ భర్త భద్రారెడ్డి అంబాజడర్ కార్లో దిగారు. ఒక్కసారి నిశబ్ధ వాతావరణం అలుముకున్నాది. వెంటనే దుఃఖసాగరం, బేతాళకథ కొనసాగుతుంది. చనిపోతే ఎవ్వరి వెంట ఏమి పోదు మనిషికి మిగిలేది మంచి -చెడు ఈ రెండే! ఈ మూడునాళ్ళకు ఇంత మురిపాలు - జీవితం నీటిమీద గాలి బుడగ లాంటిది. ఎప్పుడారిపోతుందో ఎవ్వరికి తెలియదు. మరణిస్తే ఎక్కడికెళ్తారు. అందరి ప్రశ్న - 'మనిషిలో పంచభూతాలు ఉన్నాయి. నీరు - నీటిలో కలుస్తుంది. ఆత్మ - ఆకాశంలో విలీనమౌతుంది. గాలి - గాలిలో కలుస్తుంది. మట్టి శరీరం - మట్టిలో కలుస్తుంది. తేజస్సు - అగ్నిలో కలుస్తుంది. మహాత్ముడు బుద్ధుడు చెప్పాడు అని కథను ముగించాడు. రాత్రి ముగిసింది.

సీతారాం రెడ్డి ఉదయాన్నే బ్యాగరి నాగన్న ఇంటికి వచ్చాడు. 'నాగా ' ఏమి తేవాలో చెప్పు అన్నాడు. " బండి కట్టెలు , ఒక ఉప్పు సంచి - ఒక డబ్బా కిరోసిన్ - మూడు మీటర్ల సైను గుడ్డ - ఒక కడవ - చిన్నసైజు కుండా - రెండు బొంగు తుంటలు నారపీసు చొప్ప కట్టెలు " తెమ్మని చెప్పాడు. తొందరగా ...రా ...అని చెప్పి వెళ్లాడు.

నాగన్న మనుమడు ఏంటి...! తాతయ్య సీతారాం రెడ్డి మన ఇంటికి వచ్చాడు. వెలివాడ అంటేనే చీధరించుకొనేవాడు. మరేమో ... మీరు 'కిరోసిన్ - బండి కట్టెలు - తెమ్మంటున్నారు. కొంపతీసి ఎవరన్నా... కాల్చడానికా ఝ' అనగా అవును బాబు అన్నాడు.

వెంకటేష్ 'తాతయ్య ....తాతయ్య నాకు ఒక చిన్న అనుమానం ' ఎప్పుడు నీకు అనుమానాలే చెప్పు త్వరగా అని నాగన్న అన్నాడు.

వెంకటేష్ తాతయ్య ... సీతారాం రెడ్డి వెలివాడకు రాడు. అ...! ఇప్పుడెందుకు వచ్చినాడు. అవసరం ఉంది కనుక! ఊర్లో ఎవరన్నా చనిపోతే మనం గుంత లెందుకు తియ్యాలి. శవం

మనమెందుకు కాల్చాలి?? ఎవరింట్ల చనిపోతే ఆ ఇంటివాళ్ళే ఆ పని చేసుకోవచ్చు కదా....! ఆ ...మన చిన్న తాతయ్య చనిపోతే నీవేగా ....గుంత తీసింది. సీతారాం రెడ్డి తీశాడా? లేదే ! మనకెందుకు ఈ చాకిరి తాతయ్య చెప్పవా...? అన్నాడు.'

'అబ్బో పెద్దమాటలు నీకెందుకురా... అన్నాడు. 'తాతయ్య ....తాతయ్య చెప్పకుంటె పచ్చి మంచినీళ్లు కూడా ముట్లను. నీ మీద ఒట్టు' అని మొండికేశాడు.

నాగన్న చెపుతాను బాబు ' మన తాతల కాలం నుండి బ్యాగరి పనిచేస్తున్నాం. ఈ ఆయకట్టు అనేది పూర్వం అంటగట్టిందే ఇలా చెయ్యడం వల్ల ఊర్లో గౌరవిస్తారు. మర్యాదుంటుంది. అన్నాడు.'

వెంకటేష్ ' తాతయ్య ఊర్లో ఎక్కడుంది గౌరవం. ఎక్కడిస్తారు మర్యాద. ఎవ్వరిస్తారు మర్యాద ???? ఈ చాకిరి కోసం ఎన్ని పనులున్నా వదులుకొని వెళ్ళాలి ఎంత డబ్బు ఇస్తారు. ఇంకేదైనా ఇస్తారా ....' అని అడిగాడు.

నాగన్న ' ఇస్తారు బాబు తెల్లటి సైను గుడ్డ శవంపై కప్పుతారు అది మనకే ! శవం కాల్చేటప్పుడు కిరోసిన్ మిగులుతుంది. వచ్చేదారిలో 'తవాలు' పరుస్తే బంధువులు కుటుంబ సభ్యులు తలాకొన్ని చిల్లర పైసలు వేస్తారు. కల్లుకిస్తారు. దినవారాలు చేస్తే పిండాకూడు పెడుతారు. పండుగ దినాల్లో వాళ్ళు చేసుకొన్న పూర్ణకుడుములు వేస్తారు. పరమాణ్ణం పోస్తారు. ఇవన్నీ మనకు ఉపయోగమే కదా... బాబు' అన్నాడు.

వెంకటేష్ తాతయ్య 'ఇన్ని ఉపయోగాలున్నా యంటున్నావే! ఇలాంటి అవకాశాలుంటే మనకెందుకు వదిలేస్తారు?? ఈ వృత్తి వారే చేసేవారు కదా...! ఎవ్వరికి రానిచ్చే వారు కాదు. వెట్టి చాకిరి కాబట్టె మనకు వదిలేశారు. ఆ చాకిరి చెయ్యబట్టె మనం ఇలా అయపోయాయు. అందుకే ! ఊరవతల వెలివేశారు. ఎంతో శ్రమపడి ఊరు...ఊరు...సావు కబురు చెప్పి...వారి బంధువుల ఇళ్లకు పోతే కూర్చోమని మాట వరుసకన్నా చెప్పారా... లేదే? ఇంత చాకిరి చేసినా ఆ గౌరవపరచినపుడు ఈ చాకిరి ఎందుకు చెయ్యాలి??' తాతయ్యా.

నీవు పిల్లోణిగా వున్నపుడు శవం కాలుస్తుంటే శవం లేచి కూర్చున్నదని, నీతో పాటు వచ్చిన బ్యాగరోళ్ళు దయ్యమని పారిపోగా ...నీవు బయపడుతుంటే మీనాన్న శవాణ్ని కట్టెతో అదిమి పట్టి , ఉప్పు చల్లగా శవం కూలబడిందని, భయంతో జ్వరం రాగా నెలరోజులు మంచం పట్టానని నాతో చెప్పేవాడివి కదా...! జ్వరం వస్తే డాక్టరుకు చూపిస్తారా... లేదే!

నాగన్న బాబూ మాట్లాడుతూ వుంటే ఆలస్యం అయితే! సీతారాం రెడ్డి వస్తాడు అనీ... అనకనే...వెంకటేశ్ అవును తాతయ్య వారి 'గర్జు' ఎన్నిసార్లైనా వస్తారు అన్నాడు.

వెంకటేష్..... తాతయ్య..... ఒక్క మాట చెప్పనా 'ఈ వృత్తి వద్దు శవాల మీద కప్పె బట్టలు దినవారాలకు పెట్టె కప్పె బట్టలు దినవారాలకు పెట్టే పిండాకూడు, పండుగలు నాడు వారు తిని మిగల్తె పెట్టె పూర్ణం కుడుములు, పరమాణ్ణం, శవంపై చల్లె చిల్లర, వారి బంధువులు ఇచ్చె చిల్లర పైసలకు ఆశ పడవద్దు. ఈలాంటి వెట్టిచాకిరి చేస్తే సమాజంలో గౌరవం వుంటుందా? ఏనాడో కులవృత్తులకు గౌరవం ఉండెడిది. ఇప్పుడు అలాంటిదేమి లేదు' అన్నాడు.

. నాగన్న బాబు 'కులవృత్తి మానురా గువ్వల చెన్నా' నేటి యువకవి చెప్పాడన్నాడు.

నాగన్న - చెన్నయ్య, -కిష్టయ్య, ఈశ్వరయ్య వీరు వెంకటేష్ 'పిల్లోడైనా తెలివి గలవాడే తండ్రిని మించిన తనయుడే' అని ఆనందపడ్డారు.

వెంకటేష్ 'మనదేశానికి అతి ప్రాచీన నామము 'జంభూద్వీపము' దీనికి - గ్రీకులు 'ఇండియా' అని పేరు పెట్టారు. పారశీకులు 'హిందూ' అని పేరు పెట్టారు. ఈ రెండు సార్లు కూడా 'సింధూ' నది అపభ్రంశ రూపాలుగా మనం గమనించాలి. ఆనాటి జంభూద్వీపానికి వారసులు 'నిమ్నకులాలే' వీరుమల్ల సామ్రాజ్యాలు నిర్మించి మాలలుగా జైనమతంలో 'మహా' 'దిగంబరులు' క్రమముగా మాదిగలుగా మారినట్లు వాటిలోని తెగనే 'బ్యాగరొళ్లు' అని చరిత్రను బట్టి తెలుస్తుంది. అని అనగా.....! తాత ఏ చరితక్రారుడు చెప్పాడనగా....! మాల - మాదిగల ప్రాచీన చరిత్ర గ్రంథం వ్రాసిన చరిత్ర పరిశోధకుడు బొనిగల రామారావు అనగా..... ఓహో...... ఇంత గొప్ప చరిత్ర' వుందా అని ఆశ్చర్యపోయాడు.

వెంకటేష్ తాతయ్య మీరు ఒకటి చెప్పారు. నాకు బాగా గుర్తు 'కొంటోని బావిలో కోటమ్మ దూకి చనిపోయిందని బావి పూడులో కూరుకుపోగా శవం తల వెంట్రుకలు పట్టుకొని దాసరి చిన్నాగన్న పైకి తెచ్చాడు. చెవుల, కమ్మలు, ముక్కురాళ్లు, కాళ్ళ కడియాలు తియ్యడానికి బంధువులు బయపడ్డారు. ధైర్యంతో దాసరి చిన్నాగన్న తీశాడని, ఆమె బ్రతికున్నప్పుడు దూరముండండి. చిన్నా - పెద్దా తేడా లేదా! అనెడిది. శవమైనందుకే మాట్లాడలేక పోయింది. 'మతంలో సమానత్వం లేదు, సమాజంలో అసమానతలు సాంఘీక దురాచారాలు ఆర్థికంగా అణిచివేస్తున్నారు. అని చెప్పేవారు కదా....! నిర్జీవులుగా ఎంతకాలం బ్రతకాలి తాతయ్య! దేశానికి స్వాతంత్ర్యం వచ్చి ఇన్ని ఏళ్ళు పూర్తి అయినా సోదరభావం లేదు. మనిషిని మనిషిగా చూడటం లేదు? ఈ వ్యవస్థ ఎప్పుడు మారుతుంది. వెట్టిచాకిరి చేసినంత కాలం మారదు? బిచ్చాటన చేసే బిచ్చగాళ్ళు 'వెలివాడ' కు వచ్చి బియ్యం అడిగితే.... లేవు బువ్వ (అన్నం) పెడతాం అంటే.... ఎవరు తింటారు మీ బువ్వ అని! మొఖం మీదే అనేసి వెళ్తారు. బిచ్చగాడికి కులం ఎందుకు? ఇది ప్రజాస్వామ్యం కాదు కులస్వామ్యం' అన్న కవి మాటలు నిజం తాతయ్య అన్నాడు.

నాగన్నబాబూ 'సమాజంలో చాలామంది ప్రజలు అట్టడుగు జీవితాన్ని అనుభవించడానికి కారణం పాపభీతి - భయం - భక్తి - హేతువు లేని అంశాలు ఆశక్తి దీని కంతటికి మూలం అజ్ఞానం 'తమ సోమా జ్యోతిర్గమయ' అని ఉపనిషత్తులు చెపుతాయి 'చీకటి నుండి వెలుగు వైపు పయనించడమే' మన కర్తవ్యం ఈ దృష్టితో నీ చుట్టు వున్న ప్రజలకు అవగాహన కల్గించుటతో పాటు వారికి విద్యను నేర్పించడానికి ప్రయత్నం చేయి' అప్పుడే వ్యక్తిగా వున్న నీవు శక్తి అవుతావు. వ్యక్తి వల్ల వ్యవస్థ మారదు. సమిష్టి చైతన్యమే మార్పుకు మూలం' అని అన్నాడు.

చెన్నయ్య, కిష్టయ్య, ఈశ్వరయ్య వీరు బాబూ వెంకటేష్ 'మీ తాత మాకు జిజ్ఞాసను సృజనాత్మకథను పెంపొందించి చైతన్యాన్ని నూరిపోశాడు. మేము గ్రామ గ్రామాన 'మా-భూమి' లోకాన పిచ్చోల్లు' 'మరో ప్రపంచం' 'దేశంలో దొంగలు పడ్డారు' మొదలగు నాటకాలు వేస్తూ ప్రజలను చైతన్యపరుస్తున్న నేపథ్యంలో మీ తాతపై దాడి చేశారు. మీ అవ్వ ప్రజాగాయకురాలు. పాటల ద్వారా ప్రజలను ఆవేశపరుల్ని చేసి రెచ్చగొడుతుందని కుట్రవన్ని అర్థరాత్రి గుడిశెలు తగలబెట్టారు. 'వెలివాడ స్మశాన వాటికయ్యింది' అమాయకులెందరో బలైపోయారు. మీ అవ్వ

అరుణక్కమంటల్లో మల మల మాడిపోయింది. మీతాత బ్రతికి బయట పడ్డారు. ఇంత మారణహోమానికి కారకుడు వెంగళరెడ్డి అని చెప్పగా వెంకటేష్ రక్తం ఉడికిపోయింది.

వెంకటేష్ - మీరు కాల్చడానికి వెళ్లొద్దు 'నేనొక్కణ్ణే ఆ నయవంచకుణ్ణి కసితీరా కాలుస్తా మల మల మాడి బూడ్డి అయ్యే వరకు అక్కడే వుండి మా అవ్వ 'అరుణక్క'కు ఆత్మ శాంతి 'వెలివాడ' కు మనశ్శాంతి కల్పిస్తాను. శవంపై కప్పెగుడ్డ, చిల్లరపైసలు - శవంపై చల్లి వెంగళరెడ్డిని దహనం చేస్తానని చెప్పి పోయాడు.

చెన్నయ్య, కిష్టయ్య, ఈశ్వరయ్య, నాగన్న ఇలా అనుకొంటున్నారు. ఈ చాకిరి వద్దని చెప్పినోడు. మాటలు విని ఎంత మార్పు చెందాడా...! అని ఆశ్చర్యపోయారు.

వెంకటేష్ తనమాట చెప్పిన ప్రకారం తంతు ముగించుకొని వచ్చాడు. 'వెంగళరెడ్డి దినవారాలకు పెట్టె అన్నానికి ఆశపడి ఎవరు వెళ్ళొద్దు అది రక్తం కూడు' పిలిచినా వెళ్ళొద్దు అని చెప్పగా 'వెలివాడ సాక్షి'గా మీ మాటకు కట్టుబడి వుంటాము మేము మనుషులమే వ్యక్తిత్వం ముంది. నైతిక విలువలతో, ఆత్మ గౌరవంతో జీవిస్తాం. స్వేచ్ఛ స్వతంత్ర్యాల కోసం, సమాన హక్కుల కోసం పోరాడుతాం తరతరాల నుండి సంక్రమించిన నిర్ధేశించిన నిర్బంధం ఈ కులవృత్తైన వెట్టిచాకిరి నేడే మానేస్తున్నాం! అని 'ప్రతినభూనారు 'బ్యాగరోళ్లు'

"సమాప్తం"



21

# అయిదవవాడు

## బి. యస్. రాములు

- ప్రియమైన సుమలతా !

కలల్లో కళ్ళల్లో కదలాడుతున్న ప్రేయసీ ! హంస రాయభారం ఫలించని దయమంతీ !ప్రవరాఖ్యుని పొందని ప్రియ వరూధినీ ! ముని ఆశ్రమ శకుంతలా ! ఈ దుష్యంతుడికి భరతుడిని ఎప్పుడు కని యిస్తావు. చారుదత్తుని పొందని ప్రియ వసంతసేనా ! ద్రౌపతీ పంచభర్తృకా !అహల్యా శాపవిమోచనీ ! నిన్ను చూడక ఎన్నాళ్ళయిందో, నా అణువణువై నిన్ను చూడాలని నిన్ను స్పర్శించాలని ఎంతగా పరితపిస్తున్నదో.

సుమా ! అనుపమా!గాలవ్యునికి శరీరం అద్దెకివ్వబడిన మాధవీ! మహాభారత మూలపుటమ్మ మాధవిలా ఎన్ని యుగాలు గతించనీ .... తిరిగి తిరిగి బయల్దేరిన చోటకే చేరుస్తావని ఎదురు చూస్తాను నీ కోసం జీవితమంతా చకోరమై ఎదురు చూసే మనిషొకరున్నానని క్షణమైనా గుర్తుంచుకో, నాకు జీవితాన్ని విశ్వాసానిచ్చిన నా హృదయేశ్వరీ ! నీ నిర్ణయం ఒక జీవితాన్ని వెలిగిస్తుందని మరిచపోకు.

ఇపుడు చక్కని సందర్భం కల్గివచ్చింది. మన ధర్మరాజు కూతురు పెళ్ళికి నువ్వు ఒకరోజు ముందుగానే తప్పక వస్తావు. మనం ఇంద్రప్రస్థ లాడ్జిలో కలుసుకుంటాం. నువ్వు తప్పక వస్తావనీ నేను నిన్ను కలుస్తాననీ, నా కలల రాణిని చూస్తాననీ నీలో ఐక్యం అయ్యే ఆ ఘడియ కోసం అనుక్షణం ఎదిరి చూస్తూ

- నీ అయిదవ వాడు"

క్రితం రోజు పెట్టిన చోటే ఉన్న ఉత్తరాన్ని తీసి మరోసారి చదువుకుంది సుమలత. ఆ ఉత్తరం మెరుపై, ఉరుమై, కుండపోత వర్షమై సుమలత పూర్తిగా తడిసిపోయింది. ఆనందంతో అణువణువూ ఉత్తేజంతో నవయవ్వనం - గడ్డకట్టిన ఎద మంచు గుహలో విద్యుత్ ప్రవాహం -

రత్నాకర్ ఆ ఉత్తరం చదివితే ఎంత బావుండు అని కనపడేట్టు టేబిల్ మీద పెట్టింది సుమలత. రత్నాకర్ చదవాలి. చదివి ఎవడీ అయిదవ వాడు అని అడగాలి మిగతా నలుగురు ఎవరు అని గొంతు చించుకొని అరవాలి. తాను ద్రౌపదిలా చిరునవ్వు నవ్వి చెప్పాలి. అతనిలో కసిరేగాలి. అని కోరుకుంది సుమలత కాని రత్నాకర్ ఆ ఉత్తరం చూసినట్లు లేదు. పిల్లలైనా చూసి డాడీకి చూపినట్టు లేరు అందుకు నిరాశపడిపోయింది సుమలత.

ఆ ఉత్తరం చదివితే రత్నాకర్ తనకు విడాకులిస్తాడు. తానూ అదే కోరుకుంటోంది. తన గురించి ఎన్ని పుకార్లు ప్రచారం అవుతాయో. అయినా అతను చదివితే బావుండేది. తాను కాలేజి

లైఫ్‌లో ఎంతమందికి కలలరాణిగా బతికిందో అందరికీ తెలియాలి. తన ఓరకంటి చూపుతో ప్రేమ పూరిత స్వర్వతో తన మాటపై గౌరవంతో ఎంతమంది చదవి ఉద్యోగులై జీవితాలు గెలుచుకున్నారో అందరికీ తెలియాలి.

కాలేజ్ లైఫ్‌లో, విద్యార్థి సంఘాల్లో తిరిగినపుడు ఎన్ని సభలు, ఎన్ని సమస్యలు ఎంతమందిని ఆర్గనైజ్ చేయడం, పగలూ, రాత్రీ...ఎంత ఉత్సాహం. ఎంతమంది స్నేహితులు ఎంత ఉత్తేజం.ఆ కలలన్నీ ఏమయ్యాయి. ఇపుడు జీవిస్తున్నది అసలు జీవితమేనా! వంటింటికి పరిమితమై గాలవ్యునికి అద్దెకివ్వబడిన మాధవిలా మారిపోయిన బతుకు. అయిదవ వాడు ఎంత అద్భుతమైన పోలిక తెచ్చాడు. మహా భారత గాథ - అనుపమా నిరంజన నవల - మాధవి - చదవమని తానే అతనికిచ్చింది. అయిదవ వాడు - అయిదవ వాడు - దయానంద్ ! ఎంత అందమైన కల. ప్రవరాఖ్యుని పొందని ప్రియ వరూధినీ - ఆట ! కానీ తాను రత్నాకర్‌లో వరూధినిలా ప్రవరాఖ్యుని పొందగలిగిందా! నేను కర్ణున్ని కాదు సుమా! అన్న దయానంద్ ! దయానంద్‌కు ఒక భరతుడిని కని వుంటే - ఎందుకు వదులుకుండా అదృష్టం ...

ఘనీభవించిన జ్ఞాపకాలు కలగిన ప్రవాహం.

నిన్ను ప్రేమిస్తున్నాను సుమలతా దయానంద్ నేల చూపులు. మాట తడబాటు

“పదిహేడు ” అనుకుంది తాను. కాని పెదవులు విడివడలేదు.

“నిజం సుమలతా ! మనం పెళ్ళి చేసుకుందా ” ఈ సారి కళ్ళల్లోకి చూశాడు దయానంద్ అతని కళ్ళల్లో ఆత్మ విశ్వాసం. నిజాయితీ, అమాయకత్వం. ఆ చూపులో ఒక వెలుగు. కళ్ళూ తల్లి అణువణువూ పులకింత.

కాసేపటికి నవ్వొచ్చింది. ఈ ప్రపంచాన్ని జయించినపుడు కలిగే నవ్వు ఆ ఆనందంతో అకస్మాత్తుగా అనేసింది తాను.

“అయిదవ వాడు”

ఆ మాటతో ఉలిక్కిపడ్డాడు దయానంద్. అతని కళ్ళల్లో గిర్రున తిరిగిన కన్నీళ్ళు అతని శరీరం ఒక్కసారిగా ముంచుకుపోయింది. అతని హృదయం మూగబోయింది.

“సుమలతా ! సారీ ! నీవు కూడా కులమతాల్ని పట్టించుకుంటావని తెలియదు. ఎదుటి వారికి ఆయాచితంగా దొరికే ఆయుధం అయిదవ వాడు అనే తిట్టు. అయిదవ వాడికి ప్రేమించే హక్కు లేదా! ” అవమాన భారంతో గిరుక్కున వెనుదిరిగిన .దయానంద్.

తనకా విషయం తట్టలేదు. ఎంత పొరపాటు అర్థం వచ్చింది. దయానంద్ ఇలా ఫీలయ్యాడేమిటి ? తాను అనుకున్న దేమిటి ! అతను అర్థం చేసికొన్నదేమిటి ! అరక్షణంలో అర్థమై“ దయానంద్ ”అంటూ అకస్మాత్తుగా కేక వేసింది. అతను క్షణం ఆగాడు. గబుక్కున అతన్ని చేరింది. వప్పించ్చింది. తాను చేసిందేమిటో తెల్సాక తనలో వణుకు. జరిగిందేమిటో తెల్సి అతనిలో ఆశ్చర్యం కన్నీళ్ళే ఆనంద బాష్పాలుగా ఉక్కిరి బిక్కిరి.

దయానంద్‌ని చేయి పట్టి ఆపింది. ఆచేతినుండి తనలోకి ప్రవహిస్తున్న విద్యుత్తు ” సారీ దయానంద్ ! నిన్ను అవమానించాలని ఆమాట అన్లేదు” అని బతిమాలింది. బతిమాలినకొద్దీ అతని పట్టుదల పెరిగింది. అయితే అయిదవ వాడు అని ఎందుకన్నావ్ అని అతడడిగిన ప్రశ్నకు ఏమని జావాబు చెప్పగలదు. చెప్తే తన పట్ల అతనికెంత నీచాభిప్రాయం కలుగుతుందో అయినా సరే... అతన్ని అవమానించలేదని నిరూపించుకోవాలి.



"దయానంద్ ! అపార్థం చేసుకోవద్దు నన్ను పెళ్ళి చేసుకుంటానన్న వారిలో నువ్వు అయిదవ వాడివి. నిన్నుప్రేమించానని చెప్పిన వారిలో నువ్వు పదిహేడో వాడివి. అది గుర్తొచ్చి నవ్వానే తప్ప నిన్ను అవమానించాలని కాదు. సారీ దయానంద్"

తన మాటతో దయానంద్‌లో కొత్త ఆశ్చర్యం అసహించుకునే బదులుగా అతనిలో సిగ్గు.

"సుమలతా ! నాకు సిగ్గుగా ఉంది. నేను నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను మొదట్నుంచీ ప్రేమిస్తున్నాను. నా ప్రేమను వ్యక్తం చేయడానికి ధైర్యం చాలలేదు. దానివల్ల ఒకటవ వాన్ని కావాల్సిన నేను పదిహేడో ర్యాంకులో పడిపోయాను. నేను ఒకటవ వాన్ని. అయిదవ వాన్ని కాదు సుమలతా!"

అతను తన నిజాయితీని నిరూపించుకోవడానికి ఎన్ని సంగతులో గుర్తు చేశాడు అప్పుడు గానీ అతను అందరికన్నా మొదట్నుంచీ తనని ప్రేమిస్తున్నాడని విశ్వాసం కుదరలేదు. దయానంద్‌ను మరింత ఉడికించడానికి అంది తాను.

"అయినా దయానంద్ ! నీ హృదయంలో భావం కలిగినప్పటిది నీ లెక్క కానీ వ్యక్తం చేసి చెప్పినపుడే నాకు చేరుతుంది. కనక నా లెక్కే సరైనది. నీవు అయిదవ వాడివి. నలుగురి తర్వాతే నీ హృదయం నా కందింది. నా జ్ఞాపకాల్లోనూ నీ సంఖ్య అయిదవదే. "

"సుమలతా ! అలా అనకు ప్లీజ్. నీ కోసం ప్రాణం యిస్తాను నువ్వు నిరాకరిస్తే బ్రహ్మచారిగా ఉండిపోతాను. కాలేజీ మానేయమంటే మానేస్తాను నన్ను నమ్ము..."

అతని మాటల్తో తనలో ఎంత ఆత్మ విశ్వాసం. సాయంత్రం శైలజతో యువరాణిలా ఫోజు కొట్టి చెప్పింది తాను.

"శైలూ ఇపుడు నా స్కోరు పదిహేడు - అయిదు నీ స్కోరు మూడు ఒకటి దాటలేదు. ఇప్పటికైనా ఒప్పుకుంటావా ! ప్రేమించబడ్డానికి అందం ఒక్కటే ముఖ్యం కాదని హృదయ సౌందర్యంతో ఎదుటి వాళ్లు తమ ప్రేమను వ్యక్తం చేసే అవకాశం యిచ్చే విధంగా స్నేహంగా, సహృదయంగా ఉండడం ముఖ్యమనీ "

శైలజ తనతో ఏకీభవించలేదు. తాను ఎంతో అందంగా ఉన్నానన్న గర్వపు చూపులు వదులుకోలేదు.

"అందంగా లేననే ఇన్ఫీరియారిటతోనువ్వు అందర్నీ వలలో వేసుకోవాలని కావాలని ప్రయత్నించిన ఫలితం యిది " అంది శైలజ.

"రైట్ శైలూ ! నేను అందంగా ఉన్నానని నీతో ఎప్పుడు చెప్పాను.?

మూతిమీద మీసాలు మగరాయుడి ముఖం. నిన్నెవరే ప్రేమించేది. అని నీవు చెప్పకపోయి వుంటే నాకీ చొరవా పట్టుదలా పెరిగి ఉండేది కాదు. పదిహేడు మందితో ప్రేమించబడేట్టు చేసికోవడానికి నువ్వే కారణం థాంక్సు"

ఈ అయిదవ వాడు ప్రవరాఖ్యుడని విన్నాను. నీ వలలో ఎలా పడ్డాడే. నీ హృదయంలో యింకెంత మందికి చోటిస్తావు ఎవర్నో ఒకర్ని ఓకే చేయరాదూ.

మిగతావాళ్లు ఆశ వదులుకుంటారు" అంది శైలజ.

"అబ్బో ! ఆశ. వారిలో ఒకర్ని కొట్టేద్దామనా ? నేను ఎవర్నీ వదులుకోను. శైలూ! నేనీ విశాల విశ్వాన్ని ప్రేమిస్తున్నాను. నేనీ ప్రపంచాన్ని కన్న తల్లిని. నా మాతృ హృదయం ఈ విశ్వమంత

విశాలమైనది కులమత వర్గాతీత నవ సమాజ నిర్మాణం కోసం నా హృదయం అందర్నీ కలుపుకుంటుంది.

"సుమా ! నీ కవిత్వం కట్టి పెట్టు. ఎవర్నో ఒకర్ని ఓకే చేయవే. నీకూ, వాళ్ళకూ మంచిది.

'శైలూ నీకు రాజకీయం అర్థం కాలేదు. ఓకే చేస్తే మిగతా వాళ్ళంతా నన్ను వదిలిపోతారు. అది నా కిష్టం లేదు. నా ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సును తొలగించుకోవడానికీ అందంగా ఉన్నానే నీలాంటి వారి గర్వం అణచడానికి నేనిలా ఉండకతప్పదు.

మరుసటి రోజు దయానంద్‌తో అంది తాను అందరితో అన్నట్టుగానే

"దయానంద్ ! డిస్టింక్షన్ తెచ్చుకున్నవారికే నా ఓటు.

దాంతో దయానంద్ విద్యార్థి రాజకీయాలకు దూరమైనా చదువుకు దగ్గరయ్యాడు అటు తర్వాత ఢిల్లీ జె 'ఎన్' యూలో చేరాడు. అక్కన్నించి కూడా ఉత్తరాలు రాస్తుండేవాడు. తాను జవాబిచ్చేది కాదు. క్రమంగా అతని ఉత్తరాలు తగ్గిపోయాయి. లక్నోలో ఉద్యోగం సంపాదించాడు.

బహుశా అపుడు రాసిన ఉత్తరమే పెద్ద ఉత్తరం. అతని ఉత్తరంలో ఎంత ప్రేమ గాఢత తాను విద్యార్థి రాజకీయాల్లో పడి అతని ప్రేమని నిర్లక్ష్యం చేసింది.

పదహారుమంది సెలక్టు కాకపోతేనే పదిహేడోవాడికి యింటర్వ్యూ కాల్ లెటర్ పంపిస్తావా, నీ నిర్ణయం కోసం ఎదిరి చూసే ... నీ అయిదవ భర్త ....

ఈ చివరి వాక్యాల్లో అతని కోపమూ - ప్రేమ గాఢతా రెండూ వ్యక్తమై తాను చలించి పోయింది. కానీ ఉత్తరం రాయలేక పోయింది. స్నేహితురాలింటికి వెళ్తున్నానని చెప్పి లక్నో వెళ్ళింది.

అకస్మాత్తుగా దిగిన తనను చూసి దయానంద్ ఎంత పొంగిపోయాడు. ఆవారం రోజుల ఆనందానుభూతుల్ని తాను జీవితంలో మరువగలదా ! అలహాబాద్, సింగార్ నగర్ ,రాజాజీ పురం,ఎన్నెన్ని వాడలు తిప్పాడు. ఎంతమంది స్నేహితులకు పరిచయం చేశాడు. చిడియాఘర్ (పక్షుల జాతీయ జూపార్క్) లో పచ్చని గడ్డిలో చల్లని చెట్ల నీడలో ఎన్నెన్ని ఊసులు -

లక్నోనుండి రెండు గంటల దూరమైనా లేని కాన్పూర్ లక్నో కన్న ఎంత భిన్నంగా ఉంటుందీ లక్నోలో ఎన్ని రకాల హిందీలున్నాయో చెప్తే ఆశ్యర్యపోయింది. జాతీయ భాషగా హిందుస్తానీ ఉండాలని కోరిన గాంధీ ఆశయానికి భిన్నంగా హిందుస్తానీ నించి ఉర్దూ పదాలన్నీ తొలగిస్తూ సాంస్కృత పదాలతో నింపిన హిందీని రుద్దుతూ వస్తున్న క్రమాన్నీ - దాన్ని వ్యతిరేకిస్తూ సాగుతున్న ముస్లిం రచయితల్నీ వారి ఉద్యమాల్ని ఎంత చక్కగా పరిచయం చేశాడు. ఆశ్చర్యకరమైన విషయం -ఒక్క ఉత్తర ప్రదేశ్‌లోనే ఎనిమిది రకాల హిందీ వాడకంలో ఉందట ..దయానంద్ ప్రతి విషయాన్ని ఎంత సునిశితంగా పరిశీలిస్తాడో.

"నీ వీపులోని ఈ చిన్న పుట్టుమచ్చ కుడి చెంపపై ఉంటే ఎంత అద్భుతంగా ఉండేదో సుమలతా !" అన్నప్పుడు తాను చకితురాలైంది. తన వీపులో పుట్టుమచ్చా? అతనెప్పుడు చూశాడు. తనని అంతగా పరిశీలిస్తూ చూస్తాడనుకునే సరికి ఒళ్ళంతా సిగ్గుతో ముడుచుకుపోయింది.

లక్నోనించి కొన్నేళ్ళకు సరిపడా ఆనందానుభూతుల్ని నింపుకొని యిల్లు చేరింది తాను. వాళ్ళింటికి వెళ్తానని చెప్పిన శైలజే తనని వెతుక్కుంటూ యింటికొచ్చి రెండు రోజులుండి వెళ్ళిపోయింది. ఇక ఎన్ని చెప్పినా ఊ కొట్టారే గానీ నమ్మినట్టు కన్పించలేదు ఇంట్లో-

శైలజను ప్రేమించిన రత్నాకర్ తనను పెళ్ళి చేసుకోవడానికి అంగీకరించడం ... ఆశ్చర్యం అన్పించింది. భగ్న ప్రేమికుడితో తన వైవాహిక జీవితం ... అంతకన్నా ఆశ్చర్యకరంగా శైలజ

దయానంద్‌ని పెళ్ళి చేసుకోవడం. ఏడాది వ్యవధిలో ఎన్నిఊహించని మలుపులు తిరిగాయి జీవితాలు.

పొరపాటు తనదే. దయానంద్ రెగ్యులర్‌గా రాసే ఉత్తరాలకు జవాబిచ్చి ఉంటే యిలా జరిగి ఉండేది కాదు. విశ్వనాథ ఏకవీర నవలలోలా జీవితాలు తారుమారై ఉండేవి కాదు.

ఆకాశంలో నీవే...అంతః హృదయంలో నీవే... శైలజలో నీవే...నా జీవిత వికాసంలో నీవే ... అంటూ దయానంద్ ఉత్తరం రాసినపుడు తనకు అయిదో నెల...

శైలజ యింత మోసం చేస్తుందని ఎవరూ అనుకోలేదు. దయానంద్ ఆసరాతో జె.ఎన్.యూలో చేరిన కృతజ్ఞతైనా లేకుండా అతన్ని నట్టేట ముంచింది. కూతుర్ని కని అతని ముహాన పడేసి మరొకర్ని చేసుకొంది. తర్వాత అతన్ని వదిలి మరొకరితో అమెరికా వెళ్ళిపోయింది. దయానంద్ ఎంత గొప్ప భావకుడు - కూతుర్ని ఒక తల్లిలా పెంచుతున్నాడు.

దయానంద్ కష్టాలు వింటుంటే తాను రత్నాకర్‌కు విడాకులిచ్చి పిల్లలతో సహా దయానంద్ దగ్గరికి వెళ్ళిపోవాలనిపించేది.

శైలూ దయానంద్‌కు అన్యాయం చేయకు. అతడొక దేవుడు'' తమ పాప రెండో పుట్టిన్రోజు కొచ్చినపుడు అంది తాను.

"సుమా ! నా లక్ష్యం నెరవేరేదాకా నే నెవరినీ లెక్కచేయనని నీకు తెల్సు. నాకు ప్రేమించడం రాదని వెక్కిరించావు. నీపై ప్రతీకారం తీర్చుకున్నాను. దయానంద్‌ను నీకు దూరం చేయగలిగాను. లక్నోలో ఉద్యోగం వచ్చాక నావాడిగా మార్చుకున్నాను. సుమలతా నిన్ను గాఢంగా ప్రేమిస్తోంది అని రత్నాకర్‌కు అబద్ధాలు చెప్పిందీనేనే జీవితంలో ఎవరూఅందుకోలేని ఉన్నత శిఖరాలనందుకోవాలన్నదే నా లక్ష్యం.''

ఆశ్చర్యపోయింది తాను. లక్నోలో నెలరోజులుండి అతన్ని ఆకర్షించింది. తన వల్ల తప్పు జరిగిపోయిందని దయానంద్ కుమిలిపోయాడు. శైలజకోరుకున్న లక్ష్యం నెరవేరింది. పశ్చాత్తాపంతోఅతను పెళ్ళిచేసుకోవడానికి యిష్టపడ్డాడు. తన జీవితం పాడైపోయిందని ఏడ్చింది. అతడు ఓదార్చాడు. ఇవి మూడో మనిషికి తెలియకూడదని బాసలు చేసుకున్నారు.

పైసా కట్నం లేకుండా అయిదంకెల ఉన్నతోద్యోగిని భర్తగా గెలుచుకుంది.

"పురుషాధిపత్య సమాజం ఉన్నంతకాలం స్త్రీ తన అందంతో సాధించలేని ఉన్నత శిఖరాలు లేవని నిరూపించదల్చుకున్నాను సుమలతా!''

'శైలూ! దయానంద్‌ను గెలుచుకోవడం ప్రపంచాన్ని గెలుచుకోవడం కాదా! ఇంతకన్నా ఉన్నత శిఖరాలుంటాయా?

" పిచ్చి సుమా ! జీవితమంటే పెళ్ళి భర్త, పిల్లలు కాదని అంతిమ లక్ష్యం మరింత ఉన్నతంగా ఉండాలని నువ్వే అన్నావు గుర్తుందా!''

నేనన్నది ఈ సమాజం మారాలని కులమత వర్గాతీత నవసమాజ నిర్మాణం అంతిమ లక్ష్యంగా ఉండాలని, అంతే గాని భర్త పిల్లల్ని కూడా కాదనేంత స్వార్థం అంతిమ లక్ష్యంగా ఉండాలని కాదు శైలూ.''

"సుమా ! నీ అర్థంలో నీవు చెప్పావు. నా అర్థంలో నేను స్వీకరించాను. నువ్వే నా గురువువి. కానీ నీ లక్ష్యాలు వేరు. నా లక్ష్యాలు వేరు.''

" శైలూ దయానంద్‌కు అన్యాయం చేయకు అని మరోసారి కోరుతున్నాను. నీ వల్ల అతనికి యిప్పటికే ఎంతో అన్యాయం జరిగింది.''

" అంటే నువ్వు అతని భార్యవై ఉంటే న్యాయం జరిగి ఉండేదనా?"

"కాదా మరి ! రత్నాకర్‌కు, నాకు యిష్టంలేని పెళ్ళి నీ వల్లనేగా జరిగింది. నీ స్వార్థం కోసం ముగ్గురి జీవితాలతో ఆడుకొన్నావు."

శైలజ నవ్వుకుంది. ఆ నవ్వు తీరులో కదిలే తీరులో క్లియో పాత్రా కన్పించింది. క్లియో పాత్రా.... తన అందంతో ఎన్ని యుద్ధాలు సృష్టించింది. ఎన్ని సామ్రాజ్యాలు కూల్చింది. ఎన్ని వేల మంది సైనికులు హతులయ్యారు.

"శైలూ నీవు క్లియోపాత్రా కావాలనుకుంటున్నావా ! నేనుఇప్పటికి హృదయపూర్వకంగా ప్రేమించే నా దయానంద్‌ను బలిపశువును చేయదల్చుకున్నావా ! నీ కాళ్ళు పట్టుకుంటానే. దయానంద్ కు అన్యాయం చేయకు ప్లీజ్" అంటూ ఆమె చెక్కిలి ముద్దాడింది తాను. నవ్వుతూనే శైలు కాళ్ళు పట్టుకుంది తాను. పైకి నవ్వుతున్నా లోపలెక్కడో గుండెలో కలుక్కుమంది.

తాను ఏది జరగకూడదని కోరుకుందో అదే జరిగింది. శైలూ తల్లీ దండ్రి చెల్లెలూ, తమ్ముడూ దయానంద్ యింట తిష్టవేసేవారు. దయానంద్ బంధువులు దూరమయ్యారు.

కొద్ది నెలల్లోనే దయానంద్ తన యింట్లో తానే అంటరానివాడయ్యాడు. అతని పళ్ళెం, బట్టలు, టవల్, బెడ్డు, గ్లాసు అతనికే ప్రత్యేకం. చెల్లెలు హృద్యని వారించింది శైలజ.

" హృద్యా ! ఎంత అసహ్యకరమైన పనిచేస్తున్నావు. అతడు నా భర్త అతని వల్లే నీకీయింట్లో ఇన్ని సుకాలు లభిస్తున్నాయి. అతని పళ్లెం, గ్లాసు, బెడ్‌షీట్లు వేరుగా పెట్టడం నా హృదయాన్ని ఎంతగా కలచి వేస్తుందో తెల్సా !

"అక్కయ్యా ! నాకే కాదు, అమ్మకూ -నాన్నకూ బావంటే అసహ్యం. అతను తాకిన వస్తువులు అతను తిన్న పళ్లాలు ... నాకసహ్యం... ఏదో గతిలేక నీ యింటికొస్తే ...మేం ఆత్మాభిమానం చంపుకోలేం...వెళ్లిపొమంటే యిప్పుడే వెళ్లిపోతా"అంటూ బెదిరించింది అది ఉత్త బెదిరింపు అని తెల్సు. కానీ కాలక్రమంలో వారికి లొంగిపోయింది. తన లక్ష్యం నెరవేరాలంటే తనకు వాళ్ల మద్దతుకావాలి. తాను మెజారిటి అయి దయానంద్ఒంటరివాడు కావాలనుకుంది శైలజ.

దయానంద్ - ఎంత చిత్రహింస అనుభవించాడో ... తన యింట్లో తానే అతిథిలా ఒక గదికి పరిమితమయ్యాడు.

ఓసారి ముహం కడుక్కుని టవల్‌తో తుడుచుకుని బెడ్డుమీద పడేశాడు దయానంద్. హృద్య కెవ్వున అరిచింది. ఏమైందోనని వణికి పోయాడు దయానంద్. ఆటవల్ తనదని ఆ బెడ్డుమీది బెడ్‌షీట్లు నిన్ననే ఉతుక్కున్నాని అవిమైలపడ్డాయాని .. ఈరోజు శనివారం ఉపవాసం ఎలా అంటూ ఏడ్చేసింది హృద్య.

ఏడ్వాల్సింది మరదలో తానో అర్థం కాలేదు దయానంద్‌కు కన్నీరు బలమంతంగా అదిమి పట్టాడు. అలా మెల్ల మెల్లగా అన్నిటికీ దూరమై తన సింగిల్ బెడ్‌రూం గెస్టుల కోసం అని అట్టి పెట్టిందానికి పరిమితమయ్యాడు దయానంద్.

శైలజ అమెరికా వెళ్లిన తర్వాత ఆమె తరపు బంధువులు యిల్లు వదిలి పోయారు. అప్పుడు జైలునుండి విడుదలైన వాడిలా స్వేచ్ఛగా ఊపిరి పీల్చాడు దయానంద్. కానీ శైలజ లేని ఒంటరితనం - తాను - రత్నాకర్‌కు చెప్పినట్టు వినే మరమనిషి కావాలి. తనలా హృదయమున్న మనిషి అక్కరలేదు. ప్రతిమాటకూ తననీ తన వ్యక్తిత్వాన్నీ తన అందాన్నీ కించపరుస్తాడు.

"నీ వల్ల నేను శైలజను కోల్పోయాను అద్భుతమైన నా కల కరిగి పోయింది. మొద్దు

ముహందానా ! నీ ముహం చూస్తే ఉన్న కోరిక కూడా చచ్చిపోతుంది ఎందరో చస్తున్నారు. నువ్వు చస్తే ఎంత బావుండేది. ఆత్మహత్య చేసుకోరాదూ - నీ పీడా పోతుంది.

"రత్నాకర్...నీకు దండం పెడ్తాను. నువ్వు ఎన్నైనా తిట్లు ... కాని అందంగా లేనని మాత్రం తిట్టకు. ఎప్పుడో ఆత్మహత్య చేసుకొంటాను. అంతదాకా క్షోభపెట్టకు...ప్లీజ్ ... "అంటూ వేడుకునేది తాను.

పిల్లలు తన కాళ్ళను చుట్టేసి" మమ్మీ ! నువ్వు చచ్చిపోవద్దు..." అని ఏడ్చేవాళ్లు తన పిల్లలు ఏమైపోతారో అని బెంగ ఒకవైపు... ఈ క్షోభ కన్నా చచ్చిపోవడమే హాయి అని మరోవైపు -

శైలజ దయానంద్‌ని వదిలేసి అమెరికా వెళ్ళిపోయాక రత్నాకర్ కాస్త తగ్గాడు. కానీ తనని తన వ్యక్తిత్వాన్ని కించపరచడం మానలేదు. తాను అన్నిటా చొరవ కోల్పోయింది. ఏ పని చేయడానికైనా, ఏ మీటింగ్‌కు వెళ్ళడానికైనా, చివరకు స్నేహితురాళ్ళని కలవడానికైనా అతని అనుమతి తీసుకోవాలి. అనుమతి లేకుండాపోతే వారం రోజులు యింట్లో నరకం సృష్టిస్తాడు. పిల్లలు బెంగపడతారు. వారి మనస్సులపై ఏవో బయాలు అభద్రత నీలి నీడలు చదువులో వెనుకబడ్డారు. స్నేహం చేయడంలో చొరవ కోల్పోయారు. ఎప్పుడూ ఏదో కోల్పోతున్నట్లుగా పిల్లల ముహాలు నిస్తేజంగా చూస్తే తన కడుపు తరుక్కుపోతుంది. రత్నాకర్‌తో పోట్లాడి సాధించగలిగేదే లేదు. పిల్లల కోసమైనా తను అణిగిపోక తప్పదనుకుంది.

అయినా రత్నాకర్‌కు తృప్తిలేదు. తాను స్టూడెంట్ లీడరుగా ఉండి ఆర్గనైజ్‌చేసిన చొరవ, వ్యక్తిత్వం, ఉన్నతాశయాలు రత్నాకర్‌ని యిప్పటికీ జెలసీకి గురి చేస్తూ యిన్ఫీరియారిటీలో పడేస్తున్నాయని తాను గమనించింది కాని అందుకు యిప్పుడు తాను ఏం చేయగలదు విడాకులు, ఆత్మహత్య యివేవి తన సమస్యను పరిష్కరించవు.

శైలజలా పిల్లల్ని అతనికే వదిలేసి తాను మళ్ళీ సమాజం కోసం అంకితం కావాలనుకుంది. కానీ రత్నాకర్ దయానంద్ కాదు. తన పిల్లల భవిష్యత్తు ఏమౌతుందోనని భయం.

వీర మరణం పొందడమే తప్పఓటమి ఎరుగని సమ్మక్క, సారక్క అన్నారు తనని. జోన్ ఆఫ్ ఆర్క్‌లా మౌనంగా శిక్ష అనుభవించడం కద్దు... అంటూ తానెందరికో చెప్పిందో. కాని తానే ఆ స్థితిలో కూరుకుపోయింది. తప్పని తెల్సి తప్పదని తెల్సి ఆ పని చేయక తప్పలేదు. తెల్సీ రత్నాకర్ డ్యూటీకి వెళ్లిపోయాడు. పిల్లలు ఏడ్చి ఏడ్చి గబగబా ఆసుపత్రికి తీసికెళ్లి బతికించుకున్నారు.... తాను బతికానని తెల్సి మూడో రోజు హాస్పిటల్‌కు చూడ్డానికొచ్చాడు రత్నాకర్.

తాను ఎందుకుబతకాలో తెలియక కుమిలి కుమిలి ఏడ్చింది ... తన డైరీలు ... ఉత్తరాలు...ఎప్పుడు చదివారో పిల్లలు...

ఓరోజు అకస్మాత్తుగా బాంబు పేల్చారు పిల్లలు.

"మమ్మీ!దయానంద్ అంకుల్... మా డాడీ అయితే ఎంత బాగుండేది. శైలజ ఆంటీ అంకుల్‌కూ, నీకూ ఎంత అన్యాయం చేసింది ...డాడీకి విడాకులియ్యి మమ్మీ...దయానంద్ అంకుల్ దగ్గరికీ వెళ్ళిపోదాం...దూరంగా...ఎవరికీ కన్పించనంత దూరంగా ...లక్నోలోనే బతుకుదాం మమ్మీ...

"తల్లీ భూదేవి " నవలలోలా తన పిల్లలే తమకు కొత్త డాడీ కావాలని ప్రతిపాదిస్తున్నారు. కానైతే అసలు డాడీ బతికుండగానే ... తన జీవితం అఖిలన్ రాసిన చిత్ర సుందరిలా మారుతోందా! తానొక ఎగ్నెసీ స్మెడ్లీలా తిరిగి జీవితాన్ని గెలుచుకోగలదా...

ఆత్మహత్యా ప్రయత్నం నుండి బతికి బయట పడ్డాక బతుకుతున్నదంతా అదనపు జీవితమే. తాను ఆనాడే చచ్చిపోయింది అనుకోవడం నుంచి విచిత్రంగా తనలో కొత్త ధైర్యం. అదే ధైర్యంతో

దయానంద్ రాసిన ఉత్తరాన్ని రత్నాకర్ కంట పడాలని టేబిల్ మీద పెట్టింది.

దయానంద్ !..ఇన్నేళ్ళ అతని చిత్రహింస తర్వాత ఈ శరీరంలో మనస్సులో చైతన్యంలో ఏమ్మిగిలిందని నన్ను కోరుకుంటున్నావ్ ! నా వయస్సు ఉడిగింది. రత్నాకర్ మానసిక హింస పుణ్యమా అని సెక్సుమీద అసలు కోరికే చచ్చిపోయింది శవం లాంటి ఈ శరీరాన్ని మనస్సును - నీకు మళ్ళీ ఎలా అర్పించను దయానంద్ ! నా వరీరంపై నీకు కలిగిన ఈ మోజును అర్థం చేసుకోలేక పోతున్నాను. దయానంద్ ! నువ్వు అందరి లాంటి మగాడివేనా ! లేకపోతే ఇంద్రప్రస్థ లాడ్జింగ్‌లో ఒంటరిగా కల్సుకుందామని ఎందుకు రాస్తావు -

"దయానంద్ ! నిజం చెప్పనా ! లోకం కోడై కూయనీ. ఈ వయస్సులో నీ ప్రతిరూపం నా శిశువుగా లాలించాలని ఉండేది యింతకాలం. కానీ యింత నీచమైన పద్ధతిలో కాదు. ఏమైనా సరే. నువ్వు రాసిందేమిటో నేను అర్థం చేసుకున్న దేమిటో -అపార్థాలు వద్దు. నిన్ను పూర్తిగా విశ్వసిస్తున్నాను. నీపై నాకు పూర్తి విశ్వాసం ఉంది. నీవు అలాంటి వాడివి కాదని నా హృదయం చెపుతోంది.."

ధర్మరాజు కూతురు పెళ్ళికి ముందుగా రాలేనని , సరిగ్గా పెళ్లి సమయానికి అందవస్తానని అన్నాడు రత్నాకర్. సుమలత ఒకరోజు ముందే బయలు దేరింది. పిల్లలూ మమ్మీతోనే బయల్దేరారు. ధర్మరాజు యింట్లో, పెళ్ళి విడిదిలో రెండు గంటలు కలివిడిగా తిరిగి సాయంత్రం పిల్లల్ని తీసుకుని ఇంద్రప్రస్థకు బయల్దేరింది సుమలత. దయానంద్ అంకుల్‌ను చూడాలని, అతని కూతుర్ని చూడాలని పిల్లల ఆరాటం

రూం నంబరు కనుక్కొని తలుపు కొట్టింది సుమలత. రూం లోంచి వినపడుతున్న సంగీతం ఆగిపోయింది. తలుపు తెరిచింది. ఆమె జూనియర్ శైలజలా ఉందో దయానంద్‌లా ఉందో ఒక్క క్షణం తబ్బిబ్బయింది సుమలత. అంతకన్నా ఆశ్చర్యం. దయానంద్ రూంలో లేడు.

" ఆంటీ..డాడీ బజారు కెళ్ళాడు... మీరొస్తారని చెప్పాడు. అన్నయ్యా! చెల్లి ఏరీ..." అంటూ అప్యాయంగా కుశల ప్రశ్నలు వేసి సుమలత కాళ్ళకు నమస్కరించింది భవ్య.

" ఏం చదువుతున్నావు పాపా!"

"సిబియస్ ఈ సెలబస్‌లో టువెల్త్ ఆంటీ "

సుమలత కాలింగ్ బెల్ నొక్కింది వెయిటర్ వచ్చాడు.

రిసెప్షన్‌లో ఉన్న పిల్లల్నీ తీసుకురమ్మంది.

" ఆంటీ ! నన్ను క్షమిస్తానంటే ఒక మాట చెప్తాను." అంటూ అడిగింది భవ్య".

"భవ్యా !"

"ఆంటీ ! మిమ్మల్ని మమ్మీ అని పిలవాలనుంది. అంగీకరిస్తారా ఆంటీ -" భవ్య ఎందుకో ఏడుస్తోంది. ఎనిమిదేళ్ళ పాపగా ఉన్నప్పుడు భవ్యను శైలజ వదిలి వెళ్ళిపోయింది. పదేళ్ళవుతోంది.

అందుకే గతమంతా గిర్రున తిరిగి సుమలతకు కన్నీళ్ళొచ్చాయి.

"విత్‌ప్లెజర్"అనే మాటని పూర్తి చేయకుండానే పాపను హత్తుకుని వెక్కి వెక్కి ఏడ్చింది సుమలత.

సుమలత పిల్లలు తలుపు తోసుకుని రావడంతో వాతావరణం కాస్త మారింది. కళ్ళు తుడచుకొన్నారు. పరస్పర పరిచయాలయ్యాక కొద్ది సేపట్లోనే పిల్లల నవ్వులతో గది నిండిపోయింది. ఎన్నో ముచ్చట్లు - ఎన్నెన్నో కబుర్లు ప్రపంచమంతా వాళ్ళ మాటల్లో దొర్లి ప్రవహిస్తోంది. ఎన్నాళ్ళకు

పిల్లలు యింత హాయిగా నవ్వుతున్నారని సుమలత సంతోషపడిపోయింది. ఎన్ని గంటలు గడిచాయో -

షాపింగ్ కెళ్ళిన దయానంద్ రెండు చేతుల నిండా బ్యాగులు తన పిల్లలకు అతను డ్రెస్సులు తీసుకురావడంతో ఆశ్యర్యపోయింది సుమలత. అంటే తన వెంట పిల్లలు కూడా తీసుకువస్తారని ఎలా తెలిసింది రత్నాకర్‌కు? ఆ డ్రెస్‌లను తీసుకుని పిల్లలు ఎంతో సంతోషపడ్డారు.

ఆఖరుగా " ఇది మీ కోసం. మీకు అభ్యంతరం లేకపోతేనే ..."అంటూ చీర సుమలత చేతిలో పెట్టాడు దయానంద్.

చిన్నప్పుడు రెండోపెళ్ళి చేసుకోడానికి చీర కట్టించి తీసుకెళ్ళాడంటారు. తనకీ చీర అలాంటిదా - ఎందుకో అకస్మాత్తుగా సుమలత చేతులు వణికాయి తనకు నచ్చిన చీర.

" మమ్మీ ఈ చీర ఎంత అద్భుతంగా ఉందో"పిల్లలు సంతోషంతో ఒకటే గోల."

అందరు కల్సి హాయిగా భోంచేసి సెకండ్ షోకెళ్ళారు.

పడుకునేటప్పుడు సున్నితమైన సమస్య మేం మాట్లాడుకోవాలి. ఈ రాత్రంతా నిద్రపోం - అంకుల్ మమ్మీ - మీరీ గదిలో పడుకొండి. మేం ఆ గదలో పడుకుంటాం అన్నారు. వాళ్ళు తెలిసి అంటున్నారో, తెలియక అంటున్నారో తెలియదు. కానీ సుమలత గుండె భయంతో విలవిలలాడింది.

నిజానికి యిలాంటి క్షణం కోసం ఎన్నేళ్ళు ఎదురు చూసింది తాను. కానీ ఆ ఘడియ రాగానే ఎందుకు వణుకు. వివాహబంధం వల్ల తనకు తెలియకుండానే తనలో గౌరవం, భయం పేనుకుపోయాయా!

చివరకు చర్చను అటు లాగి ఇటు లగి ముచ్చట్లన్నీ అయ్యాక భవ్యసుమలతతో వేరే గదిలోకి వెళ్ళింది. సుమలత పిల్లలు దయానంద్‌తో ఉండిపోయారు.

ధర్మరాజు కూతురి పెళ్ళయిపోయింది. భోజనాలు పూర్తి కావచ్చాయి. ఎన్నో ఏళ్ళ తర్వాత కల్సుకున్న అయిదుగురు మిత్రులు కుర్చీలు దగ్గరగా లాక్కుని ముచ్చట్లలో పడ్డారు.

ఎవరేమనుకున్నాసరేననుకుని సుమలత దయానంద్ తెచ్చిన చీరే కట్టుకుంది. రత్నాకర్ ఆమె పక్కనే కూర్చున్నాడు. సుమలత దయానంద్ కోసం చూస్తోంది. దయానంద్ ధర్మరాజు వెంటే తిరుగుతున్నాడు. పిల్లలు అప్పుడే ఎందరినో స్నేహితులుగా మార్చుకున్నారు. ఒకటే అల్లరి. ఒకటే నవ్వులు. పాత స్నేహితుల పిల్లలు పాత స్నేహితుల్లా కల్సి పోయారు.

"ఎవరికోసం చూస్తున్నారు ఝాన్సీ లక్ష్మీబాయిగారు - " అంటూ నవ్వాడు అర్జున్.

"ధర్మరాజు కోసమై ఉంటుంది. అందరం కలిస్తే గ్రూప్ ఫోటో అవుతుందని కావచ్చు "అని నవ్వాడు భీమారావు.

సుమలత నవ్వింది. రత్నాకర్ ఆశ్చర్యపోయాడు. సుమలత అంత అందంగా, ఆనందంగా నవ్వుతుందా! ఆ నవ్వు చూసి ఎన్నేళ్ళయిందో -

"ఎవరికోసం మేడం" అన్నాడు రత్నాకర్ అతి మర్యాదగా.

"అయిదవ వాడి కోసం -" అంటూ నవ్వింది సుమలత. ఆ నవ్వులో ప్రపంచాన్ని జయించిన విశ్వాసం.

"అర్థం కాలేదు సుమలతా !" అన్నాడు అర్జున్.

"నీవు రెండో వాడివి కదా ! అతడు అయిదోవాడు. అతడే దయానంద్!" అంది. ఇరవై ఏళ్లనాటి నవ్వులు. కాసేపు అందరూ కుర్రాళ్ళయి పోయారు. మధ్యలో దయానంద్ వారితో వచ్చి కలిశాడు.

సాయంత్రం వెళ్తానన్నాడు రత్నాకర్. తాము మూడు రోజులుండి వస్తామన్నారు. పిల్లలు , పెళ్లికూతుర్ని, పెళ్ళి కొడుకుని సాగనంపాలి. సుమలత దయానంద్ లాడ్జి ఖాళీ చేసి ఆ యింటి కొచ్చారు. కాస్త ఏకాంతం కోసం చూద్దామంటే కోడి పిల్లల్లా ఎప్పుడూ వెంటే పిల్లలు. వారి ముందే అడిగింది సుమలత.

"దయానంద్ ! ఉత్తరం అలా రాశావేంటి ! కవిత్వం పిచ్చి నిన్నింకా వదల్లేదా !"అంటూ నవ్వింది సుమలత.

ఆ మాటవిని సుమలత కూతురు కావ్య మెల్లిగా అక్కన్నించి జారుకుంది. అంకుల్ ! మమ్మీ బతకాలంటే మీరు మాకు సహకరించక తప్పదు. తనను నిండు హృదయంతో ప్రేమించే వారొక్క రున్నారనుకున్నా ఆత్మహత్యలు చేసికోరని ఎక్కడో చదివాను. మామమ్మీని మునుపటి మమ్మీగా మార్చే శక్తి మీలోనే ఉంది అంకుల్! మా మమ్మీకి తిరిగి ప్రాణం పోయండి. మాకు ప్రాణభిక్ష పెట్టండి ప్లీజ్ అంకుల్ ' అంటూ రాసిన కావ్య ఉత్తరం దయానంద్ కళ్ళల్లో మెదులుతోంది. అది చెప్పడం భావ్యం కాదనుకున్నాడు.

"సుమలతా ! గతించిన యవ్వనం తిరిగి ఎలానూ రాదు. కనీనం కలల్లో, జ్ఞాపకాల్లో,ఊహల్లోనైనా యవ్వనంతో ఉండాలని - మరేంలేదు - మీరు తిరిగి సమాజానికి అంకితమవ్వాలనుకునే మీ లక్ష్యం మీ పట్ల నాకు మరింత గౌరవం పెంచింది. నా నుండి ఎందరో ఏవేవో లబ్ది పొందారు, ఆశించారు. నా నుండి ఏమీ ఆశించనిది నీవే. నా జీవితానికి వెలుగైన నీవు సమాజానికి వెలుగై నడవడం నాకెంతో సంతోషం. నీవు విడిగా ఉండదల్చుకుంటే నేను సాయం చేస్తాను. ఊరకే కాదు. భవ్యకు మమ్మీగా ప్రేమ పంచినందుకు అయితే వాళ్ళ డాడీకి భార్యగా కాదు. అతడికి ఆ ఆసక్తి పోయింది.

దయానంద్ ఎటో చూస్తున్నాడు. సుమలత కళ్ళు వర్షిస్తున్నాయి. లోకం ఏమైనా అననీ - తాను రత్నాకర్ నించి విడాకులుతీసుకుంటుంది. తన ఆశయాల కోసం పునరంకితం అవుతుంది.-

"డాడీ ! మమ్మీని పెళ్లి చేసుకోవా? " బేలగా అడిగింది భవ్య.

"పాపా! దూరంగా ఉండి స్నేహంగా సహకరించుకోవడంలో ఉండే పవిత్రతను సమాజం హర్షిస్తుంది. కల్సి జీవిస్తే అదే సమాజం ఈసడిస్తుంది - ఈ విలువలు మారేదాకా -సహనం తప్పదు. కాలమే సమస్యల్ని పరిష్కరిస్తుంది."

"అంకుల్! ఇపుడు మీతో పాటు మమ్మీ - మేమూ లక్నో వచ్చేస్తాం..."

"అపుడు నా యింట్లో నేను మళ్ళీ పంచముడినవుతానేమో " నవ్వాడు.

"అదేమీ నాకు తెలియదు అంకుల్ కాని. మమ్మీకి మీరు పంచప్రాణాలు"

"తొందరెందుకు గానీ యింకా మూడు రోజులుంటారుగా. ఈ మూడు రోజుల్లో పరస్పరం అవగాహన పెరుగుతుంది. అపుడు ప్రస్తుత నిర్ణయాలను సమీక్షించుకుందాం." దయానంద్ మాటల్లో సుమలత కళ్ళు మెరిశాయి. పిల్లల భవిష్యత్తుపై చింత వీడింది.

ఆ రాత్రి యిల్లు వదిలిన సుమలత మళ్ళీ తిరిగి రాలేదు. తన కోసం వెతకవద్దని ఆరు నెలల తర్వాత తానే ఉత్తరం రాస్తానని ఉత్తరం రాసి పెట్టి పోయింది. ఎక్కడికి పోయిందో తెలియదు నాలుగో రోజున కన్నీళ్ళతో పిల్లలు దయానంద్ వెంట లక్నో ప్రయాణమయ్యారు.



# 23 ఈ సంకలనాల గురించి

కె.లక్ష్మీనారాయణ.

'గురువులు చూపిన మార్గం' 'మేధావుల సాంగత్యం' సాహితీవేత్తల ప్రేరణ. 'దృఢవిశ్వాసం' కృషి, వ్యక్తిత్వం. పట్టుదల రచయితల సహకారం. పలు స్వచ్ఛంద సంస్థ ఆదర్శ దృక్పథం ఇలా ఎన్నో.... ఎన్నెన్నో... మిళితమైన ప్రయత్నం ఈ దళిత కథా సంకలనాల సమీకరణ.

ఆంధ్రదేశంలో దళితులు - దళిత సమస్య గురించి పలువాద వివాదాలు జరిగాయి. ఎటూ తేలకుండా పోయాయి. దళితులు ఎవరనేది మొదటి ప్రశ్న అసమానతలు అన్ని మతాలూ కులాలలోనూ ఉన్నాయి. కాలం పరిణామ వంతం అవుతున్న నేపథ్యంలో అస్పృశ్యత దళితుని మొదటి సమస్య. తరాలుగా మర్యాదకూ. మన్ననకూ దూరమై సంపదకూ సమానత్వానికీ కడుదూరమై, గ్రామం వెలుపలికి నెట్టబడిన వారే దళితులు. వీరు గ్రామం వెలుపల వాడల్లో నివసిస్తున్నవారు. ఈ వాదాన్ని లెఫ్టిస్టులు నిరాకరించవచ్చు. మార్క్సిస్టు ఉద్యమాల నుండి బయటపడి. లెఫ్టిస్టులుగా మారిన మేధావుల దళిత ఆలోచన మరో రకం. వీరి ఆలోచన కాన్షీరాం నాయకత్వంలో ఏర్పడిన బహుజన సమాజవాది పార్టీ ఆలోచనతో ఏకీభవిస్తుంది. వీరి ప్రకారం. యస్సీ, యస్టీ. బి.సి. మైనార్టీలు, స్త్రీలు అందరూ దళితులే. అణచబడుతున్న వ్యక్తి దళితుడు. కానీ ఈ అభిప్రాయం కూడా దళితుల పట్ల సరైంది కాదు. ఈనాడు దళితుల పట్ల జరుగుతున్న దాడుల్లో బి.సి.లు మధ్యంతర పాత్ర వహిస్తున్నారు. దీనికి అనంతపురం జిల్లాలో మలసముద్రం, కరుట్లపల్లి, ఆలమూరు సంఘటనలే తాజా ఉదాహరణలు. దీనిని బహుజన మేధావులు గుర్తించాల్సి ఉంది. దళిత శబ్దానికి అర్థాన్ని కుదించాల్సి ఉంది. ఈ సంకలనాలు కేవలం యస్సీల సమస్యలు ఆధారంగా వెలువడినవే.

నా విద్యాభ్యాసంలో భాగంగా 1991 నాటికి యం.ఏ. పూర్తి చేశాను. నాకు యం.ఏ అనంతరం నిరుద్యోగిత ప్రారంభమైంది. పరిశోధన పట్ల గాలిమళ్లింది. సాహిత్యం పట్ల అవగాహన లేకున్నా ఉద్యోగ ప్రయత్నంలో భాగంగా పరిశోధనలో మే. 1993 లో చేరాను. నాపరిశోధనకు ఆచార్య కొలకలూరి ఇనాక్ పర్యవేక్షక బాధ్యతలు స్వీకరించారు. యం.ఏ. అనంతరం ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి గారి వద్ద S. K. U. N.S.S. Units లో చిరుద్యోగంలో చేరాను. మేమిద్దరం కలిసి అప్పుడప్పుడు N.S.S. క్యాంపులు వెళ్ళేవాళ్ళం. ఆచార్య ఆర్. చంద్రశేఖరరెడ్డి గారు పలు సాహిత్య విషయాలు చెప్పడం. సంఘటనలు వివరించడం, నేను రాసిన వ్యాసాలు చదివి, తప్పులు సవరించి పత్రికలకు పంపడం వల్ల సాహిత్యం పట్ల నాకు అభిరుచి పెరిగింది. అప్పటికే నాకు విప్లవ సాహిత్యంలో పరిశోధన చేయాలనే ఆలోచన ఉండేది. ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారు నాకు దళిత సాహిత్యం పై పరిశోధన చేయమని సలహా ఇచ్చి హరిజనాభ్యుదయం - తెలుగు కథానిక' అనే అంశాన్ని సూచించారు. ఈ అంశం నాకు కూడా అనువైందిగానే తోచింది.

నా పరిశోధనమొదలైంది. ఈ పరిశోధనలో గురువుల సహకారం 'ఆలోచన' ప్రేరణ నాకు ఊతంగా మారి నాలో వేగాన్నీ, సాహసాన్నీ కల్గించాయి. ముందుకు నడిపించాయి. దళిత సాహిత్యాన్ని చురుకుగా చదివాను. సమాజంలో జరిగిన దళిత సంఘటనలు (కారంచేడు చుండూరు వంటివి) స్టడీ చేశాను. అవగాహన చేసుకున్నాను. నాదైన బాణీలో దళిత సమస్య గురించి ఆలోచించడం. రాయడం మొదలు పెట్టాను. రాష్ట్రవ్యాప్తంగా రచయితలు, విమర్శకులు, తత్త్వవేత్తలు, ఆచార్యులతో నాకు పరిచయాలు లభించాయి. పలు సహితీ సంస్థల్లో సభ్యుణ్ణి అయ్యాను. 1993లో అనంతపురంలో గుర్రం జాషువ శతజయంతి కమిటి ఏర్పడింది. అందులో కార్యవర్గ సభ్యునిగానూ రాష్ట్రంలో ఆంధ్రప్రదేశ్ దళితరచయితలు, కళాకారుల, మేధావుల ఐక్యవేదికలో జిల్లా కన్వీనర్‌గానూ, రాయలసీమ ప్రాంతీయ కార్యదర్శిగానూ పనిచేశాను. ఈ పనులు కూడా నా సాహిత్యాభివృద్ధికి దోహదం చేశాయి. ప్రారంభంలో నేనూ రాచపాళెం చంద్రశేఖరరెడ్డిగారూ వస్తుపరంగా ఒక దళితకథల సంకలనాన్ని తీసుకొచ్చాం. ఈ పుస్తకాన్ని గుర్రం జాషువ శతజయంతి కమిటి తరుపున ప్రచురించదలచాం. కాని ఈ ప్రయత్నం అసాధ్యం కావడంతో విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారిని సంప్రదించి ఈ పుస్తకాన్ని ప్రచురించాం. ఇది మొదటి దళితకథల సంపుటి - ఈ సంకలన ప్రచురణలోపు నా పరిశోధన పూర్తి అయ్యింది. ఇందుకు మా గురువు సహకారం ఉంది. నా పరిశోధనా గ్రంథం హరిజనాభ్యుదయం - తెలుగు కథానికకి శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం ఉత్తమ పరిశోధనా గ్రంథంగా గుర్తించి తూమాటి దోణప్ప బెస్ట్ థీసిస్ అవార్డు ప్రకటించింది. అప్పటికి నేను అరకొరగా వ్యాసాలు రాయడం మొదలు పెట్టాను.

'హరిజనాభ్యుదయం - తెలుగు కథానిక' గ్రంథాన్ని డిశంబర్ 1996 న ప్రచురించాను. ఈ గ్రంథం కేవలం 4 నెలల కాలంలోనే ఏడువందల ప్రతులు అమ్ముడుపోయాయి. ఒకరోజు ఈ గ్రంథాన్ని శ్రీ సదాశివరావుగారికి ఇవ్వడం కోసం వెళ్ళాను. ఆ రోజు ఆయన నన్ను తెలుగు విశ్వవిద్యాలయానికి తీసుకెళ్ళి, ఆచార్య చేకూరి రామారావు గారికి పరిచయం చేశారు. మాటల సందర్భంలో సమగ్రదళిత కథా సాహిత్యాన్ని పలుసంపుటాలుగా వెలువరిస్తే బాగుంటుందని వారు సలహా ఇచ్చారు. వారి ముందు దళిత కథా సంకలనాలు ప్రచురించడానికి అంగీకరించాను. వారి సలహానే ఈ సమగ్రదళిత కథానికా సాహిత్య సమీకరణకు మూలం.

1997 ఏప్రిల్‌లో దళిత కథా సంకలన సమీకరణకు శ్రీకారం చుట్టాను. నేను పరిశోధనా కాలంలో సేకరించగా మిగిలిన కథానికలు సేకరించడానికి ప్రయత్నించాను. ఇలా ఆరునెలలు గడిచిపోయింది. దాదాపు 220 కథానికలు సేకరించాను వాటిని సమగ్రంగా చదివి కొన్ని భాగాలుగా విభజించాను. ఆ భాగాలను ఎనిమిది పుస్తకాలుగా చేసి ప్రచురించాను. స్త్రీ సమస్యలను వివరించినది దళిత స్త్రీ సమస్యల కథలు (జూలై 1998) అస్పృశ్యత ప్రధానాంశంగా అస్పృశ్య కథలు (మార్చి 1999) దళితుని ఆర్థిక, రాజకీయ సమస్యలు అంశంగా ఆర్థిక రాజకీయ కథలు (అక్టోబర్ 1998) వర్ణవివక్షత అంశంగా వర్ణ వివక్షకథలు (డిశంబర్ 1998) వ్యక్తిత్వ వికాసంతో కూడిన వ్యక్తిత్వ వికాసకథలు దళితుని హక్కులు భూమికగా హక్కుల సాధన కథలు (అక్టోబర్ 1999) దళితుని కులంనుండి అస్పృశ్యత నుండి విముక్తిని కోరే విముక్తి కథలు (డిసెంబర్‌బర్, 2000) ఇలా ఎనిమిది సంకలనాలు ప్రచురించాను.

ఈ కథానికా సాహిత్యాన్ని భావవాద కాలంలోని సాహిత్యాన్ని, దళితుల భావవాద సాహిత్యం గాను, సంస్కరణ వాదకాలంలో వచ్చిన సాహిత్యాన్ని, దళితుల సంస్కరణ వాద సాహిత్యంగానూ,



అభ్యుదయ వాద కాలంలో వచ్చిన సాహిత్యాన్ని దళిత అభ్యుదయ వాద సాహిత్యంగానూ, విప్లవవాద కాలంలో వచ్చిన సాహిత్యాన్ని దళిత విప్లవ సాహిత్యంగానూ, స్త్రీవాద కాలంలో వచ్చిన సాహిత్యాన్ని, దళిత స్త్రీ వాద సాహిత్యంగానూ దళిత వాద కాలంలో సాహిత్యాన్ని యదాతథంగానూ ఈ కథానికల్ని పరిగణించినా అభ్యంతరం లేదు. భిన్నాకాలాల్లో దళిత జీవితానికి ఈ కథానికలు అద్దం పడుతాయి.

'చిక్కనవుతున్న పాట' 'పదునెక్కిన పాట' రెండు బహుజన కవితా సంకలనాలను దళిత కవిత్వమని నెత్తిన మోసుకొని ఊరూర తిరిగిన మేధావులకు ఈ సంకలనాల్లోని దళిత తత్త్వం కన్పించలేదు. వీరి అభిప్రాయం ప్రకారం కారంచేడు 'సంఘటన తర్వాత ఆంధ్రదేశంలో 'దళిత' పదం ఉద్భవించిందని ఆ తర్వాత దళితులు రాసిన సాహిత్యమే దళిత సాహిత్యమని వీరి వాదన. ఈ సంకలనాలకు దళిత లేబుల్ వేసి ప్రచారం చేస్తున్నానట ఇది వీరి ప్రచారం.

వీరు అగ్రవర్ణ దళిత సాహిత్యాన్ని నిరసిస్తూనే గౌతమబుద్ధుని రచనలను, వెనుకబడిన కులాల దళిత సాహిత్య సేవను నిరాకరిస్తూనే మహాత్మా జ్యోతి బాపూలే రచనలను తమ దళిత వాదానికి అన్వయించుకుంటున్నారని సాహితీవేత్తల భావన. ఈ సంకలనాలకు దళిత లేబుల్ వేశానని ప్రచారం చేస్తూనే, గాంధీజీ సిద్ధాంతాలను వ్యతిరేకిస్తూనే, ఆయన సిద్ధాంతాలకు అనుగుణంగా హరిజన సాహిత్యం సృష్టించిన హరిజన కవి గుర్రం జాషువను మాత్రం 'దళితకవి' అంటూ ఆయనను మిలీనియం మహనీయుల్లో చేర్చడానికి తాపత్రయపడ్డారు. కాని జాషువ సమకాలంలో వచ్చిన ఈ దళిత సాహిత్యాన్ని, ఈ పేరుతో పిలవడానికి నిరాకరిస్తున్నారు.

మ్లేచ్చులు, చండాలురు, అస్పృశ్యులు, పంచములు, అంటరానివారు, హరిజనులు, ఈ పేర్లు అనంతర కాలంలో 'దళితులు'గా రూపాంతరం చెందాయి. రేపు మరో పేరు కూడా రావచ్చు. కారం చేడు సంఘటనతోనే ఆంధ్రదేశంలో అకస్మాత్తుగా 'దళితులు'' 'దళిత చైతన్యం' అనే పదాలు ఊడి పడ్డాయా లేదా కారంచేడు సంఘటన జరిగిన రోజునే 'దళిత'' 'దళిత 'చైతన్యం' అనే విదేశీ మెడిసిన్ ఆంధ్ర దేశ దళితమేధావులకు ఇంజెక్టు చేయబడిందా? లేదా ఈ దళిత మేధావులు ఆ రోజునే ఆకాశం నుండి ఊడి పడ్డారా! దళిత చైతన్యం రావడానికీ, ఆంధ్ర దేశంలో కారంచేడు సంఘటన జరగడానికీ కుల,మత,వర్గంతో కూడిన పదుల, వందల, వేల సంవత్సరాల ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ సంఘటనల ప్రభావం ఉంది. ఈ అంతసూత్రాన్ని దళిత మేధావులు గుర్తించాల్సి ఉంది. అగ్రవర్ణాలు సృష్టించిన గతకాలపు దళిత సాహిత్యాన్ని స్పృశించకుండానే ఈ దళిత మేధావులు, మేధావులయ్యారా!'' పిల్ల వచ్చి గుడ్డును వెక్కిరించినట్లు' ' అనే చందం వీరిది. ఈ ఆలోచనతో ఈ మేధావులు చరిత్రను మటుమాయం చేసి ఉద్యమాన్ని ఉద్యమ సాహిత్యాన్ని తమ స్వంతం చేసుకొనే ప్రయత్నంలో ఉన్నారు. అందుకు వీరు ప్రచురించిన ప్రతి పుస్తకంలోనూ'' అసలైన దళితసాహిత్యం ఇదే'' అని ఉంటుంది. ఈ ఆలోచనవల్ల వీరి కీర్తికాంక్ష ఎట్టిదో అర్థమవుతుంది. ఈ ఆలోచనతోనే దళిత ఉద్యమానికి సమాంతరంగా వచ్చిన పలు ఉద్యమాలు కనుమరుగవుతున్నాయి. దళిత ఉద్యమానికి అకాలం రాకూడదనేది నా ఆశ.

దళిత కథా సంకలనం సమీకరణలో భాగంగా ఈ దళిత మేధావులకు వందల సంఖ్యలో ఉత్తరాలు రాశాను. ఈ సంకలనాలు ప్రచురిస్తే, కె.లక్ష్మీనారాయణకు ఎక్కడ కీర్తి వస్తుందో అనే భ్రమలో పడి చాలామంది దళిత మేధావులు తమ దళిత కథానికలను పంపలేదు. ఎక్కడో సంపాదించుకొన్న కథానికలను సంకలనాల్లో ప్రచురించడానికి కొందరు అనుమతి నిరాకరించారు. ఇది చాలా బాధాకరం.

దళిత పీఠాధిపతులు దళిత సాహిత్యాన్ని వారు వారి సాహితీ దృక్పథం నుండి మాత్రమే ప్రచురించాలి. మరొకరు ప్రచురించ కూడదు. ఒకవేళ ప్రచురిస్తే డబ్బుకోసం ఆ పని చేశారని చాటింపు వేస్తారు. వారు చెప్పిందే దళిత వేదం! వారు చేసిందే దళిత శాసనం! మరొకరు మాట్లాడరాదు. ఇతరులకు ఏమీ తెలియదని వాగేస్తారు. నోరు కుక్కేస్తారు. దీనివల్ల దళిత సాహిత్యం బలపడుతుందా! దిగజారుతుందా! వారే ఆలోచించాలి. ప్రారంభంలో బి.సి. మేధావి ఒకరు. యస్సి, యస్టీ, బి.సి. మైనారిటీలు అందరూ దళితులని సిద్ధాంతం చేసి దళిత పీఠం వేసుకున్నాడు. అందరి దళిత సాహిత్యాన్ని విమర్శించడం మొదలు పెట్టాడు. ఈ కోవలో యస్సీ రచయితల దళిత సాహిత్యాన్ని కూడా విమర్శకు పెట్టాడు. దళితులు మేలుకొన్నారు. దళితులు రాసిందే అసలైన దళిత సాహిత్యమని తమకు బి.సి. లు కూడా అవసరం లేదని. తమ సాహిత్యాన్ని తామే సృష్టించుకుంటామని స్పష్టం చేశారు. ఆ బి.సి. మేధావి అవాక్కయి పోయాడు. ఇలా సమస్యలు తలెత్తాయి. దళిత పీఠాధిపతుల ఆధిపత్య బావం సరిదిద్దుకొనిదే దళిత సాహిత్యం ముందుకు పోదు. దళిత పీఠాది పతులు చాలామంది దళిత రచయితలను, కళాకారులను మేధావులనూ తయారు చేయాల్సి ఉంది. అపుడే ఉద్యమం బలపడుతుంది.

ఇక కథకులు కథల గురించి ఆలోచిస్తే. దళితేతర కథకులు ఎక్కువ దళిత కథకులు చాలా తక్కువ శ్రీపాద చలం, కరుణ కుమార కా.రా లాంటివారు తమ శక్తిమేర దళిత జీవితాన్ని తమ కథానికల్లో చిత్రించారు. బి.యస్. రాములు పులికంటి కృష్ణారెడ్డి కాలువ మల్లయ్య, స్వామి, చిలుకూరి దేవపుత్రలు దళిత సమస్యలను కథలుగా రాశారు. రాస్తున్నారు. దళిత కథకుల గురించి ఆలోచిస్తే 1972 అనంతరం కొలకలూరి ఇనాక్ ఊరబావి లాంటి దళిత కథానికలు రాయలేకపోయారు. బోయ జంగయ్య గ్రామీణ దళిత జీవితాన్ని శక్తివంచన లేకుండా కథాలుగా రాస్తూనే వున్నారు. పైడి తెరేష్ బాబు నగర దళితుల జీవన చిత్రణకే పరిమితయ్యారు. నాగప్పగారి సుందరరాజు కథలు తెలంగాణాలోగానీ, ఉత్తరాంధ్రలోగానీ సామాన్య పాఠకుడు చదివి అర్థం చేసుకోవాల్సి ఉంది. సదలపల్లి స్వరూపారాణి సీరియస్ రైటర్‌గా ఎదగాల్సి ఉంది. గ్రామీణ దళిత జీవితం నుండి కథానికలు రావాల్సి ఉంది. దళిత సాహిత్యం స్తబ్దతకు లోనయ్యింది దళిత సాహితీవేత్తలు మౌనం వహించారు. వీరు దళిత సమస్య గురించి ఒక కొత్త ఆలోచనకోసం ఒక కొత్త అనుభూతి కోసం ఒక కొత్త అభివ్యక్తి కోసం ఆలోచిస్తున్నారు. ఈ నూతన నేపథ్యం నుంచి దళిత సాహిత్యం ఉద్భవించాల్సి ఉంది.

ఓ మేధావులారా! ఈ సంకలనాలు చదవండి, విమర్శలు. ప్రతి విమర్శలు రాయండి సంకలనాలను ఇతర భాషలలోకి అనువదించండి.

ఈ సంకలనాల్లో అచ్చు తప్పులు చాలా ఉన్నాయి. దీనికి కారణం పాత,పుస్తకాల్లోనూ పాత పత్రికల్లోనూ కథానికలు సరిగా జిరాక్స్ రాకపోవడం. నేను ప్రూఫ్ దిద్దినా కంప్యూటర్‌లో అచ్చు తప్పులు సరిగా దిద్దక పోవడం లాంటి పొరపాట్లు జరిగాయి. అందుకు నన్ను రచయితలు పాఠకులు క్షమించాలి.

ఈ విజయం నాది ఒక్కనిదే కాదు అపార ఆంధ్రదేశపు రచయితలది, ఆర్థిక సహాయం అందించిన పలు సంస్థలు అధినేతలది. ఈ సంకలనాలకు సూచనలిచ్చిన మేధావులది. సంకలనాలను ఆదరించిన పాఠకులది, మిత్రులది. కానీ ఈ ప్రయత్నం సమగ్రం కాదు. తెలుగు కథానికా సాహిత్యం చిన్నది 'లోతైనది' విశాలమైనది. దాదాపు లక్షన్నర కథానికలు కలిగిన ఈ



సాహిత్యంలో సమగ్ర దళిత కథా సేకరణ సులభతరం కాదు. నేను చూసిన పత్రికల్లో దొరికిన కథలు మాత్రమే ఇవి దొరకని పాత పత్రికల్లో దొరకని కథలు ఎన్ని ఉన్నాయో వివరించటం. ఆలోచించడం కష్టతరం. అయినా నామేర నేను కథల సమీకరణకు ప్రయత్నించాను. నాశ్రమకు ఒక ఉదాహరణ చెబుతాను. శ్రీపాదరాసిన పుల్లంరాజా కథ సేకరణకు దాదాపు ఆరు సంవత్సరాలు పట్టింది. కథ ఉన్నట్లు తెలుసుకానీ కథ దొరకలేదు. ఒకసారి కాకినాడకు వెళ్ళడం. శ్రీపాద శిష్యుడు డా॥ చామర్తి కనకయ్య గారిని కలవడం ఈ కథ గురించి వాకబు చేయడం తనవద్ద చితికిపోయిన ప్రబుద్ధాంధ్ర పత్రికలను (1930 ప్రాంతంనాటివి) చూడటం, అందులోనుండి కథ ఎత్తి రాసుకోవడం. ఇలాంటి సంఘటనలు చాలా ఉన్నాయి. ఇలా చేసినందుకు ఈ ప్రయత్నం సాధ్యమైంది. తెలుగు సాహిత్యంలో అతిపెద్ద పనిని అతి తక్కువ కాలంలో చేసిన ప్రాజెక్టు ఇది ఈ ప్రయత్నంలో నేను పడని కష్టం అంటూలేదు. ఆర్థిక ఇబ్బందుల వల్ల లారీ ప్రయాణాలు చేస్తూ. పలుసార్లు ప్రాణాపాయం నుండి బయట పడటం. ఆర్థిక సహాయాల సేకరణలో అనుమానాలు 'అవమానాలు' సూటిపోటిమాటలు, భరించాను. చివరకు ఈపని పూర్తిచేసి తెలుగు సాహితీ లోకానికి అందించాను.

ఈ సంకలనాల అంకితాలను గురించి తెలుగు పాఠకలోకానికీ, దళితవాదులకూ కొన్ని ఆలోచనలున్నాయి. నాకు కొన్ని వేలరూపాయలు ఆర్థిక సహాయం చేసిన వారికి కృతజ్ఞతగా ఈ పని చేయడం నా దృష్టిలో సబబే. అలాగే ఈ సంకలనాలు దళిత వాదానికి చెందినవేనా? అనే ప్రశ్న నేడు దళితమేధావుల్లోనే తలెత్తింది. అక్షరాలా ఈ కథల్లో దళిత జీవితం ఉందనే నా అభిప్రాయం. కొందరు దళిత మేధావులు దళితవాదాన్ని నిర్వచించాల్సి ఉంది.

ఈ సంకలనాల ప్రచురణకు అధికధనాన్ని (60,000) ఆర్.డి.టి. సంస్థ ఇచ్చింది. అలాగే అలాగే మిగిలిన సంకలనాలకు ఆర్థిక సహాయం అందించిన సాక్షి యంగ్ ఇండియా, అస్మితా వంటి సంస్థలకు, శ్రీ ఫాదర్ విన్సెంట్ ఫెర్రర్, మోస్ట్. రెవ. డా॥ మారంపూడి జోజిగారు, మోస్ట్. రెవ. డా॥ గోరంట్ల జ్వోన్నెస్ రెవ. ఫాదర్. గోవాడ దైవాశీర్వాదం గార్లకు, కోరిన వెంటనే ఈ సంకలనాలకు ముఖచిత్రాలు గీచిన శ్రీ శీలావీర్రాజు, శ్రీ గడియారం శ్రీను గార్లకు హృదయపూర్వక కృతజ్ఞుడను.

ఏది ఏమైనా, ఎన్ని ఆటంకాలు అడ్డంకి అయినా ఒక కార్యం పూర్తి అయ్యింది ఒక ప్రయత్నం నెరవేరింది. ఇపుడు నా గుండె ప్రశాంతంగా ఊపిరి పీల్చుకుంటోంది. నా ప్రయత్నం ముగిసింది. ఇక ఈ సంకలనాల గురించి ఆలోచించాల్సిన పని రచయితలకు, విమర్శకులకు, తత్త్వవేత్తలకు, అనువాదకులకూ, పాఠకులకు ఉంది. ఈ సంకలనాల సమీకరణలో ఆదినుండి అంతందాకా అమూల్య సహాయ సహకారాలు అందించిన గురువులకు. రచయితలకు మేధావులకూ, ఈ సంకలనాలను ఆదరిస్తున్న పాఠక లోకానికీ, పరిశోధనలు చేస్తున్న పరిశోధకులకూ, అమ్మకానికి పెట్టిన పుస్తక విక్రయ శాలలకు కృతజ్ఞతలు నా ఉన్నతి కోరే నా తల్లి కుమ్మర అనంతమ్మకూ, నాకుటుంబ సభ్యులకు, లిటరరీ క్లబ్ (అనంతపురం) సభ్యులకు, జిల్లా రచయితల సంఘానికి (అనంతపురం) కృతజ్ఞతలు.

# 24 అపూర్వ కృషి - అనన్య శ్రమ

## రాచపాళెం చంద్రశేఖరరెడ్డి

తెలుగు కథానిక 1901 ప్రాంతాలనుంచి పురిటి నొప్పులు పడి 1910లో గురజాడ "దిద్దుబాటు" 'తో సలక్షణంగా సాహితీలోకంలోకి ప్రవేశించింది. ఆరకంగా తెలుగు కథానిక మరో ఏడాదిలో నూరేళ్ళు నింపుకోబోతున్నది. పుట్టినప్పటి నుంచి నేటి దాకా తెలుగు కథానిక భారతీయ జీవితంలోని వెలుగు చీకట్లకు అద్దం పట్టుతూ వస్తున్నది. ఊరికే అద్దం పట్టడం కాకుండా సామాజిక పరివర్తనకు తాను స్పందిస్తూ, సామాజిక మార్పుకు దోహదం చేస్తూ తన సామాజిక బాధ్యతను నిర్వహిస్తూ వస్తున్నది. భారతీయ సమాజంలో సంభవిస్తున్న ఆర్థిక సాంఘిక రాజకీయ సాంస్కృతిక సందర్భాలకు తెలుగు కథానిక ఎప్పటి కప్పుడు ప్రతిఫలనంగా నిలుస్తున్నది. తెలుగు కథానిక అప్పుడప్పుడూ కొంతవరకు వ్యాపార మార్గం పట్టిన సందర్భాలు లేకపోలేదు గాని, ఏనాడు కథానిక మొత్తంగా సామాజిక స్వభావాన్ని చంపుకో లేదు, పూర్తిగా ఏనాడూ సామాజిక బాధ్యతను విస్మరింపలేదు. ఇంకొక రకంగా చెప్పాలంటే ఒకదశలో తెలుగు నవల తెలుగు వాళ్ళకు తెచ్చిన తలవంపులు కథానిక మాత్రం తీసుకు రాలేదు. ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో స్తబ్ధతాయుగంగా కొందరు చరిత్రకారులు భావించే 1956 - 1965 దశాబ్దంలో కూడా ఎన్నో గొప్ప కథానికలు వచ్చాయి. తెలుగు కథానికకు సంబంధించి క్షీణయుగాలు స్తబ్ధతాయుగాలు లేవు.

తెలుగు కథానిక పుట్టుకే ప్రతిఘటనలతో, ప్రశ్నలతో మొదలైంది. గురజాడ సృష్టించిన కమలిని, పూజారి కోడలు సరళలు ఈ పాత్ర నిర్వహించారు. అప్పట్నుంచి తెలుగు కథానిక మడమ తిప్పకుండా ఎప్పటికప్పుడు సామాజిక రుగ్మతల్ని ఎండగడుతూ వస్తున్నది. సామాజిక స్వేచ్ఛకోసం, సామాజిక సమానత్వంకోసం, సామాజిక సౌభ్రాతృత్వం కోసం - ఒక్క మాటలో సామాజిక న్యాయం కోసం పోరాటం చేస్తూనే ఉంది. అన్ని రకాల ఆధిపత్యాన్ని, అణచివేతను హింసను వ్యతిరేకిస్తూ విప్లవిస్తున్నది. విభిన్న కాలాల్లో కొనసాగిన ఉద్యమాలకు ప్రతిస్పందిస్తూ తెలుగు కథానిక అనతి కాలంలోనే క్రింది తరగతిని, అధోజగత్సహోదరుల జీవితాలను అందిపుచ్చుకొంది. అనారోగ్యంతో కొట్టుమిట్టాడుతున్న సమాజాన్ని ఆరోగ్య కరంగా మార్చడానికి కృషి చేస్తున్నది.

తెలుగు కథానికాభివృద్ధికి తెలుగు పత్రికలు చేసిన, చేస్తున్న దోహదం అనిర్వచనీయమైంది. తెలుగు జనానా, కల్పలత హిందూ సుందరి వంటి పత్రికల్లో పిండరూపం ధరించి ఆంధ్రభారతిలో పురుడు పోసుకుంది తెలుగు కథానిక. ఆతర్వాత సాహితి, ఆంధ్రపత్రిక, రెడ్డిరాణి, ప్రబుద్ధాంధ్ర, ఆంధ్రశిల్పి, అభ్యుదయ, సఖి, జ్వాల, గృహలక్ష్మి, చిత్రగుప్త వంటి ఎన్నో పత్రికలు కథానికను తమ పుత్రికగా పెంచి పోషించాయి. ఇవాళ అనేక దినవార మాస పక్ష పత్రికలు కథానికలు లేకుండా రావడం లేదు. ఇవాళ పత్రికలు ఎంత వ్యాపారదృష్టితో వ్యాపార కథానికల్ని ప్రోత్సహిస్తూ

ఆదరిస్తున్నా, సీరియస్ కథానికల్ని తిరస్కరించలేని స్థితిలో ఉన్నాయి. ఇది కథానికా సాహిత్యం పత్రికా రంగంమీద సాధించిన విజయం.

ఈ శతాబ్ది చివరికి కనీసం లక్షన్నర కథానికలైనా లెక్కవుతాయని ఒక అంచనా. వీటిలో అత్యధిక సంఖ్యలో కథానికలు పత్రికల్లోనే మిగిలిపోయాయి. సంకలనాల్లోకి ఎక్కినవి అతి తక్కువ కథానికలే. ఒకనాటి పత్రికలు మరి కొంత కాలానికి అలభ్యాలై తర్వాతి తరాలకు అందుబాటులో ఉండటంలేదు. వచ్చిన కథానికలన్నీ ఎప్పటి కప్పుడు సంకలన రూపంలో వస్తే కథానికాధ్యయనం సులభతరమౌతుంది. అయితే ఇది వ్యయ ప్రయాసలతో కూడిన పని. ప్రభుత్వానికి గొప్ప సాంస్కృతిక దృష్టి ఉంటే తప్ప ఇది సాధ్యం కాదు. వ్యక్తిగతంగా రచయితలు, కొన్ని సాహితీ సంస్థలు, ప్రజా సంఘాలు తమ తమ అభిరుచులకు ప్రయోజనాలకు అనుగుణంగానైనా తెలుగులో ఇప్పటికి అనేక కథానికా సంకలనాలు తెస్తున్నారు, తెస్తున్నాయి.

కథా సంకలనాలు రెండు రకాలు. ఒకటి, ఒక రచయిత రాసిన కథానికల సంకలనం - గురజాడ కథానికలు, శ్రీపాద చిన్న కథలు, మొ॥. రెండు, విభిన్న రచయితలు రాసిన కథానికల సంకలనాలు - నేల తల్లి విముక్తి కోసం, భూమిక మొ॥ ఈ రెండో రకం సంకలనాలు అనేక విధాలుగా ఉంటాయి.

1. ఒక నిర్దిష్ట కాలంలో వచ్చిన కథానికల సంకలనం తొలినాటి తెలుగు కథలు (1935 - 45), ఒక దశాబ్ది తెలుగు కథలు (1946 - 55) తెలుగు కథ (1960 - 85) కథ - 90, కథ - 91 మొ॥.

2. ఒక ఉద్యమనేపథ్యంలోంచి వచ్చిన కథానికల సంకలనాలు తెలంగాణ పోరాట కథలు, రుతు పవనాలు, శ్వేతరాత్రులు.

3. ఒక ప్రాంత జీవితం పరిధిగా వచ్చిన కథానికల సంకలనాలు సీమ కథలు, వంశధార కథలు, నాగావళి కథలు, గోదావరిగాథలు, ఇంద్రావతి కథలు, పెన్నేటి కతలు, వాలినమబ్బులు, ఇంద్రావళి కథలు, పెన్నేటి కతలు, వాలిన మబ్బులు, సినబ్బకతలు మొ॥

4. ఒక జీవిత సమస్య లేక ఒక సామాజిక వర్గ జీవితం ఆధారంగా వచ్చిన కథానికల సంకలనాలు: చదువు కథలు, ఇంకానా ఇకపై చెల్లదు. మాదిగోడు, మావూరి మైసమ్మ, ఎదురు చూపులు.

ఇంకా అనేక పరిధులు ప్రమాణాలతో ఒకతరం తెలుగు కథ, నూట పదహార్లు, కథా మంజూష, తాతదిగిపోయిన బండి, కథాభారతి, మంచికథ, కొత్త కథ, సరికొత్త కథ, కథాంజలి, కథా స్రవంతి, కథాసాగర్, కథామందారం, పల్లెమంగలి కథలు, ఫాక్షన్ కథలు, అల్పజీవులు, సుమసౌరభాలు, నవకథావళి వంటి పేర్లతో ఎన్నో సంకలనాలు వచ్చాయి. ఆంధ్ర (వార) పత్రిక అసంఖ్యాకంగా ఉగాది సంచికల్ని కథా సంకలనాలుగా తెచ్చింది. ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ వంటి పత్రికలు కూడా ఏడాదికో కథా సంకలనం తెస్తున్నాయి. యువ మాస పత్రిక ప్రతిదీ ఒక సంకలనం. విపుల పత్రిక నెలనెలా వచ్చే భారతీయ కథాసంకలనం. విపుల 1978 ఫిబ్రవరి నుంచి ఇప్పటిదాకా దాదాపు 4000 కథానికల్ని తెలుగు పాఠకులకు అందించింది. కేంద్ర సాహిత్య అకాడమీ, నేషనల్ బుక్‌ట్రస్ట్, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, విశాలాంధ్ర (బుక్ హౌస్) విశాల సాహిత్య అకాడమీ, విరసం, అరసం వంటి సంస్థలు విశేషంగా కథా సంకలనాలను అందిస్తున్నాయి. ఇటీవల రచన, సాహిత్య నేత్రం, ఆహ్వానం, ఇండియాటుడే వంటి పత్రికలు కూడా ప్రత్యేక కథాసంకలనాలు తెస్తున్నాయి.

ఇప్పుడు మిత్రుడు డా. కె. లక్ష్మీనారాయణ దళిత కథా సంకలనాలను మనకు అందుబాటులోకి తెచ్చాడు. ఈ సంకలనాలలో రెండిటికి నేను ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారు సహకరించాం. అయినా ప్రధాన కృషి మాత్రం లక్ష్మీనారయణకే. ఆచార్యకొలకలూరి ఇనాక్‌గారు నలుగురు పరిశోధకులతో ఆధునికాంధ్ర కవిత్వం, నవల, కథానిక, నాటకాలలో హరిజనాభ్యుదయంమీద పరిశోధనలు చెయ్యించారు. ఆనలుగురిలో లక్ష్మీనారాయణ "హరిజనాభ్యుదయం - తెలుగు కథానిక" అనే అంశంమీద పరిశోధించారు. అతని సిద్ధాంతగ్రంథానికి శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంవారి ఉత్తమ సిద్ధాంత గ్రంథపురస్కారం లభించింది. పిహెచ్.డి. పట్టా రాగానే అనేకమంది దానితో తృప్తిపడిపోయి ఊరుకుంటారు. కాని లక్ష్మీ నారాయణ అలా ఊరుకోలేదు. తన పరిశోధన పరిధిలోకి వచ్చిన దళిత కథానికల్ని, పరిశోధన పూర్తయిన తర్వాత వచ్చిన కథానికల్ని సంకలనాలుగా ప్రజలకందించే బాధ్యతను భుజాన వేసుకున్నాడు. ప్రయత్నించి విజయం సాధించాడు. సంస్థలు చెయ్యవలసిన పనిని వ్యక్తి చేశాడు. నిరుద్యోగిగా ఇబ్బంది పడుతూనే, దళిత సమస్యల మీద కృషి చేస్తూనే, దళిత రచయితలు కళాకారులు మేధావుల ఐక్యవేదికలో పనిచేస్తూనే ఈ సంకలనాలు మనకందించాడు. నేను లక్ష్మీనారాయణ కలిసి తెచ్చిన మొదటి "దళిత కథలు" సంకలనాన్ని విశాలాంధ్ర వాళ్ళు ప్రచురించారు. తక్కిన సంకలనాలు రమా పబ్లికేషన్స్‌మీద వచ్చాయి. మొదటి సంకలనం కాల క్రమ పద్ధతిలో వచ్చింది. తక్కినవి ఆర్థిక సాంఘిక రాజకీయాది దృష్టులతో వచ్చినవి.

తెలుగు కథానికా ప్రచురణలోనేగాక, దళిత సాహిత్య చరిత్ర నిర్మాణంలోనే ఇదొక ఉజ్జ్వల సంఘటన, బాధ్యతాయుతమైన చర్య. అపూర్వకృషి అనన్యశ్రమ. ఈ కృషిని ఈ శ్రమను సాహితీ జీవులందరూ ఆహ్వానించడం అభినందించడం అభిలషణీయం. దళిత ఉద్యమకారులు, సానుభూతి పరులు, సామాజిక న్యాయవాదులు, ప్రగతిశీల విప్లవ సాహిత్యకారులు గర్వించదగిన కృషి ఇది. వ్యాపార దృష్టిలేని ఈ కృషి బాధ్యతాయుత సామాజికాచరణకు నిదర్శనం.

ఒక్క విషయం మనం గుర్తు పెట్టుకోవాలి. ఆచార్య ఇనాక్ గారు దళిత దృష్టితో పరిశోధనలు చెయ్యించడానికి, లక్ష్మీనారాయణ ఈ సంకలనాలు తీసుకు రావడానికి స్ఫూర్తి ప్రేరణ ఆంధ్ర ప్రదేశ్‌లో సంభవించిన కారంచేడు చుండూరు వంటి సంఘటనలు, అప్పట్లో మొదలైన దళితోద్యమం, డా. బి.ఆర్. అంబేద్కర్, శ్రీ గుర్రం జాషువాల శత జయంతులు వంటివే. సామాజిక ప్రేరణలోంచే ఈ కృషి జరిగింది.

ఈ ఎనిమిది సంకలనాలలో 110 కథకులు రచించిన 215 దళిత కథలున్నాయి. ఈ సంకలనాలు ఆధారంగా చూస్తే 1925లో ప్రబుద్ధాంధ్రలో వచ్చిన శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి "పుల్లం రాజు" మొట్టమొదటి దళితకథగా తెలుస్తున్నది. శాస్త్రిగారు "పుల్లం రాజు" అనే పేరుతో అంతకు ముందే ఒక కథ రాసినట్లు నేను అక్టోబర్ 23న శ్రీకాకుళంలోని కథానిలయం సందర్శించినప్పుడు తెలిసింది. అయితే అది దళిత జీవితాన్ని చిత్రించిన కథ దళిత జీవితాన్ని గురించి దళిత రచయిత రాసిన మొదటి కథానికగా గొట్టముక్కుల మంగాయమ్మగారి "అయ్యోపాపం" (గృహలక్ష్మి మార్చి 1935). అయితే 1960 - 65 ప్రాంతాలదాకా దళితుల జీవితాన్ని గురించి దళితేతర రచయితలు రాసిన కథానికలే అత్యధికంగా వచ్చాయి. 1960 - 65 ప్రాంతాల్లో కొలకలూరి ఇనాక్‌గారు గొప్ప దళిత కథలు రచించారు. ఆతర్వాత అనేకమంది దళితులు కథారచయితలు ఎదిగి వచ్చి దళిత కథానికను సుసంపన్నం చేస్తున్నారు. శ్రీ పాదనుండి నేటిదాకా దళితేతర రచయితలు తమ కథానికల్లో దళిత జీవితాన్ని చిత్రిస్తూనే ఉన్నారు.

ఈ ఎనిమిది సంకలనాల్లోని కథానికల్ని చారిత్రక క్రమంలో అధ్యయనం చేస్తే దళిత సమస్యను రచయితలు ఆయాకాలాల్లో కొనసాగిన ఉద్యమాలు, ఆయాకాలాల్లో ప్రబలంగాపని చేసిన భావజాలం, ఆయా రచయితల వ్యక్తిగత చైతన్యం నేపథ్యంలో అధ్యయనం చేసి రచించినట్లు అర్థమౌతుంది. సంఘ సంస్కరణోద్యమం, భారతజాతీయోద్యమం, వామపక్షోద్యమం విప్లవోద్యమం, దళితోద్యమం - ఇవన్నీ దళిత కథా రచయితల్ని ప్రభావితం చేశాయి. సమస్యను అర్థం చేసుకోవడంలో, దానికి పరిష్కారం చెప్పడంలో, సమస్యను చిత్రించడంలో ఈ ప్రభావాలను మనం గమనించగలం.

ఈ కథానికలన్నిటినీ అధ్యయనం చేస్తే "చాతుర్వర్ణ్యం వంటి భ్రష్టవ్యవస్థ ప్రపంచంలో మరెక్కడా కనిపించదు" "మూఢాచారుల చేతిలో కులం ఒక వజ్రాయుధం" "సాంఘిక నిరంకుశత్వం రాజకీయ నిరంకుశత్వం కంటే క్రూరమైనట్టిది" డా.బి.ఆర్. అంబేద్కర్‌గారి అభిప్రాయాలు ఎంత వాస్తవాలో అర్థమౌతుంది. మనదేశం గురించి మనం చెప్పుకునే గొప్పలు ఎంత అసంబద్ధాలో, మన స్వాతంత్రోద్యమం, అది సాధించిన స్వతంత్రం ఎన్ని పరిమితులకు లోనయ్యాయో అవగాహన కొస్తాయి. ఇవాళ నడుస్తున్న ఆర్థిక రాజకీయోద్యమాలతో, 1936 నాటి డా. బి.ఆర్. అంబేద్కర్‌గారి సలహాను పరిగణనలోకి తీసుకొని, సాంఘిక ఉద్యమాన్ని తిరిగి అనుసంధానం చేసుకోవలసిన అవసరం తెలిసి వస్తుంది. కుల దురహంకారం, మతోన్మాదం వంటి పనికి మాలిన అంశాలు ప్రధానమైపోతే అవి మనసామాజిక వ్యవస్థను, మానవసంబంధాలను ఎలా ఛిన్నాభిన్నం చేస్తాయో ఈ కథానికలు తెలియ జేస్తాయి. సాంఘిక సమస్యల్ని పరిష్కరించుకోకుండా శాస్త్ర సాంకేతిక రంగాల్లో ఎంత ప్రగతి సాధించినా సమాజం నాగరిక బాటలో నడవడం సాధ్యం కాదని ఈ కథానికలు తెలుపుతాయి. ఉత్పత్తి రంగంలో కీలక పాత్ర పోషించేవాళ్ళు అభివృద్ధికీ ఆత్మ గౌరవానికీ నోచుకోని దుర్మార్గమైన వైరుధ్యాన్ని ఈ కథానికలు బట్టబయలు చేస్తాయి. భారతీయ సమాజ నిర్మాణంలోని అప్రజాస్వామికతను ఈ కథానికలు ప్రశ్నిస్తాయి, మానవ సంబంధాల్లో కొరవడిన సౌభ్రాతృత్వాన్ని ఎత్తి చూపుతాయి. ఒక్క మాటలో భారతీయ సామాజిక వ్యవస్థలోని సామాజిక క్రౌర్యానికి ఈ కథానికలు నిలువెత్తు సంతకాలు. ఈ సంకలనాలలోని కొన్ని కథానికలు దోపిడి వ్యవస్థను మార్చకుండా ఏ సామాజిక వర్గంనుంచి వచ్చినవారైనా దోపిడికి అతీతులు కాదన్న వాస్తవాలన్ని కూడా చాటి చెబుతున్నాయి.

భారతీయ సమాజంలో దళితులు దప్పిక తీర్చుకోడానికి ఇన్ని నీళ్ళు తాగాలంటే మతం మార్చుకోవాల్నా? అని పాద శ్రీపాదగారి 'ఇల్లాంటి తవ్వాయి వస్తే" అనే కథ (1934) ప్రశ్నిస్తుంది. "భారతదేశంలోని హరిజనులందరూ ఇంత తిండీ ఇంత బట్ట సంపాదించుకోవాలంటే శాసనసభ్యులవ్వాలా?" అని అడివి బాపిరాజు 1952 (నరసన్న పాపాయి) ప్రశ్నిస్తే, "తమమీద దౌర్జన్యం జరిగితే మంత్రి అయి కూడా శివరాం ఎందుకు మౌనం వహిస్తున్నాడు? పాలనాధికారం ఉండికూడా దళితుడు పీడింపబడవలసిందేనా?" అని డా. శాంతినారాయణ 1992లో (ఉక్కుపాదం) ప్రశ్నించారు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో దళితోద్ధరణ ప్రయత్నం జరిగినా, స్వాతంత్ర్యానంతరం దళితుల ఆర్థిక రాజకీయ జీవితాల్లో ఏవో కొన్ని మార్పులు వచ్చినా, సాంఘికంగా దళిత సమస్య అపరిష్కృతంగానే మిగిలి పోవడాన్ని ఈ ప్రశ్నలు సూచిస్తున్నాయి.

"గ్రుక్కెడు నీళ్ళు" (బందాకనకలింగేశ్వరరావు) కథలో వెంకటప్ప కరణంచేత దెబ్బలు తిని మౌనంగా భరిస్తాడు. దెబ్బలు కొట్టిన వారికే ఉపకారం చేసి పరివర్తనకు దోహదపడతాడు. ఇదిగాంధీ ప్రభావంతో 1932లో వచ్చిన కథ. "పోలయ్య" (కరుణ కుమార) కథలో పోలయ్యను దళితుడని తెలుసుకొని, బ్రహ్మణున్ని బండిలో తీసుకొచ్చినందుకు, అగ్రవర్గాలవాళ్ళు బాగగొట్టబోతూంటే,

జాగ్రత్త పడిన పోలయ్య, తన పేరు పౌలయ్య అని, తాను క్రైస్తవుడినని చెప్పి దెబ్బలు తప్పించుకుంటాడు. పురోహిత వర్గం పాలకులెవరైనా వాళ్ళకు విధేయత ప్రకటించడాన్ని కూడా 1937 నాటి ఈ కథ నిరూపిస్తుంది. దళిత స్త్రీని చంపిన భూస్వామి మీద సహాయ నిరాకరణ ద్వారా ప్రతీకారం తీర్చుకున్న దళితుల కథ "కొత్త చెప్పులు"

చెరువులో నీళ్ళు ముంచుకోనివ్వని అగ్రహారికులకు మతం మార్చుకుని మహమ్మదీయులుగా మారి, దళితులు బుద్ధి చెప్పిన కథ శ్రీపాద "ఇలాంటి తవ్వాయి వస్తే" (1934). అగ్రవర్ణాల వాళ్ళు దళితుల్ని నీళ్ళు చేరుకోనివ్వకపోతే, దళితులు అగ్రవర్ణాల వాళ్ళకు అవసరమైనప్పుడు దళితవాదంలోని తమ బావిలో నీళ్ళు చేదుకో నిచ్చి బుద్ధి చెప్పిన కథ "చెంబుకొక గంగ" (పులికంటి కృష్ణారెడ్డి). అగ్రవర్ణాలవాళ్ళు దళితుల్ని ఊరిబావిలో నీళ్ళు చేదుకోనివ్వకపోతే, తమకు లేని నీళ్ళు అగ్రవర్ణాల వాళ్ళకు మాత్రం ఎలా ఉంటాయని, చచ్చిన పశువు కళేబరాన్ని బావిలో పడవేసి కసి తీర్చుకున్న చిదంబరం భార్య కథ "ఊరబావి" (కొలకలూరి ఇనాక్ 1969) కాట్రగడ్డ దయానంద్ రచించిన "చెలమ" కథలో కూడా నీళ్ళు తోడుకోనివ్వని అగ్రవర్ణాల వాళ్ళకు, బావిలో పశువును పడవేసి బుద్ధి చెబుతారు దళితులు. బి. దామోదరరావు రచించిన "ఊరిబాయి" కథలో అగ్రవర్ణాల వాళ్ళు దళితుల్ని నీళ్ళు చేదుకోనివ్వకపోతే పోచవ్వ తల్లి ఆబావిలో దూకి వాళ్ళకు బుద్ధి చెబుతుంది. మనుషులందరికీ జీవనాధార మైన నీటి విషయంలో అస్పృశ్యత అనే దురాచారం సృష్టించిన సామాజిక సంఘర్షణను, దళితులు తమ సమస్యల్ని ఎట్ల కాలానుగుణంగా చైతన్యానుగుణంగా తమదైన పద్ధతిలో నిరసనను తెలపడం ప్రతిఘటించడం - ఈ కథలు ప్రదర్శిస్తున్నాయి.

అజ్ఞాత వాసం (మధురాంతకంరాజారాం) ఊడల మర్రి (చిలుకూరి దేవపుత్ర) వేట (కొల్లిపాక శ్రీరామమూర్తి) పెద్దోళ్ళు (బొడ్డుపల్లి కూర్మారావు) వంటి కథానికలు దళితులకు పంచాయితీలలో రిజర్వేషన్లు పెట్టినప్పుడు జరిగిన ప్రహసనాలను చిత్రించాయి. అగ్రవర్ణ భూస్వాములు దశాబ్దాలుగా సర్పంచులుగా ఉన్న పంచాయితీలు దళితులకు రిజర్వు చేస్తే, ఆ భూస్వాములు తమ అధీనంలో ఉండే తమ జీతగాళ్ళనే సర్పంచుల్ని చేసి తమ ప్రయోజనాలకు భంగం కలక్కుండా కాపాడుకున్న తీరును ఈకథానికాలు అత్యంత వాస్తవికంగా ప్రతి ఫలించాయి.

యజ్ఞం (కాళీపట్నం రామారావు) ధనదాహ ఫలితం (మొలకవల్లి కోటీశ్వరరావు) ఉచ్చు (సింగమనేని నారాయణ) వంటి కథలు అగ్రవర్ణభూస్వాములు అప్పు అనే ఆయుధంతో దళితుల్ని వెట్టి వాళ్ళుగా చేసుకునే దుర్మార్గాన్ని బట్ట బయలు చేశాయి. "యజ్ఞం"లో అప్పు (లాముడి కుటుంబం, "ధనదాహ ఫలితం"లో మంగ కుటుంబం, "ఉచ్చు"లో కర్రోడు కుటుంబం భూస్వాముల ఆర్థిక దోపిడీకి బలైపోతాయి. దాదాపు అర్ధ శతాబ్ది సామాజిక పరిణామాలు దళితుల వినాశనానికి ఎలా దారి తీశామో 'యజ్ఞం' కథ నిరూపించింది. ఈ కథలన్నిట్లోను అప్పు అనే ఉచ్చు పన్ని దళితుల భూముల్ని అగ్రవర్ణ భూస్వాములు లాగేసుకోవడాన్ని చిత్రించాయి. "బాబయ్యా! యేదినుసైనా మామమ్మబోతే రూపాయి కైదుకుంచాలు. మాంకొనబోతే మూడు కుంచాలు. అదే మాదిరి మేం కొనే టప్పుడు కుంచాలు చిన్నవి గుందేవి. మామమ్మే ఏలకి పెద్దవైపోయేవి" అన్న అప్ప (లాముడి మాట (యజ్ఞం) తగళి శివశంకర పిళ్ళై "కూలిగింజలు" (మలయాళం) నవల్ని తలపిస్తుంది. ఈ కథలన్నిటిలో అగ్రవర్ణాల వాళ్ళ అప్పులకు దళితులు బలైపోతే "దిరోడ్" (పి. కేశవ రెడ్డి) కథలో దళిత సుబ్బరాయుడు మిలటరీలో చేరి మునసబు దగ్గర తండ్రిచేసిన అప్పును తీర్చి చరిత్ర సృష్టిస్తారు. అగ్రవర్ణ లక్ష్మమ్మ దళిత కొండడి భూమిని స్వాధీనం చేసుకోడానికి అనేక విధాల ప్రయత్నించి విఫలమై, చివరికి కొండడు పండించిన పంటను

కాల్చి బూడిద చేసిన కార్యాన్ని "కయ్య కాలువ" (కరణకుమార) కథ చూపిస్తుంది. స్వతంత్రభారత దేశంమీద దళితుల ఆర్థికస్థితి దృష్ట్యా విమర్శ పెట్టిన కథ "కోటిగాడు స్వతంత్రుడు" (పులికంటి కృష్ణా రెడ్డి)

కరుణకుమార్ "కొత్త చెప్పులు" గోపిచంద్ "చెప్పులు కుట్టేవాడు" కాలువ మల్లయ్య "నా తెలంగాణా" కథలు చెప్పులు కుట్టుకునేవాళ్ళ జీవితాలను విభిన్న చారిత్రక సందర్భాలలో చిత్రించాయి. ఈ మూడు కథల్లోను చెప్పులు కుట్టేవాళ్ళ పట్ల చెప్పు కుట్టించుకునేవాళ్ళకున్న చిన్నచూపును రచయితలు సహజంగా ప్రదర్శించారు. కరుణకుమార. కాలువ మల్లయ్య కథల్లో చెప్పులు కుట్టడంలో జరిగే ఆలస్యాన్ని భూస్వాములు సహించలేక వాళ్ళను చంపడం, తిట్టడం కనిపిస్తుంది. గోపీచంద్ కథలో చెప్పులు కుట్టేవాడు పట్టణ పోలీసుల దోపిడీకి గురౌతూంటే, కాలువ మల్లయ్య కథలో పోచయ్య సమ్మిరెడ్డివంటి అగ్రవర్ణ దురహంకారంగల అధికారితో అవమానింపబడతాడు. కరణకుమార కథలో చిన్నపరెడ్డి వంటి భూస్వాముల పీడనకు గురౌతారు దళితులు. ఈ కథలో దళితులు చిన్నపరెడ్డిమీద మౌన విప్లవం లేవదీస్తే, కాలువ మల్లయ్య కథలో పోచయ్య దళిత చట్టాల పరిజ్ఞానంతో ప్రత్యక్ష్యంగా ప్రతిఘటనకు తిరుగుబాటుకు పూనుకుంటాడు 'చెప్పులు కుట్టేవాడు' కథలో దళిత దంపతుల అన్యోన్యత వీధి బతుకుల రాపిడిలో చితికి పోవడాన్ని గోపీచంద్ బలంగా చిత్రించాడు.

కుల వ్యవస్థ రాజ్యమేలే నిచ్చెన మెట్ల సమాజంలో అగ్రవర్ణాల వాళ్ళకు దళితులంటే చులకన దళిత స్త్రీ లంటే మరీ చులకన. దళిత పురుషులు శ్రమ దోపిడికి గురైతే, దళిత స్త్రీలు శ్రమ దోపిడితో పాటు లైంగిక దోపిడికి కూడా గురి కావడం అందరికీ తెలిసిందే. దళిత స్త్రీకి మరో బాధ కూడా ఉంది. ఆమె తన పై కులాల పురుషుల నుంచే కాక, తన సొంత జాతి మగవాళ్ళనుంచి కూడా పీడనను భరిస్తుంది. కాల క్రమంలో దళిత స్త్రీ చదువుకొని ఉద్యోగాల్లోకి ప్రవేశించినా ఈ పరిస్థితిలో మార్పు లేదు. స్వామి రచించిన 'ప్రశాంతం' 'ఓ హెచ్. సరస్వతి' కథానికలు ఇందుకు మంచి ఉదాహరణలు. మొదట కథలో దుర్గమ్మ రెండో కథలో సరస్వతి పాత్రలు ఇలా అవమానాలు పొందాయి. "పురిటి నెప్పులు" (ఓల్గా) కథలో అన్నమ్మ, వందనం పాత్రల ద్వారా దళితస్త్రీ తనజాతి పురుషుల వివక్షకు గురి కావడం నిరూపించబడింది. కుల రహితమైన స్వచ్ఛ ప్రేమను కులం ఎలా చీలుస్తున్నదో కెమెరావిజయ కుమార్ "అంటరాని ప్రేమ" లో ప్రదర్శించారు.

"మాదిగ దానికి ఏం వైభోగం పట్టిందిరా"

"దీన్ని ఉంచుకోరా.... నీ కూపడ్తుంది వైభోగం" ఉప్పునీళ్ళు (సదానంద శారద) వంటి సంభాషణలు సంస్కారం కోల్పోయిన జాతి జీవితానికి దర్పణాలు.

తెలంగాణాలో ప్రజలు సాయుధ పోరాటం ముగిసి పోయి, పోరాటం విరమింపబడి, తెలంగాణా భారత యూనియన్‌లో విలీనమైపోయి పంచవర్ష ప్రణాళికలు అమల్లోకి వచ్చినా అక్కడి దళితుల పరిస్థితులో రావలసినంత మార్పు రాలేదని దాశరధి రంగాచార్య కథ 'చదువు' (1956) స్పష్టం చేస్తున్నది.

"అవ్వదొర కొడుకు చదువుకుంటాందే. నాకు సదవాలని ఉన్నది" అన్నఎంకటితో "కొడకా! దొర లెక్కడ? మనమెక్కడ? దొరలు దొరలే - బాంచలు బాంచలే" అని తల్లి అంటుంది. బి.ఎస్. రాములు కథ "సదువు" చదువుకి కొత్త అర్థం చెబుతుంది.

దళితుల లోని అంతర్గత వైరుధ్యాలను శ్రీపాద తన కథల్లో చర్చించారు. దాంతో ఈ ఉద్యమంతో ఆ వైరుధ్యం బాగా చర్చకు వచ్చింది. సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి కథ 'అంటు' రాయలసీమలో

దళితకులాల అంతర్గత వైరుధ్యాలకు ప్రతిబింబం. కాలువ మల్లయ్య "వైరుధ్యాలు" ఈ వైరుధ్యాన్ని మరింతగా చర్చకు పెట్టింది.

సన్నపురెడ్డి "చనుబాలు" కథ ఒక విశిష్టమైన కథ. దళిత స్త్రీ చనుబాలు తాగి పెరిగి పెద్దవాడైన అగ్రవర్ణయువకుడు దళితుల వ్యతిరేకిగా మారి, అసలు విషయం తెలిసి అవాక్కయిన వైనాన్ని ఈ కథ అత్యంత సహజంగా చిత్రించింది. ఈ వాస్తవం అంటరాని తనంలోని డొల్లను బట్టబయలు చేస్తుంది. గ్రామాల్లో అగ్రవర్ణ పిల్లలు దళిత స్త్రీల చనుబాలు తాగడం ఒక వాస్తవం.

దళితుల్ని అగ్రవర్ణ భూస్వాములు తమ ప్రయోజనాలకోసం వాడుకొని, దళితుల జీవితాలను నాశనం చేసే తీరును చిలుకూరి దేవపుత్ర "సమిధులు"లో నిరూపించారు.

తోలేటి జగన్మోహణరావు కథ "కులం" ఇంకోరకమైన వైశిష్ట్యంగల కథ. రిజర్వేషన్ సౌకర్యాలను ఉపయోగించుకొని అభివృద్ధిలోకి వచ్చిన దళితులు అతర్వాత సంస్కృతాసరణులలోనై తన జాతికి దూరమై పోవడమే గాక, తన జాతికి శత్రువులుగా మారకుండా కొందరికైనా కనిపిస్తున్నదే. ఈ వాస్తవానికి ఈ కథ ప్రతిఫలకం" ఆ బ్రాహ్మణులతో పోటీపడి పైకెదిగి ఎదిగి చివరకు ఆళ్ళలో కూరుకుపోయాడు. ఇప్పుడాడు హరిజనుడుకాడు. హరిజన బ్రాహ్మడు." అన్న ముసలివాని వ్యాఖ్య అభివృద్ధి చెందినదళితులు ఆలోచించవలసినది. అల్లం రాజయ్య "మధ్యవర్తులు" కథ ఈ సత్యాన్నే మరింత శాస్త్రీయంగా నిరూపించింది.

ఇలా పరిశీలించుకుంటూ పోతే ఈ కథానికలు భారతీయ సమాజాన్ని ప్రపంచ వేదికమీద తలవంచుకొనేట్టు చేస్తున్న అమానవీయాంశ విరాట్ స్వరూపం మనల్ని తీవ్రంగా హెచ్చరిస్తుంది. ఒక అనాగరిక చారిత్రక తప్పిదం భారతీయ సమాజ జీవితంలో లేపిన సుడిగుండాలు కనిపిస్తాయి. పీడితుల మనోవేదనలు వినిపిస్తాయి.

సమాజం ఎలా ఉండకూడదో ఎలా ఉండాలో సూచిస్తాయి. భారతీయ సమాజంలో రావలసిన తీవ్రమైన మార్పుల గురించి ఆలోచించమని మేధావుల్ని నిద్రలేపుతాయి ఈ కథలు. కుల దురహంకారుల హీన సంస్కారాన్ని ఎండగడతాయి. ఉత్తమ సంస్కారాన్ని నేర్పుతాయి.

నిజానికి ఈ కథానికల్ని అగ్రవర్ణాల వాళ్ళు ఎక్కువగా చదవాలి. మారవలసింది అగ్రవర్ణాల వాళ్ళు. మానవత్వం కావలసింది అగ్రవర్ణాలవాళ్ళకు. సాహిత్యంలోని హితాన్ని ఈ కథానికలు చదివి తెలుసుకోవచ్చు. కులోన్మాద విష సర్ప పరిష్వంగంలో చిక్కుకున్న భారతీయ సమాజాన్ని విముక్తం చెయ్యడానికి ఈ కథానికలు అనేక మార్గాలను పరిష్కారాలను మనముందుంచుతున్నాయి. తెలుగు కథానికారచయితలు నిర్వహించిన మహత్తర సామాజిక బాధ్యతకు నిదర్శనాలు ఈ కథానికలు.

ఈ కథానికా రచయితల్లో దళితులున్నారు, దళితేతరులున్నారు. వీళ్ళు విభిన్న కాలాలకు విభిన్న భావజాలాలకు విభిన్న నేపథ్యాలకు విభిన్న చైతన్యాలకు చెందినవారు ఆయా భేదాలు, పరిమితులు వాళ్ళ కథానికల్లో కనిపిస్తాయి. అయ్యో పాపం అన్న వాళ్ళున్నారు, చీకొట్టిన వాళ్ళున్నారు, బుద్ధి చెప్పినవాళ్ళున్నారు, మొట్టికాయలు వేసిన వాళ్లున్నారు, పళ్ళు కొరికినవాళ్ళు, పిడికిళ్లు బిగించినవాళ్ళు ఉన్నారు. ప్రతీకారం తీర్చుకున్నవాళ్లున్నారు.

మనం ఒకటి గమనించాలి. ఏ సమాజానికైనా ఒక చరిత్ర ఉంటుంది. దానికొక గతి ఆగతికోకరీతి అందుకనుగుణంగా ఉంటుంది. ఈ చలన సూత్రాన్ని మనం మరచిపోకూడదు. ఈ కథల్లో తొలిరోజుల్లో అయ్యోపాపం కథలే వచ్చాయి. క్రమ క్రమంగా సామాజిక పరిణామ క్రమానికి

అనుగుణంగా పిడికిళ్ళు బిగించే కథానికలు వచ్చాయి. అసలు ఏ సమస్యకైనా 'అయ్యోపాపం' నుంచే పరిష్కారం మొదలౌతుంది. ఈ పరిణామ దృష్టితో ఈ కథానికల్ని చదువుకోవాలి.

ఈ సంకలనాల్లోని కథానికలు సభ్యసమాజంముందు ఈ వేదభూమిముందు ఈ పవిత్ర భూమిముందు వెదజలుతున్న ఆవేదనలు ఆక్రోశాలు ప్రశ్నలు సందేహాలు. విమర్శలు వినండి. తిట్లు శాపనార్థాలు ఆలకించండి. ఎరుపెక్కుతున్న కంటి జీరల్ని గమనించండి.

"ఆతోళ్ళముక్కల్ని తంతుంటే నా పిల్లల్ని తంతున్నట్టే అనిపించింది. నాకు" (గోపిచంద్: చెప్పులు కుట్టేవాడు)

"భయం ప్రాతిపదికమీద బ్రతుకుతున్న ఈఊరు ఈదేశం ఎంత కాలం జీవిస్తాయి? ప్రేమ ప్రాతిపదికమీద బ్రతికే సమాజం, వ్యవస్థ ఏ రోజు పుడతాయి?" (కొలకలూరి ఇనాక్: ఊరబావి)

"ఓటు మూలంగా కనీసం యెలక్షన్లముందు మాగుడిసెల్లో జనాన్ని పెద్దవాళ్ళు పలకరిస్తారు. వాళ్ళ పెద్దరికాలు నిలబెట్టుకొనేందుకు. మళ్ళీ అయిదేళ్ళ దాకా యెక్కడి వాళ్ళక్కడే. స్వాతంత్ర్యం తెచ్చిన పెద్ద మార్పు యిదేనేమో" (సి.ఎస్.రావు: మార్పుకుమార్గం)

"పుష్టికరమైన ఆహారం మనకెందుకు లేదు?" అమ్మతో కర్రంకడు. వెంకడి ప్రశ్న అర్థంగాక గంగి తెల్లబోయింది" (కౌతు విశ్వనాథ రెడ్డి: శిలువ వేసిన మనుషులు).

"పెద్దోల్లు సామీ! యామన్నాజేస్తారు. యావక్కన్నా తిరుగుతారు. సామీ! మీరెట్ల తిరిగినా దొడ్డగునమంటారు.... అదే మమ్మన్నయితే తప్పన్నొకొడుకులంటారు" (చిలుకూరి దేవపుత్ర: సమిధులు)

"తల్లి మట్టిలోనికే సరిగ్గా పాతుకోలేనివేర్లు ఇతర వాతావరణంలో నాటుకుంటాయా" (స్వామి: తల్లిమట్టి)

"అవున్లెండయ్యా. మేం మనుషులమైతేగదా" (శాంతినారాయణ - జీవనాధులు)

"ఒరేయ్! రెడ్డోడా! మేం నీళ్ళకొచ్చినం. నువ్వుగమ్ముకుండకుంటె నీ రక్తం నింపకపోతం" (పినాకపాణి: కొత్తదారి)

"కులాల మధ్య సమన్వయం సాధించాలంటే కనీసం నాలాంటి ప్రేమ పెళ్ళిళ్ళయినా తల్లిదండ్రుల చేతులమీదుగా జరగాలిగదా" (బి.ఎస్.రాములు: బందీ)

"అదేమిటి ఆయన ఎండలో నిల్చుని పాటాలు చెబుతున్నారే? అతను హరిజనుడండీ హరిజనుడు. తప్పదు మరి" (సింగమనేని నారాయణ: మకరముఖం)

"మాలోళ్ళం బీదోళ్ళమనేగా నామొగుణ్ణి కొజ్జాను నన్ను నంజను చేసేవ్?" (కప్పగంతుల మల్లికార్జునరావు: పేదపురుగులు కాటేస్తాయ్, ఖబడ్దార్)

"ఈ బతుకు లిట్టా తగలబడ్డానికి ఈల్లేదు" (కొలకలూరి ఇనాక్: సూర్యుడు తలెత్తాడు)

"రొండు కులాలు కలవాలంటే ఏం చెయ్యాల? ఆల్లపిల్లని యిల్లు యీల్ల పిల్లని ఆల్లు పెల్లిల్లు సేసుకోవాల. అప్పుడే కులాలు లేకుండా పోతయ్యి" (పి. నాసరయ్య: మాన్యులం)

"ఏం తాతా చెప్పులు ఇంకెవరూ కుట్టకూడదా? మనమే ఎప్పుడూ కుడుతూనే వుండాలా?" (సి. సుజాత: అమ్మానువ్వా నవ్వచ్చే)

"మట్టిమనుషుల ఆర్తికి పరిసమాప్తిలేదా?" (జి.భాను: రుధిరమథనం)

"బా బతుకులిలా గంగపాలు కావలసిందేనా?" (పాలెపుబుచ్చిరాజు: అంకురార్పణ)

"దుర్మార్గతను చదివే అవకాశంకోల్పోవడానికి అసలైన కారణం ఆమె పుట్టుకే" (స్వామి: ప్రశాంతం)

"ప్రాణం లేని ఆ పిండిమిషనుకు ఉన్న విలువకూడా మామాదిగోల్లకు లేదా! మేమూ మీమాదిరే మనుషులం కామా?"

"దేవుడనే వాణక నుండి చస్తూ వుంటే భగవంతుడు భాగ్యవంతులూ ఒకటేనేమో (గొట్టుముక్కల మంగాయమ్మ: అయ్యోపాపం)

"పదేండ్లనుంచీ కూలివొక్క పావలా అన్నా పెంచియిచ్చినావా? మీ ఆదాయం యేమన్నా తగ్గిందా! పెంచకపోవడానికి?" (కేతు విశ్వనాథరెడ్డి: చీకటినాడీ - వెలుగు నెత్తురూ)

"కేవలం మాలవాడై పుట్టిన కారణంగా మనిషిని చంపడమే!" (చిరంజీవి: రియాక్షనరీ కథ)

"అంటరానివాళ్ళు పీల్చి విడిచిన గాలిని తాము పీల్చగా లేనిది అంటరాని వాళ్ళు ముట్టిన నీరు తాగడానికేం వచ్చింది?" (మధు చక్రవర్తి: జలం! జనం!)

"గోడ్డు చెరువులోకి దిగి నీళ్ళు తాగితే తప్పు లేనప్పుడు మాదిగోడు చెరువులోకి దిగడంలో తప్పేందని" (కాట్రగడ్డ దయానంద్: చెలమ)

"మతంలో కలియడం వల్ల మాదిగలకు వచ్చిన కొత్త సరపతి యేమీ లేదు" (శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి: ఇలాంటి తవ్వాయి వస్తే)

"మాల్దయితేనేం? అది మనిసిగాదూ?" (సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి: చనుబాలు)

"ఏఅగ్రకులస్థుడు మాత్రం వాళ్ళ చనుబాలు తాగకుండా ఇప్పుడుండే స్థాయికిఎదిగాడని?"

"రాయలసీమ వంటి ఫాక్షనిస్టు రాజకీయాలున్న ప్రదేశం సంగతెలా వున్నా సముద్ర కెరటాల్లా ఉద్యమాలు ఉవ్వెత్తున లేచిన తెలంగాణా గ్రామాల్లోనూ ఇంకా అస్పృశ్యతలాంటి దున్నదన్న నిజం మధుసూదన్‌కు మింగుడు పడడంలేదు". (కాలువ మల్లయ్య : వైరుధ్యాలు)

"సార్! దయచేసి కులాల మాటెత్తుకండ్రి. నేనీకులంలో పుట్టినందుకేం చిన్నబుచ్చికుంటలేను. పైగా గర్వపడుతున్న. మారెక్కల కష్టంతోని మేంబతుకుతం. అన్ని పనులు చేస్తం. అన్ని పంటలకు సృష్టి కర్తలం మేం. అయినా ఏకులం గొప్పైనా ఏందిసార్...? ఎవ్వల కులం వాళ్ళకే గొప్ప" (కాలువ మల్లయ్య - నా తెలంగాణా).

"యేమి! బేపనోన్ని గోస్తేపాలు, మాదిగోన్ని గోస్తే నీల్లు వస్తయ్యా! జాతి జాతి అంటుడదే నా ముంగలజాతి యాడుండది?" (ఎండ్లూరి సుధాకర్: జాతంటేయాంది?)

"ఈ దేశంలో అంటరాని వారంటే అసహ్యాన్ని కనుపాపల వరకే పరిమితం చేయించడానికి చాలా రక్తపాతమవసరమేమో" (కెమెరా విజయకుమార్: కప్పగంతులు)

"పేదరికం అన్నింటికీ ఆటంకమే. టాగోరు గానీ, జిడ్డు కృష్ణమూర్తి గానీ, బుద్ధుడు గానీ పేదరికం లేకుండా పెరిగారు గనక స్వేచ్ఛ విలువలను చెప్పగలిగే స్థాయికి, ఇతరులను అందుకు ఒప్పించగలిగే స్థాయికి ఎదిగారు. గంగ ధరి పుట్టిన కులం వల్ల పేదరికం వల్ల అతనికా అవకాశం లేదేమో" (బి. ఎస్. రాములు: సదువు).

"సద్వులు సద్విరాజ్యాలేలే రాతలు మనకేడివి బిడ్డా! కూటికి లేనోల్లం". (దేవరాజు మహారాజు: పొడవని పొద్దు)

"మాకళ్ళల్లో మాపిల్లల బవిసత్తే కనబడింది ఆల్లాంతా బాగా సదువుకొని పెద్ద ఆపీసర్లై మల్లి ఈ వూరొత్తే నన్ను 'నీయమ్మ' అని తిట్టి కాలితో తన్నిన సెద్దరెడ్డిగారు ఆరి పిల్లలు కూడ లేసి పిల్లలకి దండమెట్టాల" (డి. గోపి: మా కాన్మెంట్)

"శరీరాల్ని రేప్ చేసే ఒక యాదగిరినీ, ఏకంగా ఒకజాతినే రేప్ చేసే రామ భద్రాన్నీ కళ్ళారా చూశాక గాయత్రి రెస్ట్ తీసుకోగలదా?" (పైడి తెరేష్‌బాబు: కంపనపడ్డ కాకి)

1996లో విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ద్వారా మొదటి సంకలనం వచ్చినప్పటికి, భార్గవీరావుగారి "ఇంకానా ఇకపై చెల్లదు" అనే పది కథల నంకలనం వచ్చింది. ఈ సంకలనాలన్నీ పూర్తయ్యే లోపల నాగప్పగారి సుందరరాజుగారి మాదిగోడు, మావూరి మైసమ్మ వచ్చాయి. ఎండ్లూరి సుధాకర్ అంటరానోళ్ళ ఆత్మకథలు రాశారు. పి. కనకయ్యగారు ఎదురు చూపులు మరో దళిత కథా సంకలనం తెస్తున్నారు. ఆ చార్య కొలకలూరి ఇనాక్‌గారు తన దళిత కథల్ని "అస్పృశ్య గంగ" తెచ్చారు. పులికంటి కృష్ణారెడ్డిగారు తన దళిత కథానికల్ని ఒక సంకలనంగా తెస్తున్నారని తెలిసింది.

మొదటి సంపుటం వచ్చినప్పుడు మిత్రులు కొందరు కొన్ని తేలిక మాటలన్నారు. ఒకరు చేసిన పనిని గురించి ఇంకొకరు ఏమనుకుంటారన్నది అనుకునే వాళ్ళ విజ్ఞత.

ఈ నేపథ్యంలో ఈ ఎనిమిది దళిత కథా సంకలనాలు పాఠకుల ముందు కొచ్చాయి. ఈ కృషిలో ప్రధాన భూమిక వహించిన శ్రామికుడు డా. లక్ష్మీనారాయణకు అభినందనలు

ఈ కథానికల్ని సంకలనాల్లో వెయ్యడానికి ఆమోదించిన రచయితలకు ఈ కథానికలు సమాజానికి అందుబాటులోకి రావడానికి ఆర్థిక సహాయం చేసినవారికి కృతజ్ఞతలు.

ఈ సంకలనాలు అందుబాటులోకి వచ్చిన తర్వాత రెండు కర్తవ్యాలు స్ఫురిస్తున్నాయి. ఒకటి; ఈ కథానికల్ని ప్రజల్లోకి తీసుకు వెళ్ళే బాధ్యతను విమర్శకులు సాహితీ సంస్థలు తీసుకోవడం, రెండు: ఈ తెలుగు కథానికల్ని ఇతర భారతీయ భాషల్లోకి అనువదించి మన సాహిత్య క్షేత్రంలో జరిగిన దళిత కృషిని ఇతర భారతీయ భాషా పాఠకులకు, ఆంగ్ల భాషా పాఠకులకు తెలిపే బాధ్యతను ఆంగ్లం, ఇతర భారతీయ భాషలు తెలిసిన తెలుగువాళ్ళు తీసుకోవడం. ఈ రకంగా ఈ యిద్దరూ సామాజిక పరివర్తనకు దోహదం చెయ్యవలసి ఉంది.

రాచపాళెం చంద్రశేఖర రెడ్డి

శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం.